## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజి


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస


అమ్మ శారదా దేవి


గురు వివేకానంద


గురు సాయిబాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళ స్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..








"ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్" ద్వారా విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందించే సేవా కార్యక్రమంలో బాగంగా ఈ పుస్తకాన్ని భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా) నుంచి సేకరించి అందిస్తున్నాము. ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము.

సాయి రామ్ వారి సేవల విస్తరణలో బాగంగా ఈ ఫౌండేషన్ స్థాపించబడినది. ఈ స్వచ్ఛంద సంస్థ ద్వారానే అన్ని సేవలు అందించబడును. ఇటువంటి పుస్తకాలు మీరు వ్రాసినట్లయితే (లేక) సేకరిస్తే మాకు తెలియచేయండి. మేము ప్రతి విద్యార్థికి ఉచితంగా అందేలా చేస్తాము, తద్వారా ఉన్నత విలువలు, నైపుణ్యాలు కలిగిన విద్యార్థులను మన దేశానికి అందించవచ్చు. మాతో కలిసి నవ భారత నిర్మాణ కార్యక్రమంలో పనిచేయుటకు, భాగస్వామ్యం అగుటకు ఆసక్తి ఉంటే సంప్రదించగలరు.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in
2) ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ వెబ్ సైట్ : www.freegurukul.org
3) సాయి రామ్ వెబ్ సైట్ : https://sites.google.com/site/sairealattitudemanagement
4) మొబైల్ ఆప్: Free Gurukul

గమనిక: భక్తి,జ్ఞాన,ధర్మ ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో భారత ప్రభుత్వపు డిజిటల్ లైబ్రరీ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఇది లాభార్జన దృష్టిలేని ఉచిత సేవ. ఈ సేవలో అంతర్జాలంలోని(ఇంటర్నెట్) లైసెన్సు / కాపీరైటు అభ్యంతరాలు లేనివి అనుకొన్న పుస్తకాలను గ్రహించటం జరిగినది. అనుకోకుండా ఏవైనా అభ్యంతరకరమైనవి ఉన్నచో మాకు తెలుప మనవి, వాటిని తొలగించగలము అని మనవి చేసుకొంటున్నాము.

Website: www.freegurukul.org Mobile App: Free Gurukul email: support@freegurukul.org
Facebook: www.facebook.com/freegurukul Help Line / WhatsApp: 904 202 0123

" మన లక్ష్యం: విలువలు, నైపుణ్యాలతో కూడిన విద్య అనేది ఉచితంగా + సులభంగా + ఆకర్షణీయంగా + నాణ్యతతో కూడి అందరికి అందించబడాలి "

ఉచిత గురుకుల విద్య ఫౌండేషన్ – Free Gurukul Education Foundation

సర్వం పరమాత్మ పాద సమర్పణమస్తు

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్

శ్రీ విద్యారణ్యముని విరచితః

# జీవన్ముక్తివివేకః

భావప్రకాశికాఖ్య

ఆంధ్రవివరణ సమలంకృతః

భావప్రకాశిక :

'బ్రహ్మవిద్యారత్నాకర'

బ్రహ్మశ్రీ సూరి రామకోటిశాస్త్రి గారు

ప్రకాశకులు :

ఆర్షభారతి - తెనాలి.



శ్రీ కాఞ్చీ కామకోటి పరమాచార్యులు
పరమహంస పరివ్రాజక వర్యులు
శ్రీశ్రీశ్రీ చన్ద్రశేఖరేన్ద్రసరస్వతీస్వామి
శ్రీచరణులు

ఓమ్

శ్రీ దుర్గాయై నమః

శ్రీ కాఞ్చీ పరమాచార్య కృతం

# శ్రీ దుర్గా పఞ్చరత్నస్తోత్రమ్

శ్రీ గురుభ్యో నమః

శ్రీ కాఞ్చీ చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీస్వామి చరణులు శ్రీ దుర్గాదేవిని ఐదు శ్లోకములతో ప్రస్తుతించిరి. 'దుఃఖేన గమ్యతే ఇతి దుర్గా.' అష్టాఙ్గయోగ, కర్మోపాసన సాధనక్లేశముచే సాక్షాత్కరించునట్టి తల్లి, దుర్గ. 'రత్నం శ్రేష్ఠే మణావపి' అను కోశ వచనము వలన, పఞ్చరత్నములు శ్రేష్ఠములైన ఐదు శ్లోకములు.

**శ్లో॥ తే ధ్యానయోగానుగతా అపశ్యన్**

**త్వామేవ దేవీం స్వగుణైర్నిగూఢామ్।**

**త్వమేవ శక్తిః పరమేశ్వరస్య**

**మాం పాహి సర్వేశ్వరి! మోక్షదాత్రి॥**

తే=వారు (జగత్తునకు కారణము ఏమి? అని చర్చించుకొనిన మహర్షులు- మునులు, ధ్యానయోగానుగతాః=ధ్యానము అనెడు ఉపాయమును అనుసరించినవారై, సర్వేశ్వరి! ఓ పరమేశ్వరీ! మోక్షదాత్రి!=మోక్షమునొసంగు తల్లీ, స్వగుణైః=నీ గుణములచే (సత్త్వ, రజ, స్తమోగుణములచేతను, ఆ గుణకార్యములచేతను, (సర్వజ్ఞత్వాది గుణములచేతను), నిగూఢామ్=ఆచ్ఛాదింపబడిన (దాగి ఉన్న), దేవీం త్వాం ఏవ = ప్రకాశస్వరూపము గల దేవి యగు నిన్నే, అపశ్యన్ = చూచిరి. పరమేశ్వరుని యొక్క శక్తి (సామర్థ్యము), త్వం ఏవ=నీవే, మాం పాహి=నన్ను రక్షింపుము.

మునులు, జగత్కారణమీమాంస- చర్చ చేసి చివరకు, ధ్యాన

శ్రీ గురుభ్యో నమః

హరిః ఓమ్

# ఒక అనుశీలనము

వేదాన్తశాస్త్రము ఆత్మజిజ్ఞాసతో ప్రారంభ మగుచున్నది. "అహమ్" 'నేను' అని స్ఫురించు వస్తువే, ఆత్మ. ఇది అందరికు పరిచితమే. కాని, ఈ ఆత్మయొక్క యథార్థ స్వరూపము మనకు స్పష్టముగా గోచర మగుట లేదు. 'అహం మనుష్యః'- 'నేను మనుష్యుడను' అని వ్యవహరించుచున్నాము. ఇచట ఆత్మ, మనుష్యత్వ ధర్మముతో పేర్కొనబడినది. మనుష్యత్వము శరీర ధర్మము, పాదాది శిరఃపర్యన్తమగు ఒకానొక ఆకృతివిశేషము యొక్క ధర్మము. ఈ భావముతోనే, మనము లోకవ్యవహారమును చేయుచున్నాము. సుఖ, దుఃఖములను అనుభవించుచున్నాము. కాని, ఈ శరీరము చర్మము, రక్తము, మాంసము, స్నాయువు, మేధస్సు, మజ్జ, అస్థిరూప సప్తధాతుమయము, జడము. దీనికి గ్రహణశక్తి లేదు.

మనము చూచుచున్నాము, వినుచున్నాము, శీతోష్ణాది స్పర్శలను గ్రహించుచున్నాము. మధురాది రసములను సుగంధ, దుర్గంధములను గూడ, తెలిసికొనుచున్నాము. చక్షువు, శ్రోత్రము, త్వక్, జిహ్వ, ఘ్రాణము లనెడి ఇంద్రియములు ఈ పనులను చేయుచున్నవి. అయినను, 'అహం శృణోమి' నేను వినుచున్నాను. 'అహం పశ్యామి' నేను చూచుచున్నాను అని వ్యవహారమును చేయుచున్నాము. ఇచట, ఇంద్రియ ధర్మములతో అహమాత్మ, వ్యవహరించుచున్నది. ఇట్లే, 'నేను సంకల్పించుచున్నాను' అనుచోట, మనోధర్మముతోను, 'నేను నిశ్చయించుచున్నాను' అనుచోట, బుద్ధిధర్మముతోను, అహమాత్మ వ్యవహరించు

చున్నది. 'అహం కరోమి'- నేను చేయుచున్నాను అనుచోట, కర్తగాను, 'అహం సుఖ మనుభవామి' అను చోట, భోక్తగాను, అహమాత్మ, గోచరించుచున్నది. కావున, ఈ ఆత్మ శరీరమా? ఇంద్రియములా? మనస్సా? బుద్ధియా? కర్త అగునా? భోక్త యగునా? అను సంశయము కలుగుచున్నది. మఱియు, స్వప్నావస్థయందు స్థూల శరీరాభిమానమును విడచి, దివ్య మహా రాజాది శరీరములతో వ్యవహరించుట కలదు. దీనినిబట్టి, స్థూల శరీరము ఆత్మ కాదని తెలియుచున్నది. జాగ్రదవస్థలో గూడ 'యోఽహం బాల్యే పితరం అన్వభూవం సోఽహ మిదానీం ప్రణప్తౄ ననుభవామి' 'నేను బాల్యములో తల్లిదండ్రులను ఎఱుగుదును, ఇప్పుడు పుత్ర, పౌత్రాదులను చూచుచున్నాను' అని బాల్య, వార్ధక్య శరీరములలో భేదమున్నను, ఈ అహమాత్మ ఒకడుగానే గోచరించుచున్నాడు. అందువలన,శరీరముకంటె ఆత్మ వేఱు అని అంగీకరింపవలసివచ్చుచున్నది. ఇదిగాక, సుషుప్త్యవస్థలో 'సుఖ మహ మస్వాప్సమ్, న కిఞ్చి దవేదిషమ్' హాయిగా నిద్రపోయితిని, నాకేమియు అప్పుడు తెలియదు అని అనుభవము కలిగియున్నాము. అప్పుడు శరీరము గాని, ఇంద్రియములు గాని, మనోబుద్ధులు గాని, పనిచేయుట లేదు. కావున, అవస్థాత్రయమును అనుభవించు ఆత్మ, ఈ శరీరేంద్రియములలో చేరడు; దేహేంద్రియ, మనోబుద్ధి, చిత్తాహఙ్కారవ్యతిరిక్తుడు. ఇంత తెలిసినను, జీవభావములో ఉన్న ఆత్మను గుఱించి మాత్రమే మనము తెలిసికొనినట్లైనది. కాని, ఈ ఆత్మయొక్క నిజస్వరూపము శ్రుతి యందు 'అయమాత్మాఽజరోఽమృతః', 'యః అశనాయాపిపాసే శోకం మోహం జరా మృత్యుమత్యేతి' 'యత్సాక్షా దపరోక్షాద్బ్రహ్మ', 'అయమాత్మా అపహతపాప్మా విజరో విమృత్యుః విశోకో విజిఘిత్సః అపిపాసః', సత్యకామః

సత్యసఙ్కల్పః, అయమాత్మా బ్రహ్మ' అని దివ్యముగా వర్ణింప బడినది.

బ్రహ్మ, సచ్చిదానన్ద లక్షణము. అహం ప్రత్యయమున గోచరించు ఆత్మ గూడ, వాస్తవముగా సత్ చిత్ సుఖస్వరూపమే అను విషయమును 'అయమాత్మా బ్రహ్మ' అను శ్రుతి బోధించు చున్నది. కాని, మనము అహమాత్మను దేహ, గృహాదులకు పరిమితమైనదానినిగాను, సుఖదుఃఖాదులను అనుభవించు సంసారి గాను గ్రహించుచున్నాము.

'తత్త్వమసి', 'అహం బ్రహ్మాస్మి' మొదలగు శ్రుతులు జీవాత్మ, బ్రహ్మస్వరూపుడే అని ఉపక్రమోపసంహారాది తాత్పర్యలిఙ్గములచే స్పష్టముగా బోధించుచున్నవి. నేను కర్తను భోక్తను, సంసారిని అయి ఉన్నాను, బ్రహ్మను కాను అను ఈ ప్రత్యక్షము, ప్రబలమగు శాస్త్రప్రమాణముచే బాధింపబడును. ప్రత్యక్షముగా చంద్రుడు అల్ప పరిమాణము కలవాడుగా గోచరించినను, జ్యోతిశ్శాస్త్రప్రమాణముచే అధిక పరిమాణము కలవానినిగానే గుర్తించుచున్నాము. కనుక, శాస్త్రమునందు వర్ణించిన ఆత్మస్వరూపమును తెలిసికొనవలసియున్నది.

వేదాన్తశాస్త్రము, బ్రహ్మాత్మదర్శనమునకై 'శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః' అని శ్రవణ, మనన, నిదిధ్యాసనము లనెడి సాధనములను బోధించినది. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్ర ములు, భగవద్గీత అను ప్రస్థానత్రయమునకు భాష్యమును రచించిన శ్రీ శఙ్కర భగవత్పాదులు తాము, బ్రహ్మాత్మైక్యాను భవమును పొంది, జీవితకాలములో ఎట్లు పరమానన్దమును అనుభవించవచ్చునో నిరూపించియున్నారు. జీవన్ముక్తికి 'అత్ర బ్రహ్మ సమశ్నుతే' ఇచటనే బ్రహ్మను పొందుచున్నాడు, 'విముక్తశ్చ విముచ్యతే' జీవితకాలములోనే ముక్తిసుఖమును

అనుభవించుచు, ప్రారబ్ధకర్మాధీన దేహపాతానంతరము విదేహ ముక్తుడు అగుచున్నాడు అను శ్రుతులు ప్రమాణములు. శ్రీ విద్యారణ్యులు వైదిక ధర్మసంరక్షణమునకై శ్రీ శఙ్కరభగవత్పాదుల మార్గమునే అనుసరించి, వేదభాష్య, వేదాన్తపఞ్చదశీ, సర్వదర్శనసంగ్రహాది బహుగ్రంథములతోపాటు, ఈ 'జీవన్ముక్తి వివేకః' అను గ్రంథమును రచించియున్నారు. అద్వైత సంప్రదాయమున, 'జీవన్ముక్తి' విశేషమైనది. జీవించియుండగానే జ్ఞాన బలముచేత ముక్తిని, పరమానన్దమును అనుభవించుటకు అవకాశమున్నది అను విషయము సోదాహరణముగా, సప్రమాణముగా ఇందు నిరూపింపబడినది.

చతుర్విధ పురుషార్థములలో ముక్తి, పరమపురుషార్థము, నిత్యము, దుఃఖమిశ్రము కాని నిరతిశయ సుఖస్వరూపము. ముక్తిని పొందినవాడు తిరిగి సంసారబంధమునకు లోనుకాడు. అజ్ఞానము, కోరికలు, పాపపుణ్యకర్మలు సంసారబంధమునకు హేతువులు. మనము ఎంతగా దేహేంద్రియాద్యభిమానమును, రాగద్వేషములను, అహఙ్కార, మమకారములను జయింపగలుగుదుమో, అంతగా ఆత్మప్రకాశానుభవము, ఆనన్దానుభూతి కలుగుచుండును. మనము ప్రతిదినము, కొంతసమయము, అవస్థాత్రయాతీత ఆత్మానుభవమునకై ప్రయత్నించవలయును. దానివలన ఆత్మబలము, స్థైర్యము, ఉత్సాహము, ఉల్లాసము లభించును. ఆత్మస్వరూప ప్రకాశానన్దానుభూతియే ముక్తి. సంన్యాసాశ్రమము స్వీకరించినవారు నిరంతరము బ్రహ్మాత్మానన్దానుభూతికై ప్రయత్నింతురు. గృహస్థులు, తాము గృహకృత్యములను నిర్వహించుకొనుచు, కొంతసమయమును అధ్యాత్మసాధనకై నిర్దేశించుకొని, ధ్యానముచేతగాని, అధ్యాత్మ

విచారణమార్గముచేత గాని, సచ్చిత్సుఖాత్మానుభూతికై ప్రయత్నించి కృతార్థులు కావలయును.

అందుకు ఈ 'జీవన్ముక్తివివేక' గ్రన్థము జీవితాదర్శములను, తగు ఉపాయములను తెలుపుచు ఉపకరించును. వేదాన్త శాస్త్రమున, ప్రారంభమయిన ఆత్మజిజ్ఞాసయొక్క పర్యవసాన ఫలము ఇందు కాననగును.

## కృతజ్ఞతాభినందనము

ఈ గ్రంథము సంస్కృతభాషలో శ్రీ విద్యారణ్యులచే రచింపబడినది. విషయము మహత్త్వము కలది. అంతగా సంస్కృతభాషాభిజ్ఞులు కాని ఆంధ్రమహాజనులు గూడ, ముఖ్యముగా తెలిసికొని ప్రయోజనము పొందగలరు అను తలంపుతో ఈ ఆంధ్రానువాదము భావప్రకాశిక అను నామముతో చేయబడినది. కాని, ధనవంతుల నాశ్రయించి ముద్రణ చేయుట శ్రమతోను, కష్టముతోను కూడిన పని అని భావించి ముద్రణ ప్రయత్నము చేయలేదు.

నా అధ్యాత్మవ్యాసఙ్గము తెలిసిన బ్రహ్మశ్రీ ఆకెళ్ళ శివరామబ్రహ్మంగారు అమెరికా వెళ్లినప్పుడు, చిరంజీవులు వారి కుమారులు శ్రీ ఆకెళ్ల వేంకటకృష్ణతో ప్రస్తావవశముగా నేను రచించిన గ్రంథములు ప్రకాశములోనికి వచ్చిన, బాగుండునని సూచించిరి. సూచించుటమేతడవుగా ఉదారాశయులు శ్రీ ఆకెళ్ల వేంకటకృష్ణ గారు స్పందించి, తమ మిత్రులతో సమాలోచించి రు.35,000/- ముప్పదియైదువేల రూప్యములను గ్రంథ ముద్రణమునకై పంపిరి. భారతీయసంస్కృతి యందు ప్రేమాభిమానములు కల, వారి మిత్రులు శ్రీ డా॥ పి. రవిశర్మగారు

5000/- శ్రీ డా॥ జగన్నాథరావుగారు 3500/- శ్రీ కె. శ్రీనివాస మూర్తిగారు 1750/- శ్రీ డా॥ కృష్ణమోహన్‌గారు 3500 శ్రీ ఆకెళ్ల వేంకటకృష్ణగారు 21,250/-లు గ్రంథముద్రణకై సమకూర్చిరి. వర్ధిష్ణువులు, చిరంజీవులు నయిన వీరు అందఱు పరమేశ్వరాను గ్రహముచే దీర్ఘాయుష్మంతులై, శాంతిసౌఖ్యములతో విరాజిల్లుదురు గాత. భారతీయసంస్కృతి తేజఃకిరణములు ప్రవర్ధమానములై దశదిశల ప్రకాశించుగాక!

ఈవిధముగా, అప్రయత్నముగా ముద్రణకు ధనము పరమేశ్వరానుగ్రహమువలన సమకూరినది. కాని, దీనిని కార్య రూపమును ధరింపజేయుటకు తగిన ముద్రణవిభాగానుభవము నాకు అంతగా లేదు. అయినను, ఇక ముద్రణకు ప్రయత్నము చేయక తప్పదు అని ఆలోచించుచుండగా, కొలది రోజులకు బ్రహ్మశ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు కార్యవశమున హైదరాబాదు వచ్చి, మా గృహమున కేతెంచిరి. మా కుశల ప్రశ్నానన్తరము, గ్రంథముద్రణవిషయము ఏమి చేయుచున్నారు అని ప్రశ్నించిరి. వారు, నా బృహదారణ్యకోపనిషద్ భావ ప్రకాశికానువాదమునకు, చతుస్సూత్రీ తాత్పర్యదీపికానువాదము నకు ముద్రణభారము వహించినవారు. వారు శ్రమపడి, నాకు ఫలమును, పేరు ప్రతిష్ఠలను కూర్చినవారు. వారికి నాయందు హార్దికమగు గౌరవాభిమానములు కలవు. కాని, వారు దృఢారోగ్య ముతో లేరు. కొంత మానసిక క్లేశమునకు దైవవశమున లోనై యున్నారు. ఇట్టి పరిస్థితులలో వారిని శ్రమపెట్టుట భావ్యము కాదని తలంచియుంటిమి. కాని, వారే స్వయముగా ముద్రణ శ్రమభారమును వహించి 'జీవన్ముక్తివివేక భావప్రకాశిక' గ్రంథము యొక్క వ్రాతప్రతిని తీసికొనివెళ్ళిరి. అనతికాలము లోనే, సమర్థముగా ముద్రణచేయించి ప్రకాశమునకు సిద్ధము

చేసినారు. ఇది వారి సౌజన్యఫలితముగాను, భగవత్కృపగాను భావించుచున్నాను. విద్యాసంబంధముచే వారికి నావలన కలిగిన ఉపకారముకంటె వారివలన నాకు కలిగిన సాహాయ్యము అనితర సాధారణము. పరమేశ్వరుడు బ్రహ్మశ్రీ జనస్వామి సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి సంపూర్ణారోగ్యము నొసంగి, సచ్చిత్సుఖ బ్రహ్మాత్మా పరోక్షానుభూతిని అనుగ్రహించుగాక అని నిండు మనస్సుతో ఆశీస్సుల నొసగుచున్నాను. వారి సౌమనస్యము, గురుజన హృదయరంజకము.

మా శాస్త్రిగారితోబాటు, బ్రహ్మశ్రీ హరి వేంకటేశ్వరశర్మగారు, నాయందుగల ఆదరాభిమానములతో ఈ గ్రంథముద్రణము నందు శాస్త్రిగారికి చేదోడువాదోడుగా నుండి సహకరించి యున్నారు. వీరికి, పరమేశ్వరుడు ఇతోధిక శ్రేయోభివృద్ధిని, శాన్తి సుఖములను ప్రసాదించుగాక.

ఇచట, మఱియొక విషయము చెప్పవలసి ఉన్నది. నేను గ్రంథరచనలో మొదట, అంత ఉత్సాహము కలవాడను కాను. శ్రీ పమిడిముక్కల నారాయణరావు (ఇంజనీరు) గారు అశోక నగరములో శ్రీ సత్యనారాయణస్వామివారి దేవాలయప్రాంగణ ములో శ్రీరామకృష్ణాశ్రమమువారి ఆధ్వర్యమున, ప్రతిదినము ప్రాతఃసాయంకాలములందలి కార్యక్రమములలో భాగముగా ప్రొద్దున నాచే జరుగుచున్న ఉపనిషత్ప్రవచనములను విను చుండెడివారు. వీరు నా బృహదారణ్యకోపనిషద్ భావప్రకాశి కాంధ్రానువాదమునకు ప్రేరకులై ముద్రణ, ప్రకాశనపర్యన్తము కడు శ్రద్ధ వహించి, అధ్యాత్మవిజ్ఞానవ్యాప్తికి, నా యశోభివృద్ధికి కారకులైరి.

అట్లే, డా. శ్రీ కొలచల గోవిందశర్మగారు **M Sc. Phd.** 'ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన సంప్రదాయముల నెఱింగినవారు,

తత్త్వజిజ్ఞాసువులు. నాకు చేదోడు వాదోడుగానుండి, చతుస్సూత్రీ పఞ్చపాదికాది గ్రంథముల రచనకై ప్రోత్సాహము నొసగిరి. వారే, ఈ 'జీవన్ముక్తి వివేక' భావప్రకాశికానువాదమునకు గూడ తోడ్పడి తమ లేఖినితో వ్రాతప్రతిని సిద్ధము చేసి ఇచ్చియున్నారు. వారి సాహాయ్యమే లేనిచో ఈ గ్రంథముల ముద్రణము సాధ్యమయ్యెడిదికాదు. బహువత్సరములనుండి నా అధ్యాత్మవ్యాసంగమునకు, సద్గోష్ఠికి తోడ్పడుచున్న శ్రీ కె. గోవిందశర్మగారికి కృతజ్ఞతను తెలియజేయుచు, పరమేశ్వరుడు వారికి, వారి కుటుంబసభ్యులకు చిరాయురారోగ్యైశ్వర్యములను శాన్తిసౌఖ్యములను ఇతోధిక విజ్ఞానాభివృద్ధిని కలిగించుగాక! అని ప్రార్థించుచున్నాను.

అనతికాలములోనే నయనాభిరామముగా గ్రంథమును ముద్రించియిచ్చిన వాణీ ఆర్ట్ ప్రింటర్స్ యజమానులు శ్రీ టి. శివశంకరరావుగారికి, వారి కార్యకర్తలకు, చక్కగా బైండుచేసి యిచ్చిన బి. వెంకటేశ్వర్లుగారికి నా హార్దికాశీస్సులు. ఇంకను ఎవరెవరు తోడు ఉండియున్నారో, వారందఱికి నా ధన్యవాదములు.

ఇట్లు
సుధీవిధేయుడు
సూరి రామకోటిశాస్త్రి

సికింద్రాబాదు
1996 డిసెంబరు

—:o:—

హరిః ఓమ్

శ్రీ గురుభ్యో నమః

శ్రీ విద్యారణ్యముని విరచితః

# జీవన్ముక్తి వివేకః

భావప్రకాశికాఖ్య

ఆంధ్రవివరణ సహితః

## ౧. జీవన్ముక్తి ప్రమాణ ప్రకరణమ్

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ యస్య నిఃశ్వసితం వేదాః యో వేదేభ్యోఽఖిలం జగత్।
నిర్మమే తమఖిలం వన్దే విద్యాతీర్థ మహేశ్వరమ్॥ 1

భావప్రకాశిక

శ్రీ విద్యారణ్య మునీంద్రులు 'జీవన్ముక్తి వివేకము' అను గ్రంథమును రచింపబోవుచు, మంగళాచరణమును చేయుచున్నారు. ఏ పరమేశ్వరునకు ఋగ్యజుస్సామాథర్వ వేదములు నిఃశ్వాసము వంటివో, ఏ పరమాత్మ, వేదముల వలన సమస్త జగత్తును సృజించెనో, అట్టి బ్రహ్మజ్ఞానైక సమధిగమ్యుడగు మహేశ్వరుని (నిర్గుణ బ్రహ్మను) నేను నమస్కరించుచున్నాను.

కాండద్వయాత్మక వేదోక్త ఉపనయనాది కర్మవిద్యా

ప్రత్యూహనివారకులు, శ్రీ గురుచరణులు నగు విద్యాతీర్థ (భారతీతీర్థ) మహేశ్వరులకు నేను నమస్కరించుచున్నాను. (మంగళాచరణము, గురుదేవతా నమస్కారపూర్వకముగా చేయ బడినది).

**జీవన్ముక్తివివేకః**

శ్లో॥ వక్ష్యే వివిదిషాన్యాసం విద్వద్న్యాసం చ భేదతః।
హేతూ విదేహముక్తేశ్చ జీవన్ముక్తేశ్చ క్రమాత్॥ 2

**భావప్రకాశిక**

ఈ గ్రంథమున విదేహముక్తికి కారణమగు వివిదిషా సంన్యాసమును, జీవన్ముక్తికి సాధనమగు విద్వత్సంన్యాసమును (యాజ్ఞవల్క్యుడు) విడివిడిగా స్పష్టముగా ఒకదానితరువాత నొకదానిని క్రమముగా వివరింతును.

**జీవన్ముక్తివివేకః**

శ్లో॥ సంన్యాసహేతు ర్వైరాగ్యం యదహర్విరజే త్తదా।
ప్రవ్రజేదితి వేదోక్తే స్తద్భేదస్తు పురాణగః॥ 3

'యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్'

'ఏ రోజున వైరాగ్యము కలుగునో, ఆ రోజుననే సంన్యసించవలె' నను శ్రుతివాక్యముచే ఐహికాముష్మిక ఫలభోగ విరాగము సంన్యాసమునకు అధికార లక్షణము. అనగా వైరాగ్యము కలిగిన వెంటనే సంన్యసించవలెను. ఈ వైరాగ్యము నాలుగు విధములు (యతమానము, వ్యతిరేకము, ఏకేన్ద్రియము, వశీకారము అని. పరగుణ వైతృష్ణ్యము (-పతంజలి) ఏవది సమాధిగా పురాణములందు చెప్పబడినది. (శ్రీధర వ్యాఖ్య, భాగవతము 10 స్కం. 89 అ.)

### జీవన్ముక్తి వివేకః

శ్లో॥ విరక్తిః ద్వివిధా ప్రోక్తా తీవ్రా తీవ్రతరేతి చ।
సత్యామేవ తు తీవ్రాయాం న్యస్యేద్యోగీ కుటీచకే॥ 4

### భావ ప్రకాశిక

వైరాగ్యము తీవ్రము, తీవ్రతరము అని రెండు విధములు. తీవ్ర వైరాగ్యము కలిగిన పిమ్మటనే కర్మయోగి (కామ్యాది కర్మలను విడనాడి, నిత్య నైమిత్తిక కర్మలను భగవదర్పణబుద్ధితో ఆచరించువాడు) కుటీచక సంన్యాసమును స్వీకరించవలెను.

### జీవన్ముక్తి వివేకః

శ్లో॥ శక్తో బహూదకే తీవ్రతరాయాం హంససంజ్ఞితే।
ముముక్షుః పరమే హంసే సాక్షాద్విజ్ఞానసాధనే॥ 5

### భావ ప్రకాశిక

మఱియు, తీవ్రవైరాగ్యము గల ఆ కర్మయోగి, తీర్థయాత్రాదులను ఆచరించుటలో సమర్థుడైనచో బహూదక సంన్యాసమును స్వీకరించవలెను. ఇక, తీవ్రతర వైరాగ్యము కలిగినచో బ్రహ్మలోకకాముడగుచో 'హంస' సంజ్ఞ గల సంన్యాసి కావలెను. తీవ్రతర వైరాగ్యము గల యోగి, ఇహలోకముననే మోక్షమును (ద్వైతబంధము నుండి విడివడుటను) కోరినవాడైనచో సాక్షాద్విజ్ఞానసాధనము లోకాంతరగమనముతో నిమిత్తము లేకుండగనే ఈ దేహమునందే ఆత్మజ్ఞానసాధనమగు పరమహంస సంన్యాసమునందు ప్రవేశించవలెను.

### జీవన్ముక్తి వివేకః

శ్లో॥ పుత్ర దార ధనాదీనాం నాశే తాత్కాలికీ మతిః।
ధిక్సంసార మితీదృక్స్యాత్ విరక్తేర్మందతా హి సా॥ 6

భావప్రకాశిక

భార్యాపుత్ర ధనాదులు నశించినపుడు, తాత్కాలికముగా 'ఛీ! సంసారము వలదు' అనునట్టి వైరాగ్యము మంద వైరాగ్యము.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ అస్మిన్ జన్మని మా భూవన్ పుత్రదారాదయో మమ।
ఇతి యా సుస్థిరా బుద్ధిః సా వైరాగ్యస్య తీవ్రతా॥ 7

భావప్రకాశిక

'ఈ జన్మయందు నాకు దారా పుత్రాదులు అక్కరలేదు. విషయసుఖము వలదు' అనెడి నిలకడ గల బుద్ధి (స్థిరమైన బుద్ధి) ఉన్నచో అది తీవ్ర వైరాగ్యము అని తెలియవలయును.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ పునరావృత్తిసహితః లోకో మే మాఽస్తు కశ్చన।
ఇతి తీవ్రతరత్వం స్యాత్ మన్దే న్యాసః న కోఽపి హి॥ 8

భావప్రకాశిక

కల్పాంతరమందైనను ఇహలోకమునకు తిరిగివచ్చుట గల బ్రహ్మలోకము గూడ నాకు వలదు' అను వైరాగ్యము తీవ్రతర వైరాగ్యము. మంద వైరాగ్యము కలవానికి ఏ సంన్యాసమూ లేదు. (ఏ సంన్యాసమునందును వీనికి అధికారము లేదు.)

జీవన్ముక్తివివేకః

శ్లో॥ యాత్రాద్యశక్తిశక్తిభ్యాం తీవ్రే న్యాసద్వయం భవేత్।
కుటీచకో బహూదశ్చేత్యుభావేతౌ త్రిదణ్డినౌ॥ 9

భావప్రకాశిక

తీవ్రవైరాగ్యము కలిగినపుడు, తీర్థయాత్రాది శక్తి లేనిచో 'కుటీచక' సంన్యాసము, తీర్థయాత్రలు చేయగల శక్తి

ఉన్నచో 'బహూదక' సంన్యాసము- రెండు సంన్యాసములు చెప్పబడినవి. ఈ కుటీచక, బహూదక సంన్యాసులు త్రిదండి సంన్యాసులు.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ ద్వయం తీవ్రతరే బ్రహ్మలోక మోక్ష విభేదతః।

భావప్రకాశిక

తీవ్రతర వైరాగ్యము కలుగగా, బ్రహ్మలోకకాముడు హంస సంన్యాసమును, మోక్షకాముడు పరమహంస సంన్యాసమును స్వీకరించును.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ తల్లోకే తత్త్వవిద్ధంసః లోకేఽస్మిన్ పరహంసకః॥ 10

భావప్రకాశిక

బ్రహ్మలోకమున, తత్త్వసాక్షాత్కారము (పొందవలెనని తలంచువాడు) పొందువాడు 'హంస' సంన్యాసి. ఈ లోకముననే తత్త్వసాక్షాత్కారము కోరువాడు 'పరమహంస' సంన్యాసి.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ ఏతేషాం తు సమాచారాః ప్రోక్తాః పారాశర స్మృతౌ।
వ్యాఖ్యానేఽస్మాభి రత్రాయం పరహంసో వివిచ్యతే॥ 11

భావప్రకాశిక

ఈ కుటీచక, బహూదక, హంస, పరమహంస సంన్యాసుల సమాచారములు (ధర్మములు, లక్షణములు) పారాశరస్మృతి వ్యాఖ్యానమునందు వివరింపబడినవి. ఈ 'జీవన్ముక్తి వివేక' గ్రంథమున, పరమహంస సంన్యాసము లక్షణ, సాధన, ప్రయోజన, ప్రమాణ, ఇతికర్తవ్యతా విభాగముతో విడిగా విశేషించి వివరింపబడుచున్నది.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ జిజ్ఞాసుః జ్ఞానవాంశ్చేతి పరహంసో ద్విధా మతః।
ప్రాహు ర్జ్ఞానాయ జిజ్ఞాసో ర్న్యాసం వాజసనేయినః॥ 12

భావప్రకాశిక

పరమహంస, ఆత్మజ్ఞానము కోరువాడు, ఆత్మజ్ఞానము కలివాడు (వివిదిషాసంన్యాసి, విద్వత్సంన్యాసి) అని రెండు విధములు. వివిదిషువునకు (ఆత్మజిజ్ఞాస కలవానికి) జ్ఞానము కొరకు సంన్యాసమును (వివిదిషాసంన్యాసమును) శుక్లయజుశ్శాఖ వారు బృహదారుణ్యకమున చెప్పుచున్నారు.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ ప్రవ్రాజినో లోక మేత మిచ్ఛన్తః ప్రవ్రజన్తి హి।

భావప్రకాశిక

"ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి" అని బృహదారణ్యక శ్రుతి వాక్యము. ఏతం = ఆత్మ, ఏతమేవ = ఆత్మలోకము కొరకు. మనుష్య, పితృ, దేవలోక ఫలములందు విరక్తి కలిగి నిత్యనైమిత్తిక కర్మసంన్యాస మొనర్చినవారు స్వప్రకాశమైన ఈ ఆత్మలోకమును కోరుచున్నవారై పరమహంసాశ్రమస్థులై వేదాన్త శ్రవణజన్య జ్ఞానము కొరకు బ్రహ్మనిష్ఠులగు ఆచార్యుల సమీపమునకు వెళ్ళుదురు.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ ఏతస్యార్థస్తు గద్యేన వక్ష్యతే మన్దబుద్ధయే॥ 13

భావప్రకాశిక

ఈ సార్ధ ఏకాదశ శ్లోకములచే చెప్పబడిన అర్థమును బుద్ధి సూక్ష్మత లేని సాధారణ జనులు తెలిసికొనుటకై గద్యముతో వివరింపబడును.

### జీవన్ముక్తివివేకః

లోకో హి ద్వివిధః, ఆత్మలోకః అనాత్మలోకశ్చేతి।

### భావ ప్రకాశిక

ఆత్మలోకము, అనాత్మలోకము అని లోకము రెండు విధములు. ఇచట; 'లోక' శబ్దము యొక్క అర్థము వివరింపబడు చున్నది.

"లోక్యతే ముముక్షుభిః తత్త్వమస్యాది వాక్యైః అపరోక్ష జ్ఞానేన సాక్షాత్క్రియతే ఇతి లోకః। ఆత్మా చ అసౌ లోకశ్చ ఆత్మలోకః॥"

ముముక్షు జనులచే 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములచే అపరోక్షముగా సాక్షాత్కరించుకొనబడు శుద్ధ అద్వైత ప్రత్యగాత్మ, ఆత్మలోకము.

శ్లో॥ "యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ।
యచ్చాస్య సన్తతో భావః తస్మా దాత్మేతి భణ్యతే॥"

అని వర్ణించిన రీతిగా అవస్థాత్రయాతీతము, అవస్థాత్రయానుస్యూతము, స్థూల, సూక్ష్మ, కారణ శరీరత్రయ వ్యతిరిక్తము, స్వప్రకాశము నయిన ఆత్మ, ఆత్మలోకము.

### జీవన్ముక్తివివేకః

తత్రా౽నాత్మలోకస్య త్రై౽విధ్యం బృహదారణ్యకే తృతీయాధ్యాయే శ్రూ౽యతే- "అథ త్రయో వావ లోకా మనుష్యలోకః, పితృలోకో దేవలోక ఇతి। సో౽యం మనుష్యలోకః పుత్రే౽ణైవ జయ్యో నాన్యేన కర్మణా, కర్మణా పితృలోకో విద్యయా దేవలోకః" ఇతి। (5-16)

### భావప్రకాశిక

న ఆత్మా అనాత్మా దృగ్రూపః స్వప్రకాశః ఆత్మా।

అనాత్మా దృశ్యపదార్థః॥

ఆత్మవస్తువు దృగ్రూపము కాగా, అనాత్మ, దృశ్య పదార్థము అగుచున్నది. అనాత్మాచాసౌ లోకశ్చ అనాత్మలోకః। ఈ అనాత్మలోకము మనుష్యలోకము, పితృలోకము, దేవలోకము అని మూడు విధములుగా బృహదారణ్యక శ్రుతియందు తృతీయాధ్యాయమున వినబడుచున్నది. మనుష్యలోకము పుత్రునిచేతనే జయించబడవలెను. అనగా తండ్రి, తాను కొంతవరకు చేసి ఆయుర్దాయము తీరుటచే పుత్రునకు ఆ కర్మలను అప్పగించును. పుత్రుడు, శేష కర్మాచరణము చేసి, తండ్రికి సద్గతిప్రాపకుడగును, మఱియు, పుత్రుడు తండ్రికి ఉపచారభోగములచే మనుష్యలోక విజయమునకు కారకుడగును. అన్యులగు బంధ్వాది జనులచేతను, నిత్య, నైమిత్తిక కర్మలచేతను, మనుష్యలోక జయము కలుగనేరదు. 'కర్మణా పితృలోకః' నిత్య నైమిత్తికాది కర్మలచే పితృలోకము- స్వర్గాఖ్యమగు చంద్రలోకము ప్రాప్తమగును. 'విద్యయా దేవలోకః' దహరాద్యుపాసనములచేత దేవలోకము-సత్యలోకము (బ్రహ్మలోకము) ప్రాప్తమగును అని శ్రూయమాణ మగుచున్నది.

జీవన్ముక్తివివేకః

ఆత్మలోకశ్చ తత్రైవ శ్రూయతే- 'యో హ వా అస్మాల్లోకాత్స్వం లోక మదృష్ట్వా ప్రైతి స ఏన మవిదితో న భునక్తి' (4-15) ఇతి। 'ఆత్మానమేవ లోక ముపాసీత స య ఆత్మానమేవ లోక ముపాస్తే న హ అస్య కర్మ క్షీయతే' ఇతి చ (4-15)।

భావప్రకాశిక

ఆత్మలోకము ఆ బృహదారణ్యకమునందే ఈవిధముగా వినబడుచున్నది. 'యో హ వా ...... నహ అస్య కర్మ క్షీయతే'। దీని అర్థము వివరింపబడుచున్నది.

జీవన్ముక్తివివేకః

యో మాంసాది పిండలక్షణాత్ స్వలోకం పరమాత్మాఖ్యం అహం బ్రహ్మాస్మీత్యవిదిత్వా మ్రియతే స స్వలోకః పరమాత్మాఽవిదితోఽవిద్యయాఽవ్యవహితః సన్ ఏన మవేత్తారం ప్రేతం మృతం న భునక్తి శోకమోహాది దోషాపనయనేన న పాలయతి।

భావప్రకాశిక

యః=ఎవడైతే, అస్మాత్ లోకాత్ మాంసాది పిండలక్షణాత్= మనుష్యలోకమునుండి స్వలోకమగు పరమాత్మను 'అహం బ్రహ్మాస్మి' అని తెలిసికొనక మరణించునో, ఆ స్వలోకమగు పరమాత్మ, అజ్ఞానావరణముచే వ్యవహితుడగుచు, ఈ అజ్ఞానిని చనిపోయినవానిని, శోకమోహాది దోషములను పోగొట్టుటచే రక్షింపజాలడు.

జీవన్ముక్తి వివేకః

ఉపాసకస్య చ హ నిశ్చితం కర్మ న క్షీయతే ఏకఫలదానేన ఉపక్షీణం న భవతి కామిత సర్వఫలం మోక్షం చ దదాతీత్యర్థం షష్ఠాధ్యాయేఽపి కిమర్థం వయ మధ్యేష్యామహే, కిమర్థం వయం యక్ష్యామహే కిం ప్రజయా కరిష్యామో యేషాం నః అయమాత్మా అయం లోకః ఇతి। యే ప్రజామీశిరే తే శ్మశానాని భేజిరే। యే ప్రజా నేశిరే తేఽమృతత్వం హి భేజిరే।"

బృ. 4-4-22 ఛాం. 5-10-1,2 శం. భా.

భావప్రకాశిక

ఆత్మోపాసకునకు (ఆత్మజ్ఞానికి) నిశ్చయముగా కర్మ క్షీణించదు. అనగా ఒక ఫలము నిచ్చుటచేత ఉపక్షీణము కాదు.

కోరబడిన సర్వఫలమునుఇచ్చున్ను,మోక్షమునుగూడ ఇచ్చుచున్నది అని శ్రుత్యర్థము. షష్ఠాధ్యాయమునందుగూడ (బృహదారణ్యక) నేను ఏల అధ్యయనము చేయవలెను ? నేను ఏల యజ్ఞములను చేయవలెను ? సంతానముతో ఏమి చేయవలెను ? మాకు ఆత్మ లోకము కలదు కదా ! ఆత్మలోకము పొందినవారికి అధ్యయన, యాగ, పుత్రాదులతో పని లేదు అని భావము. ఎవరు సంతానమును బడసిరో వారు శ్మశానములను చేరికొనిరి (మరణించిరి). ఎవరు పుత్రులను కోరలేదో (ఆత్మలోకమునే కోరిరో) వారు అమృతత్వ మును, అనగా మోక్షమును పొందిరి.

జీవన్ముక్తివివేకః

ఏవం చ 'ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి' ఇత్యత్ర ఆత్మలోకః వివక్షిత ఇతి గమ్యతే, 'స వా ఏష మహానజ ఆత్మా' ఇతి ప్రక్రాన్తస్య ఆత్మన ఏతచ్ఛబ్దేన పరామృష్టత్వాత్।

భావప్రకాశిక

వివిదిషాసంన్యాసమునకు ప్రమాణముగా ఉదహరించిన ఈ బృహదారణ్యక శ్రుతిలో 'ఏతమేవలోకం' అను వచనముచే ఆత్మలోకమే శ్రుతికి వివక్షితము అని తెలియనగును. ఏలననగా, అంతకు పూర్వము 'స వా ఏష మహానజ ఆత్మా' అని ఆత్మవస్తువు ప్రక్రాన్తము అయినది (వక్తృ శ్రోతృ బుద్ధిస్థమైనది). ఏతచ్ఛబ్దము సర్వనామ పూర్వపరామర్శకము గనుక, ఆ ఆత్మను చెప్పుచున్నది.

జీవన్ముక్తివివేకః

"లోక్యతే అనుభూయతే ఇతి లోకః తథా చ ఆత్మానుభవ మిచ్ఛన్తః ప్రవ్రజన్తి ఇతి శ్రుతేస్తాత్పర్యార్థః సంపద్యతే॥

భావప్రకాశిక

'ఆత్మలోకః' అనుచోట, లోకశబ్దము, 'లోక్యతే, అనుభూయతే' అపరోక్షముగా అనుభవింపబడుచున్నది అను అర్థమున ఆత్మయందు ప్రవర్తించుచున్నది. తేలిన పర్యవసానము ఏమనగా ఆత్మాపరోక్షానుభవము కోరుచున్నవారు (అధికారులు) సంన్యసించుచున్నారు (సంన్యసించవలయును) అని శ్రుతియొక్క తాత్పర్యార్థము సిద్ధించుచున్నది.

జీవన్ముక్తి వివేకః

స్మృతిశ్చ—

శ్లో॥ బ్రహ్మవిజ్ఞానలాభాయ పరహంస సమాహ్వయః
శాన్తి దాన్త్యాదిభిః సర్వైః సాధనైః సహితో భవేత్॥ ఇతి।

భావప్రకాశిక

స్మృతియు, సచ్చిదానంద లక్షణమగు బ్రహ్మయొక్క దృఢ అపరోక్ష సాక్షాత్కారలాభము కొరకు పరమహంస సంజ్ఞగల సంన్యాసి శమము, దమము, తితిక్ష మొదలగు శ్రౌత సాధనములు, అమానిత్వము, అదంభిత్వము, అహింస, క్షాంతి, ఆర్జవము మొదలగు స్మార్త (భగవద్గీతోక్త) సాధనములు అన్నియు కలవాడు కావలెను అని కలదు.

జీవన్ముక్తి వివేకః

ఇహ జన్మని జన్మాన్తరే వా సమ్యగనుష్ఠితైః వేదానువచనాదిభి రుత్పన్నయా వివిదిషయా సంపాదితత్వా దయం వివిదిషా సంన్యాస ఇత్యభిధీయతే।

భావప్రకాశిక

ఈ జన్మయందుగాని, జన్మాంతరమునందు (పూర్వజన్మయందు) గాని, చక్కగా (కర్తృత్వాభిమానము, ఫలేచ్ఛ

లేకుండగా ఈశ్వరార్పణ బుద్ధితో) ఆచరింపబడిన వేదానువచన (నిత్యస్వాధ్యాయ) యజ్ఞ, దాన, తపస్సులచే కలిగిన వివిదిషచే-ఆత్మతత్త్వజిజ్ఞాసచే స్వీకరింపబడిన సంన్యాసము గాన, ఇది వివిదిషాసంన్యాసము అని వ్యవహరింపబడుచున్నది.

## జీవన్ముక్తివివేకః

అయం చ వేదనహేతుః సంన్యాసః ద్వివిధః, జన్మాపాదక కామ్యకర్మాదిత్యాగమాత్రాత్మకః, ప్రైషోచ్చారణపూర్వక దండ ధారణాద్యాశ్రమరూపశ్చేతి।

శ్లో॥ పుంజన్మ లభతే మాతా పత్నీ చ ప్రైషమాత్రతః।
బ్రహ్మనిష్ఠః సుశీలశ్చ జ్ఞానం చైతత్ప్రభావతః॥

## భావప్రకాశిక

ఆత్మతత్త్వజ్ఞానహేతువగు ఈ వివిదిషా సంన్యాసము రెండు విధములు. ఉత్తరజన్మసంపాదకమగు కామ్యకర్మలను, తత్సాధన ధనార్జనాదులను విడనాడుట మాత్రమే స్వరూపముగా గలది ఒకటి. రెండవది-'సంన్యస్తం మయా' అను ప్రైషవాక్యమును ఉచ్చరించి, కాషాయ కమండలు దండధారణాది లక్షణములు గల ఆశ్రమసంన్యాసము.

సంన్యాసాశ్రమమును స్వీకరించుటకు ముందు, తల్లి అనుమతిని, పత్ని యొక్క ఆమోదమును పొందవలయును. ఆవిధముగా పుత్రుడు, ప్రైషోచ్చారణము చేసి సంన్యాసము స్వీకరించుటవలన తల్లికి, తరువాత పురుషజన్మ లభించును. భార్య కూడ పురుషజన్మను పొందగలదు. ఈ ప్రైషవాక్య ఉచ్చారణ మాత్రముచేతనే బ్రహ్మనిష్ఠుడు, మంచి శీలము గలవాడు, జ్ఞానియు అగును.

### జీవన్ముక్తివివేకః

త్యాగశ్చ తైత్తిరీయాదౌ శ్రూయతే— 'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః' 4-12-3 ఇతి। అస్మింశ్చ త్యాగే స్త్రియో೭ప్యధిక్రియన్తే

### భావప్రకాశిక

త్యాగరూపమగు సంన్యాసము తైత్తిరీయ, కైవల్యాది ఉపనిషత్తులందు వినబడుచున్నది. ఏకే=కొందరు (ముఖ్యులు), త్యాగేన=త్యాగలక్షణమగు సంన్యాసము చేతనే అమృతత్వం = మోక్షమును ఆనశుః=పొందిరి. కర్మణా న= వైదిక కర్మచేతను కాదు, ప్రజయా న=పుత్రుని చేతను కాదు, ధనేన=ధనముచేతను (దానముచేతను) న=మోక్షమును పొందరు. ఈ త్యాగమునందు స్త్రీలు కూడ, అధికారము కలిగి ఉన్నారు.

### జీవన్ముక్తివివేకః

'భిక్షుకీ' ఇత్యనేన స్త్రీణామపి ప్రాగ్వివాహాద్వా వైధవ్యాదూర్ధ్వం వా సంన్యాసే೭ధికారో೭స్తీతి దర్శితమ్; తేన భిక్షాచర్యం మోక్షశాస్త్రశ్రవణ మేకాన్తే ఆత్మధ్యానం చ తాభిః కర్తవ్యమ్, త్రిదండాదికం చ ధార్యమ్ ఇతి మోక్షధర్మే చతుర్థ టీకాయాం సులభా జనక సంవాదే—

శ్లో॥ అథ ధర్మయుగే తస్మిన్ యోగధర్మమనుష్ఠితా।
మహీ మనుచచారైకా సులభా నామ భిక్షుకీ ॥

మ.భా., శాం; 320. అ. మోక్షధర్మము

### భావప్రకాశిక

'భిక్షుకీ' అని అనుటచేత స్త్రీలకు గూడ, వివాహమునకు పూర్వము గాని, వైధవ్యానంతరము గాని సంన్యాసమునందు అధికారము కలదని చూపబడినది. అందుచేత భిక్షుకధర్మ మగు

భిక్షాధర్మము మోక్షశాస్త్రశ్రవణము, విజన ప్రదేశవాసము, ఆత్మ ధ్యానము వారిచేత చేయదగియున్నది. త్రిదండధారణము కూడ చేయవలయును అని మోక్షధర్మము నందు చతుర్ధరీటీకయందు సులభాజనక సంవాద సందర్భములో చెప్పబడినది.

## జీవన్ముక్తి వివేకః

శారీరక భాష్యే 'వాచక్నవీ' ఇత్యాది శ్రూయతే। దేవతాధికరణ న్యాయేన విధురస్య అధికార ప్రసజ్గత్వేన తృతీయాధ్యాయే చతుర్థపాదే। అత ఏవ మైత్రేయీవాక్యం ఆమ్నాయతే- 'యేనాహం నామృతా స్యాం కిమహం తేన కుర్యామ్, యదేవ భగవాన్ వేత్థ। తదేవ మే బ్రూహి' ఇతి।

## భావప్రకాశిక

శారీరక భాష్యమున, వాచక్నవి (గార్గి) మొదలైన స్త్రీ నామములు వినబడుచున్నవి. వచక్నుదుహిత యగు గార్గి, జనక విద్వత్సభలో యాజ్ఞవల్క్యుని ప్రశ్నించినట్లు స్పష్టముగా కలదు. విధురుడు (భార్యావియోగముచే అనాశ్రమి) బ్రహ్మవిద్యయందు అధికారము కలవాడు అగునా ? అను ప్రసంగమున, తృతీయాధ్యాయ చతుర్థపాదమునందు 'అంతరా చాపి తు తద్దృష్టేః' అను సూత్రమున, దేవతాధికరణ న్యాయమును తీసికొని బ్రహ్మవిద్య యందు విధురునకు గూడ అధికారము కలదు అని నిర్ణయింపబడినది. దేవతాధికరణమున 'దేవతలకు కర్మాధికారము లేకపోయినను, 'అపర్యుదస్తత్వాత్' బ్రహ్మవిద్యను అధ్యయనము చేయరాదు అను నిషేధము లేనందువలన సుఖస్వరూపమగుటచే బ్రహ్మ, స్పృహణీయము అయినందున, దేవతలకు బ్రహ్మవిద్యాధికారము కలదు అని నిర్ణయించబడినది. స్త్రీలకు గూడ బ్రహ్మాధికారము కలదు. కనుకనే బృహదారణ్యకమునందు

మైత్రేయీ బ్రాహ్మణములో మైత్రేయీవాక్యము ఈవిధముగా పఠింపబడినది. అంతకుపూర్వము యాజ్ఞవల్క్యుడు

"అమృతత్వస్య తు న ఆశాఽస్తి విత్తేన"

మోక్షము ధనముచేతగాని, ధనసాధ్యమగు కర్మచేతగాని ఆశించుట తగదు అని చెప్పియుండెను. అపుడు మైత్రేయి 'ఏ ధనముతో నేను అమృతత్వమును పొందజాలనో, ఆ ధనముతో నేను ఏమి చేసికొనెదను? పూజ్యుడా! ఏది అమృతత్వసాధనమని మీరు ఎరుగుదురో, ఆ అమృతత్వసాధనమునే నాకు ఉపదేశింపుడు' అని పలికెను.

### జీవన్ముక్తి వివేకః

బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థానాం కేనచిత్ నిమిత్తేన సంన్యాసాశ్రమస్వీకారే ప్రతిబద్ధే సతి స్వాశ్రమధర్మేషు అనుష్ఠీయమానేష్వపి వేదనార్థః మానసః కర్మాదిత్యాగః న విరుధ్యతే। శ్రుతి స్మృతీతిహాస పురాణేషు లోకే చ తాదృశాం తత్త్వవిదాం బహూనా ముపలమ్భాత్।

### భావప్రకాశిక

బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థులకు ఒకానొక కారణము చేత సంన్యాసాశ్రమ స్వీకారము ప్రతిబద్ధము కాగా తాము ఉన్న ఆశ్రమధర్మములు అనుష్ఠింపబడుచుండగానే బ్రహ్మాత్మజ్ఞానము కొరకు మానస కర్మాదిత్యాగము (మానస సంన్యాసము) విరుద్ధము కాదు. శ్రుతులయందు, స్మృతులయందు, ఇతిహాసము లందు, పురాణములందు, లోకమునందుగూడ సంన్యాసాశ్రమము స్వీకరించినంతనే తత్త్వజ్ఞానము కలిగిన మహానుభావులు పలువురు కనబడుచున్నారు. కావున, శ్రుతులందు ఛాందోగ్యమున ఉద్దాలక, శ్వేతకేతు, సనత్కుమార, నారదాదులు; బృహదారణ్యకమున అజాతశత్రు, దధ్యఙ్, ఆథర్వణ, యాజ్ఞవల్క్య, మైత్రేయీ,

కహోల, ఉషస్త, గార్గి, జనకాదులు; వీరుకాక, కౌషీతకోపనిషత్తు నందు ప్రతర్దనాదులు, ఆత్మజ్ఞానసంపన్నులుగా ప్రసిద్ధులు. స్మృతులందు అర్జున, జనక, అశ్వపతి మొదలైనవారు; పురాణములందు (శ్రీభాగవతాదులందు) సూత, శౌనక, వ్యాస, కర్దమ, కపిల, దేవహూతి, ప్రియవ్రత, సౌభరి, జడభరత, రహూగణ, యదు, విదుర, వసుదేవ, ఉద్ధవ, పరీక్షిదాదులు; ఇతిహాసములందు (శ్రీమహాభారతమునందు) కశ్యపాదులు, శ్రీమద్రామాయణమున, వాల్మీకి మొదలైనవారు ప్రసిద్ధులు. లోకమునందు గూడ, సంన్యాసాశ్రమము స్వీకరించకనే ప్రౌఢ అద్వైత తత్త్వ గ్రంథమును రచించినవారు ఖండనఖండఖాద్య కర్త శ్రీహర్షుడు, భామతీకారులగు వాచస్పతిమిశ్రులు ప్రసిద్ధులు. కనుక, వివిదిషా సంన్యాసము ఆశ్రమసంన్యాసమే కాక, మానస కర్మత్యాగరూపమగు రెండవ సంన్యాసము కూడ అంగీకరింప దగినది.

జీవన్ముక్తివివేకః

యస్తు దణ్డధారణాదిరూపః వేదనహేతుః పరమహంసాశ్రమః, సః పూర్వాచార్యైః బహుధా ప్రపఞ్చిత ఇతి అస్మాభిః ఉపరమ్యతే॥

ఇతి జీవన్ముక్తివివేకే వివిదిషాసంన్యాసః।

భావప్రకాశిక

ఆత్మజ్ఞానము కొరకు దండ కాషాయాంబరధారణాది రూపమగు ఏ పరమహంసాశ్రమము కలదో, అది పూర్వాచార్యులగు భాష్యకారాదులచే, శ్రుతిప్రమాణముచే బహువిధములుగా విస్తరించి వర్ణింపబడినది గనుక, మేము ఆ ఆశ్రమసంన్యాసమును గురించి వివరించుటకు పూనుకొనుటలేదు.

జీవన్ముక్తివివేకమున వివిదిషాసంన్యాసము సమాప్తము.

మోక్షసాధనము బ్రహ్మాత్మైక్యజ్ఞానము. ఆ జ్ఞానమునకు సంన్యాసము అంగము. ఈ సంన్యాసము కర్మలచే నశించని దురితమును నశింపజేయుట ద్వారా జ్ఞానమునకు ఉపయోగ పడునని కొందరు చెప్పుచున్నారు. మఱికొందరు అదృష్టద్వారా శ్రవణాంగము అని తలంచిరి. మఱికొందరు దృష్టమగు విక్షేపమును వారించి వేదాన్త శ్రవణమునకు అంగ మగునని తలంచిరి. సంన్యాస శ్రుతియందు 'బ్రాహ్మణ' శబ్ద ప్రయోగముచేత బ్రాహ్మణునకే సంన్యాసము అని కొందరి అభిప్రాయము. అపుడు, క్షత్త్రియ, వైశ్యులకు సంన్యాసము లేకయే ఇంద్రాది దేవతలకు వలె వేదాన్త శ్రవణాధికారము కలదు.

"బ్రహ్మసంస్థః అమృతత్వ మేతి।"

అను శ్రుతి వలన వేదాన్త శ్రవణ, బ్రహ్మవిద్యలందు సంన్యాసి ముఖ్యాధికారి. గృహస్థు, క్షత్త్రియ, వైశ్యులు వేదాన్త శ్రవణాదు లందు గౌణాధికారులు. ఎవరికి సంన్యాసము లేకుండగనే తత్త్వ జ్ఞానము శ్రుతి స్మృతీతిహాస పురాణ లోకప్రసిద్ధమో, వారికి పూర్వజన్మయందే సంన్యాసము జరిగి యుండవలెను. అథవా, ఉత్తర జన్మయందు అపరోక్షజ్ఞానము పొంది, మోక్షమును పొంద గలరు. మానసకర్మత్యాగరూప మగు వివిదిషాసంన్యాసపక్షమున ఈ జన్మయందే పరివ్రాజకేతరులు కూడ మోక్షమును పొంద వచ్చును.

## జీవన్ముక్తివివేకః

### విద్వత్సంన్యాసః

అథ విద్వత్సంన్యాసం నిరూపయామః। సమ్యగనుష్ఠితైః శ్రవణ మనన నిదిధ్యాసనైః పరం తత్త్వం విదితవద్భిః సంపాద్యమానః విద్వత్సంన్యాసః। తం చ యాజ్ఞవల్క్యః

సంపాదయామాస। తథా హి, విద్వచ్ఛిరోమణిః భగవాన్ యాజ్ఞవల్క్యః విజిగీషుకథాయాం బహువిధేన తత్త్వనిరూపణేన అశ్వలప్రభృతీన్ విజిత్య, వీతరాగకథాయాం సంక్షేప విస్తరాభ్యాం అనేకథా జనకం బోధయిత్వా, మైత్రేయీం బుబోధయిషుః తస్యాః త్వరయా తత్త్వాభిముఖ్యాయా స్వకర్తవ్యం సంన్యాసం ప్రతిజజ్ఞే। తతః తాం బోధయిత్వా సంన్యాసం చకార।

## భావప్రకాశిక

వివిదిషా సంన్యాస నిరూపణానంతరము విద్వత్సంన్యాసము నిరూపించుచున్నాము. సాధనచతుష్టయ సంపత్తితో అనుష్ఠింప బడిన శ్రవణ, మనన, నిదిధ్యాసనములచే పరతత్త్వమును (బ్రహ్మను) తెలిసికొనిన (సాక్షాత్కరించుకొనిన) వారిచే ఆచరింప బడు సంన్యాసము విద్వత్సంన్యాసము. యాజ్ఞవల్క్యుడు ఈ విద్వత్సంన్యాసమును స్వీకరించెను. దీనిని ఉపపాదించు చున్నాము. విద్వచ్ఛిరోమణి, పూజ్యుడు నయిన యాజ్ఞవల్క్యుడు జనక విద్వత్సభలో బ్రహ్మవిద్యయందు విజయము కోరునట్టి బహువిద్వాంసులతో సంభాషించి బహువిధములుగా తత్త్వ నిరూపణ మొనర్చి, అశ్వలుడు మొదలగు మునులను జయించెను. జనకునితో వీతరాగ కథాప్రసంగమున సంక్షేపముగాను, తరువాత విస్తారముగాను అనేకవిధముల జనకునికి తత్త్వబోధ చేసెను. తరువాత, యాజ్ఞవల్క్యుడు తన పెద్దభార్య యగు మైత్రేయికి తత్త్వబోధ చేయదలచినవాడై త్వరగా ఆమెకు తత్త్వాభి ముఖ్యము కలుగుటకొరకు 'నేను గృహస్థాశ్రమము వదలి, పై ఆశ్రమమును (పారివ్రజ్యమును) స్వీకరించబోవుచున్నాను' అని ప్రతిజ్ఞ చేసెను. తరువాత, ఆమెకు ఆత్మబోధను చేసి భార్యాను మతితో స్వకర్తవ్యమైన సంన్యాసమును స్వీకరించెను.

### జీవన్ముక్తి వివేకః

తదుభయం మైత్రేయీబ్రాహ్మణస్య ఆద్యన్తయోః ఆమ్నాయతే– 'అథ హ యాజ్ఞవల్క్యః అన్యద్ వృత్తం ఉపాకరిష్యన్ మైత్రేయీతి హోవాచ యాజ్ఞవల్క్యః ప్రవ్రజిష్యన్వా అరేఽహమస్మాత్ స్థానా దస్మి' 4-5-1, 2 ఇతి। 'ఏతావదరే ఖల్వమృతత్వమితి హ ఉక్త్వా యాజ్ఞవల్క్యో విజహార' 4-5-16 ఇతి చ।

### భావప్రకాశిక

మైత్రేయికి బ్రహ్మవిద్యోపదేశ ప్రతిపాదకమగు ఉపనిషద్భాగము మైత్రేయీబ్రాహ్మణము. అందు మొదట, యాజ్ఞవల్క్యుడు మైత్రేయీ! అని పిలిచి 'నేను గృహస్థాశ్రమమును వీడి, సంన్యసింపబోవుచున్నాను' అని ప్రతిజ్ఞ చేసెను. మైత్రేయికి ఆత్మబోధ చేసి ఈ జ్ఞానముచేతనే మోక్షము లభించునని చెప్పి, తరువాత, సంన్యసించెను.

### జీవన్ముక్తి వివేకః

కహోల బ్రాహ్మణేఽపి విద్వత్సంన్యాసః ఆమ్నాయతే– 'ఏతం వై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి' 3-5-1 ఇతి। న చైతద్వాక్యం వివిదిషాసంన్యాసపర మితి శఙ్కనీయమ్। పూర్వకాలవాచినః 'విదిత్వేతి' 'క్త్వా' ప్రత్యయస్య బ్రహ్మవిద్వాచినః 'బ్రాహ్మణ' శబ్దస్య చ బాధప్రసఙ్గాత్।

### భావప్రకాశిక

కహోలబ్రాహ్మణమునందు గూడ, విద్వత్సంన్యాసము పఠింపబడినది. ఎట్లనగా– ఈ సాక్షాదపరోక్ష బ్రహ్మస్వరూపమగు ఆత్మను తెలిసికొని, బ్రాహ్మణులు (బ్రహ్మజ్ఞానులు–బ్రహ్మజ్ఞానవిదులు) పుత్రేషణ నుండియు విత్తేషణ నుండియు లోకేషణ

నుండియు విడివడి (దూరముగా పైకి వెళ్ళి, అనగా జయించి) అనంతరము, భిక్షాచరణమును చేయుచున్నారు అని చెప్పబడినది. ఇచట ఆత్మవేదనము, పుత్ర విత్త లోక ఏషణాత్యాగము, భిక్షా చరణము అను విషయములు క్రమముగా చెప్పబడినవి. ఈ వాక్యము వివిదిషాసంన్యాసపరము అని శంకింపరాదు. ఏలననగా 'విదిత్వా' అని 'క్త్వా' ప్రత్యయము పూర్వకాలికము, వ్యుత్థాన భిక్షాచరణములు అనంతరకాలికములు అని తెలియవచ్చుచున్నది. జ్ఞానానంతర పారివ్రాజ్యము గనుక, ఇది విద్వత్సంన్యాసమే అయి ఉన్నది. మఱియు 'బ్రాహ్మణాః' అను శబ్దము కలదు. బ్రాహ్మణశబ్దము బ్రహ్మవేత్తలను బోధించును. వారు భిక్షా చరణము చేయుచున్నారు అనుటచేత వేదనానన్తర-సంన్యాసమే గ్రహింపవలయును. అట్లు కానిచో బ్రాహ్మణ-శబ్దార్థమును పరి త్యజించినట్లగును.

## జీవన్ముక్తివివేకః

న చాత్ర బ్రాహ్మణశబ్దో జాతివాచకః। వాక్యశేషే పాణ్డిత్య బాల్య మౌన శబ్దాభిధేయైః శ్రవణ మనన నిదిధ్యాసనైః సాధ్యం బ్రహ్మసాక్షాత్కార మభిప్రేత్య 'అథ బ్రాహ్మణః' ౩-1-5 ఇతి అభిహితత్వాత్। నను తత్ర వివిదిషాసంన్యాసోపేతః పాండిత్యాదౌ ప్రవర్తమానోఽపి బ్రాహ్మణశబ్దేన పరామృష్టః 'తస్మాద్ బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్' ౩-5-1 ఇతీతిచేత్, నైవమ్, భావినీం వృత్తి మాశ్రిత్య తత్ర బ్రాహ్మణ శబ్దస్య ప్రయుక్తత్వాత్ అన్యథా కథం 'అథ బ్రాహ్మణః' ౩-5-1 ఇతి సాధనానుష్ఠానోత్తరకాలవాచినం అథ శబ్దం ప్రయుఞ్జీత?

## భావప్రకాశిక

'బ్రాహ్మణాః .... భిక్షాచర్యం చరన్తి' అను వాక్యములో 'బ్రాహ్మణ శబ్దము బ్రాహ్మణజాతి వ్యక్తులను బోధించును.

బ్రహ్మవేత్తలు అను అర్థము అచట గ్రహింపరాదు' అని వాదింప రాదు. వాక్యశేషమున పాండిత్య, బాల్య, మౌన, శబ్దములచే క్రమముగా శ్రవణ, మనన, నిదిధ్యాసనములను బోధించి 'అథ బ్రాహ్మణః' తరువాత బ్రాహ్మణుడు అగును అని చెప్పుటవలన ఈ ప్రకరణమున బ్రాహ్మణ శబ్దము బ్రహ్మసాక్షాత్కారము గల వానినే గ్రహించవలెనని చెప్పినట్లైనది. ఓయీ! ఈ ప్రకరణమున, వివిదిషాసంన్యాసము స్వీకరించి,పాండిత్యాది శబ్దములచే శ్రవణ, మనన, నిదిధ్యాసనములందు ప్రవర్తించువాడు కూడ బ్రాహ్మణ శబ్దముచేతపరామర్శింపబడెను.'తస్మాత్ బ్రాహ్మణః...తిష్ఠాసేత్' అను వాక్యములో బ్రాహ్మణశబ్దము వివిదిషుసంన్యాసిపరము గానే ప్రయుక్తమైనది కదా! అని అనినచో, అట్లు కాదు. ఆ వాక్యమున, 'భావినీవృత్తి మాశ్రిత్య' రాబోవు స్థితిని బట్టి బ్రాహ్మణశబ్దము ప్రయుక్తమైనది. అట్లు కానిచో 'కథ మథ బ్రాహ్మణః' 'అథ బ్రాహ్మణః' అని అనంతరవాచి 'అథ' శబ్దమును ప్రయోగించి శ్రవణ, మనన, నిదిధ్యాసానన్తరము బ్రాహ్మణుడు అగును అని చెప్పుట ఎట్లు పొసగును ?

## జీవన్ముక్తి వివేకః

శారీరబ్రాహ్మణేఽపి విద్వత్సంన్యాస, వివిదిషాసంన్యాసౌ స్పష్టం నిర్దిష్టౌ- 'ఏతమేవ విదిత్వా మునిర్భవతి, ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి' 4-4-22 ఇతి। మునిత్వం మననశీలత్వం; తచ్చ అసతి కర్తవ్యాన్తరే సంభవతి ఇతి। అర్థాత్ సంన్యాస ఏవ అభిధీయతే। ఏతచ్చ వాక్యశేషే స్ఫుటీ కృతమ్- ఏతద్ధ స్మ వై తత్పూర్వే విద్వాంసః ప్రజాం న కామయన్తే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాఽయం లోక ఇతి తే హ స్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి' 4-4-22 ఇతి।

అయం లోక ఇతి అపరోక్షేణ అనుభూయత ఇత్యర్థః। నన్వత్ర మునిత్వేన ఫలేన ప్రలోభ్య వివిదిషాసంన్యాసం విధాయ వాక్యశేషే స ఏవ ప్రపఞ్చితః। అతః న సంన్యాసాన్తరం కల్పనీయమ్।

భావప్రకాశిక

శరీరాభిమానము గల జీవుని తాత్త్విక స్వరూపమును ప్రతిపాదించు బ్రాహ్మణమునందు గూడ విద్వత్సంన్యాసము, వివిదిషాసంన్యాసము- ఈ రెండును స్పష్టముగా నిర్దేశింపబడినవి. 'ఈ ఆత్మనే తెలిసికొని, ముని అగుచున్నాడు. ఈ ఆత్మలోకమునే కోరుచు సంన్యాసులు సంన్యాసము తీసికొనుచున్నారు' అని చెప్పబడినది. ఇచట, మునిత్వ మనగా నిరంతర మనన స్వభావము. ఆ మననము మరియొక కర్తవ్యము లేనపుడే సంభవించును. కనుక, అర్థాత్ = తాత్పర్యమువలన సంన్యాసమే చెప్పబడుచున్నది. ఈ విషయము వాక్యముయొక్క చివరి భాగమునందు స్పష్టము చేయబడినది. పూర్వకాలపు విద్వాంసులు పుత్రులను, (ఉపలక్షణము, కర్మను, ఉపాసనను) లోకత్రయ సాధనములతో ఏమి చేయగలము? ఆ ఫలమునందు అపేక్ష లేదు. ఏ మాకు అపరోక్షముగా అనుభూయమానమగు ఈ ఆత్మలోకమే అభీష్టమైనది అని తలంచి పుత్ర, విత్త, లోకేషణలనుండి విరక్తులై- మరలినవారై తరువాత, భిక్షాచరణము చేయుచున్నారు అని చెప్పబడినది. 'అయం లోకః' అనగా అపరోక్షానుభూతికి లోనగు ఆత్మయే ఇచట మనుష్యలోకము అని అర్థము కాదు.

ఈ శ్రుతిని విద్వత్సంన్యాసమునకు ప్రమాణముగా మీరు ఉదహరించుచున్నారు. కాని, మునిత్వఫలము కొరకు వివిదిషా సంన్యాసమును తీసికొనవలెను అని అర్థము ఏల చెప్పరాదు ? వాక్యశేషమునందు గూడ, వివిదిషాసంన్యాసమే వివరింపబడినది. కనుక, వివిదిషాసంన్యాసము కంటె వేరుగా విద్వత్సంన్యాసమను

వేరొక సంన్యాసమును కల్పించవలసిన పని లేదని అనినచో—

జీవన్ముక్తి వివేకః

మైవమ్, వేదనస్యైవ వివిదిషాసంన్యాసపరత్వాత్, న చ వేదన మునిత్వయోః ఏకత్వం శఙ్కనీయమ్, 'విదిత్వా మునిర్భవతి' పూర్వోత్తరకాలీనయోః తయోః సాధ్యసాధనభావ ప్రతీతేః।

భావప్రకాశిక

అట్లు కాదు. వివిదిషాసంన్యాసమునకు ఫలము వేదనమే-జ్ఞానమే కాని; మననము కాదు. వేదన, మననములు ఏక స్వరూపములు కావు. 'విదిత్వా మునిర్భవతి' అను వాక్యములో వేదనము ముందు, మననము తరువాత అని 'క్త్వా' ప్రత్యయము చేత తెలియవచ్చుచున్నందున, మననమునకు వేదనము సాధనమనియు, వేదనమునకు మననము సాధ్య మనియు సాధ్యసాధన భావము ఆ వాక్యము వలన తెలియబడుచున్నది.

జీవన్ముక్తి వివేకః

నను వేదనస్యైవ పరిపాకాతిశయరూపం అవస్థాన్తరం మునిత్వమ్। అతః వేదనద్వారా పూర్వసంన్యాసస్యైవ ఏతత్ఫలమ్ ఇతి చేత్, బాఢమ్। అత ఏవ సాధనరూపాత్ సంన్యాసాత్ అన్యం ఫలరూపం ఏతం సంన్యాసం బ్రూమః। యథా వివిదిషాసంన్యాసినా తత్త్వజ్ఞానాయ శ్రవణాదీని సంపాదనీయాని తథా విద్వత్సంన్యాసినాఽపి జీవన్ముక్తయే మనోనాశవాసనాక్షయౌ సంపాదనీయౌ। ఏతచ్చ ఉపరిష్టాత్ ప్రపఞ్చయిష్యామః।

భావప్రకాశిక

ఓయీ! వివిదిషాసంన్యాసమునకు ఫలమైన జ్ఞానము యొక్క పరిపాకాతిశయము అను అవస్థాన్తరమే మునిత్వము.

కనుక, పూర్వ వివిదిషాసంన్యాసమునకే వేదనము ద్వారా ఈ మునిత్వము ఫలము అని చెప్పవచ్చును అనినచో, అది అంగీకారమే అగును. జ్ఞానమునకు పూర్వము సాధనముగా ఉన్న సంన్యాసము కంటె జ్ఞానానన్తరము ఫలరూపమైనది, ఈ విద్వత్సంన్యాసము అని మేము చెప్పుచున్నాము. వివిదిషాసంన్యాసి తత్త్వజ్ఞానము కొరకు శ్రవణ, మనన, నిదిధ్యాసనములను ఎట్లు సంపాదింపవలయునో, ఆవిధముగానే విద్వత్సంన్యాసి కూడ జీవన్ముక్తిసుఖము కొరకు మనోనాశ, వాసనాక్షయములను సంపాదింపవలయును. ఈవిషయమును ముందు గ్రంథభాగమున విపులముగా వర్ణించెదము.

### జీవన్ముక్తి వివేకః

సత్యపి అనయోః సంన్యాసయోః అవాన్తరభేదే పరమహంసత్వాకారేణ ఏకీకృత్య చతుర్విధః భిక్షవః ఇతి శ్రుతిషు చతుస్సంఖ్యా ఉక్తా। పూర్వోక్తయో స్తయోః సంన్యాసయోః పరమహంసత్వం జాబాలశ్రుతౌ అవగమ్యతే। తత్ర హి జనకేన సంన్యాసే పృష్టే సతి, యాజ్ఞవల్క్యః అధికారవిశేషవిధానేన, ఉక్తకాలానుష్ఠేయేన చ సహితం వివిదిషాసంన్యాస మభిధాయ పశ్చాదత్రిణా యజ్ఞోపవీతరహితస్య బ్రాహ్మణ్యే ఆక్షిప్తే సతి పశ్చాత్ ఆత్మజ్ఞానమేవ యజ్ఞోపవీతమితి సమాదధౌ। అతః బాహ్య యజ్ఞోపవీతాభావాత్ పరమహంసత్వం నిశ్చీయతే, తథా అన్యస్యాం ఖణ్డికాయాం తత్ర 'పరమహంసో నామ' ఇత్యుపక్రమ్య సంవర్తకాదీన్ బహువిధాన్ బ్రహ్మవిదః జీవన్ముక్తాన్ ఉదాహృత్య, 'అవ్యక్తలిఙ్గాః అవ్యక్తాచారాః అనున్మత్తాః ఉన్మత్తవదాచరన్తః' ఇతి విద్వత్సంన్యాసినో దర్శితాః।

### భావప్రకాశిక

ఈ వివిదిషాసంన్యాస, విద్వత్సంన్యాసములకు అవాంతర

భేదము ఉన్నను, వివిదిషాసంన్యాసి, విద్వత్సంన్యాసి- ఇరువురును పరమహంస సంన్యాసులే. కనుక, స్మృతులలో సం న్యాసులు కుటీచక, బహూదక, హంస, పరమహంసనామములతో నాలుగు విధములుగా చెప్పబడిరి. వివిదిషాసంన్యాసి, విద్వ త్సంన్యాసి, పరమహంస అని జాబాల శ్రుతియందు తెలియబడు చున్నది. అచట, జనకుడు సంన్యాసమును గురించి ప్రశ్నించగా యాజ్ఞవల్క్యుడు సంన్యాసమునకు ఎవడు అధికారియో, ఎప్పుడు అనుష్ఠించవలెనో తెలియజేయుచు వివిదిషాసంన్యాసమును గురించి చెప్పెను. తరువాత అత్రి మహాముని 'కథ మయజ్ఞోపవీతీ బ్రాహ్మణః' యజ్ఞోపవీతము లేనివాడు బ్రాహ్మణు డెట్లగునని ఆక్షేపించగా యాజ్ఞవల్క్యుడు సంన్యాసికి ఆత్మజ్ఞానమే యజ్ఞోప వీతము అని సమాధానము చెప్పెను. దీనివలన బాహ్య యజ్ఞోప వీతము లేనివాడు పరమహంస అని నిశ్చయింపబడుచున్నది. అట్లే మరియొక ఖండికయందు (జాబాల శ్రుతి) 'తత్రపరమహంసో నామ' అని మొదలిడి సంవర్తకుడు, ఆరుణి, శ్వేతకేతువు, దుర్వాసుడు, ఋభువు, నిదాఘుడు, జడభరతుడు, దత్తా త్రేయుడు మొదలగువారిని అనేకరూపములు గల స్థితి కలవారిని బ్రహ్మవిదులగు జీవన్ముక్తులను ఉదాహరించి, అవ్యక్తలిఙ్గాః= అస్పష్ట వర్ణాశ్రమ చిహ్నములు కలవారు, అవ్యక్తాచారాః = స్పష్టము కాని శౌచ, ఆచమనాది ఆచారములచే ఏ వర్ణమువారైనది తెలిసికొనుటకు శక్యము కానివారు, ఉన్మత్తులు కానివారు, ఉన్మత్తుల వలె ఆచరణచే లోకమునకు కన్పడువారు అని విద్వత్సంన్యాసులు చూపబడిరి.

అందు, సంవర్తకుడు పరమహంస, బృహస్పతికి బంధువు, మహాభారతమున ప్రసిద్ధుడు. ఆరుణి, శ్వేతకేతువు తండ్రి. శ్వేత

కేతువు ఆరుణియగు ఈ ఉద్దాలకుడు ఛాందోగ్యమున ప్రసిద్ధులు. దుర్వాసుడు లోకప్రసిద్ధుడే. ఋభు, నిదాఘులు గురుశిష్యులు, జ్ఞానరక్షావిచారమున ఉదహరింపబడుచున్నారు. జడభరతుడు శ్రీమద్భాగవతమున పంచమ స్కంధమున వర్ణింపబడి ఉన్నాడు. కాని, అచట

"కస్త్వం నిగూఢ శ్చరసి ద్విజానాం బిభర్షి సూత్రమ్"

అని వర్ణింపబడుటచే యజ్ఞోపవీతము కలవాడుగా వర్ణింపబడెను. అందువలన, పారమహంస్యము అప్పుడు ఉన్నట్లు తోచదు. అయినను, శ్రుతియందు పరమహంసలలో పేర్కొనుటవలన తరువాత పారమహంస్యము స్వీకరించి ఉండవచ్చును. దత్తాత్రేయుడు అవతారపురుషుడు. రైవతకుడు పురాణప్రసిద్ధుడు. వీరు బ్రహ్మవేత్తలయినను, వివిధములగు స్థితులలో కన్పడుచున్నారు. కొందరు వర్ణాశ్రమాచారనిష్ఠాపరులు. మరికొందరు బాలోన్మత్తాదుల వలె సంచరించువారు. వ్యవహారమున భోగములను అనుభవించువారు. యోగసిద్ధులు గూడ కన్పడుచున్నారు. జ్ఞానభూమికలు ఏడింటిలో నాలుగవ భూమిక నుండి బ్రహ్మవిదులు అయిదవ భూమికనుండి జీవన్ముక్తులు బ్రహ్మజ్ఞానఫలము అనుభవించుచు ఉన్మత్తులు కాకపోయినను, లోకసంగమును దూరము చేసికొనుటకై ఉన్మత్తులవలె సంచరించుదురు.

లోకమునందు ఉన్మత్తులు విడ్డూరముగాను, యథేష్టముగాను లోకవిరుద్ధాచారములతో వర్తింతురు. జ్ఞానులందు ఒకప్పుడు లోకవిరుద్ధాచారము గోచరించినను వారిని ఉన్మత్తులుగా భావించరాదు. దత్తాత్రేయుడు ఇందుకు ఉదాహరణము. జ్ఞానులు విధినిషేధములకు అతీతులు గనుక, యథేచ్ఛాచరణముతో వారు ఉండవచ్చునని కొందరు పొరబడుచున్నారు. జ్ఞానులు విధినిషేధములకు అతీతులే కాని, వారి ఆచరణము ప్రాకృతజనులకు వలె యథేష్టాచరణము

కాదు. వ్యుత్థానమునందు (దేహస్ఫురణమున్నపుడు) సాధన కాలమునందలి సంస్కారవశమున, ఆచరణము కలిగియుందురు.

బ్రహ్మవిదః = బ్రహ్మజ్ఞానులు. ఈ జ్ఞానము మూడు విధములు. 1. పౌరుషము, 2. దైవము 3. ఆర్షము.

1. 'పురుషాత్ ఆచార్యాత్ జాతం పౌరుషమ్' గురుముఖముగా శ్రవణము చేసి మనన, నిదిధ్యాసనముల ద్వారా సంపాదించిన తత్త్వజ్ఞానము బ్రహ్మాత్మైక్య అపరోక్ష సాక్షాత్కారము పౌరుషము.
2. శివ, విష్ణు, శక్తి, సూర్య, సుముఖాది దేవతోపాసనముచేత కలిగిన తత్త్వజ్ఞానము దైవము.
3. ఋషిః వేద ఉపదేశాపేక్ష లేకుండగనే పూర్వజన్మలయందు చేసిన పరమేశ్వరోపాసనాసుకృతవిశేషము చేత స్వయం ప్రతిభాతవేదులు, త్రిశఙ్కుమహర్షి మొదలైనవారు. మాతృగర్భమునందున్నపుడే తత్త్వజ్ఞానము కలిగిన వామదేవాదులు. వీరి జ్ఞానము ఆర్షము.

యోగులు శక్తిపాతముచేత శిష్యులకు జ్ఞానమును అనుగ్రహించుట కూడ యోగ సంప్రదాయమున గలదు. గురువు అగు యోగి స్పర్శ, దృక్, వేధ దీక్షావిధానముచే శిష్యునందు ఈ శక్తిపాత మొనరించును. పక్షి రెక్కలచే స్పృశించి గ్రుడ్లను పిల్లలనుగా చేయును. కూర్మము వీక్షణముచేత పిల్లలను పెంచును. అట్లే సిద్ధ గురువులు, కొందరిని స్పృశించియు, మరికొందరిని వీక్షించియు, ఇంకను కొందరిని స్మరించి ధ్యానమాత్రముచేతనే శిష్యుని అనుగ్రహించుదురు. ఈ విధముగా యోగియగు బ్రహ్మజ్ఞాని శిష్యుని బుద్ధియందు ఉన్న మోహావరణమును చిచ్ఛక్తి ప్రబోధముచేత తొలగించి, తక్షణమే మహావాక్యముల వలన బ్రహ్మాత్మైక్యాపరోక్ష సాక్షాత్కారమును కలిగించుచున్నారు.

జీవన్ముక్తివివేకః

తథా 'త్రిదణ్డం కమండలుం శిక్యం పాత్రం జలపవిత్రం శిఖాం యజ్ఞోపవీతం చ ఏతత్సర్వం భూః స్వాహేత్యప్సు పరిత్యజ్య ఆత్మాన మన్విచ్ఛేత్' ఇతి త్రిదండినః సతః ఏకదండలక్షణం వివిదిషాసంన్యాసం విధాయ తత్ఫలరూపం విద్వత్సంన్యాసం ఏవ ముదాజహార– 'యథా జాతరూపధరః నిర్ద్వన్ద్వః నిష్పరిగ్రహ స్తత్ర బ్రహ్మమార్గే సమ్యక్సంపన్నః శుద్ధమానసః ప్రాణ సంధారణార్థం యథోక్తకాలే విముక్తః భైక్ష్య మాచరన్ ఉదకపాత్రేణ లాభాలాభౌ సమౌ కృత్వా శూన్యాగార దేవగృహ తృణకూట వల్మీక వృక్షమూల కులాలశాలాగ్నిహోత్ర (గృహ) నదీపులిన గిరికుహర కందరకోటర నిర్ఝర స్థండిలేషు అనికేతవాసీ అప్రయత్నః నిర్మమః శుక్లధ్యానపరాయణః సంన్యాసేన దేహ త్యాగం కరోతి స ఏవ పరమహంసో నామ' ఇతి ।

భావప్రకాశిక

తథా = అట్లే మనోవాక్కాయ దండచిహ్నమగు త్రిదండ మును, కమండలువును, ఉట్టిని, పాత్రను, వడగట్టు వస్త్రఖండ మును, శిఖను, యజ్ఞోపవీతమును– ఈ సమస్తమును 'భూఃస్వాహా' అను మంత్రమును ఉచ్చరించి, నీటిలో పరిత్యజించి ఆత్మను అన్వేషించవలెను. జ్ఞానరూప ఏకదణ్డ సంన్యాసముతో ఆత్మ విచారము చేయవలెను' అని త్రిదణ్డి అయిన సంన్యాసికే జ్ఞాన చిహ్నమగు ఏకదండలక్షణ వివిదిషాసంన్యాసమును విధించి, ఆ వివిదిషాసంన్యాసమునకు ఫలరూపమగు విద్వత్సంన్యాసమును ఈవిధముగా ఉదహరించెను. పుట్టినపుడు ఉన్నరూపమునే ధరించిన వాడై శీతోష్ణాది ద్వంద్వములను సహించినవాడై, శరీరధార ణమునకు మాత్రమే ఉపయోగించు వస్తువులు దక్క, మరియొక వస్తువును గ్రహించనివాడై పరమార్థవస్తువగు బ్రహ్మమార్గము

నందు అజ్ఞాననివృత్తి సాధనమగు అపరోక్ష సాక్షాత్కారమునందు నిరంతరము బ్రహ్మచింతనము చేయుచున్నవాడై, నిర్మలాంతః కరణము కలవాడై, ప్రాణధారణమునకు మాత్రమే నిర్దిష్ట కాలమున, జ్ఞానాభ్యాసమును చాలించినవాడై భైక్ష్యమును ఉదర పాత్రతోను (పాణిపాత్రతోను, ముఖపాత్రతోను) ఆచరించుచు భైక్ష్యము లభించినను, లభించకపోయినను, మనోవికారము నొందక సమములుగా చూచి, బ్రాహ్మణులు నివసించి వదలిపెట్టిన గృహమున గాని, దేవాలయమున గాని, గడ్డితో నిర్మింపబడిన పర్ణ శాలయందు గాని, పుట్టసమీపమున, చెట్టు మొదట, కుమ్మరిశాల, అగ్నిహోత్రగృహము, జీవనదీసైకతము, గిరిగుహ, చెరియ, చెట్టుతొర్ర, నిర్ఝరస్థండిలము (సెలయేటి ఒడ్డు) మొదలగు ప్రదేశములందు స్థిరనివాసము లేనివాడై ఆహారాది సౌకర్యముల కొరకు ప్రయత్నము లేనివాడై, మమకారము లేనివాడై, శుద్ధ బ్రహ్మధ్యానపరాయణుడై, అధ్యాత్మనిష్ఠుడై, పాపపుణ్యకర్మలను నిర్మూలనము చేయుటయందు తత్పరుడై సంన్యాసముతో దేహ త్యాగమును ఎవడు చేయుచున్నాడో, అతడే పరమహంస సంన్యాసిగా ప్రసిద్ధుడు. (మొదట త్రిదండిసంన్యాసి అయిన వాడు క్రమముగా వివిదిషాసంన్యాసి, విద్వత్సంన్యాసి అగుచు దేహమును చాలించుచున్నాడు) వివిదిషాసంన్యాసివలెనే విద్వ త్సంన్యాసి కూడ పరమహంస అగుచున్నాడు.

జీవన్ముక్తి వివేకః

తస్మా దనయో రుభయోః పరమహంసత్వం సిద్ధమ్.

భావప్రకాశిక

కనుక, ఈ వివిదిషాసంన్యాసి, విద్వత్సంన్యాసి- ఇరువురు పరమహంస లగుట సిద్ధించినది.

## జీవన్ముక్తివివేకః

సమానేఽపి పరమహంసత్వే సిద్ధే విరుద్ధధర్మాక్రాన్తత్వాత్ అవాన్తర భేదోఽపి అభ్యుపగన్తవ్యః। విరుద్ధధర్మత్వం చ ఆరుణికోపనిషత్ పరమహంసోపనిషదోః పర్యాలోచనాయా మవ గమ్యతే। 'కేన భగవన్ కర్మాణ్యశేషతో విసృజామి' ఇతి శిఖా యజ్ఞోపవీత స్వాధ్యాయ గాయత్రీజపా ద్యశేషకర్మత్యాగరూపే వివిదిషాసంన్యాసే శిష్యేణారుణినా పృష్టే సతి, గురుః ప్రజాపతిః 'శిఖాం యజ్ఞోపవీతమ్' ఇత్యాదినా సర్వత్యాగ మభిధాయ, దణ్డ మాచ్ఛాదనం కౌపీనం చ పరిగ్రహేత్' ఇతి దండాది స్వీకారం విధాయ, 'త్రిసంధ్యాదౌ స్నాన మాచరేత్', సంధిం సమాధౌ ఆత్మన్యాచరేత్, సర్వేషు వేదేష్వారణ్యక మావర్తయేత్, ఉపనిషద మావర్తయేత్' ఇతి వేదనహేతూ నాశ్రమధర్మా ననుష్ఠేయతయా విధత్తే।

### భావప్రకాశిక

వివిదిషా, విద్వత్సంన్యాసులకు ఇరువురికి పరమ హంసత్వము సమానమైనను, వారిలో విరుద్ధధర్మములు ఒకరిలో నున్నవి మరియొకరిలో లేకపోవుటవలన, (ఒకరిలోలేనివి మరి యొకరిలో ఉండుటవలన) పరమహంససంన్యాసమున, అవాంతర భేదముకూడ అంగీకరింపవలయును. విరుద్ధధర్మము లెవ్వి? అనగా ఆరుణ్యుపనిషత్తునందును, పరమహంసోపనిషత్తునందును పర్యా లోచింపగా ఇట్లు తెలియవచ్చుచున్నది. శిష్యుడగు ఆరుణి, హే భగవన్! ఏ విధానముతో సర్వకర్మలను విడిచిపెట్టుదును? అని శిఖా యజ్ఞోపవీత స్వాధ్యాయ గాయత్రీజపాది సమస్తకర్మల త్యాగరూపమైన వివిదిషాసంన్యాసమును గూర్చి గురువగు ప్రజా పతిని ప్రశ్నించెను. అపుడు ప్రజాపతి 'శిఖాం యజ్ఞోపవీతమ్' మొదలగు వాక్యములచే సర్వత్యాగమును చెప్పి, దండమును,

ఆచ్ఛాదనము అగు కౌపీనమును పరిగ్రహింపవలెను అని దండాది స్వీకారమును విధించి మూడు సంధ్యాసమయములకు పూర్వ కాలమున స్నానమును ఆచరింపవలెను. భేదదర్శనము కలిగి నపుడు సమాధి (భేదశూన్య) స్వరూపమగు ఆత్మయందు ఆ భేదమును లయింపజేసి, భేదము తోచకుండా వారించుకొన వలయును. వేదములందు కర్మప్రతిపాదకమగు కర్మకాండను వదలి అరణ్యకములు, ఉపనిషత్తులను అర్థముతో ఆవృత్తి చేసికొన వలయును అని బ్రహ్మాత్మైక్యజ్ఞానమునకు సాధనములుగా సంన్యాసాశ్రమ ధర్మములను అనుష్ఠింపవలసినదిగా విధించు చున్నాడు.

## జీవన్ముక్తివివేకః

అథ 'యోగినాం పరమహంసానాం కోఽయం మార్గః' ఇతి విద్వత్సంన్యాసే నారదేన పృష్టే సతి, గురుర్భగవాన్ ప్రజాపతిః 'స్వపుత్రమిత్ర .... ఇత్యాదినా పూర్వవత్' సర్వత్యాగ మభి ధాయ 'కౌపీనం దండం ఆచ్ఛాదనం చ స్వశరీరోపభోగార్థాయ లోకస్య ఉపకారార్థాయ చ పరిగ్రహేత్' ఇతి దండాదిస్వీకారస్య లౌకికత్వం అభిధాయ, 'తచ్చ న ముఖ్యోఽస్తి' ఇతి శాస్త్రీ యత్వం ప్రతిషిధ్య, కోఽయం ముఖ్య ఇతి చేత్ అయం ముఖ్యః న దండం న శిఖాం న యజ్ఞోపవీతం న చాచ్ఛాదనం చరతి పరమ హంసః ఇతి దండాదిలిఙ్గరాహిత్యస్య శాస్త్రీయతా ముక్త్వా 'న శీతం న చోష్ణమ్' ఇత్యాదివాక్యేన 'ఆశాంబరో నిర్నమస్కారః' ఇత్యాదివాక్యేన చ లోకవ్యవహారాతీతత్వం అభిధాయ, అన్తే, 'యత్పూర్ణానన్దైకబోధః తత్ బ్రహ్మాహమస్మి ఇతి కృతకృత్యో భవతి' ఇత్యన్తేన గ్రంథేన బ్రహ్మానుభవమాత్ర పర్యవసానం ఆచష్టే। అతః విరుద్ధధర్మోపేతత్వాత్ అస్త్యేవ అనయోః మహాన్ భేదః। స్మృతిష్వపి అయం భేదః ఉక్తదిశా ద్రష్టవ్యః।

శ్లో॥ సంసారమేవ నిస్సారం దృష్ట్వా సారదిదృక్షయా।
ప్రవ్రజన్తి అకృతోద్వాహాః పరం వైరాగ్య మాశ్రితాః॥
ప్రవృత్తిలక్షణో యోగః జ్ఞానం సంన్యాసలక్షణమ్।
తస్మాత్ జ్ఞానం పురస్కృత్య సంన్యసేదిహ బుద్ధిమాన్॥
బృ. స్మృ.

ఇత్యాది వివిదిషాసంన్యాసః॥

భావ ప్రకాశిక

తరువాత, యోగులగు పరమహంసలకు మార్గము ఏది? అని విద్వత్సంన్యాసమును గూర్చి నారదుడు ప్రశ్నించగా గురువు, పూజ్యుడగు బ్రహ్మ 'స్వపుత్ర మిత్ర ... ' మొదలగు వాక్యములతో వెనుకటివలెనే సర్వత్యాగమును చెప్పి కౌపీనమును, దండమును, ఆచ్ఛాదనవస్త్రమును, తన శరీరోపభోగము కొరకు, లోకోపకారము కొరకును, పరిగ్రహించవలెను. ఈ దండాది స్వీకారము లోకప్రయోజనము మాత్రమే కలది, ముఖ్యము కాదు దండాది స్వీకారము శాస్త్రీయమని అనుకొనరాదు. ముఖ్యధర్మ మేమనగా పరమహంస దండమును ధరించడు, శిఖను పెట్టుకొనడు, యజ్ఞోపవీతము ఉండదు, ఆచ్ఛాదనము కూడ లేదు అని దండాది లింగరాహిత్యమే శాస్త్రీయము అని చెప్పి, 'న శీతం న చోష్ణమ్ ....' అని మొదలగు వాక్యములతోను

'ఆశాంబరః నిర్నమస్కారః .... '

అను వాక్యములచేతను శీతోష్ణాది ద్వంద్వమును సహించి దిగంబరుడై, నమస్కారములను పెట్టక, అందుకొనక లోకాతీత వ్యవహారుడై ఉండవలెను.చివరకు పూర్ణానందైకబోధ బ్రహ్మాత్మానుభవము కలిగి కృతకృత్యుడగును' అను గ్రంథముచే బ్రహ్మానుభవమే పర్యవసానముగా చెప్పెను. ఇందువలన ఈ వివిదిషా విద్వత్సంన్యాసులకు విరుద్ధధర్మములుండుటచే ఎంతయో భేదము

కలదు. స్మృతులందు గూడ ఈ భేదము వెనుక చెప్పిన రీతిగానే దర్శింపనగును.

పరాశరమాధవీయమున- సంసారమును నిస్సారముగా తలంచి సారమగు తత్త్వమును దర్శింప తలంపుచే వివాహము చేసికొనకయే పరవైరాగ్యమును ఆశ్రయించి సంన్యసించుచున్నారు. యోగము (కర్మ) ప్రవృత్తి లక్షణము. జ్ఞానము సంన్యాసలక్షణము. కనుక జ్ఞానము నుద్దేశించి బుద్ధిమంతుడు సంన్యసింపవలయును అని వివిదిషాసంన్యాసము ప్రస్తుతింపబడినది.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ "యదా తు విదితం తత్త్వం పరం బ్రహ్మ సనాతనమ్।
తదైకదండం సంగృహ్య సోపవీత(తాం) శిఖాం త్యజేత్।
జ్ఞాత్వా సమ్యక్ పరంబ్రహ్మ సర్వం త్యక్త్వా పరివ్రజేత్॥"
ఇత్యాది విద్వత్సంన్యాసః।

భావప్రకాశిక

సనాతనమగు ఆ సచ్చిదానన్దలక్షణ పరబ్రహ్మ, పరోక్షముగా తెలియబడినచో అప్పుడు ఏకదండసంన్యాసమును స్వీకరించి యజ్ఞోపవీత సహితముగా శిఖను వదలిపెట్టవలెను. పరబ్రహ్మము అపరోక్షముగా తెలిసికొని సర్వమును త్యజించి విద్వత్సంన్యాసమును గ్రహించవలెను. ఈ మొదలగు శ్రుతులందు విద్వత్సంన్యాసము చెప్పబడినది.

జీవన్ముక్తివివేకః

నను- కలావిద్యాస్వివ కదాచిత్ ఔత్సుక్యమాత్రేణాపి వేదితుమిచ్ఛా సంభవతి,ఏవం విద్వత్తాఽపి అపాతదర్శినః పండితమ్మన్యమానస్యాపి అవలోక్యతే, న చ తౌ ప్రవ్రజితౌ దృష్టౌ,

అతో వివిదిషావిద్వత్తే కీదృశే వివక్షితే ఇతి చేత్। ఉచ్యతే-

భావప్రకాశిక

ఓయీ! సంగీత, నృత్యకళలందును, పురాణ, ధర్మశాస్త్ర, న్యాయాది విద్యలందు వలె ఒకానొకప్పుడు ఆత్మను గురించి వేదాంతములందు తెలిసికొనుటకు కుతూహలమాత్రము చేత గూడ ఇచ్ఛ జనించుచున్నది. ఇట్లే విద్వత్తు కూడ ఆపాతజ్ఞానము కల,లోతుగా తెలియని పండితంమన్యునందు తర్కవ్యాకరణాదులు చదివియుండుటచే విద్వత్త కనిపించుచున్నది. కాని, వారిరువురును సంన్యాసమును తీసికొనినవారుగా కనిపించరు. కనుక, వివిదిషా సంన్యాసమున వివిదిష, విద్వత్సంన్యాసమున విద్వత్త ఎట్టి లక్షణములు కలవి? అను విషయము ఇచట అభిప్రేతమై ఉన్నది అనినచో, చెప్పబడుచున్నది.

జీవన్ముక్తివివేకః

యథా తీవ్రాయాం బుభుక్షాయా ముత్పన్నాయాం భోజనా దన్యో న రోచతే వ్యాపారః, భోజనే చ విలంబోఽపి సోఢుం న శక్యతే, తథా జన్మహేతుషు కర్మసు అత్యన్తం అరుచిః వేదనసాధనేషు చ శ్రవణాదిషు త్వరా మహతీ సంపద్యతే తాదృశీ వివిదిషా సన్యాసహేతుః।

విద్వత్తతా (యా) అవధిః ఉపదేశసాహస్ర్యాం అభిహితః-

శ్లో॥ దేహాత్మజ్ఞానవజ్జ్ఞానం నేహాత్మజ్ఞానబాధకమ్।
ఆత్మన్యేవ భవే ద్యస్య స నేచ్ఛన్నపి ముచ్యతే॥ 4-5 ఇతి।

శ్రుతావపి-

శ్లో॥ భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥
ము. ఉ. 2-2-7. ఇతి।

### భావప్రకాశిక

ఆకలి తీవ్రముగా వేసినపుడు భోజనముకంటె మరియొక పని ఇష్టము కాదు. ఆ భోజనమునందు గూడ విలంబమును సహించుటకు సమర్థుడు కాడు. అట్లే జన్మలకు కారణములగు కర్మలందు మిక్కిలి అరుచి (ఇష్టములేకపోవుట), ఆత్మజ్ఞానసాధనములగు శ్రవణ, మనన, నిదిధ్యాసనములందు ఎక్కువ త్వర (ఈ జన్మమునందే సాక్షాత్కారము సాధించవలెనను పట్టుదల-తొందర) కలుగునో అట్టి వివిదిషయే - ఆత్మజ్ఞానేచ్ఛయే సంన్యాసమునకు కారణము.

విద్వత్తయొక్క అవధి కూడ ఉపదేశసాహస్రియందు ఇట్లు చెప్పబడినది. 'అహం మనుష్యః బ్రాహ్మణః' నేను మనుష్యుడను, బ్రాహ్మణుడను అను దేహాత్మజ్ఞానము ఎంత రూఢమో, ఆ దేహాత్మజ్ఞానమునకు బాధకమగు 'అహం బ్రహ్మాస్మి' నేను పరిపూర్ణ బోధానంద బ్రహ్మస్వరూపుడను అను జ్ఞానము ఎవనికి ప్రరూఢమగునో అతడు ముక్తిని కోరనప్పటికీ ముక్తుడగుచున్నాడు.

శ్రుతియందు గూడ- వ్యష్టి జీవులకు పరుడగు హిరణ్యగర్భ బ్రహ్మ, ఏ పరబ్రహ్మకు అవరుడు (ఆజ్ఞను పాలించువాడు) అగుచున్నాడో, అట్టి ప్రత్యగభిన్న పరబ్రహ్మ, సాక్షాత్కరింపబడినవాడు కాగా, అహంకారగ్రంథి (ఆత్మాహంకార తాదాత్మ్యభ్రమ) వీడిపోవును. సర్వసంశయములు తొలంగును. అనేక జన్మారంభకములగు సంచితకర్మలు క్షీణించును అని చెప్పబడినది.

### జీవన్ముక్తివివేకః

పరమపి హైరణ్యగర్భాదికం పదం అవరం యస్మాత్ అసౌ పరావరః, హృదయే బుద్ధౌ సాక్షిణః తాదాత్మ్యాధ్యాసః అనాద్యవిద్యానిర్మితత్వేన గ్రన్థివత్ దృఢసంశ్లేషరూపత్వాత్ గ్రన్థిరిత్యుచ్యతే। ఆత్మా సాక్షీ కర్తా వా,సాక్షిత్వే ఽపి అస్య బ్రహ్మత్వం

అస్తి వా న వా, బ్రహ్మత్వేఽపి తత్ బుద్ధ్యా వేదితుం శక్యతే వా న వా, శక్యత్వేఽపి తద్వేదనమాత్రేణ ముక్తిరస్తి వా న వా, ఇత్యాదయః సంశయాః। కర్మాణి అనారబ్ధాని ఆగామిజన్మకారణాని। తదేతత్ గ్రన్థ్యాదిత్రయం అవిద్యానిర్మితత్వాత్ ఆత్మదర్శనేన నివర్తతే।

## భావప్రకాశిక

వ్యష్టిలింగశరీరము కంటె ఉత్కృష్టమగు సమష్టిలింగ శరీరాభిమానియగు హిరణ్యగర్భుడు సూత్రాత్మపదము, ఏ బ్రహ్మ పదముకంటె తక్కువైనదో ఆ పరబ్రహ్మ పరావరుడు. హృదయ గ్రన్థి అనుచోట, హృదయ మనగా బుద్ధి (అహంకారము). దాని యందు సాక్షియగు ఆత్మకు తాదాత్మ్యాధ్యాస అహంకారమే ఆత్మ, ఆత్మయే అహంకారము అను ప్రతీతి అధ్యాసలక్షణము. అనాది యగు అవిద్యచే సృజింపబడినందున, గ్రంథి (ముడి)వలె రెండు కొనలు గట్టిగా కరచుకొనినట్లు అహంకారాత్మలకు దృఢసంశ్లేష రూపము (అధ్యాస) అగుటచే గ్రంథి అని చెప్పబడినది. ఆత్మ, సాక్షి అగునా, కర్త అగునా? సాక్షియే అయినను, ఈ ఆత్మకు బ్రహ్మత్వము కలదా, లేదా ? బ్రహ్మత్వము ఉన్నను, ఆ బ్రహ్మత్వము బుద్ధిచే తెలిసికొనుటకు సాధ్యమగునా, కాదా ? సాధ్యమైనను, ఆ బ్రహ్మజ్ఞానమాత్రము చేతనే ముక్తి కలుగునా, లేదా? ఈ మొదలైనవి సంశయములు. కర్మలు అనగా ఇచట ప్రారబ్ధకర్మవ్యతిరిక్తములగు ఆగామి జన్మకారణములైన సంచిత కర్మలు. ఆ యీ హృదయగ్రన్థి, సర్వసంశయములు- సంచిత కర్మలు అజ్ఞానజనితములగుటచే ఆత్మసాక్షాత్కారము చేత అజ్ఞానము నివర్తించగా అజ్ఞానకార్యములగు ఈ గ్రన్థ్యాది త్రయము నివర్తించును. 'ఉపాదాన కారణనాశాత్ కార్యనాశః' పరిణామి అజ్ఞానకారణము నశించుటచేత కార్యము నశించుచున్నది.

## జీవన్ముక్తివివేకః

స్మృతావపి అయమర్థః ఉపలభ్యతే-

శ్లో॥ యస్య నాహంకృతో భావః బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాఽపి స ఇమాంల్లోకాన్ న హన్తి న నిబధ్యతే॥

భ. గీ. 18-17 ఇతి।

యస్య బ్రహ్మవిదోభావః సత్తాస్వభావ ఆత్మా న అహంకృతః అహంకారేణ తాదాత్మ్యాధ్యాసాతిశయాత్ అన్తర్భావితః। బుద్ధిలేపః సంశయః। తదభావే త్రైలోక్యవధేనాపి న బధ్యతే, కిముతాన్యేన కర్మణా ఇత్యర్థః। నను, ఏవంసతి వివిదిషాసంన్యాస ఫలేన తత్త్వజ్ఞానేనైవ ఆగామిజన్మనాం నివారితత్వాత్ వర్తమాన జన్మశేషస్య భోగమన్తరేణ నివారయితు మశక్యత్వాత్ కృతమనేన విద్వత్సంన్యాసప్రయాసేన ఇతి చేత్। మైవమ్, విద్వత్సంన్యాసస్య జీవన్ముక్తిహేతుత్వాత్। తస్మాత్ వేదనాయా యథా వివిదిషాసంన్యాసః ఏవం జీవన్ముక్తయే విద్వత్సంన్యాసః సంపాదనీయః। ఇతి విద్వత్సంన్యాసః ॥2॥

## భావప్రకాశిక

స్మృతియందు గూడ (భగవద్గీతలో) ఈ అర్థము కనిపించు చున్నది.

శ్లో॥ 'యస్య నాహంకృతో భావః బుద్ధి ర్యస్య న లిప్యతే'

అని. ఏ బ్రహ్మవేత్త యొక్క భావము, సత్తా స్వభావము, ఆత్మ అహంకార తాదాత్మ్యాధ్యాసాతిశయము వలన ఆచ్ఛాదితము కాదో, ఎవనికి బుద్ధిలేపము (అనగా సంశయము) లేదో (అహంకార తాదాత్మ్యాధ్యాస, సంశయములు) లేవో అతడు మూడులోకములను వధించినను బంధమునకు లోను కాడు (అసంగుడుకనుక). ఇక, ఇతరకర్మలచే బద్ధుడు కాడని వేరుగా చెప్ప నవసరము లేదు.

ఓయీ! ఇట్లయినచో! వివిదిషాసంన్యాసఫల మగు తత్త్వ

జ్ఞానముచేతనే ముందురాబోవు జన్మలు నివారింపబడుటవలనను, వర్తమాన జన్మశేషము ప్రారబ్ధకర్మభోగము లేక, నివారించుటకు శక్యము కానందున, ఈ విద్వత్సంన్యాసముతో పని యేమి? అని అనినచో అట్లుకాదు. విద్వత్సంన్యాసము జీవన్ముక్తికి హేతువు, కనుక, తత్త్వజ్ఞానము కొరకు ఏవిధముగా వివిదిషాసంన్యాసము ఉపయోగపడుచున్నదో, అదేవిధముగా జీవన్ముక్తికొరకు విద్వత్సంన్యాసము ఉపయోగించును. కావున, విద్వత్సంన్యాసము స్వీకరింపదగినది. ఈవిధముగా విద్వత్సంన్యాసము నిరూపింపబడినది.

## జీవన్ముక్తివివేకః

అథ కా ఇయం జీవన్ముక్తిః? కిం వా తత్ర ప్రమాణమ్? కథం వా తత్సిద్ధిః? సిద్ధౌ వా కిం ప్రయోజనమ్? ఇతి చేత్ ఉచ్యతే– జీవతః పురుషస్య కర్తృత్వ భోక్తృత్వ సుఖ దుఃఖాది లక్షణః చిత్తధర్మః క్లేశరూపత్వాత్ బన్ధో భవతి, తస్య నివారణం జీవన్ముక్తిః।

## భావప్రకాశిక

వివిదిషాసంన్యాస, విద్వత్సంన్యాసములను రెంటిని నిరూపించిన తరువాత విద్వత్సంన్యాసమునకు ప్రయోజనమగు జీవన్ముక్తిని స్వరూప, ప్రమాణ, సాధన, ఫలములచే ఉపపాదించుటకు శిష్యునియొక్క ప్రశ్నను ఉద్భావన చేయుచున్నారు.

అట్లయినచో ఈ జీవన్ముక్తిస్వరూప మేమి ? అందు ఏది ప్రమాణము? ఎట్లు ఆ జీవన్ముక్తి సిద్ధించును (సాధనమేమి) ? ఆ జీవన్ముక్తి సిద్ధించినను మనకు కలగు ప్రయోజనమేమి ? అని ప్రశ్నించినచో ఇట్లు ప్రత్యుత్తరము ఈయుబడుచున్నది–

పురుషుడు జీవించిఉండగా కర్తృత్వ, భోక్తృత్వ, సుఖ దుఃఖ, కామాదిలక్షణమగు చిత్తధర్మము క్లేశరూప మగుటవలన

బంధము అగుచున్నది. దానిని నివారించుటయే జీవన్ముక్తి.

## జీవన్ముక్తివివేకః

నను అయం బంధః కిం సాక్షిణః నివార్యతే, కిం వా చిత్తాత్? నాద్యః; తత్త్వజ్ఞానేనైవ నివారితత్వాత్। న ద్వితీయః, అసంభవాత్। యదా తు జలాద్ ద్రవత్వం, వహ్నేర్వా ఉష్ణత్వం నివార్యేత తదా చ్చిత్తాత్ కర్తృత్వాది నివారణసంభవః, స్వాభావికత్వం తు సర్వత్ర సమానమ్। మైవమ్, ఆత్యన్తిక నివారణ అసంభవేఽపి, అభిభవస్య సంభవాత్। యథా జలగతం ద్రవత్వం మృత్తికామెలనేన అభిభూయతే వహ్నేరౌష్ణ్యం మణిమన్త్రాదినా, తథా సర్వాః చిత్తవృత్తయః యోగాభ్యాసేన అభిభవితుం శక్యన్తే।

## భావప్రకాశిక

ఓయీ! ఈ బంధము సాక్షినుండి నివారింపబడుచున్నదా? లేక చిత్తమునుండి నివారింపబడుచున్నదా? మొదటి వికల్పము సరి కాదు. తత్త్వజ్ఞానముచేతనే సాక్షికి బంధము నివారింపబడినది కదా! ఇక, రెండవ వికల్పమున, చిత్తమునుండి బంధమును వారించుట కుదరదు, అసంభవము కనుక. జలమునందు ద్రవత్వము, వహ్నియందు ఉష్ణత్వము నివారింపగలిగినచో అపుడు చిత్తమునుండి కర్తృత్వాది బంధనివారణము సాధ్యమగును. జలమునకు ద్రవత్వము, వహ్నికి ఉష్ణత్వము సహజమైనట్లు, చిత్తమునకు కర్తృత్వ, సుఖదుఃఖాదులు కూడ స్వభావమే కదా! నిజమే. అయినను, చిత్తమునుండి బంధమ నివారించుట సంభవము కాకపోయినను, అభిభవము (అప్రతీతి) సంభవమగును. ఎ ద్రవత్వము మృత్తికామేలనముచేత అభి యొక్క, ఔష్ణ్యము మణిమన్త్రాదులచే అ

సమస్త చిత్తవృత్తులు యోగాభ్యాసముచేత అభిభవించుటకు వీలు పడుచున్నది.

జీవన్ముక్తివివేకః

నను ప్రారబ్ధం కర్మ కృత్స్నా అవిద్యా తత్కార్యనాశనే ప్రవృత్తస్య తత్త్వజ్ఞానస్య ప్రతిబన్ధం కృత్వా స్వఫలదానాయ దేహేన్ద్రియాదికం అవస్థాపయతి। న చ సుఖదుఃఖాదిభోగః చిత్తవృత్తిభిర్వినా సంభవతి, అతః కథం అభిభవః ? మైవమ్, అభిభవసాధ్యాయాః జీవన్ముక్తేరపి సుఖాతిశయరూపత్వేన ప్రారబ్ధఫల ఏవ అంతర్భావాత్।

భావప్రకాశిక

ఓయీ! ప్రారబ్ధకర్మ, సమస్తమైన అవిద్యా తత్కార్యములను నశింపజేయుటకు ప్రవృత్తమైన తత్త్వజ్ఞానమును ప్రతిబంధించి (ఫలమును ఇవ్వకుండా ఆపి) తన ఫలమును ఇచ్చుటకొరకై దేహేన్ద్రియాదులను నిలిపి ఉంచును. ఈ ప్రారబ్ధకర్మఫలమగు సుఖదుఃఖాదిభోగము చిత్తవృత్తిరహితముగ సంపాదింపశక్యము కాదు గాన, చిత్తవృత్తి యొక్క అభిభవము జీవన్ముక్తిలో ఎట్లు సంభవించును? అట్లు కాదు. చిత్తవృత్తి అనుభవసాధ్యమగు జీవన్ముక్తి కూడ, సుఖాతిశయరూపమే గనుక, ప్రారబ్ధఫలమగు సుఖభోగములోనే అంతర్భవించును.

జీవన్ముక్తి వివేకః

తర్హి కర్మైవ జీవన్ముక్తిం సంపాదయిష్యతి, మాభూత్ పురుషప్రయత్నః ఇతి చేత్ కృషివాణిజ్యాదావపి సమానః (పరిప్రశ్నః) పర్యనుయోగః। కర్మణః స్వయమదృష్టరూపస్య దృష్టసాధనసంపత్తిమన్తరేణ ఫలజననాసమర్థత్వాత్ అపేక్షితః కృష్యాదౌ పురుషప్రయత్నః ఇతి చేత్, జీవన్ముక్తావపి సమం సమాధానమ్.

భావప్రకాశిక

అట్లయినచో ప్రారబ్ధకర్మయే జీవన్ముక్తిని సంపాదించ పెట్టగలది గాన, యోగాభ్యాసలక్షణ పురుషప్రయత్నము అక్కర లేదు కదా? అని అనినచో అట్లు కాదు. వ్యవసాయము, వాణిజ్యము మొదలగు కర్మలందు గూడ, ఈ ప్రశ్న పురుషప్రయత్నమేల ? అనునది సమానమే అయిఉన్నది. కర్మ, స్వయముగా అదృష్ట రూపమగుటచే దృష్టమగు సాధనసంపత్తిని అపేక్షించును. దృష్ట సాధనసంపత్తి లేనిచో అదృష్ట కర్మ, ఫలమును కలిగించుటకు సమర్థము కాదు. కావున, కృషి, వాణిజ్యాదులందు పురుష ప్రయత్నము ఆవశ్యకమని అనినచో జీవన్ముక్తియందు గూడ సమాధానము సమానమే అయి ఉన్నది. పురుషప్రయత్నాపేక్ష కలదని చెప్పవచ్చును.

జీవన్ముక్తివివేకః

సత్యపి పురుషప్రయత్నే కృష్యాదౌ ఫలపర్యవసానం యత్ర న దృశ్యతే తత్ర ప్రబలేన కర్మాన్తరేణ ప్రతిబన్ధః కల్ప నీయః। తచ్చ ప్రబలం కర్మ స్వానుకూల వృష్ట్యభావాది రూపాం దృష్టసామగ్రీం సంపాద్యైవ ప్రతిబధ్నాతి। స చ ప్రతి బన్ధః విరోధినా ప్రబలతరేణ ఉత్తంభకేన కారీరీష్ట్యాదిరూపేణ కర్మణా అపనీయతే। తచ్చ కర్మ స్వానుకూలాం వృష్టిలక్షణాం దృష్టసామగ్రీం సంపాద్యైవ ప్రతిబన్ధం అపనయతి।

భావప్రకాశిక

పురుషప్రయత్నమున్నను, ఒకప్పుడు కృష్యాదులు ఫలించుట కన్పడుటలేదు. అచట ప్రబలమైన మరియొక కర్మ ప్రతిబంధకముగా ఉన్నదని కల్పించవలయును (అనుకొన వలయును). ఆ ప్రబలకర్మ కూడ, తనకు అనుకూలమగు వర్షా

భావరూపమైన దృష్టసామగ్రి ద్వారా ప్రతిబంధించును. ఆ ప్రతిబంధముకూడ తనకు విరోధి యగు, తనకంటె ప్రబలమైన, ఉత్తేజకమైన కారీరీష్టి మొదలగు కర్మలచేత తొలగింపబడును. ఆ కర్మ తనకు అనుకూలమగు వర్షము అను దృష్టసామగ్రిని సంపాదించియే వర్షప్రతిబంధమును తొలగించుచున్నది.

జీవన్ముక్తివివేకః

కిం బహునా ? ప్రారబ్ధకర్మణి అత్యన్తభక్తేన భవతా యోగాభ్యాసరూపస్య పురుషప్రయత్నస్య వైయర్థ్యం మనసాఽపి చిన్తయితుం అశక్యమ్।

భావప్రకాశిక

ఇన్ని మాటలేల? ప్రారబ్ధకర్మయందు పరమ భక్తుడవగు నీవు యోగాభ్యాసరూపమగు పురుషప్రయత్నమునకు వ్యర్థత్వమును మనస్సుచేత గూడ ఊహించుటకు శక్యము కాదు.

ప్రారబ్ధకర్మ, తప్పక ఫలమునిచ్చునని తలంచువాడవు, దృష్టసామర్థ్యముగల యోగాభ్యాసరూపమగు పురుషప్రయత్నము ఫలము నీయదని ఎట్లనగలవు ?

జీవన్ముక్తివివేకః

అథవా ప్రారబ్ధం కర్మ యథా తత్త్వజ్ఞానాత్ప్రబలం తథా తస్మాదపి కర్మణః యోగాభ్యాసః ప్రబలోఽస్తు।

భావప్రకాశిక

మరియొకపక్షము చెప్పబడుచున్నది. ప్రారబ్ధకర్మ, తత్త్వజ్ఞానముకంటె ప్రబలము అని నీవు అనుచున్నావు. అట్లే ఆ ప్రారబ్ధకర్మకంటె గూడ, యోగాభ్యాసము ప్రబలము అని ఏల అనుకొనరాదు?

జీవన్ముక్తివివేకః

తథా చ యోగినామ్ ఉద్దాలక వీతహవ్యప్రభృతీనాం

స్వేచ్ఛయా దేహపరిత్యాగః ఉపపద్యతే।

భావప్రకాశిక

ప్రారబ్ధముకంటె గూడ యోగాభ్యాసాది రూపమగు శాస్త్రీయ యత్నము ప్రబలము. కనుకనే యోగవాసిష్ఠమున యోగులగు ఉద్దాలకుడు, వీతహవ్యుడు మొదలగువారు స్వేచ్ఛచే తమ దేహమును పరిత్యజించిరి అని వర్ణించుట ఉపపన్నమగుచున్నది.

జీవన్ముక్తి వివేకః

యద్యపి అల్పాయుషా మస్మాకం తాదృశో యోగో న సంభవతి, తథాఽపి కామాది ధీవృత్తి విరోధమాత్రే కో నామ ప్రయాసః? యది శాస్త్రీయప్రయత్నస్య ప్రాబల్యం నాఙ్గీ క్రియతే, తదా-చికిత్సామారభ్య మోక్షశాస్త్రపర్యన్తానాం సర్వేషా మానర్థక్యం ప్రసజ్యేత।

భావప్రకాశిక

ప్రాచీనులగు యోగీశ్వరులు యోగాభ్యాసబలముచేత బహు కాలము జీవించిరి గనుక, వారికి అట్టి యోగము సంభవమై యున్నది. అల్పాయుర్దాయము గల మనవంటివారికి అట్టి యోగము సంభవించుట దుర్ఘటము. అయినను, యోగసాధనచే కామము మొదలగు బుద్ధి (మనో) వృత్తులను నిరోధించుటలో ఏమి ప్రయాసము కలదు? శాస్త్రీయప్రయత్నమునకు ప్రాబల్య మును అంగీకరించనిచో చికిత్సాశాస్త్రము మొదలుకొని మోక్షశాస్త్ర పర్యన్తము సర్వశాస్త్రములు వ్యర్థములు కావలసివచ్చును.

జీవన్ముక్తి వివేకః

నహి కాదాచిత్క కర్మఫల సంవాదమాత్రేణ దౌర్బల్య మాపాదితుం శక్యమ్; అన్యథా కాదాచిత్కం పరాజయం దృష్ట్వా సర్వైః భూపైః గజాశ్వాదిసేనా ఉపేక్ష్యేత।

భావప్రకాశిక

ఒకప్పుడు కృషివాణిజ్యాది లౌకికకర్మలందుగాని, చికిత్సా కారీరీష్ట్యాది శాస్త్రీయకర్మలందు గాని, ఫలము విసంవాదమును (లభించకపోవుట) పొందినంతమాత్రముచేత పురుషయత్నము నకు దౌర్బల్యమును ఆపాదించుట యుక్తము కాదు. అట్లు కానిచో ఎప్పుడో ఒకప్పుడు పరాజయమును పొందిన రాజులు అందరును గజాశ్వాదిసేనను ఉపేక్షించి ఉండెడివారు.

జీవన్ముక్తివివేకః

అతఏవ ఆనన్దబోధాచార్యా ఆహుః– 'న హి అజీర్ణభయాత్ ఆహారపరిత్యాగః, భిక్షుకభయాద్వా, స్థాల్యనధిశ్రయణమ్, యూకాభయాద్వా ప్రావరణపరిత్యాగః' ఇతి। శాస్త్రీయస్య ప్రయత్నస్య ప్రాబల్యం వసిష్ఠరామసంవాదే విస్పష్ట మవగమ్యతే। 'సర్వ మేవేహ హి సదా' ఇతి ఆరభ్య 'తదను తదపి అపముచ్య సాధు తిష్ఠ' ఇత్యన్తేన గ్రన్థేన।

భావప్రకాశిక

ఇందువలననే ఆనందబోధాచార్యులు ఇట్లు చెప్పిరి– 'జీర్ణముకాదను భయముతో ఆహారమును పరిత్యజించుట గాని, బిచ్చగాండ్ర భయమువలన పొయ్యిమీద గిన్నె నెక్కించకపోవుట గాని, నల్లుల భయము వలన దుప్పటిని విడనాడుట గాని, ఉండదు కదా'. శాస్త్రీయప్రయత్నము ప్రబలము అను విషయము వసిష్ఠరామ సంవాదమున 'సర్వ మేవేహ హి సదా' అని మొదలుకొని 'సాధు తిష్ఠ' అనువరకు గల గ్రంథముచేత విస్పష్టముగా తెలియజేయ బడినది.

జీవన్ముక్తివివేకః

వసిష్ఠః :–

శ్లో॥ 'సర్వ మేవేహ హి సదా సంసారే రఘునన్దన।

సమ్యక్ ప్రయత్నాత్ సర్వేణ పౌరుషాత్ సమవాప్యతే॥"

సర్వం పుత్ర విత్త స్వర్గలోక బ్రహ్మలోకాది ఫలమ్। పౌరుషం పుత్రకామ్యేష్టి కృషి వాణిజ్య జ్యోతిష్టోమ బ్రహ్మోపాసనాది లక్షణః పురుషప్రయత్నః।

భావప్రకాశిక

వసిష్ఠుడు ఇట్లు చెప్పెను- 'ఓ రఘునందనా! శ్రీరామా! ఈ సంసారమున నిరంతరము అందరిచేతను చక్కగా ఆచరింపబడిన పురుషప్రయత్నము వలన సమస్తమైన ఫలము తప్పక లభించుచున్నది.

'సర్వమ్' అనగా పుత్రులు, ధనము, స్వర్గలోకము, బ్రహ్మలోకము మొదలగు ఫలము. పౌరుష మనగా పుత్రకామ్యేష్టి, వ్యవసాయము, వ్యాపారము, జ్యోతిష్టోమము, బ్రహ్మోపాసన అనుష్ఠానలక్షణమగు పురుషప్రయత్నము.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి పౌరుషం ద్వివిధం స్మృతమ్।
తత్ర ఉచ్ఛాస్త్రం అనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్॥

ఉచ్ఛాస్త్రమ్ పరస్త్రీగమన పరద్రవ్యాపహరణాది। శాస్త్రితమ్ నిత్యనైమిత్తికానుష్ఠానాది, అనర్థః నరకః, అర్థేషు స్వర్గాదిషు పరమః మోక్షః పరమార్థః॥

శ్లో॥ ఆబాల్యా దల మభ్యస్తైః శాస్త్ర సత్సంగమాదిభిః।
గుణైః పురుషయత్నేన సోఽర్థః సంపాద్యతే హితః॥

అలం సంపూర్ణం సమ్యగిత్యర్థః। గుణైర్యుక్తేనేత్యధ్యాహారః। హితః శ్రేయోరూపః॥

భావప్రకాశిక

పౌరుషమనగా పురుషప్రయత్నము. ఉచ్ఛాస్త్రము, శాస్త్ర

విహితము అని ఇది రెండు విధములు. వానిలో ఉచ్ఛాస్త్రము శాస్త్రోల్లంఘనముచేసి చేయు ప్రయత్నము అనర్థముకొరకు అగును. శాస్త్రీయప్రయత్నము పరమార్థమును లభింపజేయును.

ఉచ్ఛాస్త్రమునకు ఉదాహరణము పరస్త్రీగమనము, పరద్రవ్యాపహరణము మొదలైనవి. శాస్త్రితమునకు ఉదాహరణము నిత్య, నైమిత్తిక కర్మానుష్ఠానాదులు. అనర్థమనగా నరకము. పరమార్థము అనగా మోక్షము, స్వర్గాదిరూపమగు అర్థములలో శ్రేష్ఠమైనది.

బాల్యమునుండి చక్కగా అభ్యసింపబడిన హితోపదేశకములగు శాస్త్రములచేతను, సాధుసంగములచేతను గుణవంతుడగు పురుషుడు ఏ అర్థమును సాధించుటకు ప్రయత్నించునో, శ్రేయోరూపమగు ఆ అర్థమును పొందినవాడు అగును.

అలం- సంపూర్ణముగా, చక్కగా అని అర్థము. గుణైః అనుచోట, 'యుక్తేన' అను పదమును అధ్యాహారము చేయవలెను. హితః- శ్రేయోరూపము.

జీవన్ముక్తివివేకః

శ్రీరామః-

శ్లో॥ ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాం యథా।
మునే తథైవ తిష్ఠామి కృపణః కిం కరోమ్యహమ్॥ ఇతి।
వాసనా ధర్మాధర్మరూపా జీవగతాః సంస్కారాః।

వసిష్ఠః :-

శ్లో॥ అత ఏవ హి హే రామ శ్రేయః ప్రాప్నోషి శాశ్వతమ్।
స్వప్రయత్నోపనీతేన పౌరుషేణైవ నాన్యథా॥ ఇతి।

యతః వాసనాపరతంత్రో భవాన్ అత ఏవ హి పారతంత్ర్య నివారణాయ సోత్సాహసంపాదితః మనోవాక్కాయజన్యః పురుషవ్యాపారః అపేక్షితః।

భావ ప్రకాశిక

శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు- హే వసిష్ఠ మహామునే! వెనుకటి జన్మయందలి వాసనాజాలము- సంస్కారసమూహము నన్ను ఎట్లు ప్రేరేపించుచున్నదో, అట్లే నడచుకొనుచున్నాను. నేను అవశుడను, దీనుడను. నేను ఏమి చేయుదును ?

వాసనలు అనగా ధర్మాధర్మరూపములగు జీవునియందలి సంస్కారములు.

వసిష్ఠుడు సమాధానము చెప్పుచున్నాడు- ఓ రామా! ఇందు వలననే నీ ప్రయత్నముతో సంపాదింపబడిన ప్రబలమైన పురుష వ్యాపారముచేతనే శాశ్వతమగు శ్రేయస్సును, పరమ సుఖమును పొందుచున్నావు. మరియొకవిధముగ శ్రేయస్సును పొందజాలవు.

'వాసనా పరతంత్రుడను' అని నీవు ఎందువలన అంటివో ఆ కారణము వలననే ఆ పారతంత్ర్యమును నివారించుకొనుట కొరకు నీ ఉత్సాహశక్తితో సంపాదించుకొనబడిన మనోవాక్కాయ జన్యమగు పురుషవ్యాపారము అపేక్షితము.

ఇప్పుడు చేయు ప్రబలపురుషప్రయత్నముచేత పూర్వ వాసనలను కార్యోన్ముఖములుకాకుండునట్లు అరికట్టవచ్చును.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ ద్వివిధో వాసనావ్యూహః శుభశ్చైవ అశుభశ్చ తే।
ప్రాక్తనో విద్యతే రామ ద్వయోరేకతరోఽథవా॥

కిం ధర్మాధర్మావుభావపి త్వాం నియోజయతః ఉత ఏకతరః ఇతి వికల్పః। ఏకతరపక్షేఽపి శుభః అశుభో వా ఇతి అర్థసిద్ధో వికల్పః।

శ్లో॥ వాసనౌఘేన శుద్ధేన తత్ర చేదపనీయసే।
తత్క్రమేణాశు తేనైవ పదం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

తత్ర తస్మిన్పక్షే తత్ తర్హి తేనైవ క్రమేణ శుభవాసనాయా

ప్రాపితేనైవ ఆచరణేన ప్రయత్నాన్తర నిరపేక్షేణ।శాశ్వతంపదం మోక్షమ్॥

భావప్రకాశిక

ఓ రామా ! 'పూర్వజన్మయందలి వాసనాసమూహము నన్ను నడిపించుచున్నది అని నీవు అంటివి. ఆ వాసనావ్యూహము శుభము, అశుభము అని రెండు తెరగులుగా నున్నది. ఆరెండును నిన్ను ప్రేరేపించుచున్నవా, లేక ఆ రెంటిలో ఒక్కొక్కటి ప్రేరేపించుచున్నదా?

ధర్మాధర్మములు రెండును నిన్ను ప్రవర్తింపజేయు చున్నవా, లేక వానిలో ఒకటియే ప్రవర్తింపజేయుచున్నదా? అని వికల్పము. రెంటిలో ఒకటి ప్రవర్తింపజేయుచున్నది అను పక్షములో గూడ శుభవాసన గాని, అశుభవాసన గాని, ఏదియో ఒకటి అను వికల్పము అర్థసిద్ధము.

శుద్ధమైన శుభవాసనాసమూహముచేతనే ఆ ఏకతరపక్షమున అసన్మార్గమునుండి దూరముగా తీసికొనిపోబడినవాడవు అగుచో అప్పుడు శుభవాసనాప్రేరితమగు ఆచరణ చేతనే మరియొక ప్రయత్నము యొక్క అపేక్ష లేకయే, శాశ్వత పదమగు మోక్ష పదమును పొందగలవు.

తత్ర = ఆ ఏకతరపక్షమున, తత్ = తర్హి = అప్పుడు. తేనైవ క్రమేణ=శుభవాసనాప్రేరితమగు ఆచరణ చేతనే, మరి యొక ప్రయత్నముయొక్క ఆవశ్యకత లేకుండా, శాశ్వతం పదమ్=మోక్షమును అని అర్థము.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ అథ చేదశుభో భావః త్వాం యోజయతి సంకటే।
ప్రాక్తనః తదసౌ యత్నాత్ జేతవ్యో భవతా స్వయమ్॥

భావః భావనా। తత్ తర్హి। యత్నః అశుభవిరోధి శాస్త్రీయ

ధర్మానుష్ఠానము. తేన=దానిచేత, స్వయం జేతవ్యః = నీ అంతట నీవే జయింపవలయును. యుద్ధమునందు మృత్యుముఖమున చిక్కికొనినవాడు మరియొక పురుషునిద్వారా మృత్యువునుండి జయింపబడినట్లు కాదు. అనగా తన అశుభవాసనలను స్వప్రయత్నము చేత తానే ఎదుర్కొని జయించవలయును. ఆ యత్నము శాస్త్రీయ ధర్మానుష్ఠానము (దేవతోపాసన) అయి ఉండును.

## జీవన్ముక్తివివేకః

శ్లో॥ శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనాసరిత్।
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి॥

ఉభయపక్షే తు శుభభాగస్య ప్రయత్ననైరపేక్ష్యేఽపి అశుభ భాగం శాస్త్రీయ ప్రయత్నేన నివార్య శుభమేవ తస్య స్థానే సమాచరేత్ ।

శ్లో॥ అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయేత్ ।
స్వమనః పురుషార్థేన బలేన బలినాం వర॥ 10

అశుభేషు పరస్త్రీద్రవ్యాదిషు, శుభేషు శాస్త్రార్థ దేవతా ధ్యానాదిషు। పురుషార్థేన పురుషప్రయత్నేన। బలేన ప్రబలేన।

శ్లో॥ అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్।
జన్తోశ్చిత్తన్తు శిశువత్ తస్మాత్ తచ్చాలయేద్బలాత్॥

యథా శిశుః మృద్భక్షణాత్ నివార్య ఫలభక్షణే యోజ్యతే, మణిముక్తాద్యాకర్షణాత్ నివార్య కన్దుకాద్యాకర్షణే యోజ్యతే, తథా చిత్తమపి సత్సంగేన తద్విపరీతవిషయాత్ నివారయితుం శక్యమ్।

## భావప్రకాశిక

'పూర్వజన్మవాసనాది శుభాశుభమార్గముల రెంటితో ప్రవహించుచున్నచో పురుషప్రయత్నముచే అశుభమార్గమున

సంచరించు నదీప్రవాహమును శుభమార్గమునకు మరలించవలెను.

శుభాశుభ ఉభయవాసనాపారతంత్ర్య పక్షమునందైనచో శుభభాగము మెల్లగా మోక్షమువైపు ప్రసరించును గనుక, అశుభ భాగమును కదలించుటకు (మరలించుటకు) శాస్త్రీయ యత్నము అవసరము కాకపోయినను, అశుభభాగమును శాస్త్రీయ ప్రయత్నముతో ప్రవహించుటను ఆపి, ఆ అశుభవాసనాంశము యొక్క స్థానమున, శుభవాసనాంశమే దృఢముగా ప్రవహించునట్లు శుభకర్మలనే చేయవలెను.

బలవంతులలో శ్రేష్ఠుడైనవాడా ! నీ మనస్సు అశుభములగు పరస్త్రీ, పరద్రవ్యాదులందు లగ్నమైనపుడు వేదాన్త శాస్త్రార్థము నందు, శుభములగు శివ, విష్ణ్వాది దేవతాధ్యానాదులందును ఆ మనస్సును ప్రబలమగు పురుషప్రయత్నముతో ప్రవేశపెట్టుము. అశుభములు = పరదారగమన. పరద్రవ్యాపహరణాదులు, శుభములు = వేదాన్త శాస్త్రార్థ బ్రహ్మవిచారము, శివ, విష్ణ్వాది ఉపాసనాదులు.

ప్రాణియొక్క చిత్తము అశుభమునుండి కదలించినచో శుభమువైపునకు కదలిపోవును. శుభమునుంచి కదలించినచో అశుభమువైపునకు వెడలును. కనుక, శిశువును వలె ఆ మనస్సును అశుభమునుండి శుభమువైపునకు ప్రయత్నవిశేషముతో చలింప జేయవలెను.

శిశువు, మట్టిని తినునపుడు నివారించి, ఫలమును భక్షించు టలో మరల్చబడును. మణులు, ముత్యములు మొదలగువానిని లాగుచున్నవో నివారించి, బంతి మొదలగు ఆటవస్తువులను లాగుటకు ప్రేరేపింపబడును. అట్లే చిత్తమును గూడా, సత్సాంగత్య ముచే పరస్త్రీగమన పరద్రవ్యాపహరణాదులగు అశుభ విషయముల నుండి నివారించుట సాధ్యమగును.

## జీవన్ముక్తివివేకః

శ్లో॥ సమతాసాన్త్వనేనాశు న ద్రాగితి శనైశ్శనైః।
పౌరుషేణ ప్రయత్నేన లాలయేత్ చిత్తబాలకమ్॥

చపలస్య పశోః బన్ధనస్థానే ప్రవేశనాయ ద్వౌ ఉపాయౌ భవతః। హరితతృణదర్శన కండూయనాదికం, వాక్పారుష్య దండాది భర్త్సనం చ। తత్ర ఆద్యేన సహసా ప్రవిశ్యతే, ద్వితీయేన ఇతస్తతః ధావన్ శనైఃశనైః ప్రవేశ్యతే। తథా శత్రు మిత్రాది సమత్వబోధనం, ప్రాణాయామ ప్రత్యాహారాది పురుష ప్రయత్నశ్చ ఇత్యేతౌ ద్వౌ చిత్తశాన్త్యుపాయౌ। తత్ర ఆద్యేన మృదుయోగేన శీఘ్రం లాలయేత్, కింతు శనైః శనైః।

### భావప్రకాశిక

చిత్తము అనగా మనస్సు, బాలకునివంటిది. దానిని శత్రు, మిత్ర, సమత్వబోధనము మొదలగు మృదూపాయములచేత, శీఘ్రముగా పురుషప్రయత్నముచేత లాలించి, వశము చేసికొన వచ్చును. శీఘ్రముగా కాదుగాని, ప్రాణాయామ, ప్రత్యాహారాది పురుషప్రయత్నముచేత గూడ మెల్లమెల్లగా వశము చేసికొన వచ్చును. ఈ ఉపాయము లాలన కాదు గాని తాడన వంటింది.

చపలమగు పశువును బంధనస్థానమునకు తీసికొనివచ్చుటకు రెండు ఉపాయములు గలవు. పచ్చిగడ్డి చేతబట్టుకొని చూపుచు గోకుట మొదలగు పశువున కిష్టమైనపనులను జేయుచో ఆ పశువు వశమగును. మరియొక ఉపాయము వాక్పారుష్యము, దండాదులతో బెదరించుట మొదలైనది. వానిలో మొదటి ఉపాయముచేత శీఘ్రముగా పశువు బంధన స్థానమును జేరును. రెండవ ఉపాయముతో ఇటునటు పరుగిడి మెల్లమెల్లగా ఎప్పటికో ప్రవేశపెట్టబడును. అట్లే చిత్తశాంతికి ఉపాయములు రెండు గలవు. శత్రు, మిత్రాది సమత్వ బోధనము మొదటిది, ప్రాణాయామ, ప్రత్యాహారాది

పురుషప్రయత్నము రెండవది. అందు మొదటిదగు మృదువైన ఉపాయముచే శీఘ్రముగా లాలించవలెను. రెండవదగు హఠ యోగముచే శీఘ్రముగా లాలించుట కాదు గాని, మెల్లమెల్లగా చిత్తమును వశము చేసికొనవచ్చును.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ ద్రాగభ్యాసవశా ద్యాతి యదా తే వాసనోదయమ్।
తథా అభ్యాసస్య సాఫల్యం విద్ధి త్వమరిమర్దన॥ 13

మృదుయోగాభ్యాసవశాత్ శీఘ్రమేవ సద్వాసనోదయే సతి సాఫల్య మభ్యాసస్య మన్తవ్యమ్, న తు అల్పకాలేన అసంభావనా శఙ్కనీయా।

భావప్రకాశిక

మృదు రాజయోగాభ్యాసము వలన శీఘ్రముగా శుభ వాసనోదయము, నీకు ఎప్పుడు కలుగునో, హే శత్రుమర్దన! రామ! నీవు అప్పుడు అభ్యాసమునకు సఫలత్వము చేకూరినదని తెలిసికొనుము.

మృదుయోగాభ్యాసము వలన (ఒకప్పుడు) శీఘ్రముగానే శుభవాసనోదయము కలుగగా నీ యోగాభ్యాసయత్నము సఫల మైనదని తలంచుము. అచిరకాలములోనే శుభవాసనోదయము కలిగినచో అది సంభవము కాదు అని శంకించరాదు.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ సందిగ్ధాయామపి భృశం శుభామేవ సమాహర।
శుభాయాం వాసనావృద్ధౌ తాత దోషో న కశ్చన॥ 14

శుభవాసనాఽభ్యస్యమానా సంపూర్ణా న వా ఇతి యదా సందేహః తదాఽపి శుభాం అభ్యస్యేదేవ। తద్యథా సహస్రజపే ప్రవృత్తస్య దశమే శతసంఖ్యా యదా సందిగ్ధా తదా పునరపి శతం జపేత్, అసంపూర్ణౌ సంపూర్తిః భవిష్యతి, సంపూర్ణౌ తు

తద్వృద్ధ్యై న సహస్రజపో దుష్యతి, తద్వత్।

భావ ప్రకాశిక

మృదుయోగముచే శుభవాసనాభ్యాసము సంపూర్ణమైనదా, లేదా? అను సందేహము కలిగినపుడు ఇంకను శుభవాసనను మిక్కిలి అభ్యసించుచునే ఉండవలెను. వత్సా! శుభవాసనావృద్ధిలో దోష మెద్దియు లేదు.

ఎట్లనగా, సహస్రమంత్రజపమునకు ప్రవృత్తుడైనవాడు పదియవ శతసంఖ్య దగ్గర సందేహము వచ్చినచో మరల నూరు మారులు మంత్రజపము చేయవలయును. ఇదివరకు తొమ్మిది వందలే చేసి సహస్రసంఖ్య పూర్తికానిచో ఇపుడు పూర్తియై సఫలమగును. ఇదివరకే సహస్రము చేసి ఉన్నచో ఇప్పుడు మరల మరియొక నూరుమార్లు జపము చేసి సహస్రసంఖ్యకు వృద్ధిని సాధించినను సహస్రమంత్రజపమునకు ఎట్టి దోషము వాటిల్లదు. అట్లే సందిగ్ధ సమయమున, శుభవాసనలు వృద్ధి చేసికొనుటలో దోషము లేదు.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ అవ్యుత్పన్నమనా యావత్ భవాన్ అజ్ఞాతతత్పదః।
గురుశాస్త్రప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర॥

శ్లో॥ తతః పక్వకషాయేణ నూనం విజ్ఞాతవస్తునా।
శుభోఽప్యసౌ త్వయా త్యాజ్యః వాసనౌఘో నిరోధినా॥

భావప్రకాశిక

నీవు, ఎంతవరకు బ్రహ్మాత్మైక్యవిచారమునందు నిపుణుడవు కావో, ఎంతవరకు అద్వైత బ్రహ్మాత్మస్వరూపము అనుభవము లోనికిరాదో అంతవరకు గురు, శాస్త్ర ప్రమాణములచే నిర్ణయించ బడినదానిని ఆచరింపుము, మోక్షసాధనాభ్యాసము చేయుము.

పిమ్మట, ప్రతిబంధకములగు రాగాది వాసనలు క్షీణించగా

దృఢ అపరోక్ష ఆత్మానుభవము కలుగును, నిశ్చయము. అప్పుడు ఈ శుభవాసనాసముదాయమును గూడ, మనోవ్యథ లేకుండా (సంకోచము లేకుండా) వదలిపెట్టవలయును.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ య దతిసుభగం ఆర్యసేవితం త
చ్ఛుభ మనుసృత్య మనోజ్ఞభావబుద్ధ్యా।
అధిగమయ పదం సదా విశోకం
తదను తదప్యవముచ్య సాధు తిష్ఠ॥

స్పష్టోఽర్థః। తస్మా ద్యోగాభ్యాసేన కామాద్యభిభవ సంభవాత్ జీవన్ముక్తౌ న వివదితవ్యమ్।

భావప్రకాశిక

విజ్ఞుడవగు ఓ రామా! సత్పురుషులు సేవించిన అతిమనోహరమైన శుభమగు ఈ మనస్సును అంతఃకరణశుద్ధితో అనుసరించి ఎల్లపుడు శోకరహితమగు అద్వైత ఆత్మతత్త్వపదమును పొందింపజేయుము. అద్వైతబ్రహ్మయందు చిత్తమును స్థిరముగా నిలుపుము. పిమ్మట, వృత్తిరూపమగు మహావాక్య తత్త్వజ్ఞానమును గూడ అభినివేశము లేకుండ వదలిపెట్టి, సాధు తిష్ఠ=అద్వైత బ్రహ్మస్వరూపుడవుగా ఉండుము అని వసిష్ఠునిచే శ్రీరామునకు ఉపదేశింపబడెను. కనుక, యోగాభ్యాసముచేత ప్రారబ్ధకర్మయొక్క అభిభవము గూడ (దీపము తెచ్చుటచేత చీకటికివలె) తిరస్కారము

"దీపానయనేన తమసః తిరస్కార ఇవ"

సంభవమైనందున, జీవన్ముక్తిని గురించి వివాదము యుక్తము కాదు.

ఇది జీవన్ముక్తి స్వరూపము.

జీవన్ముక్తి వివేకః

శ్రుతిస్మృతివాక్యాని జీవన్ముక్తిసద్భావే ప్రమాణాని। తాని చ కఠవల్ల్యాదిషు పఠన్తి- 'విముక్తస్య విముచ్యతే' 5-1 ఇతి కఠవల్ల్యామ్। జీవన్నేవ దృఢబంధనాత్ కామాదేః విశేషేణ ముక్తస్సన్ దేహపాతే భావి బన్ధాత్ విశేషేణ ముచ్యతే।

భావప్రకాశిక

జీవన్ముక్తి కలదు అనుటలో శ్రుతి, స్మృతి వాక్యములు ప్రమాణములు. అవి ఎవ్వి అనగా కఠవల్లి మొదలగు ఉపనిషత్తు లందు

'విముక్తశ్చ విముచ్యతే'

అని పఠించుచున్నారు. బ్రతికి ఉండగానే దృఢబంధనమగు కామాదులయొక్క విశేషముచే ముక్తుడగుచు దేహపతనానంతరము రాబోవు బంధమునుండి విశేషముగా ముక్తుడగుచున్నాడు అని భావము.

జీవన్ముక్తి వివేకః

వేదనాత్ ప్రాగపి శమ దమాది సంపాదనేన కామాదిభ్యః ముచ్యత ఏవ। తథాఽపి ఉత్పన్నానాం కామాదీనాం తత్ర ప్రయత్నేన నిరోధః; అత్ర తు ధీవృత్త్యనునయమాత్రాత్ అనుత్పత్తిరేవ; తతః విశేషేణేత్యుచ్యతే। తథా ప్రలయే దేహపాతే సతి కించిత్కాలం భావిదేహబోధాత్ ముచ్యతే। అత్ర తు ఆత్యన్తికో మోక్షః ఇతి అభిప్రేత్య విశేషేణేత్యుక్తమ్।

భావప్రకాశిక

తత్త్వజ్ఞానమునకు పూర్వము గూడ, శమ దమాది సాధన సంపాదనచే కామాదులనుండి విడివడుచునే యున్నాడు. అట్లయినను అపుడు ఉత్పన్నములైన కామాదివృత్తులను కార్యకారులు కాకుండునట్లు ప్రయత్నముతో నిరోధించుట జరుగు

చున్నది. తత్త్వజ్ఞానానన్తరము కామాది బుద్ధివృత్తులు ఉదయించనే ఉదయించవు. కనుక ఆ కామాదుల అనుత్పత్తియే పూర్వముకంటె విశేషముగ జీవన్ముక్తి సమయమున చెప్పబడుచున్నది. అట్లే ప్రళయకాలమునందు గూడ, ఒకదేహము వీడిన తరువాత మరియొక దేహము స్వీకరించులోపల కొంతకాలము రాబోవు దేహబంధము నుండి ముక్తుడగుచున్నాడు. జీవన్ముక్తియందైనచో కామాదులయొక్క ఆత్యంతిక మోక్షము ఉండును అను అభిప్రాయముతే 'విశేషేణ' అను పదము ప్రయుక్తమైనది.

జీవన్ముక్తి వివేకః

బృహదారణ్యకే పఠ్యతే–

శ్లో॥ 'యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేస్య హృది శ్రితాః।
అథ మర్త్యోఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే'।
4–4–7. ఇతి।

శ్రుత్యన్తరేఽపి– 'సచక్షు రచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ, సమనా అమనా ఇవ సప్రాణోఽప్రాణ ఇవ' ఇతి।

భావప్రకాశిక

బృహదారణ్యకమున, అధ్యేతలచే ఇట్లు పఠింపబడుచున్నది–
"యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః।
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥"

ఈ ముముక్షువుయొక్క హృదయమును ఆశ్రయించిన కోరికలు అన్నియు,ఎప్పుడు విడివడుచున్నవో, అప్పుడు ముముక్షువగు ఆ మర్త్యుడు (మనుష్యుడు) కైవల్యముక్తిని (బ్రహ్మాత్మస్వరూపమగు అమృతత్వమును) పొందుచున్నాడు. ఇచటనే మరియొక దేహము ఉండగనే బ్రహ్మను పొందుచున్నాడు. దేహపాతానంతర్యముతో పని లేదు. ఇది జీవన్ముక్తి ప్రమాణశ్రుతి.

మరియొక శ్రుతియందు గూడ–

"సచక్షు రచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ సమనా అమనా ఇవ
సప్రాణోఽప్రాణ ఇవ।"

అను శ్రుతియందు గూడ, 'ఇవ' శబ్ద వ్యత్యయముతో, అనగా 'అచక్షుః సచక్షురివ' అను రీతిగా చక్షుస్సు లేకపోయినను, చక్షురింద్రియము కలవానివలెను, చెవి లేనివాడు చెవి కలవానివలెను, మనస్సు లేనివాడు మనస్సు కలవానివలెను, ప్రాణము లేనివాడు ప్రాణము కలవానివలెను లోకదృష్టితో కన్పడును అని జీవన్ముక్తుడు వర్ణింపబడి ఉన్నాడు.

## జీవన్ముక్తి వివేకః

ఏవ మన్యత్రా ప్యుదాహార్యమ్। స్మృతిషు జీవన్ముక్తః స్థితప్రజ్ఞ భగవద్భక్త గుణాతీత బ్రాహ్మణాతివర్ణాశ్రమ్యాది నామభి స్తత్ర తత్ర వ్యవహ్రియతే। వసిష్ఠ రామసంవాదే 'నృణాం జ్ఞానైకనిష్ఠానాం' ఇత్యారభ్య, 'సత్కించి దవశిష్యతే' ఇత్యన్తేన గ్రన్థేన జీవన్ముక్తః పఠ్యతే।

## భావప్రకాశిక

స్మృతులందు జీవన్ముక్తుడు స్థితప్రజ్ఞుడు, భగవద్భక్తుడు, గుణాతీతుడు (భగవద్గీత), బ్రాహ్మణుడు, అతివర్ణాశ్రమి మొదలగు నామములచే అచ్చటచ్చట వ్యవహరింపబడుచున్నాడు. వసిష్ఠ, రామ సంవాదమునందు 'నృణాం జ్ఞానైకనిష్ఠానామ్' అను శ్లోకము మొదలుకొని 'సత్కించిదవశిష్యతే' అని పరిసమాప్తమగు గ్రంథముచేత జీవన్ముక్తుడు వర్ణింపబడి ఉన్నాడు.

## జీవన్ముక్తివివేకః

వసిష్ఠః :-

శ్లో॥ నృణాం జ్ఞానైకనిష్ఠానాం ఆత్మజ్ఞానవిచారిణామ్।
సా జీవన్ముక్తతోదేతి విదేహోన్ముక్తతేవ యా॥

జ్ఞానైకనిష్ఠత్వం లౌకిక వైదిక కర్మత్యాగః। దేహేన్ద్రియ సదసద్భావమాత్రేణ ముక్తిద్వయస్య విశేషః న తు అనుభవతః; ద్వైతప్రతీతేః ఉభయత్రాభావాత్।

శ్రీరామః :-

శ్లో॥ బ్రహ్మన్విదేహముక్తస్య జీవన్ముక్తస్య లక్షణమ్।
బ్రూహి యేన తథైవాహం యతే శాస్త్రజయా దృశా॥

భావప్రకాశిక

వసిష్ఠుడు చెప్పుచున్నాడు- జ్ఞానైకనిష్ఠులు, ఆత్మజ్ఞాన విచారణశీలురు అగు మనుష్యులకు ఆ జీవన్ముక్తత్వము ఉదయించును. ఆ జీవన్ముక్తి కూడ, విదేహముక్తివలెనే ఉండును.

జ్ఞానైకనిష్ఠత్వమనగా లౌకిక, వైదిక కర్మత్యాగము. దేహేంద్రియములు ఉండుట, లేకపోవుట- ఇంతమాత్రమే జీవన్ముక్తి, విదేహముక్తుల రెంటికి గల భేదము; అనుభవమునందు భేదము లేదు. ఏలననగా, రెండు ముక్తులందును ద్వైతజ్ఞానము ఉండదు.

శ్రీరాముడు అడుగుచున్నాడు- 'ఓ బ్రహ్మర్షీ! విదేహ ముక్తునకును, జీవన్ముక్తునకును లక్షణములు చెప్పుడు. నేను శాస్త్ర దృష్టితో అట్లు ఉండుటకు ప్రయత్నింతును.

జీవన్ముక్తివివేకః

వసిష్ఠః :-

శ్లో॥ 'యథాస్థిత మిదం యస్య వ్యవహారవతోఽపి చ।
అస్తంగతం స్థితం వ్యోమ స జీవన్ముక్త ఉచ్యతే॥'

ఇదం ప్రతీయమానం గిరినదీసముద్రాదికం జగత్ ప్రతిపత్తుః దేహేన్ద్రియవ్యవహారేణ సహ మహాప్రళయే పరమేశ్వరేణ ఉపసంహృతం సత్ స్వరూపోపమర్దేన అస్తంగతం భవతి।

భావప్రకాశిక

వసిష్ఠుడు పలికెను- పరిదృశ్యమానమగు ఈ గిరి, నదీ, సముద్రాదికము, దేహేంద్రియ వ్యవహారముతోసహా ఎవనికి అదర్శనమగునో, కేవలము చిదాకాశస్వరూపమే మిగిలియుండునో అతడు జీవన్ముక్తుడు అని చెప్పబడుచున్నాడు.

కన్పడునట్టి ఈ గిరి, నదీ, సముద్రాదికమైన జగత్తు తెలిసికొనువానియొక్క దేహేన్ద్రియవ్యాపారసహితముగా, మహాప్రళయమున పరమేశ్వరునిచే ఉపసంహరింపబడినదై స్వరూపనాశముచేత అగోచరము అగును.

జీవన్ముక్తివివేకః

అత్ర తు న తథా, కింతు విద్యత ఏవ దేహేన్ద్రియాదివ్యవహారః గిరినద్యాదికం చ పరమేశ్వరేణ అనుపసంహృతత్వాత్, యథాపూర్వం అవతిష్ఠమానం సత్ సర్వైః అన్యైః ప్రాణిభిః విస్పష్టం అవలోక్యతే। జీవన్ముక్తస్య తత్ప్రత్యాయకధీవృత్త్యభావాత్ సుషుప్తావివ సర్వం అస్తంగతం భవతి। స్వయం ప్రకాశమానం చిద్వ్యోమ కేవలం అవశిష్యతే। బద్ధస్య సుషుప్తౌ తాత్కాలిక ధీవృత్తి అభావసామ్యేఽపి భావిధీవృత్తిబీజస్య సద్భావాత్ న జీవన్ముక్తత్వమ్।

శ్లో॥ నోదేతి నాస్తమాయాతి సుఖే దుఃఖే ముఖప్రభా।
యథాప్రాప్తే స్థితి ర్యస్య స జీవన్ముక్త ఉచ్యతే॥

భావప్రకాశిక

జీవన్ముక్తియందైనచో అట్లు కాదు. ఇకనేమనగా, దేహేన్ద్రియాదివ్యవహారము, గిరి, నదీ, సముద్రాదికము పరమేశ్వరునిచేత ఉపసంహారము చేయబడలేదు. పూర్వము వలెనే అవి, ఉంటున్నవి, ఇతర ప్రాణులచే విస్పష్టముగా చూడబడుచున్నవి. జీవన్ముక్తునకు ఆ యా విషయములకు అవభాసకమగు బుద్ధి

వృత్తి, సుషుప్తియందువలె లేకుండును. స్వయంప్రకాశమాన మగు చిదాకాశము మాత్రమే జ్ఞాని యగు జీవన్ముక్తునకు మిగిలి ఉండును. సుషుప్తియందు తాత్కాలిక ధీవృత్తియొక్క అభావము సమానమైనను, తిరిగి జాగ్రద్దశలో కలుగు ధీవృత్తి సంస్కారము మిగిలియుండును. కనుక, సుషుప్తునకు జీవన్ముక్తత్వము లేదు.

జీవన్ముక్తుని ముఖకాంతి ఉదయించదు, తరిగిపోదు. హర్ష విషాదములు ఉండవు. ప్రారబ్ధకర్మాపాదితమగు సుఖ, దుఃఖభోగ సంపాదకమగు విషయసన్నిధానము మాత్రము ఉండును. ప్రారబ్ధకర్మభేదముచే విషయభేదము ఆ జీవన్ముక్తునందు చూడబడును.

## జీవన్ముక్తివివేకః

ముఖప్రభా హర్షః। చందనసత్కారాది సుఖే ప్రాప్తేఽపి సంసారిణ ఇవ హర్షః నోదీయతే। అస్తమయః దైన్యమ్। ధనహాని ధిక్కారాది దుఃఖే ప్రాప్తేఽపి న దీనో భవతి। ఇదానీంతన స్వప్రయత్నవిశేష మన్తరేణ ప్రారబ్ధకర్మాపాదిత పూర్వప్రవాహాగత భిక్షాన్నాదికం యథాప్రాప్తం తస్మిన్స్థితిః దేహరక్షా। సమాధిదార్ఢ్యేన స్రక్చన్దనాది ప్రతీత్యభావాత్। కదాచిత్ వ్యుత్థాన దశాయాం ఆపాతతః ప్రతీతావపి వివేకదార్ఢ్యేన హేయోపాదేయత్వ బుద్ధ్యభావాత్ హర్షాదిరాహిత్యం ఉపపద్యతే।

## భావప్రకాశిక

'ముఖప్రభా' అనగా హర్షము. చందనసత్కారాది సుఖము ప్రాప్తమైనను సంసారిజనునకు వలె హర్షము (ఉప్పొంగిపోవుట) కలుగనేరదు. 'అస్తమయము' అనగా దైన్యము. ధనహాని, ధిక్కారాది దుఃఖహేతువు ప్రాప్తమైనను దీనుడు కాడు. భిక్షాన్నాదికము కూడ అతనియందుఇప్పటి ప్రయత్నవిశేషమువలన కాక,

ప్రారబ్ధకర్మాపాదిత పూర్వవాసనాబలముచేతనే వానికి పూర్వము వలె ప్రాప్తమగును, ఆ స్థితి దేహరక్షార్థము అయి ఉన్నది. సమాధియొక్క దృఢాభ్యాసముచే స్రక్చందనాది విషయములు మనోవృత్తిగోచరములు కావు. ఒకప్పుడు వ్యుత్థానదశయందు దేహస్ఫురణ వచ్చినమీదట ఆపాతముగా విషయములు ప్రతీత మైనను, దృఢవివేక ముండుటచే ఇది హేయము అని కాని, ఇది ఉపాదేయము అని కాని, బుద్ధి కలుగదు. కనుక, హర్షాది రాహిత్యము జీవన్ముక్తునియందు ఉపపన్నము అగుచున్నది.

## జీవన్ముక్తివివేకః

శ్లో॥ యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రన్న విద్యతే।
యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే॥

చక్షురాదీంద్రియాణాం స్వస్వగోళకేషు అవస్థానేన ఉపరత్యభావాత్ జాగర్తి। మనోవృత్తిరహితత్వాత్ సుషుప్తిస్థః। అతఏవ 'ఇన్ద్రియై రర్థోపలబ్ధిః' ఇత్యేతస్య జాగరణలక్షణస్య అభావాత్ జాగ్రత్ న విద్యతే। సత్యపి బోధే జాయమానః బ్రహ్మత్వాభిమానాదిభిః భోగార్థాపాదిత కామాదిభిశ్చ ధీదోషః, వాసనావృత్తి రాహిత్యేన తద్దోషాభావాత్ నిర్వాసనత్వమ్।

## భావప్రకాశిక

ఎవరు సుషుప్తియందున్నను మేల్కొనుచున్నాడో, ఎవనికి జాగ్రదవస్థ లేదో, ఎవని జ్ఞానము వాసనారహితమో, అతడు జీవన్ముక్తుడు అని చెప్పబడుచున్నాడు.

చక్షువు, శ్రోత్రము మొదలగు ఇంద్రియములు తమ తమ గోళకములందు ఉండుటచేత, నిర్వ్యాపారము లేదుగనుక (విషయ సన్నికర్ష ఉండును గనుక) మేల్కొని ఉన్నాడు. మనస్సు, చక్షురాదులతో చేరనందున, విషయాకారవృత్తి కలుగదు గనుక, సుషుప్తిస్థుడు అని చెప్పబడుచున్నాడు. ఇందువలననే

'ఇంద్రియైః అర్థోపలబ్ధిః జాగరితమ్।'

ఇంద్రియములతో విషయమును మనస్సు గ్రహించుట అను ఈ జాగ్రదవస్థాలక్షణము లేదు గనుక, అతనికి జాగృతి లేదు. కొందరికి జ్ఞానము కలిగినను, 'నేను బ్రహ్మవేత్తను' అను అభిమానము ఉండును. మరికొందరు భోగార్థము కామాది దోషములకు లోనగుదురు (సౌభరి మొదలగువారు). ఈ ధీదోషము వాసనా రూపము. ఇట్టి వాసన కూడ లేకుండ, జ్ఞానసంపన్నుడగువాడు జీవన్ముక్తుడు. జీవన్ముక్తుడు వృత్తిరాహిత్యము సంపాదించుకొనుటచేత ఆ ధీదోషము లేదుగాన, వాని జ్ఞానము నిర్వాసనము. అనగా, వాసనారహితము.

## జీవన్ముక్తివివేకః

శ్లో॥ రాగద్వేషభయాదీనా మనురూపం చరన్నపి।
యోఽన్తర్వ్యోమవ దత్యచ్ఛః స జీవన్ముక్త ఉచ్యతే॥

రాగానురూపం భోజనాదిప్రవృత్తిః। ద్వేషానురూపం బౌద్ధకాపాలికాదిభ్యః విముఖత్వమ్। భయానురూపం సర్వవ్యాఘ్రాదిభ్యః అపసర్పణమ్। ఆదిశబ్దేన మాత్సర్యానురూపం ఇతర యోగిభ్యః ఆధిక్యేన సమాధ్యనుష్ఠానమ్। సత్యపి వ్యుత్థానదశాయాం ఈదృశాచరణే పూర్వాభ్యాసేన ప్రాపితే విశ్రాన్తచిత్తస్య కాలుష్య రహితత్వాత్ అత్యచ్ఛత్వమ్। యథా వ్యోమ్ని ధూమ ధూలి మేఘాది యుక్తేఽపి నిర్లేపస్వభావత్వాత్ అతిశయేన స్వచ్ఛత్వం తద్వత్।

### భావప్రకాశిక

రాగము, ద్వేషము, భయము, మాత్సర్యము మొదలగు వానికి తగినట్లుగా (లోకదృష్టిలో) నడచుకొనుచున్నను అంతరమున ఆకాశమువలె అతి స్వచ్ఛముగా ఎవడు ఉండునో, అతడు జీవన్ముక్తుడని చెప్పబడును.

రాగమునకు తగినట్లుగా ఆచరణము భోజనాదులయందు

ప్రవృత్తి అయి ఉన్నది. దోషానుగుణముగా ప్రవృత్తి, బౌద్ధ కాపాలికాదులకు విముఖుడుగా నుండుట అయి ఉన్నది, భయాను గుణమైన ఆచరణము సర్వవ్యాఘ్రాదులనుండి తప్పుకొనుట. 'ఆది' శబ్దముచే మాత్సర్యానుగుణమగు ప్రవృత్తిని గ్రహించ వలెను. కొందరు యోగులు ఇతర యోగులు కంటె ఆధిక్యమును చూపుటకు ఎక్కువ కాలము సమాధ్యనుష్ఠానము చేయుదురు. వ్యుత్థానదశయందు (దేహస్ఫురణానంతరము) ఇటువంటి ఆచరణము పూర్వాభ్యాసముచే ప్రాప్తమగును. విశ్రాంత చిత్తునకు వాసన లేనందునను, వృత్తిరాహిత్యము వలనను అంతఃకరణము స్వచ్ఛస్వభావముతోనే ఉండును. ఆకాశము, పొగ, దుమ్ము, మేఘము, మంచు మొదలగువానితో గూడి ఉన్నను, నిర్లిప్త స్వభావముతోనే ఉండును. అట్లే, జీవన్ముక్తుడు నిర్లిప్తుడై ఉండును.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిః యస్య న లిప్యతే।
కుర్వతోఽకుర్వతో వాఽపి స జీవన్ముక్త ఉచ్యతే॥

పూర్వార్థం విద్వత్సంన్యాసప్రస్తావే వ్యాఖ్యాతమ్। లోకే బద్ధస్య పురుషస్య శాస్త్రీయం కర్మ కుర్వతః 'అహం కర్తా' ఇతి చిదాత్మా అహంకృతో భవతి। 'భావి స్వర్గం ప్రాప్స్యామి' ఇతి హర్షేణ బుద్ధిః లిప్యతే। అకుర్వతస్తు 'త్యక్తవానస్మి' ఇతి అహం కృతత్వమ్। స్వర్గఅలాభవిషాదః లేపః। ఏవం ప్రతిషిద్ధకర్మణి లౌకికకర్మణి చ యథాసంభవం యోజనీయమ్। జీవన్ముక్తస్య తు తాదాత్మ్యాధ్యాసాభావాత్ హర్షాద్యభావాచ్చ న దోషద్వయమ్.

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకః లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయాన్ముక్తః స జీవన్ముక్త ఉచ్యతే॥

అధిక్షేప తాడనాదౌ అప్రవృత్తత్వాత్ తస్మాత్ లోకః

నోద్విజతే। అతఏవ ఏతస్మిన్ లోకస్యాపి అధిక్షేపాద్యప్రవృత్తేః, కస్యచిత్ దుష్టస్య తత్ప్రవృత్తావపి ఏతచ్చిత్తే తాదృగ్వికల్ప అనుదయాచ్చ అయమపి నోద్విజతే।

భావప్రకాశిక

ఎవని చిదాత్మ, అహంకారాధ్యాసమునకు లోను కాదో, ఎవని బుద్ధి, హర్ష విషాదములకు లోను కాదో, అతడు శాస్త్రీయ కర్మను చేయుచున్నను, చేయకపోయినను, జీవన్ముక్తుడు అని చెప్ప బడును.

పూర్వార్థము విద్వత్సంన్యాసప్రకరణమున వ్యాఖ్యానము చేయబడినది. లోకమునందు బద్ధ పురుషుడు శాస్త్రీయ కర్మను ఆచరించి 'నేను కర్తను' అని అహంకార తాదాత్మ్యాధ్యాస కలవాడు అగును. భవిష్యత్కాలమున 'నేను స్వర్గమును పొందగలను' అని హర్షముతో అతని బుద్ధి, లేపమును పొందును. చేయకపోయినచో (శాస్త్రీయకర్మను) ఆ కర్మలను 'నేను వదలిపెట్టితిని' అని భావించును. స్వర్గము రానందున, బుద్ధిలో విషాదము జనించును. ఇట్లే, ప్రతిషిద్ధ కర్మలను, లౌకిక కర్మలను ఆచరించినపుడు, ఆచరించనపుడు గూడ 'తనకు నరకము ప్రాప్తించును' అని లౌకిక కర్మలను ఆచరించునపుడు 'తనకు ప్రయోజనము చేకూరలే'దని చేసినప్పుడు హర్షమునకు, చేయనప్పుడు విషాదమునకు గురి యగును. జీవన్ముక్తునకైనచో, అహంకార తాదాత్మ్యాధ్యాస లేదు గనుక, హర్షవిషాదములు ఉండవు. కావున, వెనుక చెప్పిన రెండు దోషములు జీవన్ముక్తునకు వర్తించవు.

ఎవరివలన లోకము భయమును, కలవరమును పొందదో, రాగమువలన ఎవ్వడు కలత నొందడో, హర్ష, అమర్ష, భయముల నుండి విడివడినవాడో, అతడు జీవన్ముక్తుడు అని చెప్పబడును.

జీవన్ముక్తుడు ఇతరులను అధిక్షేపించడు. తాడనమునందు గూడా ప్రవృత్తుడు కాడు. కనుక, లోకము అతనిని చూచి

భయపడదు. లోకము కూడ అతనిని అధిక్షేపించదు, బాధించదు. ఎవరో దుర్జనుడొక్కడు అట్లు ప్రవర్తించినను, అతని చిత్తము నందు అమర్షము కాని, భయము కాని, ఉదయించదు. కనుక, జీవన్ముక్తుడు నిర్వికారుడుగానే ఉండును, కలత నొందడు.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ శాన్తసంసారకలనః కలావానపి నిష్కలః।
యః సచిత్తోఽపి నిశ్చిత్తః స జీవన్ముక్త ఉచ్యతే॥

శత్రుమిత్ర మానావమానాది వికల్పాః సంసారకలనాః శాన్తా యస్య సః। చతుష్షష్టివిధాః కలాః, తత్సద్భావేఽపి తదభిమాన వ్యవహారయోః అభావాత్ నిష్కలత్వమ్। చిత్తస్య స్వరూపేణ సద్భావేఽపి వృత్త్యనుదయాత్ నిశ్చిత్తత్వమ్। నిశ్చిన్తేతి పాఠే వాసనావశాత్ ఆత్మధ్యానవృత్తిసద్భావేఽపి లౌకికవృత్త్యభావాత్ నిశ్చిన్తత్వమ్।

శ్లో॥ యః సమస్తార్థజాతేషు వ్యవహార్యపి శీతలః।
పరార్థేష్వివ పూర్ణాత్మా స జీవన్ముక్త ఉచ్యతే॥

పరగృహే వివాహోత్సవాదౌ స్వయం గత్వా తత్ప్రీత్యై తదీయకార్యేషు వ్యవహరన్నపి లాభాలాభయోః హర్షవిషాదరూపం బుద్ధిసంతాపం న ప్రాప్నోతి, యథా ఏవం అయం ముక్తః స్వకార్యేఽపి శీతలః। న కేవలం సంతాపాభావాత్ శీతలత్వం, కింతు పూర్ణస్వరూపానుసంధానాదపి।

ఇతి జీవన్ముక్త లక్షణమ్॥

భావప్రకాశిక

శత్రు, మిత్ర, మానావమానాది సంసారవాసనలు ఉపశమించినవాడును, చతుష్షష్టికళాభిజ్ఞుడైనను, తదభిమానవ్యవహారములు లేనందున నిష్కలుడును, చిత్తము ఎట్టి విషయాకారవృత్తి

శ్లో॥ జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే।
విశత్యాదేహముక్తత్వం పవనోఽస్పందతామివ॥

యథా వాయుః కదాచిత్ చలత్వం త్యక్త్వా నిశ్చలరూపేణ అవతిష్ఠతే తథా ముక్తాత్మాఽపి ఉపాధికృతం సంసారం త్యక్త్వా స్వరూపేణ అవతిష్ఠతే।

శ్లో॥ విదేహముక్తః నోదేతి నాస్తమేతి న శామ్యతి।
న సన్నాసన్న దూరస్థో న చాహం న చ నేతరః॥

ఉదయాస్తమయౌ హర్షవిషాదౌ, న శామ్యతి న చ తత్పరిత్యాగే, లిఙ్గదేహస్య అత్రైవ లీనత్వాత్। సద్వాచ్యః జగద్ధేతుః అవిద్యామాయోపాధిః న ప్రాజ్ఞేశ్వరః, అసద్వాచ్యోఽపి నాఽపి భూతభౌతికః। న దూరస్థ ఇత్యుక్త్యా న మాయాతీతః। న చేత్యుక్త్యా స్థూలభుక్ సమీపస్థోఽపి నిషిధ్యతే। అహం న చ ఇతి న సమష్టిశ్చ। నేతర ఇతి న వ్యష్టిశ్చ। వ్యవహారయోగ్యో వికల్పః కోఽపి నాస్తీత్యర్థః।

### భావప్రకాశిక

### విదేహముక్తిలక్షణము

అనంతరము విదేహముక్తలక్షణములు చెప్పబడుచున్నది.

జీవన్ముక్తపదమును వదలిపెట్టి తన దేహము ఒకప్పుడు కాలాధీనము కాగా, వాయువు నిశ్చలతను పొందినట్లు, విదేహముక్తత్వమును పొందుచున్నాడు.

ఏవిధముగా వాయువు ఒకప్పుడు చలత్వమునువీడి నిశ్చలరూపముగ నుండునో, అట్లే ముక్తాత్మకూడ, ఉపాధికృతమగు సంసారమును వీడి, స్వరూపముతో నుండును.

విదేహముక్తుడు హర్షమును పొందడు, విషాదమును పొందడు. సూక్ష్మశరీరము (లింగశరీరము) ఇచటనే లీనమైనందువ, ఆ హర్షవిషాదములను గూడ, పరిత్యజించడు. అనగా

హర్షవిషాదములకు ఆశ్రయమగు అంతఃకరణము లేనందున, హర్షవిషాదత్యాగప్రసక్తి లేదు. జగత్కారణము, అవిద్యామాయోపాధికుడు, ప్రాజ్ఞుడగు ఈశ్వరుడు సత్పదవాచ్యార్థము. విదేహముక్తుడు సత్పదవాచ్యుడగు జగత్కారణమైన ఈశ్వరుడు కాడు, ప్రాజ్ఞుడును కాడు. అసత్పదమునకు వాచ్యమగు భూత భౌతిక స్వరూపుడును కాడు, మాయాతీతుడును కాడు. జాగ్రత్ స్థూల భోగమును అనుభవించు విశ్వుడును కాడు, సమష్టి బ్రహ్మాండాభిమానియు కాడు, వ్యష్టిదేహాభిమానియు కాడు. వ్యవహారయోగ్యమగు వికల్పము ఏదియు విదేహముక్తునకు లేదు. అనగా హర్షవిషాదములకు ఆశ్రయమగు అంతఃకరణము లేనందున, హర్షవిషాదత్యాగ ప్రసక్తియే లేదు.

### జీవన్ముక్తివివేకః

శ్లో॥ తతః స్తిమితగంభీరం న తేజో న తమ స్తతమ్।
అనాఖ్య మనభివ్యక్తం సత్కించి దవశిష్యతే॥

ఏవం విదేహముక్త్యా సాదృశ్యోక్తేః జీవతోఽపి యావద్యావ న్నిర్వికల్పాతిశయః తావత్తావ దుత్తమత్వం ద్రష్టవ్యమ్॥

### భావప్రకాశిక

జీవన్ముక్తునకు ప్రారబ్ధసమాప్తిచే దేహపాతానంతరము నిశ్చలము, నిర్వికారము, గంభీరము (లోతుతెలియనిది), ప్రసిద్ధమగు భూత తేజస్సుకంటె భిన్నము, వ్యాప్తమైన తమస్సు కాదనియు, పేరు లేదనియు (ద్వైతవర్జితము), ఏ ఉపాధియందును అభివ్యక్తము కానిదియు, ఒకానొక దేశ, కాల పరిచ్ఛేద రహితము, సర్వప్రపంచ బాధావధిభూతము, సద్రూపమును అగు ఆత్మతత్త్వము మిగులుచున్నది.

ఈవిధముగా విదేహముక్తితో సాదృశ్యమును చెప్పుటవలన జీవన్ముక్తునకు ఎంతెంతగా అసంప్రజ్ఞాత సమాధినిష్ఠ ఆరూఢ

మగునో అంతంతగా జీవన్ముక్తునకు ఉత్తమత్వము గ్రహింప సగును.

### జీవన్ముక్తి వివేకః

భగవద్గీతాసు ద్వితీయాధ్యాయే స్థితప్రజ్ఞః పఠ్యతే-

అర్జున ఉవాచ :-

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥ 2-54

ప్రజ్ఞా తత్త్వజ్ఞానమ్। తద్ద్వివిధమ్, స్థిత మస్థితం చ ఇతి। యథా జారే అనురక్తాయా నార్యాః సర్వేష్వపి వ్యవహారేషు బుద్ధిః జారమేవ ధ్యాయతి, ప్రమాణప్రమితాని క్రియమాణాన్యపి గృహకర్మాణి సద్యఏవ విస్మర్యన్తే, తథా పరవైరాగ్యోపేతస్య యోగాభ్యాసపాటవేన అత్యన్త వశీకృతచిత్తస్య ఉత్పన్నే తత్త్వజ్ఞానే తద్బుద్ధిః జారమివ నైరన్తర్యేణ తత్త్వం ధ్యాయతి। తదిదం స్థితం జ్ఞానమ్। ఉక్తగుణరహితస్య కేనాపి పుణ్యవిశేషేణ కదాచిత్ ఉత్పన్నేఽపి తత్త్వజ్ఞానే గృహకర్మవత్ తత్రైవ తత్త్వం విస్మర్యతే। తదిదమ్ అస్థితం జ్ఞానమ్।

### భావప్రకాశిక

భగవద్గీతయందు ద్వితీయాధ్యాయమున స్థితప్రజ్ఞుడు పఠింపబడియున్నాడు.

అర్జునుడు ప్రశ్నించెను- 'కేశవా! సమాధినిష్ఠుడైన స్థితప్రజ్ఞునకు లక్షణము ఎట్టిది ? స్థితప్రజ్ఞుడు ఏమి మాట్లాడును ? ఎట్లు కూర్చుండును? ఎట్లు నడచును (వ్యవహరించును) ?

ప్రజ్ఞ అనగా తత్త్వజ్ఞానము. అది రెండువిధములు- స్థితము, అస్థితము అని. జారునియందు అనురాగము గల స్త్రీ యొక్క బుద్ధి, సర్వవ్యవహారములందును జారునే తలంచుచుండును. తనచేత చేయబడిన గృహకృత్యములు ప్రత్యక్ష

ముగా చూడబడినవి, అయినను వెంటనే విస్మరింపబడుచున్నవి. అదే విధముగా పరవైరాగ్యముతో యోగాభ్యాసపాటవముచే మిక్కిలి వశముచేసికొనబడిన చిత్తము గలవానికి తత్త్వజ్ఞానము కలుగగా అతనిబుద్ధి, ఆ స్త్రీబుద్ధి జారుని ధ్యానించునట్లు నిరంతరము తత్త్వమునే ధ్యానించుచుండును. స్థితజ్ఞానము అనగా ఇదియే. పరవైరాగ్య, యోగాభ్యాసపాటవములు లేక, ఒకప్పుడు పుణ్యవిశేషవశముచేత ఒకానొకనికి తత్త్వజ్ఞానము కలుగవచ్చును. కాని, అతనిచే స్త్రీచేత గృహకర్మ విస్మృతమైనట్లు, ఆ తత్త్వము అక్కడే విస్మరింపబడును. ఇది అస్థితజ్ఞానము.

## జీవన్ముక్తి వివేకః

ఏతదేవాభిప్రేత్య వసిష్ఠః ఆహ–

శ్లో॥ పరవ్యసనినీ నారీ వ్యగ్రాఽపి గృహకర్మణి।
తదేవ ఆస్వాదయ త్యన్తః పరసంగ రసాయనమ్॥ 27-58

శ్లో॥ ఏవం తత్త్వే పరే శుద్ధే ధీరః విశ్రాన్తి మాగతః।
తదేవాస్వాదయత్యన్తః బహిః వ్యవహరన్నపి॥ 27-58 ఇతి।

తత్ర స్థితప్రజ్ఞః కాలభేదాద్ ద్వివిధః, సమాహితః, వ్యుత్థితశ్చ। తయోః ఉభయోః లక్షణం పూర్వోత్తరాభ్యాం అర్ధాభ్యాం పృచ్ఛతి– సమాధిస్థస్య స్థితప్రజ్ఞస్య కా భాషా? కీదృశైః లక్షణ వాచకైః శబ్దైః అయం భాష్యతే? వ్యుత్థితః స్థితప్రజ్ఞః కీదృశం వ్యవహారం కరోతి? తస్య ఉపవేశనగమనే మన్దేభ్యో విలక్షణే కీదృశే ?

## భావప్రకాశిక

తత్త్వజ్ఞానము స్థితము, అస్థితము అని రెండు విధములు అను అభిప్రాయముతోనే వసిష్ఠుడు ఇట్లు చెప్పెను–

పరపురుషవ్యసనము గల స్త్రీ, గృహకర్మవ్యాపృతురాలైనను మనస్సులో ఆ పరసంగసుఖరసాయనమునే ఆస్వాదించుచుండును.

అట్లే, శుద్ధమగు పరతత్త్వమునందు విశ్రాంతిని పొందిన ధీరుడు బాహ్యముగా దేహేంద్రియములతో వ్యవహరించుచున్నను, లోపల పరతత్త్వరసాస్వాదమునే చేయును.

అచట స్థితప్రజ్ఞుడు కాలభేదమువలన సమాహితుడు, వ్యుత్థితుడు అని రెండువిధములుగా పేర్కొనబడినాడు. ఆ ఇరువురి లక్షణమును అర్జునుడు శ్లోకపూర్వోత్తరార్ధములచే ప్రశ్నించుచున్నాడు. సమాధిస్థుడైన స్థితప్రజ్ఞునకు లక్షణములు ఎవ్వి? వ్యుత్థితుడు అగు స్థితప్రజ్ఞుడు ఎటువంటి వ్యవహార మొనరించును? అతడు కూర్చుండుటగాని, నడచుటగాని, మందులకంటె ఎట్టి విలక్షణములు అయి ఉన్నవి?

జీవన్ముక్తి వివేకః

శ్రీభగవానువాచ–

శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవ ఆత్మనా తుష్టః స్థితప్రజ్ఞః తదోచ్యతే॥ 2-55

కామాః త్రివిధాః, బాహ్యాః, అన్తరాః, వాసనారూపమాత్రాశ్చ ఇతి। ఉపార్జితా మోదకాదయః బాహ్యాః। ఆశామోదకాదయః ఆన్తరాః। పథి పతితతృణాదివత్ ఆపాతతః ప్రతీతాః వాసనారూపాశ్చ। సమాహితః అశేషధీవృత్తిసంక్షయాత్ సర్వాన్ పరిత్యజతి। అస్తి చ అస్య ముఖప్రసాదలిఙ్గగమ్యః సంతోషః। స చ న కామే। కింతు ఆత్మన్యేవ, కామానాం త్యక్తత్వాత్। బుద్ధేః పరమానన్దరూపేణ ఆత్మతత్త్వే అభిముఖత్వాచ్చ। న చాత్ర సంప్రజ్ఞాత సమాధావివ ఆత్మానందః మనోవృత్త్యా ఉల్లిఖ్యతే। కింతు స్వప్రకాశ చిద్రూపేణాత్మనా। సంతోషశ్చ న వృత్తిరూపః, కింతు తత్సంస్కారరూపః। ఏవంవిధైః లక్షణవాచకైః శబ్దైః సమాహితో భాష్యతే।

భావప్రకాశిక

శ్రీకృష్ణభగవానుడు ప్రత్యుత్తరమిచ్చెను-

అర్జునా! ఎప్పుడైతే మనస్సునందలి కోరికలను అన్నింటిని పూర్తిగా వదలిపెట్టునో, ఆత్మయందే ఆత్మచేత సంతుష్టుడగునో అపుడు స్థితప్రజ్ఞుడు అని చెప్పబడును.

బాహ్యములు, ఆంతరములు, వాసనామాత్రరూపములు అని కోరికలు మూడువిధములు. భోగార్థము సంపాదించుకొనిన భక్ష్యములు మొదలగునవి బాహ్యములు. మనస్సులోనే అనుభవించవలయును అనుకొను ఆశామోదకములు మొదలగునవి ఆంతరములు. మార్గమున పడిఉన్న తృణాదులవలె పైపైన తాత్కాలికముగా తోచునట్టి పదార్థములు వాసనారూపములు. సమాహితుడగు స్థితప్రజ్ఞుడు బుద్ధివృత్తుల నన్నింటిని నశింపజేసికొనినందువలన అన్ని కామములను పరిత్యజించుచున్నాడు. ఇతనికి ముఖప్రసన్నతచే తెలియబడు సంతోషము గలదు. ఇది ఆత్మసంతోషము, కామసంతోషము కాదు. ఏలన, కామములను ఇదివరకే వదలిపెట్టిఉన్నాడు. అతని బుద్ధి, ఆత్మతత్త్వాభిముఖ మగుటచే పరమానందముతో ఉండును. ఈ ఆత్మానందము కూడ సంప్రజ్ఞాత సమాధియందు వలె మనోవృత్తి కాదు. మరేమనగా, స్వప్రకాశ చిద్రూపమగు ఆత్మచేతనే ఆనందము అనుభవింపబడుచున్నది. సంతోషము గూడ, వృత్తిరూపము కాదు, సంస్కారరూపమై యున్నది. ఈవిధమగు లక్షణవాచక శబ్దములచే సమాహితుడు వ్యవహరింపబడును.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।
వీతరాగభయక్రోధః స్థితధీ ర్ముని రుచ్యతే॥ 2-56

దుఃఖం రోగాది నిమిత్తజన్యా రజోగుణ వికారరూపా

సన్తాపాత్మికా ప్రతికూలా చిత్తవృత్తిః। తాదృశే దుఃఖే ప్రాప్తే సతి 'అహం పాపీ, ధిక్ మాం దురాత్మానమ్' ఇతి అనుతాపాత్మికా తమోగుణవృత్తి వికారత్వేన భ్రాన్తిరూపా చిత్తవృత్తిః ఉద్వేగః। యద్యపి అయం వివేక ఇవ ఆభాతి తథాఽపి పూర్వస్మిన్ జన్మని చేత్ తత్పాపప్రవృత్తి ప్రతిబన్ధకత్వాత్ సప్రయోజనోభవతి। ఇదానీం తు నిష్ప్రయోజన ఇతి భ్రాంతిత్వం ద్రష్టవ్యమ్।

## భావప్రకాశిక

ఆధ్యాత్మిక, అధిభౌతిక, ఆధిదైవిక దుఃఖములు ప్రాప్తములైనను, కలవరము చెందని మనస్సు కలవాడు, సుఖములు పూర్వసుకృతఫలముగా ప్రాప్తములైనను, వానియందు భోగాభిలాష లేనివాడు, రాగము, భయము, క్రోధము, తనను విడచి దూరముగా పోయినవాడు (లేనివాడు), స్థితప్రజ్ఞుడగు ముని అని చెప్పబడుచున్నాడు.

దుఃఖ మనగా శారీర రోగ, వ్యాఘ్ర, సర్పాది భూత, అతివాతాది కారణముల వలన కలుగునట్టి రజోగుణవికారమగు ప్రతికూలమైన, సంతాపరూపమైన చిత్తవృత్తి. అట్టి దుఃఖము ప్రాప్తము కాగా, 'నేను పాపాత్ముడను, దుష్టస్వభావము గల నన్నుగూర్చి నింద అగుగాక (ఛీ)' అను అనుతాపస్వరూపమైన తమోగుణవృత్తి వికారము, మోహాత్మకమైన భ్రాంతిరూప చిత్తవృత్తి, ఉద్వేగము. ఈ చిత్తవృత్తి, పైకి వివేకమువలె కన్పడును. పూర్వజన్మయందే కలిగినచో పాపాచరణము మాని యుండెడివాడు. కాని, పాపము చేసిన తరువాత తనను తిట్టుకొనినందువలన ప్రయోజనము శూన్యము. కనుక, ఇది మోహము (భ్రాన్తి) అని తలంచవలెను.

## జీవన్ముక్తివివేకః

సుఖం రాజ్యపుత్రలాభాదినిమిత్తజన్యా సాత్త్వికీ ప్రీతి రూపా అనుకూలా చిత్తవృత్తిః। తస్మిన్ సుఖే సతి ఆగామినః తాదృశస్య సుఖస్య కారణం పుణ్యం అననుష్ఠాయ వృథైవ తదపేక్షా తామసీ చిత్తవృత్తిః స్పృహా। తత్ర చ సుఖదుఃఖయోః ప్రారబ్ధకర్మప్రాపితత్వాత్ వ్యుత్థితచిత్తస్య వృత్తిసంభవాచ్చ తదుభయ ముపపద్యతే। ఉద్వేగస్పృహే తు న వివేకినః సంభవతః। తథా రాగ భయ క్రోధాశ్చ తామసత్వేన కర్మణా ప్రాపితత్వా భావాత్ నాస్య విద్యన్తే। ఏవంలక్షణలక్షితః స్థితధీః స్వానుభవ ప్రకటనేన శిష్యశిక్షార్థం అనుద్వేగ నిస్పృహత్వాదిగమకం వచో భాషత ఇత్యర్థః।

## భావ ప్రకాశిక

సుఖ మన్నగా, రాజ్యలాభ, మిత్రలాభాది కారణముల వలన, కలుగు సత్త్వగుణవృత్తి. ప్రీతిరూపమైనది కావలయునని, కోరుకొనునట్టి చిత్తవృత్తి. అట్టి సుఖము కలిగినప్పుడు తనకు ఇట్టి సుఖమే భవిష్యత్కాలమున గూడ, కలుగవలయును అని సుఖ కారణమగు పుణ్యమును అనుష్ఠించకయే ఆ సుఖమును అపేక్షించుట, తామస చిత్తవృత్తి, స్పృహ.

ఈ సుఖ దుఃఖములు ప్రారబ్ధకర్మాధీనములుగా వ్యుత్థిత చిత్తునకు సంభవములైనవి. అప్పుడు వివేకముతో ఉద్వేగమును గాని, అప్రాప్త సుఖాభిలాష గాని, స్థితప్రజ్ఞునకు ఉండవు. అట్లే రాగ, భయ, క్రోధములు తామస కర్మ వలన వచ్చునవి గనుక, సాత్త్వికుడు అగు స్థితప్రజ్ఞునకు ఉండవు. ఇట్టి లక్షణములు గల స్థితప్రజ్ఞుడు శిష్యశిక్షార్థము తన అనుభవమును ప్రకటించుచు; అనుద్వేగ, నిస్పృహత్వాదులను తెలియజేయునట్టి మాటలను మాట్లాడును అని అర్థము.

## జీవన్ముక్తివివేకః

శ్లో॥ యః సర్వత్రానభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

యస్మిన్ సతి అన్యదీయే హానివృద్ధీ స్వస్మిన్నారోప్యేతే తాదృశః అన్యవిషయః తామసవృత్తివిశేషః స్నేహః। సుఖహేతుః యః స్వకళత్రాదిః శుభః। తద్గుణకథనాదిప్రవర్తికా ధీవృత్తిః అభినందః। అత్ర గుణకథనస్య పరప్రరోచనార్థత్వాభావేన వ్యర్థత్వాత్, తద్ధేతుః అభినందః తామసః। అసూయోత్పాదనేన దుఃఖహేతుః పరకీయవిద్యాదిః ఏనం ప్రతి అశుభో విషయః। తన్నిందాప్రవర్తికా ధీవృత్తిః ద్వేషః। సోఽపి తామసః। తన్నిందాయాః నివారణార్థత్వాభావేన వ్యర్థత్వాత్। త ఏతే తామసా ధర్మాః కథం వివేకిని సంభవేయుః?

## భావప్రకాశిక

స్నేహము అనగా ఏ చిత్తవృత్తి ఇతరుల హాని, వృద్ధులను తనమీద ఆరోపించుకొనుటకు కారణమో, అన్యవిషయమగు ఆ తామస వృత్తివిశేషము స్నేహము. ఎవడు, అంతటను అతిగా స్నేహము లేనివాడో, శుభమును పొందినపుడు అభినందనము చేయడో, అశుభమును పొందినపుడు ద్వేషించడో, అతని ప్రజ్ఞ (వివేకము) నిలుకడ గలది. సుఖకారణమగు భార్యాపుత్రాదులు, సుఖవిషయములు. వారి గుణములను చెప్పుటకు ప్రవర్తించు ధీవృత్తి, అభినందము. భార్యాపుత్ర గుణకథనము వలన, పరప్రరోచనము ఉద్దిష్టము కాదు గనుక, వ్యర్థము. కావున ఆ అభినందనము తామసము. పరకీయ విద్యాదులు తనకు అసూయా కారణము అయినందున, దుఃఖ హేతువు లగుటచే, అశుభ విషయములు. వానిని నిందించుటకు ప్రవర్తించు ధీవృత్తి, ద్వేషము. అదిగూడ తామస వృత్తియే. ఆ నిందానివారణార్థము

కాదు గనుక, వ్యర్థము. ఈ తామస ధర్మములు వివేకి యగు స్థిత ప్రజ్ఞునందు ఎట్లు సంభవించును ?

జీవన్ముక్తివివేకః

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః।
ఇన్ద్రియాణి ఇన్ద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 2-58

వ్యుత్థితస్య సమస్తతామసవృత్త్యభావః పూర్వశ్లోకాభ్యాం అభిహితః। సమాహితస్య తు న వృత్తయ ఏవ సన్తి, కుతః తామసత్వశఙ్కేత్యభిప్రాయః।

భావప్రకాశిక

ఎప్పుడైతే ఈసమాహితచిత్తుడు తాబేలు తన అవయవము లను ఉపసంహరించుకొనునట్లు, శబ్ద, స్పర్శాది విషయములనుండి చక్షురాది ఇంద్రియములను పూర్తిగా ఉపసంహరించుకొనునో, అపుడు, అతని ప్రజ్ఞ నిలుకడ గలది అగును. (అతడు స్థిత ప్రజ్ఞుడు).

పూర్వము రెండు శ్లోకముల చేత వ్యుత్థితచిత్తునకు తామస వృత్తులు ఏవియు ఉండవు అని చెప్పబడినది. ఇపుడు, సమాహిత చిత్తునకు విషయాకార వృత్తులన్నిటికి ఉపసంహారము గాన, మనోవృత్తులు సుతరాం (బొత్తుగా) ఉండవు, కావున, తామస వృత్తులు ఉండునేమో అను శంకకు అవకాశ మెక్కడిది? అని అభిప్రాయము.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥ 2-59

ప్రారబ్ధకర్మ సుఖదుఃఖహేతూన్ కాంశ్చిత్ విషయాన్ చన్ద్రోదయ అన్ధకారాదిరూపాన్ స్వయమేవ సంపాదయతి। అన్యాంస్తు గృహక్షేత్రాదీన్ పురుషోద్యోగద్వారేణ। తత్ర చన్ద్ర

ఉదయాదయః పూర్వేణ ఇంద్రియాదిసంహార లక్షణేన సమాధిన ఇవ నివర్తన్తే, నాన్యథా। గృహాదయస్తు సమాధిమన్తరేణాపి నివర్తన్తే, ఆహరణ మాహారః ఉద్యోగః। నిరుద్యోగస్య గృహాది విషయాః। నివర్తన్తే। రసస్తు న నివర్తతే। రసః మానసీ తృష్ణా। సాऽపి పరమానన్దరూపస్య పరస్య బ్రహ్మణః దర్శనే సతి స్వల్పానన్దహేతుభ్యః నివర్తతే। 'కిం ప్రజయా కరిష్యామో యేషాం నోऽయ మాత్మాऽయం లోకః' (బృ. 4-4-22) ఇతి శ్రుతేః।

### భావప్రకాశిక

ఆహారము (పురుషప్రయత్నము) స్వీకరించని దేహధారికి విషయములు నివర్తించును, విషయవాసనలు మిగిలి ఉండును. కాని, ఇతనికి పరమానన్దస్వరూపమగు పరబ్రహ్మయొక్క దర్శనము కలుగగా, ఆ వాసనలు గూడ, నివర్తించును.

ప్రారబ్ధకర్మ, సుఖహేతువులగు చంద్రోదయాది విషయములను, దుఃఖహేతువులగు అంధకారాది విషయము లను స్వయముగానే సంపాదించిపెట్టును. గృహ, క్షేత్రాది రూపములగు విషయములను పురుషప్రయత్నముద్వారా సంపాదించిపెట్టును. వానిలో సర్వజీవసాధారణములు, పరమేశ్వర కృతములును అగు చంద్రోదయాదులు, పూర్వము చెప్పిన విషయములనుండి ఇంద్రియములను ఉపసంహరించుట అను సమాధిచేతనే నివర్తించును.

'ఇంద్రియాణి ఇంద్రియార్థేభ్యః'

మరియొకవిధముగా నివర్తించవు. గృహక్షేత్రాదులైనచో, సమాధి లేక కూడ నివర్తించును. ఇచట, ఆహారము అనగా పూనిక, స్వప్రయత్నము, ఉద్యోగము. ప్రయత్నము లేనివానికి గృహ క్షేత్రాది విషయములు నివర్తించును. వానియందు ప్రీతిమాత్రము

నివర్తించదు. రస మనగా మానసమగు తృష్ణ, అభిలాష. అదియు, పరమానన్దస్వరూప పరబ్రహ్మదర్శనము కలుగగా, స్వల్పానందహేతువులనుండి నివర్తించును.

'కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ
మాత్మాఽయం లోకః।'

ఏ మాకు పరమానన్ద స్వరూపమగు ఆత్మలోకము ప్రాప్తమైనదో, (అనుభవింపబడుచున్నదో) అట్టి మేము పుత్రాధిసంతతిచే మనుష్యలోకజయముతో ఏమి చేయగలము?' అను బృహదారణ్యక శ్రుతివలన ఈ విషయము స్పష్టమగుచున్నది.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ యతతోహ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥ 2-60

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ 2-61

ఉద్యోగత్యాగ బ్రహ్మదర్శనప్రయత్నం కుర్వతోఽపి కాదాచిత్క ప్రమాదపరిహారాయ సమాధ్యభ్యాసః। తదేతత్కిమాసీత ఇతి ప్రశ్నోత్తరమ్।

భావప్రకాశిక

ఓ కుంతీపుత్రా! ఉద్యోగత్యాగ, బ్రహ్మదర్శన ప్రయత్నము చేయునట్టి వివేకి పురుషునకు గూడ, ఇంద్రియములు వివేకమును గూడ త్రోసిపుచ్చగలవు, బలాత్కారముగమనస్సును విషయముల వైపు ఈడ్చుకొనిపోవును. ఆ ఇంద్రియములను అన్నింటిని నియమించి, వశము చేసికొని, సమాహితుడవై, వాసుదేవ పరమాత్మతత్పరుడవై, నిర్వ్యాపారుడవుగా ఉండవలయును. ఇంద్రియములు ఎవని వశమందు ఉండునో, అతడు స్థితప్రజ్ఞుడు.

గృహక్షేత్రాది విషయములను సంపాదించుటకు

ప్రయత్నము చేయక, బ్రహ్మదర్శనము కొరకే ప్రయత్నించుచున్నను, ఒకప్పుడు ప్రమాదవశమున, ఇంద్రియములు మనస్సును విషయములమీదికి తీసికొనిపోవచ్చును. కనుక, ఆ ఏమరుపాటు లేకుండుటకొరకు సమాధ్యభ్యాసము చేయవలయును. ఇది 'కిమాసీత?' అను ప్రశ్నకు ఉత్తరము అయి ఉన్నది.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే॥ 2-92

శ్లో॥ క్రోధాద్ భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశః బుద్ధినాశా త్ప్రణశ్యతి॥ 2-93

అసతి సమాధ్యభ్యాసే ప్రమాదప్రకారః ఉపన్యస్తః। సఙ్గో ధ్యేయవిషయసన్నిధిః। సమ్మోహః వివేకపరాఙ్ముఖత్వమ్। స్మృతి విభ్రమః తత్త్వానుసంధానాభావః। బుద్ధినాశః విపరీతభావనో పచయదోషేణ ప్రతిబద్ధస్య జ్ఞానస్య మోక్షప్రదత్వ సామర్థ్యాభావః।

భావప్రకాశిక

భోగ్య విషయములను నిరంతరము తలంచు పురుషునకు ఆ విషయములందు ప్రీతి జనించును. ఆ సంగము వలన, ఆ విషయములను పొందుటకు కామము, అనగా ఉత్కటాభిలాష కలుగును. కామము ప్రతిబద్ధమైనపుడు దానివలన, క్రోధము జనించును. క్రోధమువలన యుక్తాయుక్త విచక్షణజ్ఞానమును కోల్పోవును. సమ్మోహము వలన, తత్త్వానుసంధానమునకు విభ్రమము, అనగా భ్రంశము కలుగును. స్మృతిభ్రంశము వలన బుద్ధినాశము కలుగును. బుద్ధినాశము వలన, పురుషార్థసాధనకు దూరుడగును.

'స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశా త్ప్రణశ్యతి।'

సమాధియొక్క అభ్యాసము లేకపోయినపుడు కలుగునట్టి

ప్రమాదప్రకారము ఇచట ఉపన్యసింపబడినది. సంగము అనగా ధ్యేయవిషయ సన్నిధానము. సమ్మోహము అనగా, వివేకమునకు పరాఙ్ముఖుడగుట. స్మృతివిభ్రమము అనగా, తత్త్వానుసంధానము లేకపోవుట. బుద్ధినాశ మనగా, విపరీతభావనాభివృద్ధిదోషముచేత ప్రతిబద్ధమగు జ్ఞానమునకు మోక్షము నిచ్చు సామర్థ్యము లేక పోవుట.

### జీవన్ముక్తివివేకః

శ్లో॥ రాగద్వేషవియుక్తైస్తు విషయా నిన్ద్రియైశ్చరన్।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥ 2-94

విధేయాత్మత్వం వశీకృతమనస్త్వమ్। ప్రసాదో నైర్మల్యం బన్ధరాహిత్యమ్। సమాధ్యభ్యాసయుక్తః తద్వాసనాబలాత్ వ్యుత్థానదశాయా మిన్ద్రియైః వ్యవహరన్నపి ప్రసాదం సమ్యక్ ప్రాప్నోతి। తదేతత్కిం ప్రజేతేతి ప్రశ్నోత్తరమ్। ఉపరితనేనాపి బహునా గ్రన్థేన స్థితప్రజ్ఞః ప్రపఞ్చితః। నను ప్రజ్ఞాయాః స్థిత్యుత్పత్తిభ్యాం ప్రాగపి సాధనత్వేన రాగద్వేషాదిరాహిత్యం అపేక్షితమ్। బాఢమ్; తథాఽప్యస్తి విశేషః, స చ శ్రేయోమార్గ కారైః దర్శితః।

శ్లో॥ విద్యాస్థితయే ప్రాక్ యే సాధనభూతాః
ప్రయత్ననిష్పాద్యాః।
లక్షణభూతాస్తు పునః స్వభావతస్తే స్థితాః స్థితప్రజ్ఞే॥

శ్లో॥ జీవన్ముక్తి రితీమాం వదన్త్యవస్థాం
స్థితాత్మసంబోధామ్।
బాధిత భేదప్రతిభా మబాధిత
ఆత్మావబోధ సామర్థ్యాత్॥ ఇతి,

### భావప్రకాశిక

స్థితప్రజ్ఞుడు ప్రారబ్ధకర్మవశమున, వ్యుత్థానదశలోనికి

వచ్చినపుడు, రాగ, ద్వేషములు లేక, తనకు వశములో ఉన్న ఇంద్రియములచే విషయములను అనుభవించుచున్నను, మనస్సు వశమునందున్నవాడై, బంధరాహిత్యమును పొందుచున్నాడు.

విధేయాత్మత్వము అనగా, వశమునందున్న మనస్సు కలిగి ఉండుట. ప్రసాద మనగా, నైర్మల్యము, బంధరాహిత్యము. సమాధి అభ్యాసముకలవాడు ఆ వాసనాబలమువలన వ్యుత్థానదశ యందు ఇంద్రియములతో వ్యవహరించుచున్నను, చిత్తనైర్మల్య మును కోల్పోవడు, బంధమునకు లోను కాడు. ఇది 'కిం ప్రవ్రజేత' అను ప్రశ్నకు ఉత్తరము. ఇంకను, తరువాత బహుగ్రంథము చేత స్థితప్రజ్ఞుడు విస్తారముగా వివరింపబడి ఉన్నాడు.

ఓయీ! తత్త్వజ్ఞానోత్పత్తికి, స్థితికి పూర్వము గూడ, రాగ, ద్వేషాది రాహిత్యమును సాధనముగా అభ్యసించి ఉన్నాడు కదా!

అవును. అయినను, పూర్వ రాగ, ద్వేషరాహిత్యమునకు, ప్రజ్ఞానంతరము కలిగిన రాగ, ద్వేషరాహిత్యమునకు భేదము కలదు. ఆ విశేషము శ్రేయోమార్గకారులచే చూపబడినది.

తత్త్వజ్ఞానస్థితికొరకు సాధనభూతములు, ప్రయత్నముతో సంపాదింపదగిన లక్షణములు ఏవి కలవో, అవి స్థితప్రజ్ఞునందు స్వాభావికములగును.

ఆత్మజ్ఞాననిష్ఠ గల ఈ అవస్థను అబాధితముగా ఆత్మతత్త్వ సాక్షాత్కారము యొక్క సామర్థ్యము వలన, భేదావభాసము బాధితము కాగా, జీవన్ముక్తి అని చెప్పుచున్నారు.

**జీవన్ముక్తివివేకః**

భగవద్భక్తో ద్వాదశాధ్యాయే భగవతా వర్ణితః —

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।

భా. ప్ర. 11 ]

నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ॥ 12-93
శ్లో॥ సన్తుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధిః యో మద్భక్తః స మే ప్రియః॥
12-14. ఇతి।

ఈశ్వరార్పిత మనస్త్వేన సమాహితస్య అన్యానుసంధానాభావాత్, వ్యుత్థితస్యాపి ఉదాసీనానుసంధానేన హర్షవిషాదాభావాచ్చ సుఖదుఃఖసామ్యమ్।ఏవం వక్ష్యమాణేష్వపి ద్వంద్వేషు ద్రష్టవ్యమ్।

శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకః లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్ష భయోద్వేగైః ముక్తో యః స చ మే ప్రియః॥
శ్లో॥ అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనః గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః॥
శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యః స చ మే ప్రియః॥
శ్లో॥ సమ శ్శత్రౌ చ మిత్రౌ చ తథా మానావమానయోః।
శీతోష్ణ సుఖదుఃఖేషు సమః సఙ్గవివర్జితః॥
శ్లో॥ తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సన్తుష్టో యేనకేనచిత్।
అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః॥ ఇతి।

అత్రాపి పూర్వవద్విశేషః వార్తికకారైః దర్శితః-

శ్లో॥ ఉత్పన్నాత్మప్రబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః।
అయత్నతో భవన్త్యస్య న తు సాధనరూపిణః॥ ఇతి।

భావప్రకాశిక

భగవద్గీతాగ్రంథమునందు ద్వాదశాధ్యాయమున, శ్రీకృష్ణ భగవానునిచే భగవద్భక్తుడు ఇట్లు వర్ణింపబడెను-

'సర్వప్రాణులందు మైత్రి కలవాడు, ద్వేషము లేనివాడు, దయ కలవాడు, అహంకార, మమకారములు లేనివాడు, దుఃఖ, సుఖములను సమముగా చూచువాడు, ఓరిమి కలవాడు, నిత్య

సంతోషి, యోగి, వశమునందున్న మనస్సు గలవాడు, దృఢ నిశ్చయము కలవాడు, మనోబుద్ధులను నాయందే అర్పించిన వాడును అగు ఏ నా భక్తుడు కలడో, అతడు నాకు ఇష్టుడు'.

మనస్సును ఈశ్వరార్పణ మొనర్చుటచేతను, ఇతర విషయానుసంధానము లేకపోవుటచేతను, సమాహితునకు సుఖ, దుఃఖసామ్యము. వ్యుత్థిత చిత్తునకైనచో ఉదాసీనభావానుసంధానమువలన, హర్ష, విషాదములు ఉండవు గనుక, సుఖ, దుఃఖ సామ్యము. ఈవిధముగానే ముందు చెప్పబోవు ద్వంద్వములందు గూడ, గ్రహింపవలయును.

ఎవరివలన, లోకము కలవరము నొందదో, ఎవడు లోకము వలన కలత నొందడో, ఎవరు హర్షము, కోపము, భయము, ఉద్వేగము లేనివాడో, ఆ భక్తుడు నాకు ఇష్టుడు.

ఏమియు కోరనివాడు, పరిశుద్ధుడు, సమర్థుడు, ఉదాసీనుడు, చింత లేనివాడు, అన్ని పనులను మానినవాడు ఎవడో, అట్టి భక్తుడు నాకు ఇష్టుడు.

హర్షము, ద్వేషము, శోకము, కాంక్ష లేనివాడు, శుభాశుభములను పరిత్యజించినవాడు నగు భక్తుడు నాకు ఇష్టుడు.

శత్రుమిత్రులందును, మానావమానములందును, సమ మనఃస్థితి గలవాడు, శీతోష్ణములందు, సుఖదుఃఖాదులందు సముడు (తితిక్ష కలవాడు), సంగము లేనివాడు, నిందాస్తుతులను సమముగా నెంచువాడు, మౌనము కలవాడు, దేః సంతోషించువాడు, స్థిరనివాసము లేనివాడు, స్థిరమైన బుద్ధిగల వాడును అగు భక్తుడు నాకు ఇష్టుడు.

ఇచటగూడ, వార్తికకారులచే వెనుకటివలె విశేషము చూపబడినది–

"ఉత్పన్నాత్మప్రబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః।
అయత్నతో భవన్త్యస్య న తు సాధనరూపిణః॥"

ద్వేషము లేకపోవుట, సర్వభూతమైత్రి, భూతదయ మొదలగు గుణములు ఆత్మతత్త్వజ్ఞానికి అయత్నసిద్ధములు, స్వాభావికములు. తత్త్వజ్ఞానప్రాప్తికి పూర్వము, సాధకునకు సాధనరూపములో నుండును అని భావము.

జీవన్ముక్తివివేకః

గుణాతీతః చతుర్దశాధ్యాయే వర్ణితః –
అర్జున ఉవాచ :
శ్లో॥ కైర్లిఙ్గైస్త్రీన్గుణానేతాన్ అతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతాన్ త్రీన్ గుణా నతివర్తతే॥

త్రయోగుణాః సత్త్వరజస్తమాంసి; తేషాం పరిణామవిశేషాత్ సర్వసంసారః ప్రవర్తతే। అతః గుణాతీతత్వం అసంసారిత్వమ్, జీవన్ముక్తత్వమితి యావత్। లిఙ్గాని పరేషాం ఏతదీయ గుణాతీతత్వబోధకాని, ఆచారః తదీయ మనఃసంచారప్రకారః। కథమితి సాధనప్రకారప్రశ్నః।

భావప్రకాశిక

గుణాతీతుడు చతుర్దశాధ్యాయమునందు వర్ణింపబడెను. ఆ ప్రసంగమున, అర్జునుడు ఇట్లు ప్రశ్నించెను–

'ఓ కృష్ణపరమాత్మా! మూడు గుణములను– సత్త్వ, రజ, స్తమస్సులను అతిక్రమించినవాడు ఏ చిహ్నముచే తెలియుబడు చున్నాడు? అతని ఆచరణము, అనగా మనఃసంచారము ఎట్లుండును ? ఏ సాధనములచేత మూడు గుణములను అతిక్రమించును ?

మూడు గుణములు అనగా సత్త్వ, రజ, స్తమస్సులు. ఆ గుణముల పరిణామవిశేషము వలననే, సమస్త సంసారము

ప్రవర్తించును. కనుక, గుణాతీతత్వ మనగా అసంసారిత్వము. జీవన్ముక్తత్వము అని నిశ్చితార్థము. లిఙ్గములు అనగా, ఇతరులకు ఇతని గుణాతీతత్వమును తెలియజేయునవి. ఆచారము- ఆచరణము, ఆ గుణాతీతునియొక్క మనస్సంచారము ఎట్లు ఉండును? అని సాధనప్రశ్న అయి ఉన్నది.

జీవన్ముక్తివివేకః

శ్రీ భగవానువాచ-

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥

శ్లో॥ ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే॥

శ్లో॥ సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాఞ్చనః।
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిన్దాత్మసంస్తుతిః॥

శ్లో॥ మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే॥

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥

భావప్రకాశిక

శ్రీకృష్ణభగవానుడు ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను-

ఓ పాండుపుత్రా! ఎవడు సత్త్వరజస్తమోగుణ కార్యములగు ప్రకాశ, ప్రవృత్తి, మోహములను, ప్రవృత్తములైనవానిని ద్వేషించడో, నివృత్తములైనవానిని కాంక్షింపడో,

ఉదాసీనునివలె కూర్చున్నవాడై గుణములచే చలింపచేయబడడో, గుణములు (ఇంద్రియములు) గుణములందు (విషయములు అందు) ప్రవర్తించుచున్నవే కాని, నేను ప్రవర్తించుటలేదు, అను వివేకముతో ఔదాసీన్యమును వహించుచున్నా, నేనే చేయు

చున్నాను అని అధ్యాసతో చలించడో,

సుఖ, దుఃఖములను సమముగా చూచునో, స్వరూపస్థితుడగుచు, మట్టిగడ్డ, రాయి, బంగారములను సమముగా చూచునో, ఇష్టానిష్టములు సమములో, వివేకవంతుడో, తనను నిందించినను స్తుతించినను వికారము నొందడో,

గౌరవావమానములందు సముడో, మిత్ర, శత్రు పక్షములందు సమవర్తియో, ఫలాపేక్షతో గూడిన అన్ని పనులు మానినవాడో, అతడు గుణాతీతుడు అని చెప్పబడును.

ఎవడు నన్ను నిత్యము భక్తి, జ్ఞాన, ధ్యానాభ్యాసముచేత సేవించునో, అతడు ఈ సత్త్వ, రజ, స్తమోగుణములను మూడింటిని దాటి (గుణాతీతుడై) బ్రహ్మభావమును పొందును.

## జీవన్ముక్తివివేకః

ప్రకాశప్రవృత్తిమోహాః సత్త్వరజస్తమోగుణాః। తే చ జాగ్రత్స్వప్నయోః ప్రవర్తన్తే; సుషుప్తి సమాధి శూన్యచిత్తవృత్త్యవస్థాసు నివర్తన్తే। ప్రవృత్తిశ్చ ద్వివిధా, అనుకూలా ప్రతికూలా చేతి। తత్ర మూఢో జాగరణే ప్రతికూలప్రవృత్తిం ద్వేష్టి, అనుకూలప్రవృత్తిం కాంక్షతి। గుణాతీతస్య తు అనుకూలప్రతికూలాధ్యాసాభావాత్ ద్వేషాకాంక్షే న స్తః। యథా ద్వయోః కలహం కుర్వతోః అవలోకయితా కశ్చిత్ తటస్థః స్వయం కేవలం ఉదాస్తే, న తు జయపరాజయాభ్యాం ఇతస్తతశ్చాల్యతే। తథా గుణాతీతః వివేకీ స్వయం ఉదాస్తే। 'గుణా గుణేషు వర్తన్తే। నత్వహమ్' ఇతి వివేకాత్ ఔదాసీన్యమ్। అహమేవ కరోమి ఇత్యధ్యాసః విచలనమ్। నచాస్య తదస్తి। తదిదం కిమాచార ఇతి ప్రశ్నస్య ఉత్తరమ్। సమదుఃఖసుఖాదీని లిఙ్గాని, అవ్యభిచారి భక్తిసహిత జ్ఞానధ్యానాభ్యాసేన పరమాత్మసేవా చేతి గుణాత్యయ సాధన ప్రశ్నస్య ఉత్తరమ్॥

## భావప్రకాశిక

ప్రకాశ, ప్రవృత్తి, మోహములు సత్త్వ, రజ, స్తమోగుణ కార్యములు. అవి జాగ్రత్స్వప్నములందు ప్రవర్తించును. సుషుప్తి, సమాధి, చిత్తవృత్తిశూన్యావస్థలందు నివర్తించును. ప్రవృత్తి, ప్రతికూలము, అనుకూలము అని రెండు విధములు. మూఢుడు (అజ్ఞజనుడు, సంసారి) జాగరణమున, ప్రతికూల ప్రవృత్తిని ద్వేషించును, అనుకూలప్రవృత్తిని కాంక్షించును. గుణాతీతునకు ఇది అనుకూలము, ఇది ప్రతికూలము అను అధ్యాస లేనందువలన, ద్వేష, కాంక్షలు రెండును ఉండవు. లోకములో ఇరువురు కలహించుకొనుచున్నపుడు, అది చూచుచున్న తటస్థుడు తాను కేవలము ఉదాసీనుడుగానే ఉండును. వారి జయాపజయ ముల వలన ఇటునటు చలించడు. వివేకియగు గుణాతీతుడు కూడ స్వయముగా ఉదాసీనుడుగానే ఉండును. 'ఇంద్రియములు విషయములందు ప్రవర్తించుచున్నవి, నేను కాదు' అను వివేకము వలన ఉదాసీనస్వరూపముతో నుండును. నేనే చేయుచున్నాను అను అధ్యాస విచలనము. ఆ అధ్యాస, గుణాతీతునకు లేదు.

ఇది 'కిమాసీత' అను ప్రశ్నకు సమాధానము.

'సమదుఃఖసుఖః, స్వస్థః' మొదలైనవి గుణాతీతుడు అని తెలిసికొనుటకు లింగములు- చిహ్నములు; ఎడతెగకుండా నిత్యము భక్తి, జ్ఞాన, ధ్యానాభ్యాసము చేత, పరమాత్మ సేవ. ప్రకృతిగుణములను ఎట్లు అతిక్రమించుట? అను సాధన ప్రశ్నకు ఉత్తరము.

## జీవన్ముక్తివివేకః

బ్రాహ్మణో వ్యాసాదిభి ర్వర్ణితః-

శ్లో॥ అనుత్తరీయవసన మనుపస్తీర్ణశాయినమ్।

బాహూపధాయినం శాన్తం తం దేవా బ్రాహ్మణం విదుః॥
మ. భా. అను 25

బ్రాహ్మణశబ్దః బ్రహ్మవిద్వాచీతి 'అథ బ్రాహ్మణః' ఇతి శ్రుత్యా వర్ణితః, బ్రహ్మవిదశ్చ విద్వత్సంన్యాసాధికారాత్। 'యథా జాతరూపధరః నాచ్ఛాదనం చరతి పరమహంసః' ఇత్యాది శ్రుత్యా పరిగ్రహరాహిత్యస్య ముఖ్యత్వాభిధానాత్ అనుత్తరీయత్వాదికం తస్య యుక్తమ్।

భావప్రకాశిక

మోక్షధర్మము మొదలైనవానియందు వ్యాసుడు మొదలగు మహానుభావులచే బ్రాహ్మణుడు ఇట్లు వర్ణింపబడెను.

పైన ఉత్తరీయము లేనివానిని, కటిక నేలమీద భుజమునే దిండుగా చేసికొని పరుండువానిని, శాంతుడైనవానిని బ్రాహ్మణునిగా దేవతలు తెలిసికొనుచున్నారు.

ఇచట 'బ్రాహ్మణ' శబ్దము బ్రహ్మవేత్తను తెలుపును.

"పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్, పాండిత్యం చ బాల్యం చ నిర్విద్య అథ మునిః, అమౌనం చ మౌనం చ నిర్విద్య అథ బ్రాహ్మణః।"

అని బృహదారణ్యకశ్రుతిలో, పాండిత్య, బాల్య, మౌన శబ్దముల చేత శ్రవణ, మనన, నిదిధ్యాసనములనువానిని సాధనములనుగా చెప్పి, పిమ్మట అట్టివాడు బ్రాహ్మణుడు అగును అని బ్రహ్మవేత్త 'బ్రాహ్మణ' శబ్దముచేత వర్ణింపబడినాడు. బ్రహ్మజ్ఞానికి విద్వత్ సంన్యాసాధికారము. 'పరమహంస జన్మించినప్పుడు గల రూపమును ధరించును, ఆచ్ఛాదనము లేకుండా సంచరించును' అను శ్రుతిచే 'పరిగ్రహము' లేకపోవుట ముఖ్యము అని చెప్పబడి నందున, ఉత్తరీయము లేకపోవుట, ఆస్తరణము లేని భూమిమీద

పరుండుట, బాహువునే మడచి దిండుగా చేసికొనుట ఇతనియందు యుక్తమగుచున్నది.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ యేన కేనచి దాచ్ఛన్నః యేన కేనచి దాశితః।
యత్ర క్వచన శాయీ స్యాత్ తం దేవా బ్రాహ్మణం విదుః॥

దేహనిర్వాహాయ అశన, ఆచ్ఛాదన, శయన స్థానాపేక్షాయామపి అశనాదిగతా గుణదోషా నాన్వేష్యతే। ఉదరపూరణ పుష్ట్యాదిరూపస్య నిర్వాహస్య సమత్వాత్ నిష్ప్రయోజనస్య గుణదోషవిచారస్య చిత్తదోషత్వాత్।

భావప్రకాశిక

ఏదో ఒక వసనముతో శరీరమును కప్పుకొనుచు, ఏదో ఒక ఆహారమును శరీరము నిల్పబడుటకు తీసికొనుచు, ఎచ్చటనో ఒక చోట పరుండుచు ఉన్నవానిని 'బ్రాహ్మణుడు' అని దేవతలు తలంచుచున్నారు.

దేహము నిలబడుటకొరకు ఆహారము, వసనము, శయనము, వాసస్థానము అపేక్షితము కావున వానిని స్వీకరించునపుడు వాని యందు గల గుణ, దోష విచారణ చేయకుండా గ్రహించవలయును. ఉదరపూరణము, పుష్టి మొదలగు దేహనిర్వాహము సమమే గనుక, వానియందు గుణదోషవిచారము నిష్ప్రయోజనము. ఇదియుగాక, అట్లు గుణదోషవిచారము చేసినచో చిత్తదోషముగా గ్రహించ పరిగణింపబడును.

జీవన్ముక్తివివేకః

అతఏవ భాగవతే పఠ్యతే—

శ్లో॥ కిం వర్ణితేన బహునా లక్షణం గుణదోషయోః।
గుణదోషదృశిర్దోషః గుణస్తూభయవర్జితః॥ ఇతి

భా. స్క. 12 ]

శ్లో॥ కన్థా కౌపీనవాసాస్తు దండధృగ్ ధ్యానతత్పరః।
ఏకాకీ రమతే నిత్యం తం దేవా బ్రాహ్మణం విదుః॥
మ. భా. అను. 251

బ్రహ్మోపదేశాదినా ప్రాణ్యనుజిఘృక్షాయాం ఉత్తమత్వ జ్ఞాపనేన శ్రద్ధా ముత్పాదయితుం దండకౌపీనాది లింగ్గం ధారయేత్। 'కౌపీనం దండ మాచ్ఛాదనం చ స్వశరీరోపభోగార్థాయ లోకస్య ఉపకారార్థాయ చ పరిగ్రహేత్' ఇతి శ్రుతేః। అనుజిఘృక్షయాఽపి తదీయాం స్వయం గృహకృత్యాదివార్తాం న కుర్యాత్, కింతు ధ్యానపరో భవేత్। 'తమేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో విముంచథ।' ము ఉ 2-2-5 ఇతి శ్రుతేః।

శ్లో॥ తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః।
నానుధ్యాయాద్ బహూన్ శబ్దా న్వాచో విగ్లాపనం హి తత్॥
బృ. ఉ. 44-21 ఇతి శ్రుతేశ్చ।

బ్రహ్మోపదేశస్తు అన్యా వాక్ న భవతీతి న ధ్యానవిరోధీ। తచ్చ ధ్యానం ఏకాకిత్వే నిర్విఘ్నం సంభవతి।

భావప్రకాశిక

ఇందువలననే భాగవతమునందు ఇట్లు పఠింపబడినది-

"కిం వర్ణితేన బహునా లక్షణం గుణదోషయోః।
గుణదోషదృశిర్దోషః గుణస్తూభయవర్జితః॥"

గుణదోషముల లక్షణమును విస్తారముగా వర్ణించుటచేత ఏమి ప్రయోజనము? ఇది గుణము, అది దోషము అను దృష్టియే దోషము. గుణదోషచింతను విడనాడుటయే ముఖ్యమైన గుణము అని భావము.

బొంత, కౌపీనము, దండము ధరించినవాడై, ఎల్లప్పుడు బ్రహ్మధ్యానతత్పరుడగుచు, ఎవరు ఒంటరిగా నిత్యము ఆనందించుచుండునో, అతడు బ్రాహ్మణుడు అని దేవతలు

తలంచుచున్నారు.

బ్రహ్మోపదేశాదులచే ప్రాణులను అనుగ్రహింపదలచినపుడు ఉత్తముడు అని తెలియజేయుచు శ్రద్ధను కలిగించుటకు దండ, కౌపీనాది లిఙ్గములను ధరింపవలయును. కౌపీనము, దండము, ఆచ్ఛాదనవస్త్రము, తన శరీరోపభోగముకొరకును, లోకోపకారము కొరకును, పరిగ్రహించవలెను అని శ్రుతిప్రమాణము కలదు.

అనుగ్రహేచ్ఛ కలిగినపుడు గూడ, ఎవరు ఉపదేశము పొందదలచిరో, వారియొక్క గృహకృత్యాది వార్తలను స్వయముగా అడుగరాదు. తాను, ధ్యానపరుడై ఉండవలెను.

"తమేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో విముంచథ।"
'ఆ ఏకాత్మను తెలిసికొనుడు, తక్కిన మాటలను వదలిపెట్టుడు' అని శ్రుతి ప్రమాణమువలన అవగత మగుచున్నది.

"తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః।
నానుధ్యాయా ద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్॥"
'వివేకి అయిన బ్రాహ్మణుడు ఆ ఆత్మనే తెలిసికొని తత్త్వజ్ఞాన నిష్ఠుడు కావలెను. ఇతర ప్రసంగములన్ను, బహుశబ్దములను మనస్సులోనికి రానీయరాదు అని బృహదారణ్యక శ్రుతి నుడువు చున్నది.

ఇతర శబ్దములను ఉచ్చరించినచో, అది వాగింద్రియ శోషణము, వృథాప్రయాస' అని చెప్పునట్టి శ్రుతివచనమువలన సంన్యాసి సంసారిజనుల వార్తలను అడుగరాదు.

బ్రహ్మోపదేశమైనచో ఇది, అవ్యవస్థైన వాక్కు కాదు గనుక, బ్రహ్మధ్యానమునకు విరోధి కాదు. ఆ ధ్యానము తాను ఒంటరిగా నున్నపుడు నిర్విఘ్నముగా సంభవించును.

**జీవన్ముక్తివివేకః**

అత ఏవ స్మృత్యన్తరేఽభిహితమ్-

శ్లో॥ ఏకో భిక్షు ర్యథోక్తః స్యాద్ ద్వావేవ మిథునం స్మృతమ్।
త్రయో గ్రామః సమాఖ్యాతః ఊర్ధ్వం తు నగరాయతే॥

శ్లో॥ నగరం న హి కర్తవ్యం గ్రామో వా మిథునం తథా।
రాజాదివార్తా తేషాం స్యాద్ భిక్షావార్తా పరస్పరమ్॥ ఇతి।

**భావ ప్రకాశిక**

ఈ కారణము వలననే, మరియొక స్మృతియందు వెనుక చెప్పిన భిక్షువు, ఒక్కడుగానే ఉండవలెను, ఇద్దరైనచో 'మిథునము' అందురు. ముగ్గురైనచో, 'గ్రామము' అని అందురు. నలుగురు, అటుపైన, 'నగరము' అగును.

సంన్యాసి నగరము చేయరాదు. గ్రామముగా పనికిరాదు. అట్లే, మిథునము కూడ; మంచిది కాదు. నలుగురు చేరినచో రాజకీయము, వార్తలు చోటుచేసికొనును. లేదా; ఒకరితో నొకరు తమ భిక్షావార్తలను చెప్పుకొందురు అని భావము.

**జీవన్ముక్తివివేకః**

శ్లో॥ నిరాశిష మనారంభం నిర్నమస్కార మస్తుతిమ్।
అక్షీణం క్షీణకర్మాణం తం దేవా బ్రాహ్మణం విదుః॥

మ. భా. అను 251

విశిష్టైః సంసారిభిః ప్రణమతాం పురుషాణా మాశీర్వాదః ప్రయుజ్యతే। యస్య యదపేక్షితం తం తం ప్రతి తదభివృద్ధి ప్రార్థన మాశీః। తథాచ పురుషాణాం భిన్నరుచిత్వాత్ తదభిమతాన్వేషణే వ్యగ్రచిత్తస్య లోకవాసనా వర్ధతే। సా చ జ్ఞానవిరోధినీ। తథాచ స్మృత్యన్తరే—

శ్లో॥ లోకవాసనయా జన్తోః శాస్త్రవాసనయాఽపి చ।
దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే॥

ఏతచ్చ ఆరంభ నమస్కారాదిష్వపి ద్రష్టవ్యమ్। ఆరంభః స్వార్థం పరోపకారార్థం వా గృహక్షేత్రాది సంపాదనప్రయత్నః।

తావేతౌ ఆశీర్వాదారంభౌ ముక్తేన త్యాజ్యౌ। న చ ఆశీర్వాదా భావే ప్రణమతాం నృణాం ఖేదః శంకనీయః। లోకవాసనా ఖేదయోః ఉభయోః పరిహారాయ నిఖిలాశీర్వాద ప్రతినిధిత్వేన నారాయణశబ్దప్రయోగాత్। ఆరంభస్తు సర్వోఽపి దుష్ట ఏవ। తథా చ స్మృతిః—

శ్లో॥ సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః।
భ. గీ 18–48 ఇతి।

భావ ప్రకాశిక

ఆశీర్వాదము చేయనివాడును, తనకొరకుగాని, ఇతరుల కొరకుగాని, గృహక్షేత్రాది సంపాదనయత్నము చేయనివాడును, నమస్కారము చేయనివాడును, స్తుతించనివాడును, దైన్యము లేనివాడును, విధి, నిషేధాతీతుడును అగువానిని బ్రాహ్మణునిగా దేవతలు తలంచుచున్నారు.

లోకమున, నమస్కరించు పురుషులకు పెద్దలగు సంసారి జనులచే ఆశీర్వాదము చేయబడుచున్నది. ఎవ్వడు ఏది కోరు కొనునో, దాని అభివృద్ధిని ప్రార్థించుట ఆశీస్సు. అట్లు కాగా, పురుషుడు వేరు వేరు అభిరుచులు కలిగియుండును గనుక, వారి అభిమతమును కనుగొనుటకు చిత్తము వ్యగ్రమై లోకవాసన పెరుగును. అది, జ్ఞానమునకు విరోధి.

మఱియొక స్మృతిలో ఇట్లు చెప్పబడినది— ప్రాణికి లోక వాసనచేతను, శాస్త్రవాసనచేతను, దేహవాసనచేతను, జ్ఞానము సరిగా కలుగనేరదు. ఇది ఆరంభ, నమస్కారాదులయందు గూడ సమానమే అని తలంచవలెను. ఆరంభ మనగా, తనకొరకుగాని, పరోపకారముకొరకు గాని, గృహక్షేత్రాది సంపాదన ప్రయత్నము. ఈ యీ ఆశీర్వాద, ఆరంభములు జీవన్ముక్తసన్న్యాసిచే విడిచిపెట్ట దగినవి. ఆశీర్వదించకపోయినచో నమస్కరించునట్టి మనుజులకు

మనస్సులో ఖేదము కలుగదా? అని శంకించరాదు. కనుకనే, లోక వాసనా, ఖేదములను రెంటిని పరిహరించుటకొరకు ఆశీర్వాదము లన్నిటికి ప్రతినిధిగా 'నారాయణ' అను శబ్దము ప్రయోగింప బడుచున్నది. గృహ, క్షేత్ర సంపాదనప్రయత్నము దోష యుక్తము గనుక, మంచిది కాదు. అట్లే, స్మృతి-

"సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః।"

ధూమముచే అగ్నివలె అన్నికార్యములు దోషముతో ఆవరింప బడినవి అని చెప్పుచున్నది.

## జీవన్ముక్తి వివేకః

నమస్కారోఽపి వివిదిషాసంన్యాసినోఽభిహితః -

శ్లో॥ యో భవేత్ పూర్వసంన్యాసీ తుల్యోవై ధర్మతో యది।
తస్మై ప్రణామః కర్తవ్యో నేతరాయ కదాచన॥ ఇతి।

తత్ర పూర్వత్వధర్మతుల్యత్వవిచారే చిత్తం విక్షిప్యతే అతఏవ నమస్కారమాత్ర ఏవ బహవః కలహాయమానా ఉప లభ్యన్తే। తత్ర నిమిత్తం వార్తికకారై ర్దర్శితమ్।'

శ్లో॥ ప్రమాదినో బహిశ్చిత్తాః పిశునాః కలహోత్సుకాః।
సంన్యాసినోఽపి దృశ్యన్తే దైవసందూషితాశయాః॥

1-1584 ఇతి।

ముక్తస్య నమస్కారాభావో భగవత్పాదైర్దర్శితః।

శ్లో॥ నామాదిభ్యః పరే భూమ్ని స్వారాజ్యే చేత్ స్థితోఽద్వయే।
ప్రణమేత్ కం తదాత్మజ్ఞో న కార్యం కర్మణా తదా॥

ఉప. 17-64 ఇతి।

## భావ ప్రకాశిక

నమస్కారము గూడ, వివిదిషాసంన్యాసికి చెప్పబడినది.

'ఏ సంన్యాసి, తనకంటె పూర్వము సంన్యాసమును స్వీకరించెనో, అతడు సమాన ధర్మము కలవాడైనచో, ఆ

సంన్యాసికి నమస్కారము ఆచరించవలెను, ఇతరునకు ఎప్పుడును నమస్కరించరాదు'.

అచట, నాకంటె పూర్వమునందు సంన్యాసము తీసికొనిరా, లేదా ? సమానధర్మము కలవారు అగుదురా, కాదా ? అని విచారించుటలో చిత్తము, విక్షేపము నొందును. కనుకనే, కేవల నమస్కారము కొరకు పలువురు సంన్యాసులు కలహించుకొనువారు కన్పడుచున్నారు. దానికి కారణము వార్తికకారులచే-

సంన్యాసులు కూడ, ఏమరుపాటు కలవారు, బహిర్ముఖులు, పరుల దోషము నుగ్గడించువారు, కలహప్రియులు, దైవము (పురాకృతకర్మ) చేత మలినమైన అంతఃకరణము కలవారై గోచరించుచున్నారు అని చూపబడినది.

ముక్తునకు నమస్కారము లేకపోవుట శ్రీమత్ శంకర భగవత్పాదులచే ప్రదర్శింపబడినది.

"నామాదిభ్యః పరే భూమ్ని స్వారాజ్యే చేత్ స్థితోఽద్వయే।
ప్రణమేత్ కం తదాత్మజ్ఞో న కార్యం కర్మణా తదా॥"

'నామ, బ్రహ్మ ఉపాసనలకంటె ఉత్కృష్టమైన భూమా, బ్రహ్మ యగు అపరిచ్ఛిన్న స్వప్రకాశ సుఖస్వరూపమునందు ఉన్న ఆత్మజ్ఞుడు (జీవన్ముక్తుడు) అపుడు ఎవరికి నమస్కరించును ? అప్పుడు నమస్కారముతో పని లేదు'.

జీవన్ముక్తి వివేకః

చిత్తకాలుష్యహేతోర్న్నమస్కారస
సామ్యబుద్ధ్యా ప్రసాదహేతుర్న్నమస్కార
తథా చ స్మృతిః-

శ్లో॥ ఈశ్వరో జీవకలయా ప్రవిష్టో భగవా
ప్రణమేద్ దండవద్ భూమా వాశ్వ

స్తుతి ర్మనుష్యవిషయా ప్రతిషిధ్యతే, న త్వీశ్వరవిషయా।
తథాచ బృహస్పతిస్మృతిః–

శ్లో॥ ఆదరేణ యథా స్తౌతి ధనవన్తం ధనేచ్ఛయా।
తథా చేద్ విశ్వకర్తారం కో న ముచ్యేత బన్ధనాత్॥ ఇతి।

భావప్రకాశిక

చిత్తకాలుష్యమునకు కారణమగు నమస్కారము ప్రతిషేధించినను, సర్వసమత్వబుద్ధితో చిత్తనైర్మల్యమునకు కారణమగు నమస్కారము అంగీకరింపబడుచున్నది. అందు, భాగవతస్మృతి ప్రమాణము–

'జీవకళతో ఈశ్వరుడు ప్రవేశించినవాడు భగవంతుడే. కావున, సమస్త ప్రాణులకు (కుక్క, చండాలుడు, గోవు, గాడిద) భూమిమీద సాష్టాంగదండప్రణామము ఆచరించవలెను' అని భాగవతవచన భావము.

నమస్కారము చేయరాదు అను స్మృతి, మనుష్యవిషయము, ఈశ్వరవిషయము కాదు. ఈ విషయమున, స్మృతి కలదు–

'లోకమున, ధనమునందు కోరికతో ధనికునివద్దకు వెళ్ళి, ఆదరముతో ఎట్లు స్తుతించునో, ఆవిధముగా సృష్టికర్తయగు భగవంతుని ఆదరముతో స్తుతించినచో, ఎవడు సంసారబంధము నుండి ముక్తుడు కాకుండును?'

జీవన్ముక్తివివేకః

అక్షీణత్వ మదీనత్వమ్। అత ఏవ స్మృతిః–

శ్లో॥ అలబ్ధ్వా న విషాదీ స్యాత్ కాలే యద్యశనం క్వచిత్।
లబ్ధ్వా న హృష్యే ద్ధృతిమా నుభయం దైవతన్త్రితమ్॥ఇతి।

క్షీణకర్మత్వం విధినిషేధాతీతత్వమ్। 'నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః' (శుక) ఇతి స్మరణాత్। ఏతదేవాభిప్రేత్య భగవతాఽప్యుక్తమ్–

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥ 2-45 ఇతి।

నారదోఽపి-

శ్లో॥ స్మర్తవ్యః సతతం విష్ణుః విస్మర్తవ్యో న జాతుచిత్।
సర్వే విధినిషేధాః స్యురేతయోరేవ కింకరాః॥ వి. పు. ఇతి।

శ్లో॥ యోఽహేరివ గణాద్ భీతః సంమానా న్మరణాదివ।
కుణపాదివ యః స్త్రీభ్యస్తం దేవా బ్రాహ్మణం విదుః॥
మ. భా. అను. 251

భావప్రకాశిక

అక్షీణత్వ మనగా దైన్యము లేకపోవుట. అందులకు స్మృతి ప్రమాణము, ఇట్లు కలదు. 'ఒకప్పుడు భిక్ష దొరకనిచో, విషాదము చెందరాదు, దొరికినచో పొంగిపోరాదు. నిర్వికారుడై ఉండవలెను. ఆ రెండును దైవాధీనములు.'

క్షీణకర్మత్వ మనగా, విధినిషేధములకు అతీతుడగుట. ప్రకృతిగుణాతీత బ్రహ్మపదమునందు సంచరించువారికి విధి నిషేధము లెక్కడివి? అను స్మృతివలన జీవన్ముక్తునకు విధినిషేధా తీతత్వము తెలియుచున్నది. ఈ అభిప్రాయముతోనే శ్రీకృష్ణ భగవానునిచే భగవద్గీతయందు ఇట్లు చెప్పబడెను-

'వేదములు-కర్మకాండభాగములు, గుణత్రయవిషయములు. అర్జునా! నీవు త్రిగుణాతీతుడవు; ద్వంద్వసహిష్ణుడవు, నిత్యము సత్త్వగుణమునందున్నవాడవు, యోగక్షేమవిచారణ లేనివాడవు, ఆత్మవంతుడవు, ధీరుడవు కమ్ము.'

నారదుడు కూడ విష్ణుపురాణమునందు ఇట్లు చెప్పెను-

'ఎల్లప్పుడు విష్ణువు స్మరింపబడవలయును. ఎప్పుడును విష్ణువును మరువరాదు. విధినిషేధశాస్త్రము లన్నియు ఈ విష్ణు

స్మరణ, అవిస్మరణములకు కింకరులవంటివి. అనగా లోబడినవి అని అర్థము.

సర్పమును జూచి భయపడినట్లు, సంఘమునకు భయపడు వానిని, మరణమునకు భయపడినట్లు సమ్మానమునకు భయపడు వానిని, శవమునుండి విముఖుడైనట్లు స్త్రీలనుండి విముఖుడు అగు వానిని బ్రాహ్మణునిగా దేవతలు తలంతురు.

### జీవన్ముక్తివివేకః

'రాజాదివార్తా తేషాం స్యాత్' ఇత్యుక్తత్వాత్ సర్పవద్ గణాద్భీతిః ఉపపద్యతే, సమ్మానస్య ఆసక్తికారణతయా పురుషార్థ విరోధిత్వా న్మరణవ ద్ధేయత్వమ్। 'నరకాదివ' ఇతి వా పాఠః। అత ఏవ స్మృతిః -

శ్లో॥ అసంమానాత్ తపోవృద్ధిః సంమానాత్తు తపఃక్షయః।
అర్చితః పూజితో విప్రోఽదుగ్ధా గౌరివ సీదతి॥

ఏతదేవ అభిప్రేత్యావమాన ఉపాదేయతయా స్మర్యతే। -

శ్లో॥ తథా చరేత వై యోగీ సతాం ధర్మమనుస్మరన్।
జనా యథావమన్యేరన్ గచ్ఛేయుర్నైవ సంగతిమ్॥ ఇతి।

### భావప్రకాశిక

నలుగురు చేరినపుడు రాజకీయ, లోకాది వార్తలు వచ్చును గనుక, బ్రహ్మవేత్తకు సర్పమువలన, భయము చెందినట్లు, జన సమూహమునుండి భయము యుక్తమగుచున్నది. సన్మానము విషయాసక్తికి కారణము. కావున, సన్మానము పురుషార్థవిరోధి. అందువలన, మరణమువలె హేయము. 'నరకాదివ' అని గూడ మరియొక పాఠము కలదు. అప్పుడు 'నరకమునుండివలె' అని అర్థము. ఇందువలననే స్మృతి-

సన్మానము లేకపోవుటవలన, తపస్సు వృద్ధి యగును. సన్మానము వలన అయినచో, తపస్సు క్షీణించును; గౌరవించి

పూజింపబడిన బ్రాహ్మణుడు పాలు పితుకని ఆవువలె వ్యర్థుడగుచున్నాడు.

ఈ అభిప్రాయముతోనే అవమానము స్వీకరింపదగినదిగా స్మరింపబడినది.

'యోగి సత్పురుషుల ధర్మమును గుర్తుచేసికొనుచు జనులు తనను అవమానించునట్లును, తన దగ్గరకు చేరకుండునట్లును సంచరించవలెను.'

## జీవన్ముక్తివివేకః

స్త్రీషు ద్వివిధో దోషః। ప్రతిషిద్ధత్వం జుగుప్సితత్వం చేతి। తత్ర ప్రతిషిద్ధత్వమాత్రం కదాచి ద్రాగాత్ ప్రారబ్ధబలాదుల్లంఘ్యతే। తదేతభిప్రేత్యాహ స్మృతిః–

శ్లో॥ మాత్రా స్వస్రా దుహితా వా నైకశయ్యాసనో భవేత్।
బలవానిన్ద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి॥ మను. 2-215

తథాచ స్మృతిభి ర్జుగుప్సా వర్ణితా–

శ్లో॥ స్త్రీణా మవాచ్యదేశస్య క్లిన్న నాడీవ్రణస్య చ।
అభేదేఽపి మనోభేదా జ్జనః ప్రాయేణ వంచ్యతే॥

శ్లో॥ చర్మఖండం ద్విధా భిన్న మపానోద్గారధూపితమ్।
యద్రమన్తే నరా స్తత్ర సాహసం కిమతః పరమ్॥

'యే రమన్తే నరా స్తత్ర క్రిమితుల్యాః కథం న తే' ఇతి వా పాఠః। అతః ప్రతిషేధ జుగుప్సయోః ఉభయో ర్వివక్షయా కుణపదృష్టాన్తోఽత్రాభిహితః।

## భావప్రకాశిక

స్త్రీలయందు దోషము రెండువిధములు. ప్రతిషేధింపబడుట, ఏవగింపునకు లోనగుట. వానిలో ప్రతిషేధింపబడుట అను దోషము ఒకప్పుడు ఉత్కట రాగము వలన, ప్రారబ్ధబలము వలన ఉల్లంఘింపబడుచున్నది. ఈ అభిప్రాయముతోనే మనుస్మృతి–

"మాత్రా స్వస్రా దుహిత్రా వా నైకశయ్యాసనో భవేత్।
బలవా నిన్ద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి॥"

'తల్లితోకాని, సోదరితోకాని, కుమార్తెతోగాని విజనమున ఏకాసనము నందు ఉండరాదు. ఎంతటి విద్వాంసుని గూడ, బలవత్తరమైన ఇంద్రియసమూహము క్రిందికి లాగును' అని చెప్పుచున్నది. అట్లే స్మృతులచే జుగుప్స (ఏవగింపు) వర్ణింపబడినది.

'స్త్రీలయొక్క అవాచ్యదేశమునకును, ఆర్ద్రనాడీవ్రణమున కును భేదము లేకపోయినను, మనోభేదము వలన జనుడు తరచు యోసగింపబడుచున్నాడు.

రెండుగా చీలినట్టియు, అపానవాయువుచే ధూపము వేయబడినట్టి చర్మఖండమును ఏ మనుష్యులు రమించుచున్నారో ఇంతకంటె వేరుగా వారి సాహసమును ఏమి చెప్పవలయును ? 'వారు ఎట్లు పురుగులతో సమానులు కారు?' అనియు, పాఠము కలదు. కనుక, ప్రతిషేధ, జుగుప్సలను రెంటిని దృష్టిలో ఉంచుకొని ఇచట, శవదృష్టాంతము ఈయబడినది.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ యేన పూర్ణమివాకాశం భవత్యేకేన సర్వదా।
శూన్యం యస్య జనాకీర్ణం తం దేవా బ్రాహ్మణం విదుః॥

మ. భా. అను. 251

సంసారిణా మేకాకిత్వే నావస్థానం భయాలస్యాది హేతుత్వాత్ వర్జ్యమ్। జనసమూహశ్చ తత్తథావిధిత్వాద్ అభ్యపేయః। యోగినస్తు తద్విపరీతత్వమ్। ఏకాకిత్వే సతి అవిఘ్నేన ధ్యానానువృత్త్యా పరిపూర్ణేన పరమానన్దాత్మనా సర్వమాకాశం పూర్ణ మివావభాసతే। అతో భయాలస్య శోకమోహాదయో న భవన్తి-

శ్లో॥ యస్మిన్సర్వాణి భూతాని ఆత్మైవాభూద్ విజానతః।

తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః॥

ఈశ. ఉ. 7. ఇతి శ్రుతేః।

జనాకీర్ణం స్థానం రాజవార్తాదినా ధ్యానవిరోధిత్వా దానన్దాత్మ ప్రతీతిరహితం తచ్ఛూన్యమివ చిత్తం క్లేశయతి, జగతో మిథ్యాత్వా దాత్మనః పూర్ణత్వాచ్చ ఇత్యర్థః।

భావప్రకాశిక

'ఏ ఒక్కనిచేతనే ఎల్లప్పుడు ఆకాశము అంతయు పరిపూర్ణ పరమానందాత్మస్వరూపముతో నిండినట్లు చూడబడునో, జన సంకీర్ణమగు దేశము ఎవనికి శూన్యముగా కన్పడునో, అతడు, బ్రాహ్మణుడు అని దేవతలు భావించుచున్నారు.'

సంసారిజనులు ఒంటరిగా నుండుటకు భయము, అలసత మొదలగు కారణముల వలన, ఇష్టపడరు గనుక, వర్జింతురు. జన సమూహము గల ప్రదేశము నిర్భయముగా నుండును గనుక, అది వారికి సమ్మతము. యోగికి ఇది విపరీతము, యోగి, తానొక్కడే ఉండి నిర్విఘ్నముగా ధ్యానము చేసికొనుచు, పరిపూర్ణ పరమానంద ఆత్మస్వరూపముచే ఆకాశమువలె పరిపూర్ణము గానే ఉండును. అపుడు, పరమానందమును అనుభవించును. భయము, అలసత, శోకము, మోహము మొదలగునవి వానికి ఉండవు.

ఏ జీవన్ముక్తిదశయందు బ్రహ్మాత్మతత్త్వజ్ఞానము కల వానికి సర్వభూతములు ఆత్మస్వరూపముగానే దర్శన మగునో, ఆ ఆత్మైకత్వసాక్షాత్కారము కలవానికి ఆ జీవన్ముక్తదశ యందు మోహము ఎక్కడిది? శోకము ఎక్కడిది? శోకమోహము లుండవు.

యోగికి జనాకీర్ణస్థానము, రాజవార్తాదులచే ధ్యానమునకు విరోధి. కనుక, ఆనందాత్మానుభవము కలుగనేరదు. అందువలన,

ఆనందశూన్యమైనదివలె చిత్తము వ్యథ నొందును. జగత్తు మిథ్యాభూత మగుటచే ఆనందము నీయజాలదు. ఆత్మ, ఆనంద స్వరూపమై పరిపూర్ణ మగుటచే యోగి, ధ్యానకాలమునందు పరిపూర్ణ ఆత్మానందానుభవమును వాంఛించును.

## జీవన్ముక్తివివేకః

అతివర్ణాశ్రమీ సూతసంహితాయాం ముక్తిఖండే పంచమాధ్యాయే విష్ణుం ప్రతి పరమేశ్వరేణ వర్ణితః -

శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోఽథ భిక్షుకః।
అతివర్ణాశ్రమీ తేఽపి క్రమాచ్ఛ్రేష్ఠా విచక్షణః॥
అతివర్ణాశ్రమీ ప్రోక్తో గురుః సర్వాధికారిణామ్,
న కస్యాపి భవేచ్ఛిష్యో యథాఽహం పురుషోత్తమ॥
అతివర్ణాశ్రమీ సాక్షాత్ గురూణాం గురురుచ్యతే।
తత్సమో నాధికశ్చాస్మిన్లోకేఽస్త్యేవ న సంశయః॥

శ్లో॥ యః శరీరేన్ద్రియాదిభ్యో విభిన్నం సర్వసాక్షిణమ్।
పారమార్థికవిజ్ఞానం సుఖాత్మానం స్వయంప్రభమ్॥

శ్లో॥ పరం తత్త్వం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్।
యో వేదాన్తమహావాక్యశ్రవణేనైవ కేశవ॥

శ్లో॥ ఆత్మాన మీశ్వరం వేద సోఽతివర్ణాశ్రమీ భవేత్।
యో వర్ణాశ్రమనిర్ముక్త మవస్థాత్రయసాక్షిణమ్॥

శ్లో॥ మహాదేవం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్।
వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః॥

శ్లో॥ నాత్మనో బోధరూపస్య మమ తే సన్తి సర్వదా।
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్॥

శ్లో॥ ఆదిత్యసంనిధౌ లోకశ్చేష్టతే స్వయమేవ తు।
తథా మత్సన్నిధావేన సమస్తం చేష్టతే జగత్॥

శ్లో॥ ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్।

సువర్ణే హారకేయూర కటకస్వస్తికాదయః॥

శ్లో॥ కల్పితా మాయయా తద్వ జ్జగన్మయ్యేవ సర్వదా।
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్॥

శ్లో॥ శుక్తికాయాం యథా తారం కల్పితం మాయయా తథా।
మహదాది జగన్మాయామయం మయ్యేవ కల్పితమ్॥
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్।

భావ ప్రకాశిక

అతివర్ణాశ్రమి (జీవన్ముక్తుడు) సూతసంహితలో ముక్తి ఖండమున, అయిదవ అధ్యాయమునందు విష్ణువును గూర్చి పరమేశ్వరునిచేత వర్ణింపబడెను.

బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, భిక్షుకుడు (సంన్యాసి), అతివర్ణాశ్రమి, విచక్షణులగు వీరందరు ఉత్తరోత్తరము శ్రేష్ఠులు.

జ్ఞానమునందు అధికారము కలవారందరికి అతివర్ణాశ్రమి గురువు అయిఉన్నాడు. ఓ పురుషోత్తమా! అతివర్ణాశ్రమి నావలె ఎవరికిని శిష్యుడు కాడు.

అతడు సాక్షాత్తు, గురువులకు గురువు. అతనితో సమానుడు కాని, అధికుడు కాని, లోకమునందు ఎవ్వడును లేడు. ఈ విషయమున సంశయము లేదు.

ఎవడు శరీరేంద్రియాదులకంటె వేరైనట్టియు, సర్వసాక్షి అయినట్టియు, పారమార్థిక (త్రికాలాబాధ్య) విజ్ఞానస్వరూపుడు, స్వప్రకాశుడునగు సుఖాత్మను పరతత్త్వముగా తెలిసికొనుచున్నాడో, అతడు అతివర్ణాశ్రమి అగును. ఓ కేశవా! వేదాంత మహావాక్య శ్రవణముచేతనే, తన్ను ఈశ్వరునిగా ఎవడు తెలిసికొనునో, అతడు అతివర్ణాశ్రమి అగును.

ఎవడు వర్ణాశ్రమములు లేని, జాగ్రత్స్వప్న, సుషుప్త

అవస్థాత్రయమునకు సాక్షియగు మహాదేవుని, తెలిసికొనునో, అతడు అతివర్ణాశ్రమి అగును.

"వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః।
నాత్మనో బోధరూపస్య మమ తే సన్తి సర్వదా,
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్॥"

వర్ణాశ్రమాచారాదులు శరీరమునందు మాయచే కల్పింప బడినవి. జ్ఞానస్వరూప ఆత్మనగు నాకు అవి ఎన్నడును లేవు అని వేదాన్తములచేత ఎవడు తెలిసికొనునో, అతడు అతివర్ణాశ్రమి అగును.

సూర్యసన్నిధానమున, లోకము స్వయముగా ఎట్లు తన పనులను చేసికొనుచున్నదో, అట్లే నా సన్నిధానముచే దేహేంద్రియాదులు, సమస్త జగత్తు, వ్యాపారము గలవి అగుచున్నవి అని ఎవడు వేదాన్తములచే తెలిసికొనునో, అతడు అతివర్ణాశ్రమి అగును.

హారము, భుజకీర్తులు, కటకములు, స్వస్తికాది ఆభరణములు బంగారమునందు ఎట్లు కల్పింపబడుచున్నవో, అట్లే మాయ చేత మహదాది సమస్త జగత్తు, నాయందు కల్పింపబడుచున్నది అని ఎవడు తెలిసికొనునో, అతడు అతివర్ణాశ్రమి అగును.

ముత్యపుచిప్పయందు రజతము మాయచే ఎట్లు కల్పింప బడుచున్నదో, మాయామయమగు మహదహంకారాది జగత్తు నాయందే కల్పితమైనది అని ఎవడు వేదాన్తములచే తెలిసి కొనునో, అతడు అతివర్ణాశ్రమి అగును.

జీవన్ముక్తివివేకః

శ్లో॥ చండాలదేహే పశ్వాదిశరీరే బ్రహ్మవిగ్రహే॥
అన్యేషు తారతమ్యేన స్థితేషు పురుషోత్తమ।
వ్యోమవ త్సర్వదా వ్యాప్తః సర్వసంబన్ధవర్జితః॥

శ్లో॥ ఏకరూపో మహాదేవః స్థితః సోఽహం పరామృతః।
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్॥
వినష్ట దిగ్భ్రమస్యాపి యథాపూర్వం విభాతి దిక్।
తథా విజ్ఞానవిధ్వస్తం జగ న్మే భాతి తన్న హి॥
శ్లో॥ ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్।
యథా స్వప్న ప్రపఞ్చోఽయం మయి మాయావిజృంభితః॥
శ్లో॥ తథా జాగ్రత్ ప్రపంచోఽపి మయి మాయా విజృంభితః।
ఇతి యో వేద వేదాన్తైః సోఽతివర్ణాశ్రమీ భవేత్॥

భావప్రకాశిక

చండాల శరీరమునందు గాని, పశ్వాదిశరీరమునందు గాని, బ్రాహ్మణశరీరమునందు గాని, మరి యే ఉపాధులు తారతమ్యతో ఉన్నను, ఓ పురుషోత్తమా! ఆకాశమువలె అంతట, వ్యాపించిన వాడు, దేనితోను సంబంధము లేనివాడు, ఏకరూపముతో ఉన్నవాడు, మహాదేవుడనైన నేను, ఆ పరామృతస్వరూపుడనగు మహాదేవుడను అయిఉన్నాను అని వేదాన్తములచే ఎవడు, తెలిసికొనునో అతడు అతివర్ణాశ్రమి యగును.

తూర్పు మొదలగు దిక్కులను గూర్చి, ఒక దిక్కును, మరియొక దిక్కుగా అనుకొనుట దిగ్భ్రమము. తత్త్వజ్ఞానము చేత ఆ భ్రమ తొలగినను, వెనుకటివలెనే ఆ దిక్కు తోచు చుండును. అట్లే, తత్త్వజ్ఞానముచేత విధ్వస్తమైన జగత్తు, నాకు తోచుచున్నదేగాని, వాస్తవముగా అది లేదు అని ఎవడు వేదాన్తములచే తెలిసికొనునో, అతడు అతివర్ణాశ్రమి అగును. (పూర్వాది దిగ్విభాగము భ్రమ కల్పితము) అని తెలిసినను, తత్త్వజ్ఞానము కలవానికి గూడ, వ్యవహారమున, తూర్పు, దక్షిణము అను రీతిగా ప్రతీతి ఉండును.

నాయందు స్వప్నప్రపంచము మాయావిజృంభితము అయిన రీతిగానే, జాగ్రత్ప్రపంచము కూడ నాయందు మాయా విజృంభితమే అయి ఉన్నది అని ఎవడు వేదాంతములచే తెలిసికొనునో, అతడు అతివర్ణాశ్రమి యగును.

జీవన్ముక్తి వివేకః

శ్లో॥ యస్య వర్ణాశ్రమాచారో గలితః స్వాత్మదర్శనాత్।
స వర్ణానాశ్రమాన్ సర్వానతీత్య స్వాత్మని స్థితః॥

శ్లో॥ యస్త్యక్త్వా స్వాశ్రమాన్ వర్ణా నాత్మన్యేవ స్థితః పుమాన్।
సోఽతివర్ణాశ్రమీ ప్రోక్తః సర్వవేదార్థవేదిభిః॥

శ్లో॥ న దేహో నేన్ద్రియం ప్రాణో న మనోబుద్ధ్యహంకృతీ।
న చిత్తం నైవ మాయా చ న చ వ్యోమాదికం జగత్॥

శ్లో॥ న కర్తా నైవ భోక్తా చ న చ భోజయితా తథా।
కేవలం చిత్సదానన్దో బ్రహ్మైవాత్మా యథార్థతః॥

శ్లో॥ జలస్య చలనాదేవ చఞ్చలత్వం యథా రవేః।
తథాఽహఙ్కారసంసర్గాదేవ సంసార ఆత్మనః॥

శ్లో॥ తస్మాదన్యగతా వర్ణా ఆశ్రమా అపి కేశవ।
ఆత్మన్యారోపితా ఏవ భ్రాన్త్యా తే నాత్మవేదినః॥

శ్లో॥ న విధి ర్న నిషేధశ్చ న వర్జ్యావర్జ్యకల్పనా।
ఆత్మవిజ్ఞానినా మస్తి తథా నాన్య జ్జనార్దన॥

శ్లో॥ స్వాత్మవిజ్ఞానినాం నిష్ఠా మీదృశీ మంబుజేక్షణ।
మాయయా మోహితా మర్త్యా నైవ జానన్తి సర్వదా॥

శ్లో॥ న మాంసచక్షుషా నిష్ఠా బ్రహ్మవిజ్ఞానినా మియమ్।
ద్రష్టుం శక్యా స్వతఃసిద్ధా విదుషాం సైవ కేశవ॥

శ్లో॥ యత్ర సుప్తా జనా నిత్యం ప్రబుద్ధ స్తత్ర సంయమీ।
ప్రబుద్ధా యత్ర తే విద్వాన్ సుషుప్త స్తత్ర కేశవ॥

శ్లో॥ ఏవ మాత్మాన మద్వన్ద్వం నిరాకారం నిరంజనమ్।

నిత్యశుద్ధం నిరాభాసం సచ్చిన్మాత్రం పరామృతమ్॥
శ్లో॥ యో విజానాతి వేదాన్తైః స్వానుభూత్యా చ నిశ్చితమ్।
సోఽతివర్ణాశ్రమీ ప్రోక్తః స ఏవ గురుసత్తమః॥ ఇతి।

భావప్రకాశిక

ఎవనికి తన ఆత్మస్వరూపసాక్షాత్కారమువలన వర్ణాశ్రమాచారము దూరమైనదో, అతడు వర్ణాశ్రమధర్మముల నన్నింటిని అతిక్రమించి తన ఆత్మస్వరూపమునందే ఉండును. అట్లున్నవాడు వేదాంతవిదులచే అతివర్ణాశ్రమిగా చెప్పబడెను.

అతడు శరీరము కాదు, ఇంద్రియములు కాదు, ప్రాణము కాదు, మనోబుద్ధ్యహంకారములు కాదు. చిత్తము కాదు, మాయయు కాదు. ఆకాశాదిజగత్తు కూడ, కాదు. కర్మ కాదు. భోక్త కాడు. భోగప్రదుడు కాడు. కేవలము సచ్చిదానన్దస్వరూపుడగు ఆత్మయే యథార్థముగా బ్రహ్మయే అయి ఉన్నాడు.

జలముయొక్క చలనము చేతనే ప్రతిబింబభూతుడైన సూర్యునకు చలనము ప్రతీతమైనట్లే, ఆత్మకు అహంకార సంసర్గము వలననే సంసారము ప్రతీతమగును.

ఓ కేశవా! భ్రాంతిచేత శరీరాదిగతములగు ఆ వర్ణాశ్రమములు ఆత్మయందు ఆరోపితములే అయిఉన్నవి. అందుచేత ఆత్మజ్ఞానులకు విధి లేదు, నిషేధము లేదు, ఇది వర్జ్యము, ఇది ఉపాదేయము అను కల్పన లేదు. జనార్దనా! ఆత్మవిజ్ఞానులకు మరి యే యితర ధర్మము లేదు.

అంబుజేక్షణా! ఆత్మవిజ్ఞానులయొక్క ఈ నిష్ఠను మాయామోహితులైన మానవులు ఎన్నడును తెలిసికొనలేకున్నారు.

బ్రహ్మవిజ్ఞానులయొక్క ఈ నిష్ఠ, మాంసచక్షుష్కులచే తెలిసికొనుటకు శక్యము కాదు. జ్ఞానులకు ఆ నిష్ఠయే స్వతస్సిద్ధము.

ఏ నిష్ఠయందు సంసారిజనులు నిద్రించిఉందురో, యోగి యగు జ్ఞాని, అచట మేల్కొంచియుండును. జనులు ఏ లోక వ్యవహారమున మేల్కొంచి ఉందురో, దానియందు జ్ఞాని, (లోక వ్యవహారమునందు) నిద్రించినవానివలె నుండును.

ఈవిధముగా అద్వితీయము, నిరాకారము, నిరంజనము, నిత్యశుద్ధము, నిరాభాసము, సచ్చిన్మాత్రము, పరామృతమును అగు ఆత్మను ఎవడు వేదాన్తములచేతను, స్వానుభవముచేతను, నిశ్చితముగా తెలిసికొనుచున్నాడో, అతడు అతివర్ణాశ్రమి అని చెప్పబడెను. అతడే ఉత్తమ గురువు. ఈవిధముగా మహాదేవునిచేత అతివర్ణాశ్రమి వర్ణింపబడినాడు.

జీవన్ముక్తివివేకః

తదేవమ్ 'విముక్తస్య విముచ్యతే' ఇత్యాదిశ్రుతయో జీవన్ముక్త, స్థితప్రజ్ఞ, భగవద్భక్త, గుణాతీత, బ్రాహ్మణాతివర్ణాశ్రమి ప్రతిపాదక స్మృతివాక్యాని చ జీవన్ముక్తి సద్భావే ప్రమాణానీతి స్థితమ్। ఇతి జీవన్ముక్తి ప్రమాణాని॥

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకే ప్రథమం జీవన్ముక్తిప్రమాణ ప్రకరణమ్॥

భావప్రకాశిక

ఈవిధముగా 'విముక్తశ్చ విముచ్యతే' మొదలగు శ్రుతులు, జీవన్ముక్త, స్థితప్రజ్ఞ, భగవద్భక్త, గుణాతీత, బ్రాహ్మణ, అతి వర్ణాశ్రమిప్రతిపాదకములగు శ్రుతివాక్యములను 'జీవన్ముక్తి కలదు' అనుటలో ప్రమాణములు అని పర్యవసానముగా తేలినది.

జీవన్ముక్తి ప్రమాణప్రకరణము సమాప్తము.

## 2. అథ ద్వితీయం వాసనాక్షయప్రకరణమ్

### జీవన్ముక్తి వివేకః

అథ జీవన్ముక్తిసాధనం నిరూపయామః। తత్త్వజ్ఞాన మనో నాశ వాసనాక్షయా స్తత్సాధనమ్। అత ఏవ వాసిష్ఠరామాయణ ఉపశమప్రకరణస్యావసానే 'జీవన్ముక్తశరీరాణామ్' ల. వా. 27-1 ఇత్యేతస్మిన్ ప్రస్తావే వసిష్ఠః ఆహ-

శ్లో॥ వాసనాక్షయవిజ్ఞాన మనోనాశా మహామతే।
సమకాలం చిరాభ్యస్తా భవన్తి ఫలదాయినః॥ ఇతి।

అన్వయ ముక్త్వా వ్యతిరేక మాహ-

శ్లో॥ త్రయ ఏతే సమం యావ న్న స్వభ్యస్తా ముహుర్ముహుః।
తావ న్న పదసంప్రాప్తి ర్భవత్యపి సమాశతైః॥ ఇతి।

సమకాలాభ్యాసాభావే బాధకమాహ-

శ్లో॥ ఏకైకశో నిషేవ్యన్తే యద్యేతే చిరయత్నతః।
తన్న సిద్ధిం ప్రయచ్ఛన్తి మన్త్రాః సంకలితా ఇవ॥ ఇతి।

## 2. వాసనాక్షయప్రకరణము

### భావప్రకాశిక

జీవన్ముక్తి ప్రమాణ ప్రకరణానంతరము, రెండవది యగు వాసనాక్షయప్రకరణము ప్రారంభింపబడుచున్నది.

జీవన్ముక్తి ప్రమాణ ప్రశ్నోత్తరానన్తరము జీవన్ముక్తి సాధనమును నిరూపించుచున్నాము. తత్త్వజ్ఞానము, మనోనాశము, వాసనాక్షయము, ఈ మూడును కలిసి జీవన్ముక్తిసాధనములు. కనుకనే, వాసిష్ఠరామాయణముయొక్క చివరి భాగమున్న, 'జీవన్ముక్త శరీరాణామ్' అను ప్రస్తావమున, వసిష్ఠుడు ఇట్లు చెప్పెను-

బుద్ధిశాలివగు ఓ రామా! వాసనాక్షయము, విజ్ఞానము, మనో నాశము, ఏకకాలమున, చిరకాలము అభ్యసింపబడినవై జీవన్ముక్తి

ఫలమును ఇచ్చునవి అగుచున్నవి.

మూడింటియొక్క అస్తిత్వమును చెప్పి, అట్లు కానప్పుడు, వ్యతిరేకమును చెప్పుచున్నారు.

ఈ వాసనాక్షయ, విజ్ఞాన, మనోనాశములు మూడును సమముగా, నిరంతరము చక్కగా అభ్యసింపబడకపోయినచో, నూరు సంవత్సరములకైనను జీవన్ముక్తపదప్రాప్తి కలుగదు. ఏకకాలమున, ఈ మూడింటిని అభ్యసించకపోయినచో బాధకమును చెప్పుచున్నారు-

'ఈ మూడును, ఒక్కొక్కదానిని విడివిడిగా చిరకాలము యత్నముతో సేవింపబడినను, అవి, సంకలితములైన (వేరు వేరైన) మంత్రములవలె ఫలమును ఇవ్వజాలవు.'

జీవన్ముక్తివివేకః

యథా సంధ్యావన్దన మార్జనే సహవినియుక్తానామ్ 'ఆపో హి ష్ఠా' ఇత్యాదీనాం తిసౄణాం ఋచాం మధ్యే ప్రతిదినం ఏకైకస్యా ఋచః పాఠే శాస్త్రీయానుష్ఠానం న సిద్ధ్యతి, యథా వా షడంగమన్త్రాణా మేకైకమన్త్రేణ న సిద్ధిః; యథా వా లోకే శాకసూపౌదనాదీనా మేకైకేన న భోజనసిద్ధిః, తద్వత్ చిరాభ్యాసస్య ప్రయోజనమాహ-

శ్లో॥ త్రిభిరేతైశ్చిరాభ్యస్తైః హృదయగ్రన్థయో దృఢాః।
నిఃశంకమేవ తృట్యన్తి బిసచ్ఛేదాద్ గుణా ఇవ॥ ఇతి।

తస్యైవ వ్యతిరేకమాహ-

శ్లో॥ జన్మాన్తరశతాభ్యస్తా రామ సంసారసంస్థితిః।
సా చిరాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్॥ ఇతి।

భావప్రకాశిక

సంధ్యావందనమున, మార్జనమునందు వినియోగము కల 'ఆపో హిష్ఠా' మొదలగు మూడు ఋక్కులలో ప్రతిదినము

ఒక్కొక్క బుక్కను పఠించినచో, శాస్త్రీయానుష్ఠానము కాజాలదు, ఫలము సిద్ధించదు. అట్లే, 'హృదయాయ నమః' మొదలుకొని 'అస్త్రాయ ఫట్' వరకు గల షడంగమంత్రములలో ఒక్కొక్క మంత్రముచేత సిద్ధి కలుగదు. లోకమునందు గూడ, శాకము, సూపము, ఓదనము మొదలగువానిలో ఒక్కొక్కదానిచేత భోజన సిద్ధి కానేరదు. అట్లే, వాసనాక్షయ, విజ్ఞాన, మనోనాశములకు సముచ్చయానుష్ఠానము (కలిపి ఏకకాలమున అనుష్ఠించుట) ఆవశ్యకము.

చిరాభ్యాసమునకు ప్రయోజనము చెప్పుచున్నారు–

ఈ మూడింటిని చిరకాలము అభ్యసించినచో, దృఢమైన హృదయగ్రంథులు కూడ, తామరకాడను ఛేదించుటవలన దానిలోని దారములవలె నిస్సంశయముగా తెగిపోవును.

దానికే వ్యతిరేకమును చెప్పుచున్నారు–

రామా! నూరు జన్మలనుండి అభ్యస్తమైన సంసారస్థితి చిరకాలము సాధనాభ్యాసయోగము లేకుండా, ఎన్నడును క్షీణించదు.'

జీవన్ముక్తి వివేకః

న కేవలమేకైకాభ్యాసే ఫలాభావః, కింతు తత్స్వరూపమపి న సిద్ధ్యతీత్యాహ–

శ్లో॥ తత్త్వజ్ఞానం మనోనాశో వాసనాక్షయ ఏవ చ।
మిథః కారణతాం గత్వా దుఃసాధ్యాని స్థితాని హి॥ ఇతి।

త్రయాణామేతేషాం మధ్యే ద్వయోర్ద్వయోర్మేలనేన త్రీణి ద్వన్ద్వాని భవన్తి। తత్ర మనోనాశ వాసనాక్షయద్వన్ద్వస్యాన్యోన్యకారణత్వం వ్యతిరేకముఖేనాహ–

శ్లో॥ యావద్విలీనం న మనో న తావద్వాసనాక్షయః।
న క్షీణా వాసనా యావత్తావచ్చిత్తం న శామ్యతి॥ ఇతి।

భావప్రకాశిక

ఈ తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయములలో కేవలము ఒక్కొక్కదానిని అభ్యసించుటతో ప్రయోజనము లేకపోవుటయే కాదు. ఇకనేమనగా, జీవన్ముక్తిస్వరూపమే సిద్ధించదు అని చెప్పుచున్నారు.

అతికష్టముతో సాధింపదగిన తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయములు అన్యోన్యము ఒకదానికి మరియొకటి కారణము అగుచున్నవి.

ఈ మూడింటిలో రెంటిని, రెంటిని కలుపగా మూడు ద్వంద్వములు ఏర్పడుచున్నవి. తత్త్వజ్ఞాన, మనోనాశములు ఒక ద్వంద్వము, తత్త్వజ్ఞాన, వాసనాక్షయములు రెండవ ద్వంద్వము, మనోనాశ, వాసనాక్షయములు, మూడవ ద్వంద్వము.

వానిలో మనోనాశ, వాసనాక్షయద్వంద్వమునకు అన్యోన్య కారణత్వమును వ్యతిరేకముఖముగా చెప్పుచున్నారు-

మనస్సు విలీనము కానంతవరకు, వాసనాక్షయము కలుగ నేరదు. వాసనలు క్షీణించనంతవరకు చిత్తము లయము చెందదు (మనోనాశము కలుగనేరదు).

జీవన్ముక్తివివేకః

ప్రదీపజ్వాలాసంతానవద్ వృత్తిసంతానరూపేణ పరిణమమాన మంతఃకరణద్రవ్యం మనసాత్మకత్వా న్మన ఇత్యుచ్యతే। తస్య నాశో నామ వృత్తిరూపం పరిణామం పరిత్యజ్య నిరుద్ధాకారేణ పరిణామః। తథా చ పతంజలిః యోగశాస్త్రే సూత్రయామాస- 'వ్యుత్థాననిరోధసంస్కారయో రభిభవప్రాదుర్భావౌ నిరోధక్షణచిత్తాన్వయో నిరోధపరిణామః' ౩-౯ ఇతి। వ్యుత్థానసంస్కారా అభిభూయన్తే నిరోధసంస్కారాః ప్రాదుర్భవన్తి; నిరోధ

యుక్తః క్షణ శ్చిత్తేనాన్వీయతే, సోఽయం మనోనాశ ఇత్యేవ గన్తవ్యమ్। పూర్వాపర పరామర్శమన్తరేణ సహసోత్పద్యమానస్య క్రోధాది వృత్తివిశేషస్య హేతు శ్చిత్తగతః సంస్కారో వాసనా, పూర్వపూర్వాభ్యాసేన చిత్తే వాస్యమానత్వాత్। తస్యాశ్చ వాసనాయాః క్షయో నామ వివేకజన్యాయాం శాన్తిదాన్త్యాది శుద్ధ వాసనాయాం దృఢాయాం సత్యపి బాహ్యనిమిత్తే క్రోధా ద్యనుత్పత్తిః।

## భావప్రకాశిక

అంతఃకరణద్రవ్యము, ప్రదీపము యొక్క జ్వాలాసంతతి వలె వృత్తిసంతతి (పరంపర) రూపముగా పరిణమించును. ఆ పరిణామము మననాత్మక మగుటచే 'మనస్సు' అని చెప్పబడును. ఆ మనస్సుయొక్క నాశము, అనగా వృత్తిరూప పరిణామమును వదలిపెట్టి, నిరుద్ధత్వ ఆకారముతో పరిణమించుట. సముద్రజలము మేఘములో ప్రవేశించి, పూర్వ తరంగాది పరిణామమును వదలి చల్లని గాలిచే కఠినమగు కరక (వడగళ్ళు) ఆకారము ధరించినట్లు, ఘనీభూతమై అంతఃకరణాత్మకముగా ఉండుట 'మనోనాశము' అని వ్యవహరింపబడును. వృత్తులచేతనే, మనస్సునకు స్వరూపము ఏర్పడినది గనుక, వృత్తినిరోధమునందు మననము లేదు గనుక, మనోనాశవ్యవహారము కలిగినది. యోగశాస్త్రము నందు పతంజలి ఈవిధముగా సూత్రించెను- 'వ్యుత్థాన సంస్కారములు అభిభూతములై నిరోధసంస్కారములు ప్రాదుర్భవించినపుడు వృత్తినిరోధక్షణమునుండి చిత్తము నిరోధ పరిణామము' అని భావము. వ్యుత్థానసంస్కారములు దేహ స్ఫురణముతో మనోవృత్తులకు కారణములగు సంస్కారములు ప్రయత్నముచే అభిభూతములగును. వృత్తినిరోధసంస్కారములు

ప్రాదుర్భవించును. వృత్తినిరోధయుక్తమగు క్షణము ఎంతకాలము చిత్తమును అనుసరించునో, అంతకాలము ఇది, 'మనోనాశము' అని తెలిసికొనవలెను. వెనుక, ముందు ఆలోచించకుండా హఠాత్తుగా కలుగు క్రోధాది వృత్తివిశేషమునకు కారణమగు చిత్తమునందలి సంస్కారము 'వాసన' అని చెప్పబడును. ఏలననగా, పూర్వ అభ్యాసముతో చిత్తమునందు ఈ భావము వసింపజేయబడు చున్నది. వివేకముచేత క్రోధాది వృత్తులకు విరోధులగు శాంతి, క్షాంతి మొదలగు వాసనలను దృఢముగా అభ్యసించగా ఆ క్రోధాది వృత్తులకు తగిన బాహ్యకారణ మున్నను, అవి ఉదయించక పోవుట, తద్వాసనాక్షయము.

జీవన్ముక్తివివేకః

తత్ర మనోనాశాభావే వృత్తిషూత్పద్యమానాసు కదాచిద్ బాహ్యనిమిత్తేన క్రోధాద్యుత్పత్తేర్నాస్తి వాసనాక్షయః। అక్షీణా యాం తు వాసనాయాం తథైవ వృత్త్యుత్పాదనా న్నాస్తి మనో నాశః। తత్త్వజ్ఞానమనోనాశయోః పరస్పరకారణత్వం వ్యతిరేక ముఖేనాహ—

శ్లో॥ యావ న్న తత్త్వవిజ్ఞానం తావ చ్చిత్తశమః కుతః।
యావ న్న చిత్తోపశమో న తావత్ తత్త్వవేదనమ్॥ ఇతి।

'ఇదం సర్వమాత్మైవ, ప్రతీయమానం తు రూపరసాదికం జగ న్మాయామయం న త్వేతద్వస్తుతోఽస్తి' ఇతి నిశ్చయః తత్త్వజ్ఞానమ్। తస్యానుత్పత్తౌ రూపరసాదివిషయాణాం సద్భావే సతి తద్గోచరాశ్చిత్తవృత్తయో న నివారయితుం శక్యన్తే, యథా ప్రక్షిప్యమాణేషు ఇన్ధనాదిషు వహ్నిజ్వాలా న నివార్యతే తద్వత్। అసతి చిత్తోపశమే వృత్తిభిః గృహ్యమాణేషు రూపాదిషు సత్సు 'నేహ నానాస్తి కించన'-కఠ. ఉ. 4-11 ఇతి శ్రుతేః 'యజమానః ప్రస్తరః' ఇత్యాదిరేవ ప్రత్యక్షవిరోధశంకయా 'బ్రహ్మ

అద్వితీయమ్' ఇత్యేతాదృశస్తత్త్వనిశ్చయో నోదీయాత్॥

భావప్రకాశిక

మనోనాశ, వాసనాక్షయములలో మనోనాశము లేక పోయినచో, మనోవృత్తులు పుట్టుచునే ఉండును గనుక, ఒకప్పుడు బాహ్యకారణముచే క్రోధాదులు జనించుటవలన, వాసనాక్షయము కాజాలదు. అట్లే, వాసనలు క్షీణించనప్పుడు మనోవృత్తులు జనించుచునేఉండును గనుక, మనోనాశము కలుగనేరదు. కావున, మనోనాశ, వాసనాక్షయములకు పరస్పర సాహాయ్యము కలదు గనుక పరస్పరకారణత్వము చెప్పబడినది. తత్త్వజ్ఞాన, మనోనాశములకు గూడ, పరస్పర కారణత్వము వ్యతిరేకముఖముగా చెప్పుచున్నారు—

తత్త్వవిజ్ఞానము కలుగనంతవరకు మనోనాశము ఎక్కడిది? మనోనాశము కలుగనంతవరకు తత్త్వజ్ఞానము కలుగనేరదు.

తత్త్వజ్ఞాన మనగా, 'ఈ సమస్త చరాచర ప్రపంచము ఆత్మవస్తువే అయి ఉన్నది. ప్రతీతమగుచున్న (భాసించుచున్న) రూప, రసాది రూపమగు జగత్తు అయినచో, మాయామయము, కల్పితము, ఈ జగత్తు వాస్తవముగా లేదు' అను నిశ్చయము. ఇట్టి తత్త్వజ్ఞానము కలుగనప్పుడు రూప, రసాది విషయములు ఉండును, సత్యములుగా తోచును. కనుక, ఆ రూప, రసాది చిత్త వృత్తులు, నివారించుటకు శక్యము కావు. ఇంధనములు వేయుచుండగా వహ్నిజ్వాల, నివారింపబడదు గదా! ఆ విధముగానే మనోనాశము లేనిచో, మనోవృత్తులచే రూపాదులు గ్రహింపబడుచుండగా, 'నేహ నానాస్తి కించన' 'బ్రహ్మయందు ఈషణ్మాత్రమైనను, అనేకత్వము (ద్వైతము) లేదు' అని శ్రుతి ఉన్నను, 'యజమానః ప్రస్తరః' 'దర్భముష్టివిశేషము యజమానుడు' అని ప్రత్యక్షశ్రుతి ఉన్నను, విరోధము కలదు గనుక, గౌణార్థము

కల్పించిన విధముగా, 'నేహ నా నాస్తి' శ్రుతికి గూడ, అన్యార్థ కల్పనచే 'బ్రహ్మ, అద్వితీయము' అను తత్త్వనిశ్చయము కలుగనేరదు.

### జీవన్ముక్తి వివేకః

వాసనాక్షయ తత్త్వజ్ఞానయోః పరస్పరకారణత్వం వ్యతిరేకి ముఖేనాహ-

శ్లో॥ యావ న్న వాసనానాశ స్తావత్ తత్త్వాగమః కుతః।
యావ న్న తత్త్వసంప్రాప్తి ర్న తావద్ వాసనాక్షయః॥ ఇతి।

క్రోధాదివాసనాస్వనష్టాసు శమదమాది సాధనాభావా న్న తత్త్వజ్ఞానం ఉదేతి। అజ్ఞాతే చాద్వితీయబ్రహ్మతత్త్వే క్రోధాది నిమిత్తస్య సత్యత్వభ్రమానపాయా న్న వాసనా క్షీయతే।

### భావప్రకాశిక

వాసనాక్షయ; తత్త్వజ్ఞానములకు పరస్పరకారణత్వము వ్యతిరేకముఖముగా చెప్పుచున్నారు-

వాసనానాశము కలుగనిచో, తత్త్వజ్ఞానము ఎక్కడిది? తత్త్వజ్ఞానము కలుగనంతవరకు వాసనాక్షయము కలుగనేరదు.

క్రోధాది వాసనలు నష్టములు కానిచో శమ, దమాది సాధనములు ప్రాప్తము కావు గనుక, తత్త్వజ్ఞానము ఉదయించదు. అద్వితీయ బ్రహ్మతత్త్వము తెలియబడనిచో, క్రోధాది వృత్తులకు కారణము సత్యమే అను భ్రమ, తొలగదు గనుక, వాసన, క్షీణించదు.

### జీవన్ముక్తివివేకః

యథోక్తానాం త్రయాణాం ద్వంద్వానాం అన్యోన్య కారణత్వం అన్వయముఖేన వయ ముదాహరామః।

మనసి నష్టే సతి సంస్కారోద్బోధకస్య బాహ్యనిమిత్తస్య అప్రతీతౌ వాసనా క్షీయతే; క్షీణాయాం చ వాసనాయాం హేత్వ

రభావేన క్రోధాదివృత్త్యనుదయా న్మనో నశ్యతి। తదిదం మనోనాశ వాసనాక్షయ ద్వంద్వమ్।

"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా ఇతి శ్రుతే రాత్మైకాగ్ర్యాభిముఖ వృత్తే ర్దర్శనహేతుత్వా దితర కృత్స్నవృత్తినాశస్య తత్త్వజ్ఞాన హేతుత్వ మవగమ్యతే। సతి చ తత్త్వజ్ఞానే, మిథ్యాభూతే జగతి నరవిషాణాదివ ధీవృత్త్యనుదయాత్ ఆత్మనశ్చ దృష్టత్వేన పునర్వృత్త్యనుపయోగాత్ నిరింధన అగ్నివత్ మనో నశ్యతి। తదిదం మనోనాశ తత్త్వజ్ఞానయో ర్ద్వంద్వమ్।

## భావప్రకాశిక

పూర్వము చెప్పబడిన వాసనాక్షయ, మనోనాశాది ద్వంద్వములు మూడింటికి అన్యోన్యకారణత్వమును అన్వయ ముఖముగా గూడ, మేము ఉదాహరించుచున్నాము.

మనోనాశము కలుగగా, సంస్కార ఉద్బోధకమగు బాహ్య నిమిత్తము భాసించదు. కావున, వాసన క్షీణించును. వాసనా క్షయము కలుగగా, కారణము లేనందున, క్రోధాదివృత్తులు పుట్ట నేరవు గాన, మనస్సు నశించును. ఇది మనోనాశ, వాసనాక్షయ ద్వంద్వము.

"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా"

అను శ్రుతివలన, ఆత్మైకాగ్ర్యాభిముఖ మనోవృత్తియే ఆత్మదర్శన కారణ మగును. అందువలన, ఆత్మాకారవృత్తికంటె ఇతరములగు సర్వవృత్తుల నాశము, తత్త్వజ్ఞానమునకు కారణము అని తెలియ వచ్చుచున్నది. తత్త్వజ్ఞానము కలుగగా, జగత్తు మిథ్యాభూతము, నరవిషాణాదుల వంటిది- తత్సదృశము అని తోచినందువలన, జగదాకార మనోవృత్తి ఉదయించదు. ఆత్మాకారవృత్తిచే ఆత్మ దర్శింపబడినందున, మరల ఆత్మాకార మనోవృత్తితో ఉపయోగము లేదు. కనుక, ఇంధనము లేని అగ్నివలె విషయము

లేని మనస్సు నశించును. ఇది మనోనాశ, తత్త్వజ్ఞానముల ద్వంద్వము.

జీవన్ముక్తివివేకః

తత్త్వజ్ఞానస్య క్రోధాదివాసనాక్షయహేతుతాం వార్తికకార ఆహ–

శ్లో॥ రిపౌ బన్ధౌ స్వదేహే చ సమైకాత్మ్యం ప్రపశ్యతః।
వివేకినః కుతః కోపః స్వదేహావయవేష్వివ॥ ఇతి ప్రసిద్ధమ్।

వసిష్ఠోఽపి–

శ్లో॥ గుణాః శమాదయో జ్ఞానా చ్ఛమాదిభ్య స్తథా జ్ఞతా।
పరస్పరం వివర్ధేతే ద్వే పద్మసరసీ ఇవ॥ ఇతి॥

తదిదం వాసనాక్షయ తత్త్వజ్ఞానయో ర్ద్వన్ద్వమ్।

భావప్రకాశిక

తత్త్వజ్ఞానమునకు క్రోధాది వాసనాక్షయమునుగూర్చి కారణత్వమును వార్తికకారులగు సురేశ్వరాచార్యులు చెప్పుచున్నారు–

శత్రువునందును, బంధువునందును, తన శరీరమునందును, సమమగు ఏకాత్మను దర్శించిన వివేకికి తన శరీరావయవము లందువలె కోపము ఎట్లు వచ్చును ? అని భావము.

క్రోధాది వాసనాక్షయరూపమగు శమాదులకు జ్ఞాన కారణత్వము ప్రసిద్ధము. వసిష్ఠుడు కూడ–

"జ్ఞానమువలన శమాదిగుణములు కలుగును. అట్లే, శమాదులవలన జ్ఞానవంతుడగును. ఆ శమాదులు, జ్ఞానము రెండును పద్మము, సరస్సువలె ఒకదానికొకటి శోభను కూర్చి, అన్యోన్యము వర్ధిల్లుచున్నవి" అని పలికెను.

ఇది, వాసనాక్షయ, తత్త్వజ్ఞానములయొక్క ద్వంద్వము.

## జీవన్ముక్తివివేకః

తత్త్వజ్ఞానాదీనాం త్రయాణాం సంపాదనే సాధనమాహ-

శ్లో॥ "తస్మాద్రాఘవ యత్నేన పౌరుషేణ వివేకినా।
భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్రయ మేతత్సమాశ్రయేత్॥"

ఇతి। పౌరుషో యత్నః కేనాప్యుపాయేనావశ్యం సంపాదయిష్యామి ఇత్యేవంవిధోత్సాహరూపో నిర్బన్ధః। వివేకో నామ విభజ్య నిశ్చయః। తత్త్వజ్ఞానస్య శ్రవణాదికం సాధనమ్, మనోనాశస్య యోగః, వాసనాక్షయస్య ప్రతికూలవాసనోత్పాదనమితి, భోగేచ్ఛాయాః స్వల్పాయా అభ్యుపగమే 'హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే' (మను. 2-94) ఇతి న్యాయేన అతిప్రసఙ్గస్య దుర్వారత్వాద్ దూరత ఇత్యుక్తమ్, నను పూర్వత్ర, వివిదిషాసంన్యాసస్య తత్త్వజ్ఞానం ఫలమ్, విద్వత్సంన్యాసస్య జీవన్ముక్తిరితి వ్యవస్థా వర్ణితా; తథా చ సతి ప్రథమతస్తత్త్వజ్ఞానం సంపాద్య పశ్చాద్విద్వత్సంన్యాసంకృత్వా జీవతః స్వస్య బన్ధస్వరూపయో ర్వాసనామనోవృత్త్యో ర్వినాశః సంపాదనీయ ఇతి ప్రతిభాతి। అత్ర తు తత్త్వజ్ఞానాదీనాం సహైవాభ్యాసో నియమ్యతే, అతః పూర్వోత్తరవిరోధ ఇతి చేత్, నాయం దోషః, ప్రధానోపసర్జనభావేన వ్యవస్థోపపత్తేః; వివిదిషాసంన్యాసినః తత్త్వజ్ఞానం ప్రధానమ్, మనోనాశవాసనాక్షయా వుపసర్జనీభూతౌ, విద్వత్సంన్యాసినస్తు తద్వైపరీత్యమ్; అతః సహాభ్యాస ఉభయత్రాప్యవిరుద్ధః, నాత్ర తత్త్వజ్ఞానోత్పత్తిమాత్రేణ కృతార్థస్య కిముత్తరకాలీనేన అభ్యాసప్రయాసేనేతి శంకనీయమ్। జీవన్ముక్తిప్రయోజననిరూపణేన పరిహరిష్యమాణత్వాత్।

భావప్రకాశిక

తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయములు మూడింటిని సంపాదించుటయందు సాధనమును వసిష్ఠమహర్షి చెప్పుచున్నారు–

"ఓ రామా! కనుక, వివేకవంతుడు పురుషప్రయత్నముతో భోగేచ్ఛను దూరముగా విడనాడి, ఈ మూడింటిని ఆశ్రయించవలెను."

పురుషప్రయత్నమనగా ఏదియో ఒక ఉపాయముతో ఈ మూడింటిని తప్పక సంపాదించెదను అనునట్టి ఉత్సాహరూపమైన పట్టుదల.

"వివేకో నామ విభజ్య నిశ్చయః"

వివేక మనగా విడమరచి నిశ్చయించుట. తత్త్వజ్ఞానమునకు శ్రవణ, మనన, నిదిధ్యాసనములు సాధనములు, మనోనాశమునకు యోగము సాధనము. వాసనాక్షయమునకు ప్రతికూల వాసనోత్పాదనము సాధనము. రాగ, ద్వేష, ఈర్ష్యాసూయలును జయించుటకు మైత్రీ కరుణాదులను అభ్యసించుట సాధనము. భోగేచ్ఛను దగ్గరకు రానీయక, దూరముగా వదిలిపెట్టవలెననుటలో ఏమాత్రము అవకాశము ఇచ్చినను, హవిస్సుచే అగ్ని, వర్ధిల్లునటుల, ఒక భోగేచ్ఛనుండి మరియొక భోగేచ్ఛకు మనస్సు పారితీయును గనుక, దూరతః అత్యంతము భోగేచ్ఛను విడనాడవలయును అని చెప్పబడినది.

ఓయీ! పూర్వము వివిదిషాసంన్యాసమునకు తత్త్వజ్ఞానము ఫలము అనియు, విద్వత్సంన్యాసమునకు జీవన్ముక్తి ఫలము అనియు, వ్యవస్థ చేయబడినది. అట్లైనచో, మొదట తత్త్వజ్ఞానము సంపాదించి, తరువాత విద్వత్సంన్యాసము స్వీకరించి, తాను జీవించి ఉండగా బంధరూపములగు వాసనా, మనోవృత్తుల నాశమును సంపాదింపవలయును అని తోచుచున్నది. కాని,

ఇక్కడ తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయములను ఏకకాలము నందే కలిపి అభ్యసించవలయునని నియమింపబడుచున్నది. దీనివలన పూర్వోత్తర గ్రంథమునకు విరోధము లేదా? అనినచో,

ఇది దోషము కాదు. ప్రధాన, ఉపసర్జనభావముతో వ్యవస్థ, ఉపపన్నమే అగుచున్నది. వివిదిషాసంన్యాసికి తత్త్వజ్ఞానము ప్రధానము. మనోనాశ, వాసనాక్షయములు అప్రధానములుగా అభ్యసింపదగినవి. విద్వత్సంన్యాసికి ఇది విపరీతము. అనగా, మనోనాశ, వాసనాక్షయములే ప్రధానములు, తత్త్వజ్ఞానము అప్రధానము. ఈ విధముగా మూడింటిని ఏకకాలమున కలపి అభ్యసించవచ్చును గనుక, పూర్వాపర గ్రంథమునకు విరోధము ఏమియు లేదు.

సరే! తత్త్వజ్ఞానము కలిగినంతనే, అజ్ఞానము నివృత్తమై కృతార్థుడగుచున్నాడు గనుక మనోనాశ, వాసనాక్షయ అభ్యాసము ఏల? అని శంకింపజనదు. జీవన్ముక్తిస్వరూప నిరూపణ సందర్భమున, ఈ శంకకు పరిహారము చెప్పబడును.

### జీవన్ముక్తి వివేకః

నను విద్వత్సంన్యాసినః వేదనసాధన శ్రవణానుష్ఠాన వైఫల్యాది వేదనస్య చ స్వరూపేణ కర్తు మకర్తు మన్యథా వా కర్తు మశక్యస్య అననుష్ఠేయత్వా దుపసర్జనత్వేఽప్యుత్తరకాలీనో ఽభ్యాసః కీదృశ ఇతి చేత్, కేనాపి ద్వారేణ పునఃపున స్తత్త్వానుస్మరణ మితి బ్రూమః। తాదృశశ్చాభ్యాసో లీలోపాఖ్యానే (ల.వా. 6) దర్శితః—

శ్లో॥ తచ్చింతనం తత్కథనమన్యోఽన్యం తత్ప్రబోధనమ్।
ఏతదేకపరత్వం చ జ్ఞానాభ్యాసం విదుర్బుధాః॥

భా. [ప. 16 ]

శ్లో॥ సర్గాదావేవ నోత్పన్నం దృశ్యం నాస్త్యేవ తత్సదా।
ఇదం జగదహం చేతి బోధాభ్యాసం విదుః పరమ్॥ ఇతి।

భావ ప్రకాశిక

ఓయీ ! విద్వత్సంన్యాసి, జ్ఞానమునకు సాధనము లగు శ్రవణాదులను అనుష్ఠించుట వ్యర్థము. జ్ఞానము కూడ, క్రియవలె చేయటకు, మానుటకు, మరొకతీరుగా చేయుటకు శక్యముకాదు. గమనక్రియ, ఇష్టమైనపుడు చేయవచ్చును, ఇష్టము కానపుడు మానవచ్చును. నడచివెళ్ళువాడు వాహనముమీద వెళ్ళవచ్చును. జ్ఞానము అట్లు కాదు. విషయేంద్రియసంయోగము ఉన్నపుడు ఇచ్ఛ లేకపోయినను, జ్ఞానము కలుగును. (ఉదా : దుర్గంధాది జ్ఞానము). కనుక, జ్ఞానము ఇచ్ఛా, కృతిసాధ్యము కాదు. కనుక, అప్రధానముగానయినను జ్ఞానాభ్యాసమును విద్వత్సంన్యాసి ఎట్లు చేయగలుగును? అని ప్రశ్నించినచో-

ఏదియో ఒక ఉపాయముతో మాటిమాటికి చేయు బ్రహ్మాత్మ తత్త్వానుస్మరణము, జ్ఞానాభ్యాసము అని చెప్పుదుము. ఇటువంటి అభ్యాసము లీలోపాఖ్యానమునందు చూపబడినది.

"తచ్చిన్తనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్।
ఏతదేకపరత్వం చ జ్ఞానాభ్యాసం విదుర్బుధాః॥"

ఏకాంతముగా తానొక్కడే, ప్రత్యగ్బ్రహ్మైక్యధ్యానము చేయుట ఇతరులకు చెప్పుట, పరస్పరము తద్బోధనము చేసికొనుట, ఇతర విషయములు మాని బ్రహ్మైక్యపరాయణత జ్ఞానాభ్యాసమని విజ్ఞులు తెలిసికొనుచున్నారు.

సృష్టిప్రారంభముననే దృశ్యమగు జగత్తు పుట్టనేలేదు. కనుక, ఎన్నడును, లేనేలేదు, జగత్తులేదు నేనును లేను అనెడి జ్ఞానాభ్యాసము ఉత్కృష్టమైనది అని విజ్ఞులు తెలిసికొనుచున్నారు.

## జీవన్ముక్తివివేకః

మనోనాశ వాసనాక్షయాభ్యాసావపి తత్రైవ దర్శితౌ-

శ్లో॥ అత్యంతభావసంపత్తౌ జ్ఞాతు ర్జ్ఞేయస్య వస్తునః।
యుక్త్యా శాస్త్రైర్యత న్తే యే తే తత్రాభ్యాసినః స్థితాః॥ ఇతి।

జ్ఞాతృజ్ఞేయయో ర్మిథ్యాత్వధీ రభావసంపత్తిః। యుక్తి ర్యోగః। సోఽయం మనోనాశాభ్యాసః।

శ్లో॥ దృశ్యాసంభవబోధేన రాగద్వేషాదితానవే।
రతిర్నవోదితా యాఽసౌ బ్రహ్మాభ్యాసః స ఉచ్యతే॥ ఇతి।
సోఽయం వాసనాక్షయాభ్యాసః।

## భావప్రకాశిక

మనోనాశ, వాసనాక్షయాభ్యాసములు కూడ, ఆ లీలోపాఖ్యానము నందే చూపబడినవి.

ఎవరు జ్ఞాత, జ్ఞేయము అను వస్తువులకు మిథ్యాత్మజ్ఞాన రూపమగు అభావసంపత్తియే కాక, జ్ఞాతృజ్ఞేయములు స్వరూపముతో ప్రతీతి లేకుండుటకు శాస్త్రోక్తయోగముతో ప్రయత్నించుచున్నారో, వారు ఇచట అభ్యాసకులుగా ఉన్నారు.

'నేను జ్ఞాతను, ఇది జ్ఞేయము- రెండును మిథ్యయే' అను దృఢనిశ్చయము అభావసంపత్తి. ఆ జ్ఞాతృ జ్ఞేయములు ప్రస్తుత స్వరూపముతోనే భాసించకపోవుట అత్యంతాభావసంపత్తి. యుక్తి అనగా యోగము. ఇదియే మనోనాశాభ్యాసము.

ఆకాశాది దృశ్యప్రపంచము పుట్టుటకు సంభవమే లేదు అను జ్ఞానము చేత ప్రాపంచిక విషయములందు రాగద్వేషాదులు కృశించగా, దృఢముగా ఉదయించిన ఆత్మరతి ఏది కలదో, అది బ్రహ్మాభ్యాసము అని చెప్పబడుచున్నది.

ఇదియే వాసనాక్షయాభ్యాసము.

## జీవన్ముక్తివివేకః

తేష్వే తేషు త్రిషు అభ్యాసేషు సామాన్యేన ప్రతీయమానేషు ప్రధానోపసర్జనభావః న వివేక్తుం శక్యత। ఇతి చేత్, మైవమ్, ప్రయోజనానుసారేణ వివేక్తుం శక్యత్వాత్। ముముక్షోః పురుషస్య జీవన్ముక్తిః విదేహముక్తిశ్చేతి ప్రయోజనద్వయమ్। అత ఏవ 'విముక్తశ్చ విముచ్యతే' కఠ 2-1-1 ఇతి శ్రూయతే। తత్ర జీవతః పురుషస్య దైవసంపదా మోక్షః, ఆసురసంపదా బన్ధః, ఏతచ్చ షోడశాధ్యాయే భగవతాఽభిహితమ్-

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా॥ ఇతి।

## భావప్రకాశిక

ఆ యీ తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయ అభ్యాసములు మూడును సామాన్యముగా ప్రతీయమానములు అగుచుండగా ఏది ప్రధానమో, ఏది ఉపసర్జనమో- అప్రధానమో విడమరచి గ్రహించుటకు సాధ్యముకాదు అని అనినచో, అట్లు కాదు, ప్రయోజనమునుబట్టి వివేచన చేయవచ్చును. ముముక్షువగు పురుషునకు జీవన్ముక్తి, విదేహముక్తి అనునవి రెండు ప్రయోజనములు కలవు. కనుకనే 'విముక్తశ్చ విముచ్యతే' జీవించి ఉండగా మొదట సంసారబంధమునుండి ముక్తుడగుచు, ప్రారబ్ధ కర్మాధీన దేహపాతానంతరము విదేహముక్తిని పొందుచున్నాడు అని చెప్పునట్టి శ్రుతి ప్రవృత్తమైనది. వానిలో జీవించియున్న పురుషునకు దైవసంపదచేత మోక్షము, ఆసురసంపదచేత బంధము కలుగును. అదియు, భగవద్గీతాషోడశాధ్యాయమున, శ్రీకృష్ణ భగవానునిచే చెప్పబడినది-

"దైవీసంప ద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా॥"

దైవసంపత్తు, మోక్షము కొరకు అగును. ఆసురసంపద బంధముకొరకు ఏర్పడినది.

## జీవన్ముక్తివివేకః

తే చ సంపదౌ తత్రైవాభిహితే-

శ్లో॥ "అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్॥
అహింసా సత్య మక్రోధ స్త్యాగః శాన్తి రపైశునమ్।
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్॥
తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా।
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత॥
దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సంపద మాసురీమ్॥ ఇతి।

### భావ ప్రకాశిక

ఆ గీతాషోడశాధ్యాయమునందే మోక్షహేతువగు దైవసంపద, బంధహేతువగు ఆసురసంపద- రెండును చెప్పబడినవి.

భయరాహిత్యము, అంతఃకరణ సంశుద్ధి, అధ్యాత్మజ్ఞాన యోగములందు ఎల్లపుడు తత్పరుడై ఉండుట (ఇవి పరమహంస ధర్మములు). దానము, ఇంద్రియ నిగ్రహము, యజ్ఞము (గృహస్థ ధర్మములు), స్వాధ్యాయము (బ్రహ్మచారి ధర్మము). తపస్సు (వానప్రస్థ ధర్మము). ఇవిగాక, సాధారణ ధర్మములు- ఋజుస్వభావము, అహింస, సత్యము, క్రోధము లేకుండుట, త్యాగము, శాంతి, ఇతరుల దోషములను ఉద్ఘోషించకపోవుట, భూతదయ, భోగలాలసత లేకపోవుట, క్రౌర్యము లేకపోవుట, అకార్యకరణమునందు సిగ్గుపడుట, చాపలము లేకపోవుట, తేజస్సు, (ప్రాగల్భ్యము, ఇతరులచే ఆక్రమింపబడకపోవుట) ఓరిమి, నిబ్బరము (ధైర్యము), శౌచము, ఇతరులకు ద్రోహము చేయకుండుట, తాను గొప్పవాడనని అతిగా భావించకుండుట సత్కులసంజాతునకు ఈ సుగుణములు ఏర్పడుచున్నవి.

అర్జునా! దంభము, గర్వము, అతిగా అభిమానము, క్రోధము, పరుషభాషణము అజ్ఞానము ఈ ఆసురసంపద మానవునకు కలుగుచున్నది.

జీవన్ముక్తివివేకః

పునరపి అధ్యాయపరిసమాప్తేః ఆసురసంపత్ప్రపంచితా। శాస్త్రీయాయాః స్వభావసిద్ధాయా ఆసురసంపదో దుర్వాసనాయాః శాస్త్రీయయా పురుషప్రయత్నసాధ్యయా దైవసంపదా సద్వాసనయా క్షయే సతి జీవన్ముక్తిర్భవతి।

భావప్రకాశిక

మరల షోడశాధ్యాయముయొక్క చివరిభాగమున, ఈ ఆసురీసంపద విస్తారముగా వివరింపబడినది. అశాస్త్రీయము స్వభావసిద్ధము, దుర్వాసనారూపమును అయిన ఈ ఆసుర సంపదను శాస్త్రీయము, సద్వాసనారూపము, పురుషప్రయత్న సాధ్యమైన దైవీసంపత్తుతో క్షీణింపజేయగా (క్షయమునొందింపగా) జీవన్ముక్తి కలుగును.

జీవన్ముక్తివివేకః

వాసనాక్షయవత్ మనోనాశస్యాపి జీవన్ముక్తిహేతుత్వం శ్రూయతే-

శ్లో॥ మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః।
బన్ధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్॥
యతో నిర్విషయస్యాస్య మనసో ముక్తిరిష్యతే।
అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా॥

శ్లో॥ నిరస్తవిషయాసంగం సన్నిరుద్ధం మనో హృది।
యదా యాత్యున్మనీభావం తదా తత్పరమంపదమ్॥
తావదేవ నిరోద్ధవ్యం యావద్ హృది గతం క్షయమ్।
ఏతజ్జ్ఞానం చ మోక్షశ్చ శేషో గ్రన్థస్య విస్తరః॥ ఇతి।

బన్ధో ద్వివిధః। తీవ్రో మృదుశ్చ। తత్రాసురసంపత్ సాక్షాదేవ

క్లేశహేతుత్వాత్ తీవ్రో బన్ధః। ద్వైతమాత్రప్రతీతిస్తు స్వయ మక్లేశ రూపత్వా దాసుర సంపదుత్పాదకత్వాచ్చ మృదుర్బన్ధః। తత్ర వాసనాక్షయేణ తీవ్రబన్ధ ఏవ నివర్త్యతే, మనోనాశేన తూభయమ్।

భావప్రకాశిక

వాసనాక్షయము వలెనే మనోనాశము కూడ, జీవన్ముక్తికి కారణము అని వినబడుచున్నది-

మనుష్యులయొక్క మనస్సే బంధమోక్షములకు కారణము. మనస్సు, విషయములందు ఆసక్తి కలదగుచో బంధమును కలిగించును, నిర్విషయమగు మనస్సు, ముక్తిఫలము నిచ్చును.

నిర్విషయమగు మనస్సు, ముక్తిహేతువగు కారణముచేత ముముక్షువు, నిత్యము మనస్సును నిర్విషయముగా (వృత్తి హీనముగా) చేయవలయును.

విషయాసక్తిని వీడిన మనస్సు, హృదయదేశమున నిరోధింపబడగా, అపుడు ఉన్మనీభావమును - సంకల్పాది వృత్తి విలయ దశను-పొందును. అపుడు పరమపదము ప్రాప్తమగును.

హృదయదేశమునందు మనస్సు క్షయ మగునంతవరకు మనస్సును, నిరోధించవలెను. ఇదియే ధ్యానము. ఇదియేజ్ఞానము. మిగిలినదంతయు ఆ మార్గముయొక్క విస్తారము అయి ఉన్నది.

తీవ్రబంధము, మృదుబంధము అని బంధము రెండు విధములు. వానిలో ఆసురసంపద సాక్షాత్తుగానే క్లేశములకు కారణము గనుక, ఆసురసపంద తీవ్రబంధము. ద్వైతముయొక్క ప్రతీతిమాత్రము స్వయముగా క్లేశరూపము కాదు గనుక, ఆసురసంపదకు ఉత్పాదకమగుటవలన మృదుబంధము అయి ఉన్నది. వాసనాక్షయముచేత తీవ్రబంధమే నివర్తించును. మనోనాశముచేత తీవ్ర బంధము, మృదుబంధము- రెండును నివర్తించును.

## జీవన్ముక్తివివేకః

తర్హి మనోనాశేనైవాలమ్, వాసనాక్షయస్తు నిరర్థక ఇతి చేన్న, భోగహేతునా ప్రబలేన ప్రారబ్ధేన వ్యుత్థాపితే మనసి వాసనాక్షయస్య తీవ్రబన్ధనివారణార్థత్వాత్, భోగస్య మృదుబన్ధే, నాప్యుపపత్తేః। తామసవృత్తయ స్తీవ్ర బన్ధః। సాత్త్విక రాజస వృత్తిద్వయం మృదుబన్ధః। ఏతచ్చ-

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః।

ఇత్యత్ర స్పష్టీకృతమ్। ఏవం చ సతి మృదుబన్ధస్య అభ్యుపేయత్వాత్ తీవ్రబన్ధస్య వాసనాక్షయేణైవ నివృత్తే రనర్థకో మనోనాశ ఇతి చేన్న, దుర్బల ప్రారబ్ధాపాదితానా మవశ్యంభావి భోగానాం ప్రతీకారార్థత్వాత్। తాదృగ్భోగస్య ప్రతీకారనిర్వర్త్యత్వ మభిప్రేత్య ఇద మాహుః-

శ్లో॥ అవశ్యం భావిభోగానాం ప్రతీకారో భవేద్యది।
తదా దుఃఖైర్న లిప్యేర న్నలరామ యుధిష్ఠిరాః॥ ఇతి।

## భావప్రకాశిక

అట్లైనచో మనోనాశ మొక్కటే చాలును గదా! తీవ్ర మృదుబంధద్వయమును నివర్తింపజేయును కదా. వాసనాక్షయ మైనచో, తీవ్రబంధ మొక్కదానినే నివర్తింపజేయును. కనుక, వాసనాక్షయము నిరర్థకము అనినచో, అట్లు కాదు. సుఖదుఃఖ భోగమునకు కారణమైన ప్రబలప్రారబ్ధముచే మనసు వ్యుత్థాన దశలోకి తీసికొనిరాబడినపుడు వాసనాక్షయము తీవ్రబంధమును నివారించుటకు ఉపయోగించును. ప్రారబ్ధకర్మభోగము మృదుబంధముచేతనైనను, సంభవమగును. తామసవృత్తులు తీవ్రబంధము, సాత్త్విక, రాజస వృత్తులు రెండును మృదు బంధము. ఈ విషయము 'దుఃఖేషు అనుద్విగ్నమనాః' అనుచోట పూర్వము వివరింపబడినది.

ఇట్లయినచో మృదుబంధము ఉన్నను, బాధకము కాదు గనుక, తీవ్రబంధము వాసనాక్షయముచేతనే నివర్తించును. కావున మనోనాశము అక్కరలేదు అనినచో, అట్లుకాదు. దుర్బల ప్రారబ్ధముచే ప్రాప్తమగు తప్పనిసరిగా అనుభవించవలసిన భోగములయొక్క ప్రతీకారముకొరకు మనోనాశము అపేక్షితమై యున్నది. అట్టి భోగము ప్రతీకారముచే నివర్తించును అను అభిప్రాయముతో పెద్దలు ఇట్లు చెప్పుచున్నారు.

"తప్పనిసరిగా అనుభవించవలసిన భోగములకు ప్రతిక్రియ అగు మనోనాశ మున్నచో అపుడు, నలుడు, రాముడు, ధర్మరాజు– వీరు రాజ్యభ్రంశ, వనవాసాది దుఃఖములతో లిప్తులు (బాధింపబడినవారు) కాకుండెడివారు కదా!"

## జీవన్ముక్తి వివేకః

తదేవం జీవన్ముక్తిం ప్రతి వాసనాక్షయ మనోనాశయోః సాక్షాత్సాధనత్వాద్ ప్రాధాన్యమ్;తత్త్వజ్ఞానం తూభయోత్పాదనేన వ్యవహితత్వా దుపసర్జనమ్, తత్త్వజ్ఞానస్య వాసనాక్షయ హేతుత్వం బహుశః శ్రుతౌ శ్రూయతే–

'జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః' శ్వే. 1–1–11 'అధ్యాత్మ యోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి' కఠ ఉ. 1–1–12; 'తరతి శోక మాత్మవిత్' ఛా. ఉ. 7–1–3. 'తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః' ఈశ ఉ. 7, 'జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః' శ్వే. ఉ. 1–1–8 ఇతి। మనోనాశ హేతుత్వం చ తత్త్వజ్ఞానస్య శ్రుతిసిద్ధమ్, విద్యాదశాం అభిప్రేత్య ఇదం శ్రూయతే– "యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్ కేన కం జిఘ్రేత్' బృ. ఉ. 2–1–14 ఇత్యాది.

గౌడపాదాచార్యైశ్చాహుః

శ్లో॥ ఆత్మతత్త్వానుబోధేన న సంకల్పయతే యదా।
అమనస్తాం తదాయాతి గ్రాహ్యాభావే తదగ్రహః" ఇతి।

భావప్రకాశిక

కనుక, ఈవిధముగా జీవన్ముక్తిని గూర్చి వాసనాక్షయ మనోనాశములు సాక్షాత్సాధనములు అగుటచే ప్రధానములు. తత్త్వజ్ఞానమైనచో వాసనాక్షయ, మనోనాశములను కలిగించి జీవన్ముక్తికి వ్యవహితకారణము అగుటచే అప్రధానము. తత్త్వజ్ఞానమునకు వాసనాక్షయము గురించి కారణత్వము శ్రుతియందు బహువిధములుగా వినబడుచున్నది-

'పరమాత్మను సాక్షాత్కరించుకొని సమస్తమైన తామస వృత్తిరూపములగు బంధముల నివృత్తి కలుగుచున్నది.' 'అధ్యాత్మయోగ సాధనముచే వివేకి పరమాత్మను దర్శించి హర్షశోకములను వదలిపెట్టుచున్నాడు.' 'ఆత్మజ్ఞాని, శోకమును దాటుచున్నాడు.' 'ఆత్మైకత్వదర్శికి శోకమోహములు ఎక్కడివి?' 'పరమాత్మను తెలిసికొని సర్వబంధములనుండి విముక్తుడగుచున్నాడు' అని భావము.

తత్త్వజ్ఞానమునకు మనోనాశనమును గూర్చి గూడ కారణత్వము శ్రుతిసిద్ధమైనది. నిర్వికల్పక బ్రహ్మసాక్షాత్కార దశను మనస్సునందు ఉంచుకొని శ్రుతియందు ఇది వినబడుచున్నది.

'ఏ విద్యాదశయందు బ్రహ్మజ్ఞానికి సర్వము ఆత్మస్వరూపమే అగునో' అపుడు దేనితో దేనిని చూచును, దేనితో దేనిని ఆఘ్రాణించును?' గౌడపాదాచార్యులుకూడ-

'ఆత్మసత్తను అనుసరించి సంకల్పము చేయనపుడు అమనస్కభావమును పొందును. దృశ్యము స్ఫురించనపుడు

(లేనప్పుడు) చిన్మాత్రావస్థితియే గాక ద్వైతభావము ఉండదు.' అని చెప్పిరి.

జీవన్ముక్తివివేకః

జీవన్ముక్తే ర్వాసనాక్షయ మనోనాశావివ విదేహముక్తేః సాక్షాత్ సాధనత్వాత్ తత్త్వజ్ఞానం ప్రధానమ్-

'జ్ఞానాదేవ తు కైవల్యం ప్రాప్యతే యేన ముచ్యతే' ఇతి స్మృతేః। కేవలస్య ఆత్మనో భావః కైవల్యం దేహాదిరహితత్వమ్, తచ్చ జ్ఞానాదేవ ప్రాప్యతే, సదేహత్వస్యాజ్ఞాన కల్పితత్వేన జ్ఞానైక నివర్త్యత్వాత్। జ్ఞానాదేవేత్యేవకారేణ కర్మవ్యావృత్తిః 'న కర్మణా న ప్రజయా ధనేన' కై. ఉ. 4-12-3 ఇతి శ్రుతేః। యస్తు జ్ఞానశాస్త్రమ్ అనభ్యస్య యథాసంభవం వాసనాక్షయ మనోనాశావభ్యస్య సగుణం బ్రహ్మోపాస్తే న తస్యకైవల్య మస్తి, లిఙ్గదేహస్యానపాయాత్। అత ఏవకారేణ తావపి వ్యావర్త్యేతే, యేన ముచ్యత ఇత్యస్యాయమర్థః - యేన జ్ఞానప్రాపిత కేవలత్వేన కృత్స్నా బన్ధా ద్విముచ్యత ఇతి.

భావప్రకాశిక

జీవన్ముక్తికి వాసనాక్షయ, మనోనాశముల వలె విదేహ ముక్తికి, తత్త్వజ్ఞానము సాక్షాత్ సాధనమగుటచే ప్రధానము.

"జ్ఞానాదేవ తు కైవల్యమ్ ప్రాప్యతే యేన ముచ్యతే"

'జ్ఞానము వలననే కైవల్యము పొందబడును, దేనిచేత విముక్తుడగునో' అని స్మృతి కైవల్యమనగా కేవలుడగు ఆత్మయొక్క భావము. అనగా దేహాదిరహితత్వము. ఆ కైవల్యమైనచో, జ్ఞానము వలననే పొందబడును. సశరీరత్వము అజ్ఞాన కల్పితము గనుక, జ్ఞానముచేతనే నివర్తింపబడుచున్నది. 'జ్ఞానాదేవ' అనుచోట 'ఏవ' కారముచే కర్మకు వ్యావృత్తి కలుగు చున్నది. 'న కర్మణా న ప్రజయా ధనేన' అను స్మృతి వలన

అమృతత్త్వము అనగా కైవల్యము 'కర్మ చేత పొందబడదు, ధనము చేత పొందబడదు' అని ఆ శ్రుతికి అర్థము. ఎవడైతే జ్ఞానశాస్త్రమును అభ్యసించకుండా వాసనాక్షయ, మనోనాశములను యథాసంభవముగా అభ్యసించి, సగుణ బ్రహ్మోపాసన చేయునో, అతనికి సూక్ష్మశరీరము పోలేదు గనుక, కైవల్యము లేదు. ఇందువలన 'జ్ఞానాదేవ' అనుచోట 'ఏవ' కారము చేత వాసనాక్షయ, మనోనాశములు గూడ వ్యావర్తిపజేయబడుచున్నవి. అనగా జ్ఞానము లేకుండా వాసనాక్షయ, మనోనాశములచేత గూడ, కైవల్యము రాదు. 'యేన ముచ్యతే' అను వాక్యమునకు 'ఏ జ్ఞానప్రాప్తి బలముచేత సమస్త బంధములనుండి విముక్తుడగుచున్నాడో' అని అర్థము.

జీవన్ముక్తివివేకః

బన్ధశ్చానేకవిధః—అవిద్యాగ్రన్థిః, అబ్రహ్మత్వమ్, హృదయగ్రన్థిః, సంశయః, కర్మాణి, అసర్వకామత్వమ్, మృత్యుః, పునర్జన్మ ఇత్యాది శబ్దైః తత్ర వ్యవహారాత్। త ఏతే బన్ధాః సర్వేఽపి జ్ఞాననివర్త్యాః॥ తథా చ శ్రుతయః— 'ఏతద్యో వేద నిహితం గుహాయాం సోఽవిద్యాగ్రన్థి వికిరతీహ సౌమ్య' ముండక. ఉ. 2-2-10, 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' ముండక. ఉ. 2-2-

శ్లో॥ భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః।
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥

ముండక. ఉ. 22-8

'యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్,
సోఽశ్నుతే సర్వాన్కామాన్సహ' తై. ఉ. 2-2-1,
'తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి' శ్వే. ఉ. 3-8

శ్లో॥ యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః।

స తు తత్పద మాప్నోతి యస్మాద్ భూయో న జాయతే॥
కఠ ఉ. 1-3-8

'య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి' బృ. ఉ. 1-4-10 ఇత్యాదీని అసర్వజ్ఞత్వాది బన్ధనివృత్తిపరాణి వాక్యాని అత్ర ఉదహరణీయాని।

భావప్రకాశిక

బంధము, అనేక విధములు-అవిద్యాగ్రంథి (అజ్ఞానాధ్యాస) అబ్రహ్మత్వము (బ్రహ్మను కాను అనుకొనుట), హృదయగ్రంథి (అహంకారగ్రంథి), సంశయము, కర్మలు, అసర్వకామత్వము, మృత్యువు, పునర్జన్మ మొదలగు శబ్దములచే అచటచట వ్యవహరింపబడుట వలన అనేక విధములు.

ఆ యీ బంధము లన్నియు, జ్ఞానముచే నివర్తింపబడును. అందులకు శ్రుతులు ప్రమాణము.

అవ్యాకృత గుహయందు ఉన్న ఈ బ్రహ్మను ఎవడు తెలిసికొనునో, అతడు ఓ సౌమ్యుడా! అవిద్యాగ్రంథిని ఇచటనే దూరము చేసికొనుచున్నాడు. (పోగొట్టుకొనుచున్నాడు).

"బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి"

బ్రహ్మను తెలిసికొన్నవాడు బ్రహ్మయే అగును.

హిరణ్యగర్భబ్రహ్మకంటె ఉత్కృష్టుడగు ఆ పరబ్రహ్మ, సాక్షాత్కరింపబడినవాడు కాగా, అహంకారగ్రంథి విచ్చిపోవును. సర్వసంశయములు తీరును. ఈ బ్రహ్మజ్ఞాని యొక్క కర్మలు (సంచితములు) క్షీణించును.

పరమాకాశమునందు బుద్ధిగుహయందు(పంచకోశములందు) ఉన్న బ్రహ్మను తెలిసినవాడు స్వప్రకాశమగు బ్రహ్మతో సకల భోగములను పొందుచున్నాడు.

ఆ పరమాత్మను తెలిసికొనియే, జనన మరణ పరంపరా

లక్షణమగు సంసార మృత్యువును అతిక్రమించుచున్నాడు. మరల ఇహలోకమున జన్మ గ్రహించడు.

"య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి" ఎవడు 'అహం బ్రహ్మాస్మి' అని తెలిసికొనునో, వాడు సర్వాత్మకుడు అగును.

ఈ మొదలైన అసర్వజ్ఞత్వాది బంధములను జ్ఞానము నివృత్తి చేయును అను వాక్యములు ఇచట ఉదహరింపదగినవి.

## జీవన్ముక్తివివేకః

సేయం విదేహముక్తిః జ్ఞానోత్పత్తిసమకాలీనా జ్ఞేయా, బ్రహ్మణ్యవిద్యారోపితానా మేతేషాం బన్ధానాం విద్యయా వినాశే సతి పునరుత్పత్త్యసంభవా దనుభవాచ్చ। తదేత ద్విద్యా సమకాలీనత్వం భాష్యకారః సమన్వయసూత్రే (బ్ర. సూ. 1-1-4) ప్రపంచయామాస। 'తదధిగమ ఉత్తరపూర్వార్ధయోః అశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్ బ్ర.సూ. 4-1-13 ఇత్యత్ర చ నను, వర్తమాన దేహపాతానన్తరభావినీ విదేహముక్తిరితి బహవో వర్ణయన్తి। తథా చ శ్రుతిః- 'తస్య తావదేవ చిరం యావ న్న విమోక్ష్యేఽథ సంపత్స్యే' ఛాం. ఉ. 6-14-2 ఇతి।

## భావప్రకాశిక

తత్త్వజ్ఞానము వలన కలుగు ఆ యీ విదేహముక్తి, జ్ఞానోత్పత్తి సమకాలముననే లభించును అని తెలిసికొనవలెను. బ్రహ్మయందు అవిద్యచే ఆరోపితములగు ఈ బంధము లన్నియు, విద్యచే నశించును, మరల జనింపనేరవు. విద్వ దనుభవము కూడ ఇదియే. జ్ఞానానన్తరము, మరల బంధము లేదు అనుటలో ప్రమాణమై ఉన్నది. భాష్యకారుడు విద్యాసమ కాలమున, ముక్తి లభించును అని ప్రతిపాదించెను. తరువాత 'తదధిగమ' సూత్రమున బ్రహ్మజ్ఞానికి ఆగామి కర్మతో

అశ్లేషము, సంచిత పూర్వకర్మవినాశము విస్తరించి ప్రతిపాదించెను- విపులీకరించెను.

ఓయీ! విదేహముక్తి, వర్తమానదేహపాతానంతరము లభించును అని పలువురు వర్ణించుచున్నారు. శ్రుతి గూడ, అట్లే కలదు.

"తస్య తావదేవ చిరం యావ న్న విమోక్ష్యేఽథ సంపత్స్యే" బ్రహ్మజ్ఞాని, దేహపాతపర్యంతము మాత్రమే విలంబము, తరువాత విదేహముక్తుడగును అని ఛాన్దోగ్యశ్రుతి చెప్పుచున్నది.

జీవన్ముక్తివివేకః

వాక్యవృత్తావప్యుక్తమ్-

శ్లో॥ ప్రారబ్ధకర్మవేగేన జీవన్ముక్తో తదా భవేత్।
కంచిత్కాల మథారబ్ధకర్మబన్ధస్య సంక్షయే॥
నిరస్తాతిశయానందం వైష్ణవం పరమం పదమ్।
పునరావృత్తిరహితం కైవల్యం ప్రతిపద్యతే॥ ఇతి।

సూత్రకారోఽప్యాహ-

'భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే'

బ్ర. సూ. 4-1-19. ఇతి।

ఇతరే ప్రారబ్ధ పుణ్యపాపే।

వసిష్ఠోఽప్యాహ –

శ్లో॥ జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే।
విశ త్యదేహముక్తత్వం పవనోఽస్పన్దతామివ॥

ల.వా. 5-95॥ ఇతి।

నాయం దోషః, వివక్షావిశేషేణ మతద్వయస్యావిరోధాత్। విదేహముక్తిరిత్యత్రత్యేన దేహశబ్దేన కృత్స్నం దేహజాతం వివక్షిత్వా బహుభి ర్వర్ణితమ్। అస్మాభిస్తు భావిదేహమాత్ర వివక్ష యోచ్యతే; తదనారంభాయైవ జ్ఞానసంపాదనాత్। అయం తు

దేహః పూర్వమేవారబ్ధః, అతో జ్ఞానేనాపి నాస్యారంభో వారయితుం శక్యతే। ఏతద్దేహనివృత్తిరపి న జ్ఞానఫలమ్, అజ్ఞానినామపి ఆరబ్ధకర్మక్షయే తన్నివృత్తేః।

భావప్రకాశిక

వాక్యవృత్తియందు గూడ, ఇట్లు చెప్పబడినది-

జీవన్ముక్తుడు ప్రారబ్ధకర్మవేగముచేత, ఎప్పుడు కొంతకాలము ఉండునో, పిమ్మట, ఆ ఆరబ్ధకర్మబంధము సంక్షయము కాగా, నిరతిశయ ఆనందస్వరూపము, విష్ణుపరమపదము, పునరావృత్తి రహితమును అగు కైవల్యమును పొందుచున్నాడు.

సూత్రకారుడు గూడ, ఇట్లు చెప్పుచున్నాడు-

ఫలానుభవముచేత పాప, పుణ్యకర్మలను రెంటిని నశింపజేసికుని, తరువాత ముక్తుడగుచున్నాడు.

'ఇతరే'- అనగా ప్రారబ్ధ పుణ్య పాపములు.

వసిష్ఠుడు గూడ, ఇట్లు చెప్పుచున్నాడు-

జీవన్ముక్తపదమును వదలిపెట్టి, తన దేహము కాలాధీనము కాగా, సంచలనశీలమగు వాయువు నిశ్చలతను పొందినట్లు, జీవన్ముక్తుడు విదేహముక్తత్వమును ప్రవేశించుచున్నాడు అనినచో, ఇది దోషము కాదు. వక్తయొక్క ఇచ్ఛను అనుసరించి మతద్వయమునకు విరోధము లేదు అని గ్రహించవలెను. విదేహముక్తి యనుచోట, ఈ 'దేహ' శబ్దముచేత వర్తమాన, భావి స్థూలశరీర, లింగశరీరరూప దేహములను అన్నింటిని వివక్ష చేసి, పలువురిచే వర్ణింపబడెను. వారిచేతనైనచో రాబోవు దేహమును మాత్రమే దృష్టిలో ఉంచుకొని 'విదేహముక్తి' శబ్దముచేత భావి దేహరాహిత్యము అను అర్థమున, 'విదేహముక్తి' శబ్దము ప్రయోగింపబడినది. ఏలననగా భావి జన్మలు రాకుండుట కొరకే జ్ఞానము సంపాదింపబడినది. ఈ వర్తమాన దేహమైనచో జ్ఞానముకంటె

పూర్వమే ఆరంభింపబడినది గనుక, జ్ఞానముచేత గూడ, వర్తమాన దేహారంభము వారించుట శక్యము కాదు. ఈ వర్తమాన దేహనివృత్తి గూడ, జ్ఞానమునకు ఫలము కాదు. ఎందుచేతనంటే అజ్ఞానులకు గూడ, ప్రారబ్ధకర్మక్షయము కలుగగా, వర్తమాన దేహము నివర్తించుచున్నది.

### జీవన్ముక్తివివేకః

తర్హి వర్తమానలిఙ్గదేహనివృత్తిః జ్ఞానఫల మస్తు, జ్ఞాన మన్తరేణ తదనివృత్తేరితి చే న్న, సత్యపి జ్ఞానే జీవన్ముక్తే స్తన్నివృత్త్యభావాత్।

నను జ్ఞానస్య కంచిత్కాలం ప్రారబ్ధేన కర్మణా ప్రతిబన్ధేన అనివర్తకత్వేఽపి ప్రతిబన్ధక్షయే లిఙ్గదేహనివర్తకత్వం భవిష్యతీతి చేన్న, పంచపాదికాచార్యేణ 'యతో జ్ఞాన మజ్ఞానస్య నివర్తకమ్' ఇత్యుపపాదితత్వాత్। తర్హి లిఙ్గదేహనివృత్తేః కిం సాధనమితి చేత్, సామగ్రీనివృత్తిరితి బ్రూమః। ద్వివిధం హి కార్యనివర్తకమ్, విరోధిసద్భావః, సామగ్రీనివృత్తిశ్చేతి। తద్యథా విరోధినా వాయునా తైలవర్తిసామగ్రీనివృత్త్యా వా దీపో నివర్తతే। లిఙ్గ దేహస్య సాక్షాద్విరోధినం న పశ్యామః। సామగ్రీ హి ద్వివిధా, ప్రారబ్ధ మనారబ్ధం చేతి। తాభ్యా ముభాభ్యాం అజ్ఞానినాం లిఙ్గ దేహ ఇహాముత్ర చావతిష్ఠతే। జ్ఞానినాం తు అనారబ్ధస్య జ్ఞానేన నివృత్తేః। ప్రారబ్ధస్య చ భోగేన నివృత్తేః, తైలవర్తిరహిత దీప వత్సామగ్రీనివృత్త్యా లిఙ్గదేహో నివర్తతే। అతో న తన్నివృత్తిః జ్ఞానఫలమ్।

### భావప్రకాశిక

అట్లయినచో, వర్తమాన స్థూలదేహనివృత్తి, జ్ఞానఫలము కాకపోయినను, వర్తమాన లిఙ్గదేహనివృత్తి, జ్ఞానఫలము అని

చెప్పవచ్చును గదా! జ్ఞానము లేకుండా లిఙ్గదేహము నివర్తించదు గనుక అనినచో–

అట్లు కాదు. జ్ఞానము కలిగినను, జీవన్ముక్తునియందు లిఙ్గదేహము నివర్తించదు.

ఓయీ! అపుడు, జ్ఞానమునకు ప్రారబ్ధకర్మచేత కొద్దికాలము ప్రతిబంధము ఏర్పడినది. కనుక లింగదేహమునకు అప్పుడు జ్ఞానము నివర్తకము కాలేదు. ప్రతిబంధమగు ప్రారబ్ధము క్షయము నొందగానే, జ్ఞానము లిఙ్గదేహమునకు నివర్తకమగును అనినచో, అట్లు కాదు.

పంచపాదికాచార్యుడు–

"జ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకమ్"

జ్ఞానము అజ్ఞానమునకే నివర్తకము అని ఉపపాదించి ఉన్నాడు. కనుక, జ్ఞానము అజ్ఞానేతరమగు లింగదేహమునకు నివర్తకము కాజాలదు. అట్లయినచో, లింగదేహ నివృత్తికి సాధనమేమి? అని ప్రశ్నించినచో, సామగ్రీ నివృత్తియే సాధనము అని చెప్పుదుము. కార్యమును నివర్తిపజేయునవి– ఒకటి, విరోధి సద్భావము, రెండవది, సామగ్రీనివృత్తి అయి ఉన్నది. ఎట్లనగా, దీపము చమురు, వత్తి ఉన్నను, విరోధియగు వాయువుచేత నివర్తించును. మరియొకప్పుడు, తైలాది సామగ్రి లేనప్పుడు, దీపము నివర్తించుచున్నది. దీపమునకు వాయువువలె లింగదేహమునకు సాక్షాత్ విరోధి ఏదియు కన్పడదు. సామగ్రి ప్రారబ్ధము, అనారబ్ధము అని రెండు విధములు. అజ్ఞానులకు ఆరెంటిచేత లింగదేహము ఈ లోకమునందును, పరలోకమునందును ఉండును. జ్ఞానులకైనచో, అనారబ్ధము జ్ఞానముచేత నివర్తించును. ప్రారబ్ధము భోగముచేత నివర్తింపబడుచున్నది. తైలము, వత్తి లేని ప్రదీపమువలె జ్ఞానికి లింగదేహసామగ్రి

(కారణ సముదాయము) నివర్తించుటచేత లింగదేహము నివృత్తమగుచున్నది. కనుక, లింగదేహ నివృత్తి, జ్ఞానఫలముము కాదు.

### జీవన్ముక్తివివేకః

నన్వనేన న్యాయేన భావిదేహానారంభోఽపి న జ్ఞానఫలమ్। తథా హి కిమనారంభ ఏవ ఫలమ్, కింవా తత్ప్రపాలనమ్? నాద్యః తస్య ప్రాగభావరూపత్వేన అనాదిసిద్ధత్వాత్। న ద్వితీయః, అనారబ్ధ కర్మరూప సామగ్రీనివృత్త్యైవ భావిదేహారంభ, ప్రాగభావ ప్రతిపాలనసిద్ధేః। న చ తన్నివృత్తిః ఫలమ్, అవిద్యానివృత్తేరేవ విద్యాఫలత్వాత్। నైష దోషః, భావిజన్మానారంభాదీనాం విద్యాఫలత్వస్య ప్రామాణికత్వాత్। 'యస్మాద్ భూయో న జాయతే' కఠ. ఉ. 1-3-8 ఇత్యాద్యుదాహృతాః శ్రుతయ స్తత్ర ప్రమాణమ్। న చ జ్ఞాన మజ్ఞానస్యైవ నివర్తక మితి న్యాయేన విరోధః। అజ్ఞానసహభావనియతానా మబ్రహ్మత్వాదీనామ్ అజ్ఞానశబ్దేన పంచపాదికాచార్యై ర్వివక్షితత్వాత్। అన్యథాఽనుభవ విరోధః। అనుభూయతే హ్యజ్ఞాననివృత్తివద్ అబ్రహ్మత్వాది నివృత్తిరపి। తస్మా ద్భావిదేహరాహిత్యలక్షణ విదేహముక్తిః జ్ఞానసమకాలీనా। తథా చ, యాజ్ఞవల్క్యవచనం శ్రూయతే- 'అభయం వై జనక ప్రాప్తోఽసి' బృ. ఉ. 4-5-15 ఇతి చ। శ్రుత్యన్తరేఽపి 'తమేవం విద్వా నమృత ఇహ భవతి' ఇతి।

### భావప్రకాశిక

ఓయీ! లింగదేహనివృత్తి, జ్ఞానఫలము కాదు అని చూపిన ఈ న్యాయము (యుక్తి) చేతనే రాబోవు దేహముయొక్క అనారంభము కూడ, జ్ఞానఫలము కాదు, దీనినే ఉపపాదించుచున్నాము. జ్ఞానఫలము పద్మపాదాచార్యులవారు చెప్పినట్లు, అజ్ఞాననివృత్తియే కదా! ఒకవేళ, భావిజన్మయొక్క అనారంభము

జ్ఞానఫలమా? లేక భావిజన్మ ఆరంభ ప్రాగభావప్రతిపాలనము జ్ఞానఫలమా? ఉత్తరజన్మ ఆరంభభావము జ్ఞానఫలము అని చెప్పుటకు వీలుపడదు. ఆ జన్మారంభాభావము ప్రాగభావరూప మగుటచే, ప్రాగభావము అనాది అగుటచే (అదివరకే ఉండుటచే) ఇపుడు జ్ఞానజన్యమైన ఫలముగా చెప్పుటకు వలనుపడదు. ఇక ప్రాయశ్చిత్తముచే పాపకర్మఫల దుఃఖప్రాగభావప్రతిపాలనము వలె భావిజన్మ ఆరంభప్రాగభావప్రతిపాలనము జ్ఞానఫలము అని రెండవ పక్షమును ఆశ్రయించవలసియున్నది. కాని, అనారబ్ధ కర్మరూప సామగ్రీనివృత్తి చేతనే భావిదేహారంభ ప్రాగభావ ప్రతిపాలనము సిద్ధించును గనుక, జ్ఞానఫలము కానేరదు. భావి జన్మనివృత్తి కూడ, జ్ఞానఫలము కాదు. అవిద్యానివృత్తియే జ్ఞానఫలము కదా! అనినచో, ఇది దోషము కాదు. భావిజన్మ అనారంభాదులు జ్ఞానఫలముగా ప్రమాణసిద్ధములు.

'యస్మాద్ భూయో న జాయతే'

మొదలగు పూర్వము ఉదహరించిన శ్రుతులే ఆ విషయములో ప్రమాణము. అట్లయినచో,

'జ్ఞాన మజ్ఞానస్యైవ నివర్తకమ్'

అను న్యాయముతో విరోధము రాదా? విరోధము లేదు. ఏల యనగా, పంచపాదికాచార్యుని వచనమునందున్న 'అజ్ఞాన'శబ్దము చేత నియమముగా అజ్ఞానముతో గూడ ఉండునట్టి అబ్రహ్మ త్వాదులు గూడ, వివక్షచే సమ్మతములు. అట్లు కానిచో, అనుభవ విరోధము ఏర్పడును. జ్ఞానముచే అజ్ఞాననివృత్తివలె అబ్రహ్మ త్వాది నివృత్తి కూడ, అనుభవసిద్ధమై యున్నది. కనుక, భావి దేహరాహిత్యరూపమగు విదేహముక్తి, జ్ఞానసమకాలమునందే లభించును. కనుకనే యాజ్ఞవల్క్యవచనము బృహదారణ్యకము నందు ఇట్లు వినబడుచున్నది.

"అభయం వై జనక ప్రాప్తోఽసి"

ఓ జనకమహారాజా! నీవు సంసారభయమునుండి విముక్తుడవైతివి, ఇకమీదట జన్మలేదు అని పలికెను. ఇట్లే మైత్రేయీబ్రాహ్మణమున, యాజ్ఞవల్క్యుడు ఆత్మజ్ఞానోపదేశముచేసినతరువాత, 'ఓ మైత్రేయీ! ఇదియే అమృతత్వము, అనగా మోక్షము' అని పలికెను. మరియొక శ్రుతియందు గూడ,

"తమేవం విద్వానమృత ఇహ భవతి"

'ఆ పరమాత్మను తెలిసికొన్నవాడు ఈ లోకమునందే ముక్తుడగుచున్నాడు' అని అర్థము.

జీవన్ముక్తి వివేకః

యద్యుత్పన్నేఽపి తత్త్వజ్ఞానే తత్ఫలభూతా విదేహముక్తిస్తదానీం న భవేత్, కాలాన్తరే చ భవేత్, తదా జ్యోతిష్టోమాదావివ జ్ఞానజన్య మపూర్వం కించిత్కల్ప్యేత, తథా చ కర్మశాస్త్ర ఏవ జ్ఞానశాస్త్ర మన్తర్భవేత్। అథోచ్యతే మన్త్రాది ప్రతిబద్ధాగ్నివత్ ప్రారబ్ధప్రతిబద్ధం జ్ఞానం కాలాన్తరే విదేహముక్తిం దాస్యతీతి। మైవమ్, అవిరోధాత్। న హ్యస్మదభిమతా భావిదేహాత్యన్తాభావ లక్షణా విదేహముక్తిః వర్తమాన దేహమాత్రస్థాపకేన ప్రారబ్ధేన విరుధ్యతే, యేన ప్రతిబధ్యతే। కించ, క్షణికత్వేన కాలాన్తరే స్వయమవిద్యమానం జ్ఞానం కథం ముక్తిం దద్యాత్? జ్ఞానాన్తరం చరమసాక్షాత్కారలక్షణం ఉత్పత్స్యత ఇతి చేన్న, సాధనాభావాత్। ప్రతిబన్ధక ప్రారబ్ధనివృత్త్యైవ సహ గురు శాస్త్ర దేహేన్ద్రియాద్యశేష జగత్ప్రతిభాసనివృత్తేః కిం తత్సాధనం స్యాత్?

భావప్రకాశిక

తత్త్వజ్ఞానము కలిగినతరువాత గూడ, దాని ఫలమగు విదేహముక్తి అప్పుడు కలుగనేరదు. కాలాంతరమున (వర్తమాన

దేహపాతానంతరము) కలుగును అని చెప్పినచో, అప్పుడు జ్యోతిష్టోమాదులందువలె కాలాంతరఫలమును సాధించుటకు తత్త్వజ్ఞానముచేత గూడ, ఒక అపూర్వము కల్పించవలసి ఉండును. అప్పుడు, జ్యోతిష్టోమయాగము అపూర్వద్వారా స్వర్గ సాధనమైనటుల, తత్త్వజ్ఞానము గూడ, అపూర్వద్వారా ముక్తి సాధనమైనచో, జ్ఞానశాస్త్రము కూడ, కర్మశాస్త్రమునందే అంత ర్భవించును. అట్లు కాదు. అగ్ని, దాహజనకమైనను, మంత్రౌష ధాదులచే ప్రతిబద్ధమైనప్పుడు, దాహమును కలిగించనేరదు. ప్రతిబంధము నివృత్తమైనచో, కాలాంతరమున అగ్ని దాహమును కలిగించును. అట్లే, ప్రారబ్ధకర్మ ప్రతిబంధముచే జ్ఞానము, ముక్తిని కలిగించనేరదు. భోగముచే ప్రారబ్ధక్షయానంతరము తత్త్వజ్ఞానము ముక్తిఫలమును ఇచ్చును. అట్లు కాదు. ప్రారబ్ధ కర్మకు, తత్త్వజ్ఞానమునకు విరోధము లేదు. మేము జ్ఞానమువలన ఉత్తరజన్మయొక్క అత్యంతాభావరూప మగు విదేహముక్తిని ఫలముగా చెప్పుచున్నాము. ప్రారబ్ధకర్మ, వర్తమానదేహమును మాత్రమే నిలబెట్టగలదు. కనుక, తత్త్వజ్ఞాన, ప్రారబ్ధములకు విరోధము లేదు. విరోధము లేనప్పుడు, ప్రారబ్ధకర్మ, జ్ఞానమునకు ఎట్లు ప్రతిబంధక మగును? మరియు, ఈ తత్త్వజ్ఞానము మహా వాక్యముల వలన కలిగినతరువాత, కొంతకాలము ఉండి, నశించుటయే క్షణికము. కొంతకాలము జీవించి, వర్తమాన దేహపాతము జరిగినపుడు, అపుడు జ్ఞానమే లేదు గనుక, ముక్తిని ఎట్లు ఇచ్చును? చరమసాక్షాత్కారరూపమగు మరియొక జ్ఞానవృత్తి, ముక్తి నిచ్చునది ఉదయించగలదు అనినచో, అదియు సరికాదు. మరియొక జ్ఞానము పుట్టుటకు అపుడు సాధనములు లేవు కదా! తత్త్వజ్ఞాన ప్రతిబంధక ప్రారబ్ధము నివృత్తమైనపుడే గురు, శాస్త్ర, ఇంద్రియాదిరూపమగు సమస్త జగత్తుయొక్క ప్రతిభాసము

నివృత్తమైనందున, క్రొత్తగా మరియొక జ్ఞానము జనించుటకు మరియొక సాధనము ఏమి కలదు?

జీవన్ముక్తి వివేకః

తర్హి 'భూయశ్చాన్తే విశ్వమాయా నివృత్తిః' శ్వే.ఉ. 1-10 ఇత్యస్యాః శ్రుతేః కోఽర్థ ఇతి చేత్, ఆరబ్ధాన్తే నిమిత్తాభావాద్ దేహేన్ద్రియాద్యశేష నైమిత్తిక నివృత్తి రిత్యేవార్థః। తతో భవదభిమతా వర్తమాన దేహరాహిత్యలక్షణా విదేహముక్తిః పశ్చాదస్తు దేహపాతానంతరమ్। అస్మదభిమతా తు జ్ఞాన సమ కాలీనైవ। ఏతదేవాభిప్రేత్య భగవాన్ శేష ఆహ-

శ్లో॥ తీర్థే శ్వపచగృహే వా నష్టస్మృతిరపి పరిత్యజన్ దేహమ్।
జ్ఞానసమకాలముక్తః కైవల్యం యాతి హతశోకః॥ ఇతి।

భావ ప్రకాశిక

అట్లయినచో,

"భూయశ్చాన్తే విశ్వమాయానివృత్తిః"

అను ఈ శ్రుతికి అర్థమేమి? (జ్ఞానమువలననే అజ్ఞానకార్యములు కూడ, నివృత్తములగును అను అభిప్రాయముతో ఈ ప్రశ్న) అనినచో, ప్రారబ్ధకర్మపరిసమాప్తి యందు కారణసామగ్రి లేకపోవుటవలన, దేహేంద్రియాదిరూపమగు సమస్త కార్యముల నివృత్తి కలుగును అనియే అర్థము. కనుక, నీకు అభిమతమైన వర్తమాన దేహరాహిత్యమగు విదేహముక్తి, వర్తమాన దేహపాతానంతరము కలుగుగాక! మాకు అభిమతమైన విదేహముక్తి అయినచో, జ్ఞానసమకాలమునందే కలుగుచున్నది. ఈ అభిప్రాయముతోనే పరమార్థసారమున, శేషభగవానుడు ఇట్లు చెప్పెను-

గంగాది తీర్థములందు కాని, శ్వపాకుని గృహమునందు గాని, స్మృతి పోయినను, దేహమును పరిత్యజించినవాడు

జ్ఞానసమకాలముననందే ముక్తుడై శోకమును వీడి, కైవల్యమును పొందును

జీవన్ముక్తివివేకః

తస్మా ద్విదేహముక్తౌ సాక్షాత్సాధనస్య తత్త్వజ్ఞానస్య ప్రధానత్వమ్, వాసనాక్షయ మనోనాశయోః జ్ఞానసాధనత్వేన వ్యవహితత్వా దుపసర్జనత్వమ్। ఆసురవాసనాక్షయకారిణ్యా దైవవాసనయా జ్ఞానసాధనత్వం శ్రుతిస్మృత్యో రుపలభ్యతే- 'శాన్తో దాన్త ఉపరతి స్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యేవ ఆత్మానం పశ్యేత్' (బృ. ఉ. 4-4-23) ఇతి శ్రుతిః। స్మృతిరపి-
శ్లో॥ అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥
ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ।
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥
అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు॥
మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది॥
అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్।
ఏతజ్జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా॥
(భ. గీ. 13-8-12) ఇతి।

అన్యస్మిన్నహంబుద్ధి రభిష్వఙ్గః, జ్ఞాయతేఽనేనేతి, వ్యుత్పత్త్యా జ్ఞానసాధన మిత్యర్థః।

భావప్రకాశిక

కనుక, విదేహముక్తియందు సాక్షాత్సాధనమగు తత్త్వజ్ఞానమునకు ప్రాధాన్యము యుక్తమే అయి ఉన్నది. వాసనాక్షయ, మనోనాశములు జ్ఞానసాధనములు గనుక,

వ్యవహితము లగుటచే ఉపసర్జనత్వము, అనగా అప్రాధాన్యము ఆసురసంస్కారములను నశింపజేయు దైవసంపత్తునకు (సంస్కారములు) జ్ఞానసాధనత్వము శ్రుతి, స్మృతులయందు కన్పడుచున్నది.

శమము, దమము, ఉపరతి (సంన్యాసము, విక్షేప రాహిత్యము), శీతోష్ణాది ద్వంద్వసహనము, చిత్తైకాగ్రతతో ధ్యానము 'శ్రద్ధావిత్తః' అను మాధ్యందిన పాఠానుసారము శ్రద్ధ (గురువేదాంతవాక్యార్థ విశ్వాసము). ఇది దమశమాదిషట్కసంపత్తి బ్రహ్మవిచారమునకు పూర్వము ఉండునవి. వీనితో ఆత్మయందు మనస్సుతో పరమాత్మను (బ్రహ్మను) సాక్షాత్కరించుకొనవలెను అని బృహదారణ్యక శ్రుతి.

స్మృతి కూడ, దైవవాసనకు జ్ఞానసాధనత్వమును చెప్పుచున్నది—

1 'నేను గొప్పవాడను అను అభిమానము లేకపోవుట, 2 దంభము లేకపోవుట, 3 అహింస, 4 ఓరిమి, 5 కౌటిల్యము లేకపోవుట (మనోవాక్కాయములందు ఏకరూపత); 6 గురూపాసనము, 7 శౌచము, 8 స్థిరత్వము, 9 మనోనిగ్రహము (దేహేంద్రియసంఘాతము వశమువందుండుట) 10 శబ్దాది దృష్టాదృష్ట భోగములందు వైరాగ్యము, 11 బొత్తుగా అహంకారము లేకపోవుట, 12 జన్మ మృత్యు జరా వ్యాధిదుఃఖములయందు ముఖ్యముగా దోషమును పర్యాలోచన చేయుట, 13 విషయములందు సంగము లేకపోవుట, 14 దారాపుత్ర, గృహాదులందు తాదాత్మ్యభావము, మోహము లేకుండుట, 15 ఇష్టానిష్టములు సంప్రాప్తమైనపుడు నిర్వికారముగా నుండుట, 16 భగవంతుని యందు అనన్యభక్తి (భగవంతునికంటె వేరుగా మరియొక వస్తువు

లేదన్న భావముతోనున్న భక్తి) 17 విజనప్రదేశమునందు ఏకాంతవాసము (నివసించుట), 18 జనసమూహములో కలిసి ఉండుటకు ఇష్టపడకపోవుట, 19 నిరంతరము ఆత్మజ్ఞాన సంపాదనమునందు పూనిక, 20 తత్త్వజ్ఞానమునకు ఫలమగు మోక్షమును దృష్టిలో పెట్టుకొనుట- ఇవి జ్ఞానసాధనములు. వీనికంటె భిన్నములగు మానిత్వ, దంభ, హింసాదులు అజ్ఞానము అని భగవద్గీత నుడువుచున్నది. 13-8-12

అభిష్వంగ మనగా, తాను కాని దారాపుత్రాదులందు నేను (తానే) అనెడి భావము. 'జ్ఞాయతేఽనేనేతి జ్ఞానమ్' దీనిచేత తెలియబడుచున్నది అను కరణవ్యుత్పత్తిచే జ్ఞానశబ్దము జ్ఞానసాధనపరము.

జీవన్ముక్తివివేకః

మనోనాశస్యాపి జ్ఞానసాధనత్వం శ్రుతిస్మృతి ప్రసిద్ధమ్- 'తతస్తు తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః' ము. ఉ. 3-1-8 ఇతి శ్రుతిః। 'అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి' కఠ. ఉ. 2-12 ఇతి చ। ప్రత్యగాత్మ సమాధిప్రాప్త్యా దేవం జ్ఞాత్వేత్యర్థః।

శ్లో॥ యం వినిద్రా జితశ్వాసాః సంతుష్టాః సంయతేన్ద్రియాః।
జ్యోతిః పశ్యన్తి యుంజానా స్తస్మై విద్యాత్మనే నమః॥
మ. భా. శాం. 46-55

తదేవం తత్త్వజ్ఞానాదీనాం త్రయాణాం విదేహముక్తి జీవన్ముక్తివశాద్ గుణప్రధానభావవ్యవస్థా సిద్ధా।

భావప్రకాశిక

మనోనాశమునకు గూడ, జ్ఞానసాధనత్వము శ్రుతి స్మృతి ప్రసిద్ధము-

"తతస్తు తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః"

పరమాత్మధ్యానము చేసినవాడు పిమ్మట, నిరుపాధిక బ్రహ్మము దర్శించుచున్నాడు.

'అధ్యాత్మయోగాధిగమేన'

అను శ్రుతి, అధ్యాత్మయోగసాధనచే దేవుని తెలిసికొని, వివేకి హర్షశోకములను వదలిపెట్టును. ఇచట, 'ప్రత్యగాత్మసమాధిచే దేవుని తెలిసికొని' అని అర్థము. కనుక, మనోనాశము స్పష్టము.

ఏ యోగులు నిద్రను వీడి, శ్వాసజయము సంపాదించి, సంతుష్టులై, ఇంద్రియసంయమము కలవారై పరమాత్మ జ్యోతిస్సును దర్శింతురో అట్టి యోగస్వరూపునకు నమస్కారము అని స్మృతివచనము.

ఈ విధముగా తత్త్వజ్ఞాన, వాసనాక్షయ, మనోనాశములు మూడింటికి విదేహముక్తి, జీవన్ముక్తి అను ఫలభేదమునుబట్టి గుణప్రధానభావవ్యవస్థ సిద్ధించినది. విదేహముక్తికి తత్త్వజ్ఞానము ప్రధానము, వాసనాక్షయ, మనోనాశములు ఉపసర్జనములు. జీవన్ముక్తికి మనోనాశ, వాసనాక్షయములు ప్రధానములు, తత్త్వజ్ఞానము ఉపసర్జనము.

## జీవన్ముక్తివివేకః

నను వివిదిషాసంన్యాసినా సంపాదితానా మేతేషాం కిం విద్వత్సంన్యాసా దూర్ధ్వం అనువృత్తిమాత్రమ్, కిం వా పునరపి సంపాదనప్రయత్నో ఽపేక్షితః? నాద్యః, తత్త్వజ్ఞానస్యేవాన్యయో రప్యయత్నసిద్ధత్వే ప్రాధాన్య ప్రయుక్తాదరాభావప్రసంగాత్। న ద్వితీయః, ఇతరయోరివ జ్ఞానస్యాపి ప్రయత్నసాపేక్షత్వే సత్యుపసర్జనత్వ ప్రయుక్తౌదాసీన్యాభావ ప్రసంగాత్। నాయం దోషః; జ్ఞానస్యానువృత్తిమాత్ర మితరయోః యత్నసాధ్యత్వ మిత్యంగీకారాత్। తథా హి- విద్యాధికారీ ద్వివిధః, కృతోపాస్తి రకృతోపాస్తిశ్చేతి। తత్రోపాస్య సాక్షాత్కారపర్యన్తామ్ ఉపాస్తిం

కృత్వా యది జ్ఞానే ప్రవర్తేత తదా వాసనాక్షయ మనోనాశయోః దృఢతరత్వేన జ్ఞానా దూర్ధ్వం విద్వత్సంన్యాస జీవన్ముక్తీ స్వత ఏవ సిద్ధ్యతః। తాదృశ ఏవ శాస్త్రాభిమతో ముఖ్యో విద్యాధికారీ। తత స్తం ప్రతి శాస్త్రేషు సహోపన్యాసాత్, స్వరూపేణ వివిక్తావపి విద్వత్సంన్యాస వివిదిషాసంన్యాసౌ సంకీర్ణావివ ప్రతిభాసేతే।

## భావప్రకాశిక

ఓయీ ! వివిదిషాసంన్యాసిచేత సంపాదింపబడిన ఈ మనోనాశ, వాసనాక్షయ, తత్త్వజ్ఞానములు, విద్వత్సంన్యాసానంతరము అనువర్తించును అని అభిప్రాయమా ? లేక, వాసనాక్షయ, మనోనాశములు తిరిగి ప్రయత్నముతో సంపాదింపవలెనా? మొదటి అనువృత్తిపక్షమున, తత్త్వజ్ఞానము వలెనే వాసనాక్షయ, మనోనాశములు కూడ, విద్వత్సంన్యాసికి అయత్నసిద్ధములు. కనుక, వాసనాక్షయ, మనోనాశములకు ప్రాధాన్యము-ఆదరము చూపవలెను అనుట పొసగదు.

తత్త్వజ్ఞాన, వాసనాక్షయ, మనోనాశ సంపాదన ప్రయత్నము అపేక్షితము అను రెండవ పక్షము గూడ, సరికాదు. వాసనాక్షయ, మనోనాశములకు వలె జ్ఞానమునకు గూడ, ప్రయత్నసాపేక్షత్వము చెప్పినచో, విద్వత్సంన్యాసికి తత్త్వజ్ఞానము ఉపసర్జనము : అని చెప్పుటవలన, లభింపదగు ఔదాసీన్యము లేకపోవలసివచ్చును. ఇది, దోషము కాదు. విద్వత్సంన్యాసికి తత్త్వజ్ఞానము అనువృత్తము, వాసనాక్షయ, మనోనాశములు యత్నసాధ్యములు అని అంగీకరించుచున్నాము. అట్లే కదా! విద్యాధికారి, రెండు విధములుగా ఉండును- ఉపాసన చేసినవాడు, ఉపాసన చేయనివాడు. వారిలో ఉపాస్య సాక్షాత్కార పర్యంతము ఉపాసనను చేసి, జ్ఞానమునందు ప్రవర్తించినచో, అప్పుడు, వాసనాక్షయ, మనోనాశములు దృఢతరములు గనుక,

జ్ఞానానంతరము విద్వత్సంన్యాస, జీవన్ముక్తులు స్వయముగానే సిద్ధించును. అట్టివాడే వేదాంతశాస్త్రమునకు అభిమతమైన ముఖ్య విద్యాధికారి. అందువలన, వానిని గూర్చి, శాస్త్రములందు తత్త్వ జ్ఞానముతో గూడ, వాసనాక్షయ, మనోనాశములను ఉదహరించుట వలన విద్వత్సంన్యాస, వివిదిషాసంన్యాసములు పరస్పరము వేరు వేరు అయినను, కలిసిపోయినట్లు భాసించుచుండును.

**జీవన్ముక్తివివేకః**

ఇదానీంతనాస్తు ప్రాయేణాకృతోపాస్తయ ఏవౌత్సుక్య మాత్రాత్సహసా విద్యాయాం ప్రవర్తన్తే। వాసనాక్షయ మనోనాశౌ చ తాత్కాలికౌ నిష్పాద్యన్తే। తైశ్చ దృఢాభ్యస్తై రజ్ఞాన సంశయ విపర్యయ నిరాసాత్ తత్త్వజ్ఞానం సమ్యగుదేతి। ఉదితస్య జ్ఞానస్య బాధకప్రమాణాభావా న్నివృత్తాయా అవిద్యాయాః పున రుత్పత్తికారణాభావాచ్చ నాస్తి తస్య శైథిల్యమ్। వాసనాక్షయ మనోనాశౌ తు దృఢాభ్యాసాభావాద్ భోగప్రదేన ప్రారబ్ధేన తదా తదా బాధ్యమానత్వాచ్చ ప్రవాతప్రదేశదీపవత్సహసా నివర్తేతే। తథా చ వసిష్ఠః–

శ్లో॥ పూర్వైభ్యస్తు ప్రయత్నేభ్యో విషమోఽయం హి సంమతః।
దుఃసాధో వాసనాత్యాగః సుమేరూన్మూలనాదపి॥

ల. వా. 28–109. ఇతి।

అర్జునోఽపి–

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్ దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥

భ. గీ. 6–34. ఇతి।

తస్మాదిదానీంతనానాం విద్వత్సంన్యాసినాం జ్ఞానస్య అనువృత్తిమాత్రమ్। వాసనాక్షయ మనోనాశౌ తు ప్రయత్న సంపాద్యావితి స్థితమ్ (సిద్ధమ్)।

భావప్రకాశిక

బ్రహ్మవిద్యాభ్యాసమునకు ప్రయత్నించునట్టి ఆధునికు లయితే తరచుగా ఉపాసన చేయనివారే. బ్రహ్మవిద్యాఫలము గొప్పదియగుటచే కేవలము ఔత్సుక్యముతో త్వరగా బ్రహ్మవిద్య యందు ప్రవర్తించుచున్నారు. వాసనాక్షయ, మనోనాశము లను తాత్కాలికముగా సంపాదించుచున్నారు. అంతమాత్రము చేతనే శ్రవణ, మనన, నిదిధ్యాసనములు నిష్పన్నము లగుచున్నవి. ఈ శ్రవణ, మనన, నిదిధ్యాసనములను దృఢముగా అభ్యసించుటచేత అజ్ఞానము, సంశయము, విపర్యయము (భ్రాంతి-ఆత్మయందు అనాత్మభ్రాంతి, అనాత్మ యందు ఆత్మభ్రాంతి) తొలగి, తత్త్వజ్ఞానము బాగుగా కలుగును. ఆ తత్త్వజ్ఞానమునకు బాధక ప్రమాణము లేనందున, అవిద్య నివర్తించును. తిరిగి, అవిద్య (అజ్ఞానము) ఉత్పన్నమగుటకు కారణము లేదుగనుక, తత్త్వజ్ఞానమునకు శైథిల్యము లేదు. వాసనాక్షయ, మనోనాశములైతే, దృఢాభ్యాసము లేనందున, భోగము నిచ్చు ప్రారబ్ధకర్మచే బాధింపబడుటవలనను, గాలిలో ఉన్న దీపమువలె, ఆ వాసనాక్షయ, మనోనాశములు త్వరగా నివర్తించును.

వసిష్ఠుడు ఆ విషయమున ఇట్లు చెప్పుచున్నాడు—

పూర్వము చేసిన ప్రయత్నములకంటె ఇది (వాసనా త్యాగము), చాల కష్టమైనది. వాసనాత్యాగము మేరుపర్వతమును పెకలించుటకంటె గూడ దుఃసాధ్యము.

అర్జునుడు కూడ—

"చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్ దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥"

కృష్ణా! మనస్సు చాల చంచలమైనది, అనర్థమును కలిగించునది.

బలము కలది, దృఢమైనది. నేను ఆ మనస్సును నిగ్రహించుటను వాయునిగ్రహముకంటె గూడ, మిక్కిలి దుష్కరము అని భావించుచున్నాను అని పలికెను.

కనుక, నేటికాలపు విద్వత్సంన్యాసులకు జ్ఞానమునకు అనువృత్తి మాత్రమే. వాసనాక్షయ, మనోనాశములయినచో ప్రయత్నముచే సాధింపదగినవే అయి ఉన్నవి అని సిద్ధించినది.

జీవన్ముక్తివివేకః

నను కేయం వాసనా యస్యాః క్షయాయ ప్రయతితవ్య మితి చేత్ తత్స్వరూప మాహ వసిష్ఠః-

శ్లో॥ దృఢభావనయా త్యక్తపూర్వాపర విచారణమ్।
యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా॥
భావితం తీవ్ర సంవేగా దాత్మనా యత్తదేవ సః।
భవత్యాశు మహాబాహో విగతేతర సంస్మృతిః॥
తాదృగ్రూపో హి పురుషో వాసనావివశీకృతః।
సంపశ్యతి యదేవైతత్ సద్వస్త్వితి విముహ్యతి॥
వాసనావేగవైవశ్యాత్ స్వరూపం ప్రజహాతి తత్।
భ్రాన్తం పశ్యతి దుర్దృష్టిః సర్వం మదవశాదివ॥

ఉ.వా. 28, 48-51 ఇతి।

భావప్రకాశిక

ఓయీ! ఈ వాసన అనగా నేమి? దేని క్షయము కొరకై ప్రయత్నించవలయు నని చెప్పబడినదో, అది అని, అనినచో వసిష్ఠుడు ఆ వాసనాస్వరూపమును చెప్పుచున్నాడు-

"దృఢ భావనయా త్యక్త పూర్వాపర విచారణమ్।
యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా॥"

బహుకాలాభ్యాసముచేత పూర్వాపరవిచారణ లేకుండా దేనిచేత పదార్థము గ్రహింపబడునో, అది వాసన (సంస్కారము) అని

చెప్పబడును.

తనచేత తీవ్రవేగముతో ఏది భావింపబడునో, ఓ రాఘవా! అతడు ఆ భావితరూపమునే ఇతర విషయముల స్మృతి లేకుండా పొందుచున్నాడు.

భావనామయుడైన ఆ పురుషుడు, ఆ భావన వలననే పరవశుడై ఏది చూచుచున్నాడో, అదియే సద్వస్తువని మోహము చెందుచున్నాడు.

తద్వాసనావేగ పారవశ్యము వలననే ఆ వాస్తవ స్వరూపమును వదలిపెట్టుచున్నాడు. దోషదృష్టి కలవాడై మదవశము వలన చూచినట్లు, అంతయు భ్రాంతిగా చూచును.

జీవన్ముక్తివివేకః

అత్ర చ స్వస్వ దేశాచార కులధర్మ భాషాభేద తద్గతాపశబ్ద సుశబ్దాదిషు ప్రాణినా - మభినివేశః సామాన్యత ఉదాహరణమ్। విశేషతస్తు భేదానుక్త్వా పశ్చా దుదాహరామః। యథోక్తం వాసనా మభిప్రేత్య బృహదారణ్యకే శ్రూయతే- 'స యథాకామో భవతి తత్క్రతు ర్భవతి, యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే, యత్కర్మ కురుతే తదభిసంపద్యతే (బృ.ఉ. 4-4-5) ఇతి।

వాసనాభేదో వాల్మీకినా దర్శితః -

శ్లో॥ వాసనా ద్వివిధా ప్రోక్తా శుద్ధా చ మలినా తథా।
మలినా జన్మహేతుః స్యా చ్ఛుద్ధా జన్మవినాశనీ॥
అజ్ఞానసుఘనాకారా ఘనాహంకారశాలినీ।
పునర్జన్మకరీ ప్రోక్తా మలినా వాసనా బుధైః॥
పునర్జన్మాంకురం త్యక్త్వా స్థితా సంభృష్టబీజవత్।
దేహార్థం ధ్రియతే జ్ఞాతజ్ఞేయా శుద్ధేతి చోచ్యతే॥

ల.వా. 1-10-2 ఇతి।

దేహాదీనాం పంచకోశానాం తత్సాక్షిణ శ్చిదాత్మనశ్చ భేదావరక మజ్ఞానమ్, తేన సుష్ఠు ఘనీభూత ఆకారో యస్యాః సేయ మజ్ఞానసుఘనాకారా। యథా క్షీరం తక్రమేలనేన ఘనీభవతి, యథా వా విలీనం ఘృతం అత్యన్త శీతలప్రదేశే చిర మవస్థాపితం సుఘనీభవతి తథా వాసనా ద్రష్టవ్యాః, ఘనీభావశ్చాత్ర భ్రాన్తి పరంపరా।

## భావప్రకాశిక

ఈ వాసనావిషయములో తమ తమ దేశాచార, కులధర్మ, భాషాభేద, అపశబ్ద, సుశబ్దాదులయందు ప్రాణులకు ఉన్న అభినివేశము (పట్టుదల) సామాన్య ఉదాహరణము. ఈ వాసనా భేదములను చెప్పినతరువాత, విశేష ఉదాహరణములను తెలియ జేయుదుము. వెనుక చెప్పిన వాసనను, దృష్టిలో ఉంచుకొని, బృహదారణ్యకమునందు ఇట్లు వినబడుచున్నది-

"స యథాకామో భవతి తత్క్రతుర్భవతి, యత్క్రతుర్భవతి
తత్కర్మ కురుతే,యత్కర్మ కురుతే తదభిసమ్పద్యతే।"

అతడు ఏ కోరిక గలవాడగునో, దానియందే దృఢాభిలాష కలవాడు అగును. ఏ దృఢాభిలాష కలవాడగునో, ఆ పనిని చేయును. ఏ కర్మను చేయునో, తదాత్మకుడగును అని భావము.

వాసనాభేదము వాల్మీకిచేత ఇట్లు చూపబడినది-

వాసన శుద్ధము, మలినము అని రెండు విధములు. మలిన వాసన జన్మకారణ మగును. శుద్ధవాసన, జన్మరాహిత్యమునకు ఉపయోగించును.

అజ్ఞానముచే ఘనీభూతమైన ఆకారము కలది, దట్టమైన అహంకారముతో ఒప్పినది, జనన మరణములకు కారణమైనది మలిన వాసన అని విజ్ఞులచే చెప్పబడెను.

మరల, జన్మాంకురము పుట్టకుండా వేయించిన గింజలవలె ఉండునట్టి, తెలిసికొనవలసిన తత్త్వమును తెలుపునట్టి వాసన, శుద్ధ వాసన అని చెప్పబడును. ఇది దేహధారణకు మాత్రమే ఉపయోగించును.

దేహ, ప్రాణ, మనో, విజ్ఞాన, ఆనందమయ రూపములగు పంచకోశములకు, ఆ కోశములకు సాక్షియగు చిదాత్మకును గల భేదమును ఆవరించునది అజ్ఞానము. దానిచేత మిక్కిలి ఘనీభూతమైన ఆకారము గల వాసన, 'అజ్ఞానసుఘనాకారా'. ఎట్లనగా తక్రముతో మేలనము జరిగినపుడు క్షీరము ఘనీభూతము (దధి) అగుచున్నది. అట్లే కరిగిన ఘృతము, చల్లని ప్రదేశమునందు చాలసేపు ఉంచినచో పేరుకొనుచున్నది. వాసన కూడ, అట్లే అని గ్రహించవలెను. అజ్ఞానఘనీభావ మనగా పంచకోశములయందు తాదాత్మ్యభ్రాంతి పరంపర.

జీవన్ముక్తివివేకః

తాం చాసురసంపద్వివరణే భగవానాహ-

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥

అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్।
అపరస్పరసంభూతం కిమన్యత్ కామహైతుకమ్॥

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥

కామ మాశ్రిత్య దుష్పూరం దంభ మాన మదాన్వితాః।
మోహాద్ గృహీత్వాఽసంగ్రహాన్ ప్రవర్తన్తేఽశుచిప్రతాః॥

చిన్తా మపరిమేయాం చ ప్రలయాన్తా ముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః॥

ఆశాపాశశతై ర్బద్ధాః కామక్రోధపరాయణాః।
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసంచయాన్॥
భ.గీ. 16-8-12 ఇతి।

త ఆసురా జగదసత్యమాహుః। నాస్తి సత్యం వేద పురాణాది ప్రమాణం యస్మిన్ తాదృశం జగదాహుః। వేదానాం ప్రామాణ్యం న మన్యన్త ఇత్యర్థః। అత ఏవ నాస్తీశ్వరః కర్తా వ్యవస్థాపకశ్చ యస్మింస్తాదృశం జగదాహుః। తర్హి, కుతోఽస్య జగత ఉత్పత్తిం వదన్తీత్యత్రాహ- అపరస్పరేతి। అపరశ్చ పరశ్చేత్యపరస్పరమ్। అపరస్పరతో అన్యోన్యతః స్త్రీపురుష మిథునాత్ సంభూతం జగత్। కిమన్యత్ కారణమస్య? నాస్త్యన్యత్ కించిత్। కిన్తు కామహైతుకమ్, స్త్రీపురుషయోః కామ ఏవ ప్రవాహరూపేణ హేతు రస్యేత్యాహు రిత్యర్థః।

భావప్రకాశిక

ఆ మలిన వాసనను గురించి శ్రీకృష్ణభగవానుడు ఆసురసంపద్వివరణములో ఇట్లు చెప్పెను-

ఆసుర స్వభావముగల జనులు, ఏ పని చేయవలయునో, ఏ పని చేయరాదో యెరుగరు. వారియందు శౌచము లేదు, ఆచారము లేదు, సత్యము లేదు.

వారు, జగత్తు అసత్యము, అనగా వేదపురాణాది ప్రమాణ రహితము, నిలకడ లేనిది. ఈశ్వరుడు లేడు. స్త్రీపురుషుల సంబంధమువలన జగత్తు పుట్టినది. కామమే జగదుద్భవమునకు కారణము, మరియొకటి ఏమున్నది? అని చెప్పుదురు.

ఈ దృష్టిని అవలంబించి, చెడిపోయిన మనస్సు గలవారై అల్పబుద్ధులై, ఉగ్రకర్మలను ఆచరించువారై, ఉపద్రవకారులై, జగత్తుయొక్క క్షయము కొరకు వారు, కారణ మగుచున్నారు.

పూరింప నలవికాని కామము నాశ్రయించి, దంభము,

దర్పము, తామే గొప్పవారము అనుకొనుట కలవారై, అవివేకము వలన, దుష్టమైన అభినివేశములను స్వీకరించి పరిశుద్ధి, నియమము లేనివారై ప్రవర్తించుచున్నారు.

ప్రలయము వరకు అపరిమితమైన చింతకు లోనైనవారై, కామభోగములే జీవితపరమావధిగా ఎంచినవారై, వందలకొలది ఆశాపాశములలో చిక్కికొని, కామ, క్రోధవశులై, కామభోగముల కొరకు అన్యాయమార్గముచే విస్తారమైన ధనార్జనము కోరుచున్నారు.

ఆ అసురులు జగత్తు, అసత్యము అనుచున్నారు. వేదపురాణాది ప్రమాణము సత్యశబ్దమునకు అర్థము. వేదములు, పురాణములు, ధర్మశాస్త్రములు, ప్రమాణములు కావు అని వారి భావము. ఈశ్వరుడు లేడు, ఆయన సృష్టికర్త కాడు, భోక్తృభోగ్య ప్రపంచముమీద నియామకుడు లేడు. ఈ జగత్తు ఎట్లు పుట్టుచున్నది? అనగా, స్త్రీపురుష మిథునము వలననే పుట్టుచున్నది. అంతంటె మరియొక కారణము లేదు. అనాది కాలమునుండి కామమే ప్రవాహరూపముగా జగత్తునకు కారణము అని చెప్పుదురు.

జీవన్ముక్తి వివేకః

ఘనాహంకారశ్చ తత్రైవోదాహృతః-

శ్లో॥ ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥

అసౌ మయా హతః శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః॥

అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥
భ. గీ. 16–12–16 ఇతి।

ఏతేన పునర్జన్మకారణత్వ ముదాహృతం భవతి, తచ్చ పునః ప్రపంచితమ్।

శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధన మాన మదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్॥

అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః॥

తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్।
క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥

ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్॥
భ. గీ. 16–17–10 ఇతి।

## భావప్రకాశిక

ఘనాహంకారము కూడ, ఆసుర సంపద్వివరణమునందే వివరింపబడినది.

నేడు, నాచే ఇది సంపాదింపబడినది, రేపు ఈ మనోరథమును నెరవేర్చుకొందును (సంపాదింతును). నాకు ఇప్పుడు ఈ ధనము ఉన్నది. భవిష్యత్కాలమున, మరింత ధనము రాగలదు.

ఈ శత్రువు నాచేత చంపబడినాడు. తక్కిన శత్రువులను తరువాత చంపగలను. నేను ప్రభువును, నేను భోగిని, నేను సిద్ధుడను, బలవంతుడను, సుఖపడువాడను, ధనాఢ్యుడను, గొప్ప కులములో పుట్టినవాడను, నాతో సమానుడు ఎవడు కలడు? యాగము చేయుదును, దానము చేయుదును, ఆనందింతును సంతోషింతును అను అజ్ఞానముచే మోహితులై అనేక చిత్తభ్రమ

పరవశులై, మోహజాలములో చిక్కికొని కామభోగాసక్తులై దుఃఖకరమగు నరకలోకమున పడుచున్నారు అని భావము.

దీనిచే పునర్జన్మకారణము ఉదహరింపబడినట్లైనది. అది మరల వివరింపబడినది-

ఈ ఆసురస్వభావము కలవారు తాము గొప్పవారమని అనుకొందురు. పెద్దలయెడ విధేయత చూపరు. ధనమదముచేతను తాము గౌరవింపబడవలెను అను భావముతోను కూడుకొని యుందురు. వారు డంబముతో శాస్త్రవిధిని పాటించక పేరుకు మాత్రమే యజ్ఞములను ఆచరింతురు.

అహంకారమును, బలమును, దర్పమును, కామమును, క్రోధమును ఆశ్రయించినవారై, అసూయాపరులై, స్వ పరదేహములందు భగవంతుని ద్వేషింతురు. ద్వేషించు క్రూరులగు అట్టి నరాధములను నేను అశుభములైన ఆసురజన్మలలో పడవేయుదును.

ఆ అసురజన్మలలో, మూఢులగువారు నన్ను ఆరాధించక ఓ అర్జునా! అంతకంటె నీచమగు గతిని పొందుచున్నారు అని వివరింపబడినది.

### జీవన్ముక్తివివేకః

శుద్ధవాసనా తు జ్ఞాత జ్ఞేయా। జ్ఞేయస్వరూపం త్రయోదశాధ్యాయే భగవానాహ-

శ్లో॥ జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా ఽమృత మశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥

సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షి శిరోముఖమ్।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥

బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవ చ।
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్॥
అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్।
భూతభర్తృ చ తత్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥
జ్యోతిషామపి తత్ జ్యోతిః తమసః పర ముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥

ఇతి। భ.గీ. 13-12-17

అత్ర తటస్థలక్షణ స్వరూపలక్షణాభ్యా మవగన్తుం సోపాధిక నిరుపాధిక స్వరూపద్వయ ముపన్యస్తమ్। కదాచిత్సంబంధి సద్యల్లక్షయతి తత్తటస్థలక్షణమ్। యథా 'కాకవద్ దేవదత్తగృహమ్' ఇతి। తథా కాలత్రయసంబంధి సద్యల్లక్షయతి తత్స్వరూప లక్షణమ్। యథా 'ప్రకృష్టప్రకాశః చన్ద్రః' ఇతి।

భావ ప్రకాశిక

శుద్ధవాసన అయినచో జ్ఞేయస్వరూపమును తెలిసికొనుట కొరకు జ్ఞేయం=బ్రహ్మ ఉపయోగించునది (తెలియజేయునది). జ్ఞానస్వరూప జ్ఞానానంతరము ఉండునది-(జ్ఞేయ స్వరూపానంతర భావినీ), జ్ఞేయ స్వరూపమును త్రయోదశాధ్యాయమున, శ్రీకృష్ణ భగవానుడు ఇట్లు చెప్పుచున్నాడు-

తెలిసికొనదగిన వస్తువు జ్ఞేయము. దేనిని తెలిసికొని అమృతత్వమును పొందునో, అట్టి జ్ఞేయ వస్తువును గురించి ప్రవచింతును. ఆ జ్ఞేయము బ్రహ్మయే అయి ఉన్నది.

"అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే"

ఆ బ్రహ్మ ఆది కలది కాదు, సర్వోత్కృష్టమైనది. సత్ అని గాని, అసత్ అని గాని, చెప్పుటకు, వీలుపడనిది. 'యతో వాచో నివర్తన్తే' అను శ్రుతిచే శబ్దగమ్యము కానిది.

అన్ని వైపుల, హస్తపాదములు గలది. అన్ని దిశల, నేత్ర

శిరో ముఖములు కలది. అన్నివైపుల శ్రవణేంద్రియము గలది. లోకమునందు సర్వమును ఆవరించి ఉన్నది.

సర్వేంద్రియ విషయములను (చిదాభాసునిచే) ప్రకాశింప జేయునది... ఏ ఇంద్రియములు లేనిది, సంగము లేనిది.

సర్వమును ధరించునది (సర్వాధిష్ఠానము), ప్రకృతిగుణ రహితమైనది. ప్రకృతిగుణకార్యములను సుఖదుఃఖ మోహములను జీవరూపముతో అనుభవించునది.

సర్వభూతములకు శరీరము లోపల, బయట ఉండునది. స్థావర జంగమాత్మకమైనది.

సూక్ష్మమగుటచే ఇంద్రియగోచరము కానిది, దూరము నందు ఉన్నది, దగ్గర ఉన్నది.

సర్వప్రాణులందు విభాగము లేక, ఏకరూపముగా నుండునది. విభక్తమువలె కన్పించునది. సర్వభూతములకు ఉత్పాదకము, రక్షకము, సంహారకము అయినది.

ఆదిత్యాది జ్యోతిస్సులకు గూడ, ప్రకాశకమగు జ్యోతిస్సు అయిఉన్నది. అజ్ఞానమునకు ఆవల ఉండునది (అజ్ఞానసర్శలేనిది). జ్ఞానస్వరూపము, జ్ఞానగమ్యము నగు ఆ జ్ఞేయము అందరి హృదయములందు అధిష్ఠించి ఉన్నది (విశేషించి ఉన్నది).

ఇచట, జ్ఞేయముగా చెప్పబడిన బ్రహ్మవస్తువు, సోపాధిక, నిరూపాధిక స్వరూపద్వయముతో తటస్థలక్షణ, స్వరూపలక్షణము లచే తెలిసికొనుటకు ఉపన్యసింపబడినది. తటస్థలక్షణ మనగా, కొంతకాలము మాత్రమే ఉండి, వస్తువును తెలియజేయునది. ఉదా : 'కాకవద్దేవదత్తగృహమ్' ఇది దేవదత్తగృహము అని తెలిసికొనుటకు ఆ యింటిమీద వ్రాలియున్న కాకి ఉపయోగపడు చున్నది. కనుక, కాకము తటస్థలక్షణము. స్వరూపలక్షణ మనగా, ముందుకాలములయందు (ఎల్లపుడు) ఉండి, వస్తువును తెలియ

జేయునది. ఉదా : 'ప్రకృష్టప్రకాశశ్చన్ద్రః' ఇచట, చంద్రుని యందు నక్షత్రాదులకంటె అధికమగు ప్రకాశము కాలత్రయము నందు ఉన్నది, చంద్రస్వరూపమును తెలియజేయుచున్నది. కనుక, ప్రకృష్ట ప్రకాశము చంద్రునకు స్వరూప లక్షణము అని తెలియనగును.

### జీవన్ముక్తివివేకః

నను త్యక్తపూర్వాపర విచారత్వం వాసనాలక్షణ ముక్తమ్, జ్ఞేయ జ్ఞానం చ విచారజన్యమ్, అతో న శుద్ధాయాం తల్లక్షణ మస్తి। మైవమ్, లక్షణే దృఢభావనయేత్యుక్తత్వాత్। యథా బహుషు జన్మసు దృఢభావితత్వేన అస్మిన్ జన్మని వినైవ పరోపదేశ మహంకార మమకార కామ క్రోధాదయో మలినవాసనా ఉత్పద్యన్తే, తథా ప్రాథమికస్య బోధస్య విచారజన్యత్వేఽపి దీర్ఘకాల నైరన్తర్యసత్కారై ర్భావితే తత్త్వే పశ్చాద్వాక్య యుక్తి పరామర్శమన్తరేణైవ పురోవర్తి ఘటాదివత్ సహసా తత్త్వం పరిస్ఫురతి, తాదృశ్యా బోధానువృత్త్యా సహిత ఇన్ద్రియ వ్యవహారః శుద్ధవాసనా। సా చ దేహజీవనమాత్రాయ ఉపయుజ్యతే, న తు దంభ దర్పాద్యాసుర సంప దుత్పాదనాయ, నాపి జన్మాంతరహేతు ధర్మాధర్మోత్పాదనాయ। యథా భృష్టాని వ్రీహ్యాది బీజాని కుసూలపూరణ మాత్రాయోపయుక్తాని, న తు రుచిరాన్నాయ నాపి సస్యనిష్పత్తయే, తద్వత్।

### భావప్రకాశిక

ఓయీ! పూర్వాపర విచారణ లేకుండా పనిని చేయించునది వాసన అని వాసనాలక్షణము చెప్పబడినది. జ్ఞేయమగు బ్రహ్మ యొక్క జ్ఞానము బ్రహ్మవిచారణవలన కలుగును. శుద్ధవాసన బ్రహ్మజ్ఞానమును కలిగించనేరదు కదా? అనినచో—

అట్లు కాదు. వాసనాలక్షణమున 'దృఢభావనయా' అని చెప్పబడినది. ఎట్లనగా, బహుజన్మలందు దృఢముగా భావితమైనవి ఈ జన్మయందు పరోపదేశము లేకయే అహంకార, మమకార, కామ, క్రోధాదులు మలినవాసనచేత ఉత్పన్నములు అగుచున్నవి. అట్లే మహావాక్యములందు ప్రాథమికబోధ, విచార జన్యమే అయినను, దీర్ఘకాల నైరంతర్య సత్కారములతో (ఆదరముతో) తత్త్వము తరువాత భావితము కాగా, వాక్య, యుక్తి, పరామర్శలు లేకుండగనే ఎదుటనున్న ఘటాదులు 'ఇది ఘటము' అను విధముగా వెంటనే తెలిసినట్లు, తత్త్వము పరిస్ఫురించును. అటువంటి బోధానంతర భావి తత్త్వస్ఫురణలో బోధానువృత్తితో కూడిన ఇంద్రియ వ్యవహారము శుద్ధవాసన అని చెప్పబడును. ఆ శుద్ధవాసన, దేహజీవనమాత్రము కొరకే ఉపయోగపడుచున్నది. దంభ, దర్పాది రూపమగు ఆసుర సంపదను కలుగజేయనేరదు. ఎట్లనగా, వేయించిన వ్రీహ్యాది బీజములు గాదెను నింపుటకు మాత్రమే ఉపయోగపడును, మనోహరమగు అన్నముకొరకు గాని, అంకురాది రూపమున సస్యనిష్పత్తికి గాని, అవి ఉపయోగింపవు. ఆ విధముగానే జ్ఞానానంతర ఇంద్రియ వ్యవహారమగు శుద్ధవాసన, జన్మాంతరారంభకము కాజాలదు.

జీవన్ముక్తివివేకః

మలినా చ వాసనా త్రివిధా— లోకవాసనా, శాస్త్రవాసనా, దేహవాసనా చేతి। సర్వే జనా యథా మాం న నిన్దన్తి యథా వా స్తువన్తి తథైవ సర్వదాఽఽచరిష్యామీత్యభినివేశో లోకవాసనా। తస్యాశ్చ సంపాదయితుం అశక్యత్వాత్ మలినత్వమ్। తథాహి—

శ్లో॥ కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్।

రామా. 1-1-2.

ఇత్యాదినా బహుధా వాల్మీకిః పప్రచ్ఛ-

శ్లో॥ ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః।

రామా. 1-1.

ఇత్యాదినా ప్రత్యుత్తరం నారదో దదౌ। తాదృశస్యాపిరామస్య పతివ్రతాశిరోమణిభూతాయా జగన్మాతుః సీతాయాశ్చ శ్రోతు మశక్యో జనాపవాదః సంప్రవృత్తః, కిము వక్తవ్య మన్యేషామ్? తథా హి, దేశవిశేషేణ పరస్పరం నిందాబాహుల్య ముపలభ్యతే, దాక్షిణాత్యైర్వైప్రైర్గౌత్తరాహా వేదవిదో విప్రా మాంసభక్షిణో నిన్ద్యన్తే। ఔత్తరాహైశ్చ మాతులసుతోద్వాహినో యాత్రాసు మృద్భాండవాహినో దాక్షిణాత్యా నిన్ద్యన్తే। బహ్వృచాః ఆశ్వలాయనశాఖీయాః కాణ్వశాఖాం అప్రశస్తాం మన్యన్తే। వాజసనేయినస్తు వైపరీత్యేన। ఏవం స్వ స్వకుల గోత్ర బన్ధువర్గేష్టదేవతాది ప్రశంసా పరకీయనిందా చ ఆవిద్వదంగనా గోపాలం సర్వత్ర ప్రసిద్ధా।

## భావప్రకాశిక

మలిన వాసన లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అని మూడు విధములు. 'జనులందరు నన్ను ఎన్నడు నిందించకుందురో, ఏవిధముగా స్తుతింతురో, అట్లే నేను నడచుకొందును' అని అభినివేశము లోకవాసన. దీనిని సంపాదించుట దుర్ఘటము గనుక, ఈ వాసన మలినము.

వాల్మీకి శ్రీమద్రామాయణమున, 'నేడు లోకములో గుణవంతుడు, వీర్యవంతుడు ఎవరు?' అని ప్రశ్నించగా, నారద మహాముని-

'ఇక్ష్వాకువంశ ప్రభవో రామః'

అని మొదలుపెట్టి, బహుగుణములు గల రాముడు అని ప్రత్యుత్తర మిచ్చెను. అట్టి శ్రీరామునకు, పతివ్రతాశిరోమణి, జగన్మాత

యగు సీతాదేవికి గూడ, వినుటకు శక్యము కాని జనాపవాదము లోకమునందు ప్రవృత్తమైనది. ఇక, తక్కినవారి మాట చెప్పనేల? ఆ యా దేశవిశేషములందు పరస్పరము నిందించుకొనువారు విస్తారముగా కన్పడుచున్నారు. దాక్షిణాత్యులు అగు విప్రులు, ఔత్తరాహులగు వేదవిదులైన బ్రాహ్మణులను మత్స్య, మాంస భక్షకులని నిందించుచున్నారు. ఔత్తరాహులు, దాక్షిణాత్యులను మేనమామ కూతురును వివాహమాడుదురనియు, యాత్రా సమయమున, మట్టిపాత్రలను వెంటబెట్టుకొని గూడా పోవుదురని నిందించుచున్నారు. ఆశ్వలాయన శాఖీయులగు ఋగ్వేదులు కాణ్వశాఖను అప్రశస్తముగా తలంతురు. శుక్లయజుశ్శాఖవారైతే కాణ్వశాఖను ప్రశస్తముగా తలంతురు. ఈవిధముగా, తమ తమ కుల, గోత్ర, బంధువర్గ, దేవతాది ప్రశంసను, పరకీయ నిందను చేయుట పండిత, పామర, స్త్రీ, బాలగోపాల పర్యన్తము ప్రసిద్ధము. లోకవాసనకు ఇది ఉదాహరణము.

జీవన్ముక్తివివేకః

ఏతదేవాభిప్రేత్యోక్తమ్—

శ్లో॥ శుచిః పిశాచో విచలో విచక్షణః క్షమోఽప్యశక్తో
బలవాంశ్చ దుష్టః।
నిశ్చిన్త చోరః సుభగోఽపి కామీ కో లోక
మారాధయితుం సమర్థః॥ ఇతి।

శ్లో॥ విద్యతే న ఖలు కశ్చిదుపాయః సర్వలోకపరితోషకరో యః।
సర్వథా స్వహిత మాచరణీయం కిం కరిష్యతి జనో
బహుజల్పః॥ ఇతి।

అతో లోకవాసనయా మలినత్వ మభిప్రేత్య యోగీశ్వరస్య తుల్యనిందాస్తుతిత్వం మోక్షశాస్త్రేషు వర్ణితమ్।

భావ ప్రకాశిక

లోకారాధన దుర్ఘటము అను అభిప్రాయముతోనే ఇట్లు చెప్పబడినది-

పరిశుద్ధుడు పిశాచముగాను, చపలుడు విద్వాంసుడుగాను, దక్షుడు గూడ కొన్ని కార్యములందు అశక్తుడుగాను, బలవంతుడు దుష్టుడుగాను, మనసు లేనివాడు గూడ (పరవిత్తమునందు) చోరుడుగాను, సుందరుడు గూడ, కాముకుడుగాను కన్పడు చున్నారు. ఎవడు లోకమును మెప్పించుటకు సమర్థుడు అగును? అని చెప్పబడినది.

సర్వ జనులను సంతోషపరచునట్టి ఉపాయము ఒక్కటిగూడ, కన్పడదు. కనుక, తన హితమును తాను అన్ని ఉపాయములతో ఆచరించుకొనవలెను. ఇష్టము వచ్చినట్లు వాగునట్టి జనము ఏమి చేయగలదు? అనియు చెప్పబడినది.

ఇందువలన, లోకవాసన మలిన మను అభిప్రాయముతో యోగీశ్వరునకు తుల్యనిందాస్తుతిత్వము, మోక్షశాస్త్రమునందు వర్ణింపబడినది.

జీవన్ముక్తి వివేకః

శాస్త్రవాసనా త్రివిధా- పాఠవ్యసనం, బహుశాస్త్రవ్యసనం, అనుష్ఠానవ్యసనం చేతి। పాఠవ్యసనం భరద్వాజేఽవగమ్యతే। స హి పురుషాయుషత్రయేణ బహూన్వేదా నధీత్యేన్ద్రేణ చతుర్థాయుషి ప్రలోభిత స్తస్త్రాపి పరిశిష్ట వేదాధ్యయనాయోద్యమం చకార। తస్యాపి పాఠస్యాశక్యత్వా న్మలిన వాసనాత్వమ్। తాం చాశక్యతా మిన్ద్రః ప్రతిబోధ్య పాఠా న్నివర్త్య తతోఽప్యధికాయ పురుషార్థాయ సగుణబ్రహ్మవిద్యా ముపదిదేశ। తదేతత్సర్వం తైత్తిరీయ బ్రాహ్మణే ద్రష్టవ్యమ్। తథైవాత్యన్తిక పురుషార్థభావా ద్బహుశాస్త్రం వ్యసనస్య మాలిన్యం కావషేయగీతాయా

ముపలభ్యతే- కశ్చిన్ముని ర్దుర్వాసా బహువిధశాస్త్ర పుస్తకభారైః సహ మహాదేవం నమస్కర్తుం ఆగత స్సభాయాం మునినా నారదేన భారవాహి గర్దభసామ్య మాపాదితః। కోపాత్పుస్తకాని లవణార్ణవే పరిత్యజ్య మహాదేవేన ఆత్మవిద్యాయాం ప్రవర్తితః ఇతి। ఆత్మవిద్యా చాన్తర్ముఖస్య గురుకారుణ్యరహితస్య న వేద శాస్త్రమాత్రేణోత్పద్యతే। తథా చ శ్రుతిః- 'నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన' కఠ. ఉ. 1-2-22) ఇతి। అన్యత్రాప్యుక్తమ్-

శ్లో॥ బహుశాస్త్రకథా కన్థారోమన్థేన వృథైవ కిమ్।
అన్వేష్టవ్యం ప్రయత్నేన తత్త్వజ్ఞైః జ్యోతి రాన్తరమ్॥ ఇతి।

శ్లో॥ అధీత్య చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః।
బ్రహ్మతత్త్వం న జానాతి దర్వీ పాకరసం యథా॥ ఇతి చ।

భావప్రకాశిక

శాస్త్రవాసన కూడ- పాఠవ్యసనము, బహుశాస్త్రవ్యసనము, అనుష్ఠాన వ్యసనము అని మూడు విధములు. పాఠవ్యసనము భరద్వాజునియందు తెలియబడుచున్నది. ఆ భరద్వాజుడైతే మూడు పురుషాయుషములు (మూడువందల సంవత్సరములు) బహువేదములను అధ్యయనము చేసెను. ముసలివాడై పరుండి ఉండగా ఇంద్రుడు వచ్చి, నాలుగవ పురుషాయుషమును కూడ, నీకు ఇచ్చెదను, ఏమి చేయుదువు? అనెను. మిగిలిన వేదములను అధ్యయనము చేయుదును అని బదులు చెప్పెను. కాని, అప్పటికిని, వేదపాఠము పూర్తిచేయుట శక్యము కాదు గనుక, ఇది మలిన వాసన అయి ఉన్నది. ఇంద్రుడు కొండలను చూపి, సమగ్రముగ వేదములన్నియు పఠించుట శక్యము కాదు అని ఉపదేశించి, తరువాత వేదపాఠమునుండి మరలించి, అంతకంటె ఉత్తమమగు సగుణబ్రహ్మవిద్యను అధికపురుషార్థము కొరకు

ఉపదేశించెను. ఇది యంతయు తైత్తిరీయ బ్రాహ్మణమునందు చూడదగును.

అట్లే, బహుశాస్త్రవ్యసనము కూడ, ఆత్యంతిక పురుషార్థమును ఈయజాలదు గనుక, మాలిన్యముగా కావషేయగీతయందు చూడబడుచున్నది. దుర్వాసమహాముని బహువిధశాస్త్ర పుస్తక భారములతో మహాదేవుని నమస్కరించుటకు వచ్చెను. ఆ సభలో ఉన్న నారదముని 'భారవాహి' వచ్చెను అని పలికెను. అపుడు, దుర్వాసుడు కోపముతో పుస్తకముల నన్నిటిని లవణసముద్రములో పారవేసి మహాదేవునిచే ఆత్మవిద్యయందు ప్రవర్తింపజేయబడెను అని అచట కలదు. ఆత్మవిద్య అయినచో, అంతర్ముఖునకు, గురు అనుగ్రహము కలవానికి మాత్రమే లభించును గాని, బహిర్ముఖునకు, గురుకృప లేనివానికి, వేదశాస్త్ర అధ్యయన మాత్రముచేత కలుగనేరదు. అట్లే శ్రుతి కలదు–

"నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన।"

ఈ ఆత్మ, ప్రవచనముచేతను సాక్షాత్కరింపబడదు. బుద్ధికుశలత చేతను గ్రహింపబడదు. బహువిద్యలచేతను ఆత్మసాక్షాత్కారము కానేరదు అని శ్రుతివచన తాత్పర్యము.

మరియొకచోట కూడ, ఇట్లు చెప్పబడినది–

బహుశాస్త్రచర్చ, గోష్ఠులయందు నెమరువేయుటచేత ఏమి ప్రయోజనము? తత్త్వము తెలిసికొనదలచినవారు ప్రయత్నముతో సర్వాంతరమగు చైతన్య జ్యోతిస్సును అన్వేషించవలయును.

నాలుగు వేదములను, ధర్మశాస్త్రములను అనేకములను చదివి కూడ, గరిటె పాకరసమును తెలియనట్లు బ్రహ్మతత్త్వమును తెలిసికొనలేడు అని చెప్పబడినది.

జీవన్ముక్తివివేకః

'నారద శ్చతుష్షష్టికలాకుశలోఽపి అనాత్మవిత్త్వేన

అనుతప్తః సనత్కుమార ముపససాద' ఛాం. 7. ఇతి ఛన్దోగా అధీయతే। అనుష్ఠానవ్యసనం విష్ణుపురాణే నిదాఘస్యోపలభ్యతే। వాసిష్ఠ రామాయణే దాశూరస్య। నిదాఘోహి ఋభుణా పునః పునః ప్రబోధ్యమానోఽపి కర్మ శ్రద్ధాజాడ్యం చిరం న జహౌ। దాశూరశ్చ అత్యన్త శ్రద్ధాజాడ్యేన అనుష్ఠానాయ శుద్ధప్రదేశం భూమౌ న క్వాప్యుపలేభే। అస్యాశ్చ కర్మవాసనాయాః పునర్జన్మహేతుత్వాత్ మలినత్వమ్।

## భావప్రకాశిక

నారదుడు చతుష్షష్టి కళలందు నిపుడు అయినను, ఆత్మవేత్త కాకపోవుటచే పరితాపమునొందినవాడై సనత్కుమారుల వారిని ఆత్మవిద్యకొరకై ఉపసదనవిధితో ప్రార్థించెను అని సామశాఖీయులు ఛాందోగ్యోపనిషత్తునందు అధ్యయనము చేయుచున్నారు.

అనుష్ఠాన వ్యసనము విష్ణుపురాణమున, నిదాఘునకు కన్పడుచున్నది. నిదాఘుడు ఋభువుచే నూటిమాటికి తత్త్వజ్ఞానోపదేశము చేయబడినవాడైనను, కర్మశ్రద్ధాజాడ్యమును చాల కాలమువరకు వదలిపెట్టలేదు. దాశూరుడు అత్యంత కర్మశ్రద్ధాజాడ్యముచే భూమియందు అనుష్ఠానమునకు శుద్ధమైన ప్రదేశమును ఎచ్చటను కనుగొనలేకపోయెను. ఈ కర్మవాసన, పునర్జన్మకు కారణమగుటచే మలినము.

## జీవన్ముక్తివివేకః

తథా చాథర్వణికా అధీయతే-

శ్లో॥ ప్లవాహ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్త
మవరం యేషు కర్మ।
ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢా జరామృత్యుం తే
పునరేవాపియన్తి ॥

అవిద్యాయా మన్తరే వర్తమానాః స్వయం ధీరాః
పండితంమన్యమానాః।
జంఘన్యమానాః పరియన్తి మూఢా అన్ధేనైవ
నీయమానా యథాఽన్ధాః॥
అవిద్యాయాం బహుధా వర్తమానా వయం కృతార్థ
ఇత్యభిమన్యన్తి బాలాః।
యత్కర్మిణో న ప్రవేదయన్తి రాగాత్తేనాతురాః
క్షీణలోకాశ్చ్యవన్తే॥
ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం నాన్యచ్ఛ్రేయో
వేదయన్తేఽత్ర మూఢాః।
నాకస్యపృష్ఠే తే సుకృతేఽనుభూత్వేమం లోకం
హీనతరం వా విశన్తి॥ ఇతి।

## భావప్రకాశిక

ఈ విధముగానే అథర్వవేదశాఖీయులు అధ్యయనము చేయుచున్నారు. (పదునారు గురు ఋత్విక్కులు, యజమానుడు, పత్ని) పదునెనిమిదిమంది జనముతో కూడినవి యజ్ఞరూపములగు ఈ నావలు గట్టివి కావు. ఈ యజ్ఞములందు అల్పఫలము కలుగును. ఈ యజ్ఞకర్మలను శ్రేయస్సుగా అభినందించునట్టి మూఢులు జరామరణములను మాటిమాటికి పొందుచున్నారు.

అవిద్యలో చిక్కికొనినవారై తామే ధీరులము, పండితులము అని తలంచుచు సంసారప్రవాహములో కొట్టుకొని గ్రుడ్డివానిచేత తీసికొనబడిన గ్రుడ్డివారలవలె సంచరించుచున్నారు.

బాలురు (అవివేకులు) అగు వీరు అజ్ఞానములోనే బహు విధముగా నడచుకొనుచు, తాము కృతార్థులమని తలంచుచు అభిమానము కలిగి ఉన్నారు. రాగవశమున, కర్మతులైన వీరు

ఆత్మతత్త్వమును తెలిసికొనలేకున్నారు. అందువలన, ఆతురులైన వీరు కర్మఫలభోగానన్తరము పై లోకమునుండి ఇహలోకమునకు జారిపడుచున్నారు.

కర్మఠులగు ఈ మూఢులు ఇష్టాపూర్తయాగములే శ్రేష్ఠము లని తలంచుచు మరియొక శ్రేయస్సును కానక, స్వర్గలోకమున సుకృతము ననుభవించి, ఈ లోకమును గాని, ఇంతకంటె హీనమగు మరియొక లోకమును గాని, ప్రవేశించుచున్నారు.

## జీవన్ముక్తివివేకః

భగవతాఽప్యుక్తమ్–

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యద స్తీతి వాదినః॥
కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి॥
భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే॥
త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥
యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే।
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥ ఇతి।

భ. గీ. 2-42-46

దర్పహేతుత్వాచ్చ శాస్త్రీయ వాసనయా మలినత్వమ్। శ్వేతకేతు రల్పేనైవ కాలేన సర్వాన్వేదానధీత్య దర్పేణ పితురపి పురతో వినయం న చకారేతి చ్ఛన్దోగాః షష్ఠాధ్యాయే పఠన్తి। తథా బాలాకిః కానిచి దుపాసనా న్యవగత్య దృప్త ఉశీనరాదిషు బహుషు దేశేషు దిగ్విజయేన బహూన్విప్రా నవజ్ఞాయ కాశ్యా మజాతశత్రుం బ్రహ్మవిచ్ఛిరోమణి మనుశాసితుం ధార్ష్ట్యం

చకారేతి కౌషీతకినో వాజసనేయినశ్చాధీయతే।

భావప్రకాశిక

శ్రీకృష్ణభగవానునిచేత గూడ, ఇట్లు చెప్పబడెను–

అర్జునా! అవిద్వాంసులు, పుష్పములవంటి అర్థవాదవాక్యములచే ఆకర్షించునట్టి ముందుచెప్పబోవునట్టి యీ వాక్కును పలుకుచున్నారు. వారు కర్మకాండప్రతిపాదకములైన వేదవాక్యములందు ఆసక్తి కలవారు, వైదిక కర్మఫలము కంటె మరియొకటి ఉత్కృష్టమైనది లేదు అని పలికెడివారు.

కామస్వభావులు, స్వర్గపరులు, కర్మఫలమును మరల జన్మను ఇచ్చునట్టి క్రియావిశేషములతో నిండిన భోగైశ్వర్య మార్గముల గురించి ప్రవృత్తులు.

ఆ భోగైశ్వర్య గతిచే ఆకర్షింపబడిన చిత్తము గలిగి, భోగైశ్వర్యములందే ప్రసక్తులైనవారికి నిశ్చయాత్మకమగు ఆత్మజ్ఞానము అంతఃకరణమునందు కలుగనేరదు.

పూర్వకాండాత్మకమగు వేదభాగములు సత్త్వ, రజ, స్తమో గుణాత్మక సంసారవిషయములు. అర్జునా! నీవు త్రిగుణాతీతుడవు, ద్వంద్వాతీతుడవు, నిత్యము సత్త్వస్థుడవు, యోగక్షేమములను ఆశించనివాడవు, మనోనిగ్రహము కలవాడవు కమ్ము.

జలపానాదులకు మాత్రమే ఉపయోగించునట్టి వాపీ, కూపాదులందు ఎంత ప్రయోజనము కలదో, పొంగి పొరలి ప్రవహించు నదులయందు, సరోవరములందును ఆ ప్రయోజనము కలదు. వేదకర్మకాండ భాగములందు ఏ ప్రయోజనము కలదో, వేదాన్త బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారము గల బ్రాహ్మణునకు అంత ప్రయోజనము కలదు. అనగా, జ్ఞానఫలమునందు కర్మఫలము అంతర్భవించును అని శ్రీకృష్ణపరమాత్మ పలికెను.

శాస్త్రీయవాసన, దర్పకారణమగుటవలన గూడ, మలినము.

శ్వేతకేతువు, స్వల్పకాలములోనే సర్వవేదములను అధ్యయనము చేసి, గర్వముతో తండ్రిముందర గూడ, వినయమును చూపక పోయెను అని సామవేదశాఖీయులు షష్ఠాధ్యాయమున పఠించుచున్నారు. అట్లే, బాలాకి అను బ్రాహ్మణుడు కొన్ని ఉపాసనలను తెలిసికొని, గర్వితుడాయెను. అతడు, ఉశీనరాది దేశములందు దిగ్విజయముచే అనేక బ్రాహ్మణులను అవమానించి, కాశీపట్టణమునందు బ్రహ్మవిచ్ఛిరోమణి యగు అజాతశత్రువుపట్ల అనుశాసించుటకు (విద్యోపదేశము చేయుటకు) ధార్ష్ట్యమును అవలంబించెను అని శుక్లయజుశ్శాఖీయులు, కౌషీతకులు అధ్యయనము చేయుచున్నారు.

## జీవన్ముక్తివివేకః

దేహవాసనాఽపి ఆత్మవద్గుణాధాన దోషాపనయన భ్రాంతి భేదాత్ త్రివిధా। తత్రాత్మత్వం భాష్యకార ఉదాజహార- 'దేహమాత్రం చైతన్యమాత్రవిశిష్ట మాత్మేతి ప్రాకృతా జనా లోకాయతికాశ్చ ప్రతిపన్నాః (బ్ర. సూ. భా. 1-1-1) ఇతి। 'స వా ఏష పురుషోఽన్నరసమయః' ఇత్యారభ్య 'తస్మాదన్నం తదుచ్యతే' (తై.ఉ. 2-1-2) ఇత్యన్తేన గ్రంథేన తామేవ ప్రాకృత ప్రతిపత్తిం తైత్తిరీయాః స్పష్టీకుర్వన్తి। 'విరోచనః ప్రజాపతినా అనుశిష్టోఽపి స్వచిత్తదోషేణ దేహాత్మబుద్ధిం దృఢీకృత్య అసురాన్ సర్వా ననుశశాస' ఇతి చ్ఛన్దోగా అష్టమాధ్యాయే సమామనన్తి। గుణాధానం ద్వివిధమ్, లౌకికం శాస్త్రీయం చేతి। సమీచీన శబ్దాదిసంపాదనం లౌకికమ్, కోమలధ్వనినా గాతు మధ్యేతుం వా తైలపాన మరీచభక్షణాదిషు లోకాః ప్రయతన్తే। మృదుస్పర్శాయ లోకాః పుష్టికరా వౌషధాహారా వుపయుంజతే। లావణ్యాయాభ్యంగోద్వర్తన దుకూలాలంకారా నుపసేవన్తే। సౌగంధ్యాయ స్రగాలేపనే ధారయన్తి। శాస్త్రీయం

గుణ మాధాతుం గంగాస్నాన సాలగ్రామతీర్థాదికం సంపాదయన్తి। దోషాపనయనం చ చికిత్సకోక్తై రౌషధైర్ముఖాది ప్రక్షాళనేన చ లౌకికమ్, శౌచాచమనాదిభి ర్వైదిక మిత్యుభయవిధమ్। అస్యాశ్చ దేహవాసనయా మాలిన్యం వక్ష్యతే। దేహస్యాత్మత్వం తావ దప్రామాణికత్వా దశేష దుఃఖహేతుత్వాచ్చ మలినమ్। అస్మింశ్చార్థే పూర్వాచార్యైః సర్వైరపి పరాక్రాన్తమ్। గుణాధానం చ ప్రాయేణ న పశ్యామః। ప్రసిద్ధా ఏవ గాయకా అధ్యాపకాశ్చ' ప్రయతమానా అపి బహవో ధ్వనిసౌష్ఠవం న లభన్తే। మృదుస్పర్శోఽఙ్గపుష్టిశ్చ న నియతౌ। లావణ్య సౌగంధ్యే అపి దుకూలస్రగాదినిష్ఠే, న తు దేహనిష్ఠే।

భావప్రకాశిక

దేహవాసన కూడ, ఆత్మత్వము, గుణాధానము, దోషాపనయనము అను భ్రాంతులచే మూడు విధములు. వానిలో దేహమునందు ఆత్మత్వభ్రాంతిని భాష్యకారులు ఉదహరించెను.

"దేహమాత్రం చైతన్యవిశిష్ట మాత్మేతి ప్రాకృతా
లోకాయతికాశ్చ ప్రతిపన్నాః।"

చైతన్యవిశిష్టమగు దేహమే ఆత్మ అని పామరులు, నాస్తికులగు లోకాయతికులు తలంచుచున్నారు. ఈ దేహము అన్నరసమయము అని మొదలుపెట్టి, 'తస్మాదన్నం తదుచ్యత ఇతి' అను గ్రంథ పర్యంతము ఆ ప్రాకృత జనులయొక్క జ్ఞానమును తైత్తిరీయులు స్పష్టము చేయుచున్నారు. విరోచనుడు, బ్రహ్మదేవునిచే ఆత్మోపదేశము పొందినవాడైనను, తన చిత్తమునందలి దోషము చేత దేహమునందు ఆత్మత్వబుద్ధిని దృఢ మొనర్చుకొని అసురులందరికి దేహాత్మవిద్యనే బోధించెను అని ఛందోగులు అష్టమ అధ్యాయమున పఠించుచున్నారు.

ఇక, గుణాధానము రెండు విధములు— ఒకటి లౌకికము,

రెండవది శాస్త్రీయము. మంచి (మధురాది) శబ్దములను స్పర్శాదులను సంపాదించుట లౌకికము. లోకులు సుకుమారమగు ధ్వనిచే (తో) గానము చేయుటకు, అధ్యయనము చేయుటకును, నూనె త్రాగుట, మిరియములను తినుట మొదలగు ఉపాయములచే ప్రయత్నించుచున్నారు. మృదు స్పర్శకొరకు లోకులు పుష్టికరములగు ఔషధాహారములను ఉపయోగించుచున్నారు. లావణ్యము కొరకు అభ్యంజనస్నానము, నలుగు పెట్టుకొనుట, పట్టువస్త్రములు– వీనిని సేవించుచున్నారు. సౌగంధ్యము కొరకు పుష్పమాలా, చందనలేపనాదులను ధరించుచున్నారు. శాస్త్రీయమగు గుణాధానము కొరకు గంగాస్నాన, సాలగ్రామ తీర్థాదికమును సేవించుచున్నారు.

ఇక, దోషాపనయనము– వైద్యులచే చెప్పబడిన ఔషధముల చేతను,ముఖాది ప్రక్షాళనముచేతను లౌకికము,శౌచ, ఆచమనాదులచే వైదికము అని రెండు విధములు. ఈ దేహవాసనయొక్క మాలిన్యము రాబోవు గ్రంథమున చెప్పబడును. దేహమునకు ఆత్మత్వము అప్రామాణికము, సమస్త దుఃఖములకు కారణము అగుటచే మలినము. ఈ విషయమున, పూర్వాచార్యులందరు దేహాత్మవాదనిరాకరణమును విపులముగా వివరించిరి. ఉపాయము చేత గుణాధానమును తరచుగా మేము చూడలేదు. ప్రసిద్ధులైన గాయకులు, అధ్యాపకులు కూడ, ప్రయత్నించినను, ఎక్కువమంది ధ్వనిసౌష్ఠవమును పొందలేకున్నారు. మృదుస్పర్శ, అంగపుష్టియు నియత ఫలములు కావు. లావణ్య, సౌగంధ్యములు కూడ, దుకూల స్రగాదులందు ఉండునవియే గాని, దేహమునందున్నవి కావు.

జీవన్ముక్తివివేకః

అత ఏవ విష్ణుపురాణేఽభిహితమ్–

శ్లో॥ మాంసాసృక్పూయ విణ్మూత్ర స్నాయు మజ్జాస్థి సంహతౌ।
దేహే చే త్ప్రీతిమాన్మూఢో భవితా నరకేఽపి సః॥
స్వదేహాశుచిగంధేన న విరజ్యేత యః పుమాన్।
వైరాగ్యకరణం తస్య కిమన్య దుపదిశ్యతే॥ ఇతి।

శాస్త్రీయం చ గుణాధానం ప్రబలేన శాస్త్రాన్తరేణాపోహ్యతే, యథా 'న హింస్యాత్సర్వా భూతాని' ఇత్యస్య, 'అగ్నీషోమీయం పశుమాలభేత' ఇత్యనేనాపవాద స్తద్వత్ ప్రబలతరం శాస్త్ర మేతదన్యశాస్త్రాపేక్షయా।

శ్లో॥ యస్యాత్మబుద్ధిః కుణపే త్రిధాతుకే స్వధీః కలత్రాదిషు భౌమ ఇజ్యధీః।
య స్తీర్థబుద్ధిః సలిలే న కర్హిచి జ్జనే ష్వభిజ్ఞేషు స ఏవ గోఖరః॥ భాగ।

అత్యన్తమలినో దేహో దేహీ చాత్యన్త నిర్మలః।
ఉభయోరన్తరం జ్ఞాత్వా కస్య శౌచం విధీయతే॥ ఇత్యాది।

యద్యప్యనేన శాస్త్రేణ దోషాపనయనం ప్రతిషిధ్యతే న తు గుణాధానమ్। తథాఽపి సతి విరోధిని ప్రబలదోషే గుణ ఆధాతు మశక్య ఇత్యర్థాద్ గుణాధానస్య ప్రతిషేధః। అత్యన్త మాలిన్యం చాత్ర మైత్రాయణీయ శాఖాయాం శ్రూయతే–

'భగవన్నస్థి చర్మ స్నాయు మజ్జా మాంస శుక్ర శోణితాశ్రు దూషికాదూషితే విణ్మూత్ర వాత పిత్త కఫ సంఘాతే దుర్గంధే నిస్సారేఽస్మిఞ్ఛరీరే కిం కామోపభోగైః' (1-1-2) ఇతి।

శరీరమిదం మైథునాదేవోద్భూతం సంవిద్వ్యపేతం నిరయ ఇవ మూత్రద్వారేణ నిష్క్రాన్త మస్థిభి శ్చిత్తం మాంసేనాను లిప్తం చర్మణాఽవనద్ధం విణ్మూత్ర పిత్త కఫ మజ్జామేదో వసాభి రన్యైశ్చ మలై ర్బహుభిః పరిపూర్ణం కోశ ఇవ వసునా' ఇతి చ।

చికిత్సయా చ రోగశాన్తి ర్న నియతా। శాన్తోఽపి రోగః

కదాచి త్పునరుదేతి। నవభిశ్ఛిద్రైర్నిరన్తరం స్రవత్సు మలేషు రోమకూపై రసంఖ్యాతైః స్విన్నే గాత్రే కో నామ ఖేదేన ప్రక్షాలయితుం శక్నుయాత్?

తదుక్తం పూర్వాచార్యైః-

శ్లో॥ నవచ్ఛిద్రయుతా దేహాః స్రవన్తి ఘటికా ఇవ।
బాహ్యశౌచై ర్న శుధ్యన్తి నాన్తః శౌచం చ విద్యతే॥
అతో దేహవాసనా మలినా॥

### భావప్రకాశిక

ఇందువలననే విష్ణుపురాణమునందు ఇట్లు చెప్పబడినది-

మాంస, రక్త, అమేధ్య, మూత్ర, స్నాయు, మజ్జా, అస్థి సముదాయరూపమగు దేహమునందు ప్రీతి కలిగినవాడు అయినచో, ఆ మూఢుడు నరకమునందు గూడ ఉండగలడు.

ఏ పురుషుడు తన శరీరముయొక్క అశుచిపదార్థ గంధముచే విరక్తి నొందజాలడో, అతనికి వైరాగ్యకారణము మరియొకటి ఏది ఉపదేశింపబడును? అని చెప్పబడినది.

శాస్త్రీయమగు గుణాధానము ప్రబలమైన మరియొక శాస్త్రముచేత నిరాకరింపబడుచున్నది. ఎట్లనగా, 'మాహింస్యాత్ సర్వాభూతాని' ఏ ప్రాణినైనను హింసించరాదు అను శాస్త్రమునకు 'అగ్నిషోమీయం పశుమాలభేత' అగ్నిషోమీయ పశువును ఆలంభనము చేయువలయునను శాస్త్రముచే అపవాదము వలె ఇతర శాస్త్రములకంటె ఈ వేదాంతశాస్త్రము మరింత ప్రబలము.

వాత, పిత్త, శ్లేష్మధాతువులతో ఉన్న శవమువంటి శరీరమునందు ఎవనికి ఆత్మ అనెడి బుద్ధి కలదో, భార్యాపుత్రాదులందు స్వత్వబుద్ధి కలదో, మృణ్మయమగు ప్రతిమలందు పూజనీయ దేవతాబుద్ధి కలదో, ఎవడు సలిలమునందు పవిత్ర తీర్థబుద్ధి కలవాడగునో, అభిజ్ఞ జనులందు తీర్థబుద్ధి కలవాడై ఎప్పుడును

ఉండడో, వాడే, గోవులకు మేత తీసికొని వచ్చు గర్దభము వంటివాడు.

శరీరము మిక్కిలి మలినమైనది. దేహి యగు ఆత్మ మిక్కిలి శుద్ధమైనవాడు. ఈ రెంటికి గల భేదమును తెలిసికొని, ఎవరికి శౌచము విధింపబడుచున్నది?

(దేహమునకు శౌచ మొనరించినను, మరల మరల మలిన మగుచునే ఉండును. కనుక, శౌచము వలన ఉపయోగము లేదు. ఆత్మ, శుద్ధమగుటచే శౌచము అక్కరలేదు.)

విచారించగా, ఈ శాస్త్రముచేత దోషమును తొలగించుట ప్రతిషేధింపబడినదేగాని, గుణాధానము చెప్పబడలేదు. అయినను, విరోధి యగు ప్రబల దోషము ఉండగా, గుణాధానము శక్యము కాదు. కనుక, అర్థాపత్తిచే గుణాధానమునకు గూడ ప్రతిషేధము. దేహమునకు అత్యన్త మాలిన్యము మైత్రాయణీయ శాఖయందు వినబడుచున్నది.

పూజ్యుడా! ఎముక, చర్మము, నరములు, మజ్జ,మాంసము, శుక్రము, శోణితము, శ్లేష్మము, పుసి, కన్నీరు మొదలగు దోషములతో కూడుకొనిన, మూత్ర, పురీష, వాత, పిత్తసంఘాత రూపము, దుర్గంధము, నిస్సారము అగు ఈ శరీరమునందు కామోపభోగములవలన ఏమి ప్రయోజనము?' 'ఈ శరీరము మైథునమువలననే ఉత్పన్నము, జడము, నరకమువలె మూత్ర ద్వారముతో నిర్గతము, ఎముకల ప్రోవు, మాంసముచే పూయ బడినది. చర్మముతో కప్పబడినది. పురీష, మూత్ర, పిత్త, కఫ, మజ్జ వసలచేతను, మరియు ఇతరములైన బహువిధ మలముల చేతను పరిపూర్ణము. ధనముచే కోశమువలె, మలములతో పూర్ణము.

చికిత్సచేత రోగశాంతి తప్పక లభించును అను నియమము

లేదు. తగ్గిన రోగము గూడ, ఒకప్పుడు మరల పైకి వచ్చును. నవచ్ఛిద్రములచే ఎడతెగకుండ స్రవించు మలములందు అసంఖ్యాకములగు రోమకూపములచే చెమర్చిన శరీరమును విచారముతో పూర్తిగా క్షాళనము చేసికొనుటకు ఎవడు సమర్థుడగును ?
పూర్వాచార్యులచే ఆ విషయమే చెప్పబడినది.

"నవచ్ఛిద్రయుతా దేహాః స్రవన్తి ఘటికా ఇవ।
బాహ్యశౌచైర్న శుద్ధ్యన్తి నాన్తఃశౌచం చ విద్యతే॥"

నవరంధ్రములతో కూడిన దేహములు, కాలగణనమునకు ఉపయోగించు చిన్న చిన్న కుండలవలె స్రవించుచుండును. బాహ్య శౌచములచే శరీరములు శుద్ధములు కావు. అంతఃశౌచము లేనేలేదు. కనుక, దేహవాసన మలినము.

జీవన్ముక్తివివేకః

తదేతన్మాలిన్య మభిప్రేత్య వసిష్ఠ ఆహ–

శ్లో॥ ఆపాదమస్తక మహం మాతాపితృవినిర్మితః।
ఇత్యేకో నిశ్చయో రామ బన్ధాయాసద్విలోకనాత్॥

ల. యో. వా 20, 42

సా కాలసూత్రపదవీ సా మహావీచివాగురా।
సాఽసిపత్రవనశ్రేణీ యా దేహోఽహమితి స్థితిః॥
సా త్యాజ్యా సర్వయత్నేన సర్వనాశోఽప్యుపస్థితే।
స్ప్రష్టవ్యా సా న భవ్యేన సశ్వమాంసేన పుల్కసీ॥

ల. వా. 20, 16-17. ఇతి।

తదేత ల్లోక శాస్త్ర దేహవాసనాత్రయ మవివేకినాం ఉపాదేయత్వేన ప్రతిభాసమానమపి వివిదిషో ర్వేదనోత్పత్తి విరోధిత్వాత్ విదుషో జ్ఞానప్రతిష్ఠావిరోధిత్వాచ్చ వివేకిభి ర్హేయమ్। అత ఏవ స్మర్యతే–

శ్లో॥ లోకవాసనయా జంతోః శాస్త్రవాసనయాఽపి చ।

దేహవాసనయా జ్ఞానం యథావ న్నైవ జాయతే॥

సూ. సం. ఇతి।

యా తు దంభ దర్పా ద్యాసురసంప ద్రూపా మానసవాసనా। తస్యా నరకహేతుత్వా న్మాలిన్య మతిప్రసిద్ధమ్। అతః కేనా ప్యుపాయేన వాసనాచతుష్టయస్య క్షయః సంపాదనీయః।

భావప్రకాశిక

ఈ మాలిన్యమును (మలిన వాసనలను) మనస్సులో నుంచుకొని, వసిష్ఠుడు ఇట్లు పలికెను–

ఓ రామా! ఆపాదమస్తకము నేను మాతాపితరులచే నిర్మింప బడినవాడను అను ఈ ఒక్క నిశ్చయము సరిగా విమర్శ చేయక పోవుట వలన, బంధము కొరకు అయి ఉన్నది.

దేహమే ఆత్మ యనెడి ఈ స్థితి, కాలసూత్ర నరకమార్గము, మహావీచి నరకజాలము, అసిపత్రవన నరకపంక్తి.

ఎన్ని పోయినను, సర్వప్రయత్నముతో ఈ 'దేహోఽహం' భావమును వదలిపెట్టవలెను. మంగళస్వరూపునిచే (భవ్యః= సౌమ్యుడు) కుక్కమాంసముతో కూడిన పుల్కసస్త్రీవలె ఆ దేహాత్మ స్థితి స్పృశింపతగినది కాదు అని చెప్పబడినది.

ఆ యీ లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసనాత్రయము అవివేకి జనులకు గ్రాహ్యముగా తోచినను, తత్త్వజిజ్ఞాసువునకు జ్ఞానము కలుగుటకు ప్రతిబంధకము గావున, తత్త్వజ్ఞానము కలిగినవానికి ఆ జ్ఞానము దృఢముగా నిలుచుటకు విరోధులైనందున వివేకము కలవారు ఆ మూడు వాసనలను వదలిపెట్టవలయును.

కనుకనే, ఇట్లు స్మరింపబడినది–

ప్రాణికి లోకవాసనచేతను, శాస్త్రవాసనచేతను మరియు దేహవాసనచేతను, జ్ఞానము సమీచీనముగా కలుగనేరదు.

ఇవి గాక, దంభ, దర్పాది ఆసుర సంపదరూపములు మానస

వాసన అయితే నరకప్రాప్తికి హేతువగును గనుక, ఆ మానస వాసనకు మాలిన్యము అతిప్రసిద్ధము. కావున, ఏదియో ఉపాయముచేత ఈ నాలుగు వాసనలయొక్క క్షయము సంపాదింపదగియున్నది.

### జీవన్ముక్తివివేకః

యథా వాసనాయాః క్షయః సంపాదనీయస్తథా మనసోఽపి। న చ తార్కికవన్నిత్యద్రవ్య మణుపరిమాణం మనో వైదికా అభ్యుపగచ్ఛన్తి యేన మనోనాశో దుఃసంపాదః స్యాత్। కిం తర్హి సావయవ మనిత్యం సర్వదా జతుసువర్ణాదివద్బహువిధ పరిణామార్హం ద్రవ్యం మనః। తస్య లక్షణం ప్రమాణం చ వాజసనేయినః సమామనన్తి– 'కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధాధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యేతత్సర్వం మన ఏవ (బృ. 1–5–3) ఇత్యేతల్లక్షణమ్। యాః కామాది వృత్తయః క్రమేణోత్పద్యమానాః చాక్షుషప్రత్యక్ష ఘటాదివత్ సాక్షిప్రత్యక్షేణాతి స్పష్టం భాసన్తే, తదుపాదానం మన ఇత్యర్థః। 'అన్యత్ర మనా అభూవం నాదర్శ మన్యత్ర మనా అభూవం నాశ్రౌషమ్' (బృ. 1–5–3) ఇతి। 'మనసా హ్యేష పశ్యతి మనసా శృణోతి' (బృ. 1–5–3) ఇత్యేతత్ప్రమాణమ్।

### భావప్రకాశిక

ఏవిధముగా వాసనాక్షయము సంపాదింపదగినదో, అదే విధముగా మనోనాశము గూడ, సంపాదింపదగినది. తార్కికుల వలె మనస్సు, నిత్యద్రవ్యము, అణుపరిమాణము అని వైదికులు అంగీకరించరు. తార్కిక మతమున మనస్సు నిత్యమైనను, వేద ప్రమాణమును అనుసరించువారు మనస్సు, జన్యము అని అంగీకరించుచున్నారు. కావున, మనోనాశము అసంభవము కాదు. వైదిక సిద్ధాంతమున మనస్సు, సావయవము, అనిత్యము,

ఎప్పుడును లక్క, బంగారమువలె బహువిధమైన పరిణామమును పొందగల ద్రవ్యము మనస్సు. దానికి లక్షణమును, ప్రమాణమును శుక్లయజుశ్శాఖీయులు ఇట్లు చెప్పుచున్నారు. కోరిక, సంకల్పము, సంశయము, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యము, అధైర్యము, భయము, లజ్జ, జ్ఞానము ఇవి అన్నియు, మనస్సే. అనగా, మనస్సుయొక్క పరిణామములు. జలము బుద్బుద (బుడగ) పరిణామములను ధరించినట్లు, మనస్సు కామాది వృత్తి పరిణామమును చెందును. ఇది, మనోలక్షణము. కోరిక మొదలగు వృత్తులు క్రమముగా ఉత్పన్నములైనవి. కంటికి ఘటము కన్పడు విధమున, సాక్షిప్రత్యక్షవేద్యములై స్పష్టముగా భాసించుచుండును. కనుక, ఆ కామాదివృత్తులకు ఉపాదానకారణము మనస్సు అని అర్థము. 'నా మనస్సు ఎక్కడనో ఉండెను, అందువలన చూడకపోయితిని. నా మనస్సు ఎచ్చటనో ఉండెను, వినకపోయితిని' అని చెప్పునట్టియు,

"మనసా హ్యేవ పశ్యతి మనసా శృణోతి।"

మనస్సుచేతనే చూచుచున్నాడు, మనస్సుచేతనే వినుచున్నాడు అను శ్రుతివాక్యములు మనస్సు ఉన్నదిఅనుటకు ప్రమాణములు.

## జీవన్ముక్తివివేకః

చక్షుః సన్నికృష్టః స్థితాలోక మధ్యవర్తీ ఘటః శ్రోత్ర సన్నికృష్ట ఉచ్చైః పఠితో వేదశ్చ యస్యానవధానే సత్యపి న ప్రతీయతే, అవధానే తు ప్రతీయతే, తాదృశం సర్వవిషయ ఉపలబ్ధి సాధారణకారణం అన్వయ వ్యతిరేకాభ్యాం ప్రతీయత ఇత్యర్థః। 'తస్మాదపి పృష్ఠత ఉపస్పృష్టో మనసా విజానాతి' (బృ. 1-5-3) ఇత్యేత దుదాహరణమ్। యస్మాచ్చ లక్షణ ప్రమాణాభ్యాం సిద్ధం మన స్తస్మా త్తదేవ ముదాహరణీయమ్। పృష్ఠభాగేఽప్యన్యేన ఉపస్పృష్టో దేవదత్తో విశేషేణ జానాతి

హస్తస్పర్శోఽయమ్ అంగులిస్పర్శోఽయమితి। న హి తత్ర చక్షుః ప్రసరతి, త్వగిన్ద్రియం తు మార్దవకాఠిన్యమాత్రగ్రహణ ఉపక్షీణమ్. తస్మాన్మన ఏవ విశేషజ్ఞానకారణం పరిశిష్యతే। తచ్చ చిత్తం సత్త్వరజస్తమోగుణాత్మకమ్, ప్రకాశప్రవృత్తిమోహానాం సత్త్వాదికార్యాణాం తత్ర దర్శనాత్। ప్రకాశాదీనాం చ గుణకారణత్వం గుణాతీత లక్షణేఽవగమ్యతే-

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ।
భ. గీ. 14-22 ఇత్యభిధానాత్।

## భావప్రకాశిక

స్పష్టమైన మంచి వెలుతురులో ఉన్న ఘటము కంటియెదుట ఉన్నను, మనస్సు ఎక్కడో ఉండుటవలన, ఇది ఘటము అని తెలియబడదు. బిగ్గరగా వేదపాఠము చేయుచున్నను, చెవిదగ్గరనే ఆ వేదమును చదువుచున్నను మనస్సు, ఎక్కడో ఉండి అవధానము లేకపోవుటచే ఆ వేదశబ్దము గ్రహింపబడదు. మనస్సు, అవధానముతో నున్నచో, (సావధానముగా ఉన్నచో) ఇది ఘటము, ఇది, వేదశబ్దము అని గ్రంహిచ గలుగును. ఈ విధముగా రూప, శబ్దాది సర్వవిషయ సాక్షాత్కారమునకు సాధారణ కారణము, ఒకటి ఉన్నది అని అన్వయ వ్యతిరేకములచేత తెలియబడుచున్నది. చక్షురింద్రియము రూపవద్ద్రవ్య సాక్షాత్కారమునకు, శ్రోత్రేంద్రియము శబ్ద సాక్షాత్కారమునకు అసాధారణ కారణములై యున్నవి. ఈ రెండు సాక్షాత్కారములకు మనస్సుయొక్క ఆవశ్యకత కలదు. కనుక, ఈ మనస్సు, సాధారణ కారణము. మఱియు వెనుకనుండి స్పృశించినను, మనస్సుచేత గుర్తించగలుగుచున్నాడు, అనునది కూడ, ఉదాహరణము. కనుక ఈ లక్షణ, ప్రమాణములచే మనస్సు

అనునది ఒకటి, ఉన్నది అని సిద్ధించినది. వెనుకనుండి ఎవరో స్పృశించినను, దేవదత్తుడు, ఇది హస్తస్పర్శయని, ఇది అంగుళి స్పర్శయని, చక్షురింద్రియ సహాయము లేకనే విశేషముగా తెలిసికొనుచున్నాడు. చక్షుస్సు (కన్ను) వెనుకకు ప్రసరించదు కదా! స్పర్శగ్రాహకమగు త్వగింద్రియము కూడ మార్దవ, కాఠిన్య స్పర్శలనిమాత్రమే గ్రహించగలదు గాని, ఇది హస్త స్పర్శ, అంగుళి స్పర్శ అని త్వగింద్రియము గ్రహింపజాలదు. కనుక, విశేషజ్ఞానకారణమగు మనస్సు ఒక్కటే పరిశేష న్యాయముచే సిద్ధించుచున్నది. 'మననాత్ మనః' మననము వలన, మనస్సు అనియు, 'చేతనాత్ చిత్తమ్' గ్రహించుటవలన, చిత్తమనియు, పిలవబడుచున్నది. ఆ చిత్తము సత్త్వ, రజస్తమో గుణాత్మకము. ప్రకాశము, ప్రవృత్తి, మోహము అను సత్త్వాది గుణకార్యములు ఆ చిత్తమునందు కన్పడుచున్నవి గనుక, ఈ ప్రకాశ, ప్రవృత్తి, మోహములు సత్త్వాదిగుణకార్యములని గుణాతీత లక్షణాధ్యాయములో తెలియబడుచున్నది.

ఓ అర్జునా! ప్రకాశమును, ప్రవృత్తిని, మోహమును క్రమముగా సత్త్వరజస్తమోగుణ కార్యములుగా తెలిసికొనుము అని చెప్పుటవలన చిత్తము సత్త్వ, రజస్తమోగుణ కార్య మని తెలియుచున్నది.

## జీవన్ముక్తివివేకః

సాంఖ్యశాస్త్రేఽపి "ప్రకాశ ప్రవృత్తి మోహా నియమార్థాః" ఇత్యుక్తమ్। ప్రకాశో నామ నాత్ర సితభాస్వరరూపం, కిన్తు జ్ఞానమ్।

శ్లో॥ సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాద మోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ॥

భ. గీ. 14-17

ఇత్యుక్తత్వాత్, జ్ఞానవత్సుఖమపి సత్త్వకార్యమ్। తదప్యుక్తమ్-

శ్లో॥ సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత।
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత॥
భ. గీ. 14-6 ఇతి॥

సముద్రతరంగవ న్నిరంతరం పరిణమమానేషు గుణేషు కదాచి త్కశ్చి దుద్భవతి। ఇతరా వభిభూయతే, తదుక్తమ్-

శ్లో॥ రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజః సత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజ స్తథా॥
భ. గీ. 14-10 ఇతి।

శ్లో॥ బాధ్యబాధకతాం యాన్తి కల్లోలా ఇవ సాగరే॥
(యో. వా.) ఇతి చ।

తత్ర తమస ఉద్భవే సతి ఆసుర సంపదుదేతి। రజస ఉద్భవే సతి లోకాదివాసనా స్త్రిస్రో భవన్తి। సత్త్వస్యోద్భవే సతి దైవీ సంప దుపజాయతే। ఏతదేవాభిప్రేత్యోక్తమ్-

శ్లో॥ సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యాద్ వివృద్ధం సత్త్వ మిత్యుత॥
భ. గీ. 14-11 ఇతి।

### భావప్రకాశిక

సాంఖ్యశాస్త్రమునందు కూడ, ఈ సత్త్వ, రజ, స్తమోగుణములు క్రమముగా ప్రకాశ, ప్రవృత్తి, మోహములను నియమముగా కలిగించును అని చెప్పబడినది. ఇచట, ప్రకాశమనగా తెల్లని పరప్రకాశమగు వెలుతురు కాదు. మరియేమనగా, జ్ఞానము.

సత్త్వగుణము వలన జ్ఞానము, రజోగుణము వలన లోభము, తమోగుణము వలన, ప్రమాదము (ఏమరుపాటు), మోహము, అజ్ఞానము కలుగును అని చెప్పబడినది.

జ్ఞానము వలెనే సుఖము కూడ, సత్త్వగుణకార్యము అయి ఉన్నది అనియు చెప్పబడినది.

ఓ భరతవంశజా! సత్త్వగుణము సుఖమునందు ఉత్కర్షతో ప్రవర్తించును. రజోగుణము కర్మను ప్రేరేపించును. తమోగుణము జ్ఞానమును ఆవరించి ప్రమాదమునకు (ఏమరపాటునకు) దారి తీయును.

సముద్రతరంగములవలె ఈ సత్త్వ, రజస్తమోగుణములు నిరంతరము (ఎడతెగకుండా) పరిణామము చెందుచుండును. ఒకప్పుడు, ఒక గుణము ఉద్భవించును, తక్కిన రెండు గుణములు అభిభవింపబడును అనియు చెప్పబడినది–

సత్త్వగుణము రజస్తమోగుణములను తిరస్కరించి, ఒకప్పుడు, ప్రవర్తించును. అట్లే రజోగుణము సత్త్వతమోగుణములను, తమోగుణము సత్త్వ, రజోగుణములను అభిభవించుచుండును.

ఇవి, సముద్రమునందు కల్లోలముల వలె ఒకదానికొకటి బాధ్యము, బాధకము అగుచుండును.

అచట, తమస్సు ఉద్రిక్తమైనప్పుడు, ఆసుర సంపద జనించును. రజోగుణము ఉద్రిక్తమైనప్పుడు, లోకాదివాసనలు (లోక, శాస్త్ర, దేహవాసనలు) మూడును జనించును. సత్త్వగుణము ఉద్రిక్తమై (ఉత్కృష్టమై) ప్రధానమైనప్పుడు, దైవీ సంపద జనించును. ఈ అభిప్రాయముతోనే ఇట్లు చెప్పబడినది–

ఈ దేహమున చక్షురాది ద్వారములందు ఎప్పుడు ప్రకాశము జనించునో, జ్ఞానము కలుగునో, అప్పుడు సత్త్వగుణము విశేషముగా వృద్ధి చెందినది అని తెలిసికొనవలయును.

జీవన్ముక్తివివేకః

యద్యప్యన్తఃకరణం త్రిగుణాత్మకం భాసతే, తథాఽపి సత్త్వమేవాస్య ముఖ్య ముపాదానకారణమ్। రజస్తమసీ తూపష్టంభకే। ఉపాదాన సహకారిభూతా అవయవా ఉపష్టంభకాః। అత ఏవ జ్ఞానినో యోగాభ్యాసేన రజస్తమసో రపనీతయోః సత్త్వమేవ స్వరూపం పరిశిష్యతే। ఏతదేవాభిప్రేత్యోక్తమ్-

'జ్ఞస్య చిత్త మచిత్తం స్యాద్జ్ఞచిత్తం సత్త్వ ముచ్యతే' ఇతి। తచ్చ సత్త్వం చాంచల్యహేతు రజోగుణశూన్యత్వా దేకాగ్రమ్। భ్రాంతికల్పిత అనాత్మస్వరూప స్థూలపదార్థాకారహేతు తమోగుణ శూన్యత్వా త్సూక్ష్మమ్। తత ఆత్మదర్శనయోగ్యమ్। అత ఏవ శ్రుతిః-

'దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః' కఠ. 1-3-12. ఇతి।

న ఖలు వాయునా దోధూయమానేన ప్రదీపేన మణిముక్తాది లక్షణాని నిర్ధారయితుం శక్యన్తే। నాపి స్థూలేన ఖనిత్రేణ సూచ్యేవ సూక్ష్మపటస్యూతిః సంభవతి। తదేతదీదృశం సత్త్వమేవాయోగిషు తమోగుణగర్భితేన రజోగుణేనోపస్పృష్టం బహువిధ ద్వైత సంకల్పేన చేతయమానం చిత్తం భవతి। తచ్చిత్తం తమోగుణాధిక్యే సతి ఆసురీం సంపద ముపచిన్వ త్పీనం భవతి। తథాఽఽహ వసిష్ఠః-

శ్లో॥ అనాత్మన్యాత్మభావేన దేహభావనయా తథా।
పుత్రదారైః కుటుంబైశ్చ చేతో గచ్ఛతి పీనతామ్॥
అహంకారవికారేణ మమతామలలీలయా।
ఇదం మమేతి భావేన చేతో గచ్ఛతి పీనతామ్॥
ఆధివ్యాధివిలాసేన సమాశ్వాసేన సంసృతౌ।
హేయాదేయవిభాగేన చేతో గచ్ఛతి పీనతామ్॥
స్నేహేన ధనలోభేన లాభేన మణియోషితామ్।

ఆపాతరమణీయేన చేతో గచ్ఛతి పీనతామ్॥
దురాశాక్షీరపానేన భోగానిలబలేన చ।
ఆస్థాదానేన చారేణ చిత్తాహిర్యాతి పీనతామ్॥

ల. వా. 24, 17-29 ఇతి।

ఆస్థా నామ ప్రపంచే సత్యత్వబుద్ధిః; తస్యా ఆదాన మంగీకారః, స ఏవ చారో గమనాగమనక్రియా తేనేతి। తదేవం వినాశనీయయో ర్వాసనా మనసోః స్వరూపం నిరూపితమ్॥

**భావప్రకాశిక**

విచారించగా, అంతఃకరణము (మనస్సు) త్రిగుణాత్మకముగా తోచును. అట్లయినను, సత్త్వగుణమే ఈ మనస్సునకు ముఖ్యమైన ఉపాదాన కారణము. రజస్తమస్సులైతే సహకారులు మాత్రమే. ఇందువలననే, జ్ఞానికి యోగాభ్యాసముచేత రజస్తమస్సులు తొలగిపోగా, సత్త్వస్వరూపమే మిగులును. ఈ అభిప్రాయముతోనే-

"జ్ఞస్య చిత్త మచిత్తం స్యాత్ జ్ఞచిత్తం సత్త్వ ముచ్యతే।"

జ్ఞానికి చిత్తము అచిత్తమగును. జ్ఞానియొక్క చిత్తము సత్త్వము అని చెప్పబడును అని చెప్పబడినది.

ఆ సత్త్వగుణము చాంచల్యమునకు కారణమగు రజోగుణము లేకపోవుటచే ఏకాగ్రము అగును. భ్రాంతిచే కల్పింపబడిన అనాత్మస్వరూపములు అగు స్థూలపదార్థముల ఆకారమునకు హేతువగు తమోగుణము లేకపోవుటచే సూక్ష్మము. అందువలననే ఆత్మసాక్షాత్కారయోగ్యత కలది.

ఇందువలననే శ్రుతి సూక్ష్మమగు బ్రహ్మతత్త్వమును దర్శించినవారలచే ఏకాగ్రము, సూక్ష్మమును అగు బుద్ధిచే ఆత్మ దర్శింపబడును అని వచించుచున్నది.

వాయువుచే అతిగా కంపింపబడు ప్రదీపముచేత మణి

ముక్తాదులయొక్క లక్షణములు నిర్ధారణచేయుటకు శక్యములు కావుకదా! అట్లే, స్థూలమగు గడ్డపారచేత సూదితో కుట్టినట్లు, సన్నని వస్త్రమును కుట్టుట సంభవించదుగదా! ఇట్టి సత్త్వమే యోగులు కానివారియందు తమోగుణగర్భితమగు రజోగుణముచే పరివృతమై బహువిధములగు ద్వైతముల సంకల్పములచే విషయములను గ్రహించుచు, చిత్తము అగుచున్నది. ఆ చిత్తము తమోగుణము అధికముకాగా, ఆసుర సంపదను వృద్ధిపొందించుచు పరిపుష్టము (బలిసినది) అగుచున్నది. వసిష్ఠుడు ఈవిషయమునే చెప్పుచున్నాడు–

అనాత్మదేహేంద్రియాదులందు ఆత్మభావనచేతను, పుత్ర దార కుటుంబాదులందు దేహభావనచేతను చిత్తము బలపడును.

సంసారమునందు మనోవ్యథ, రోగాదులయొక్క విలాసము చేతను; ఊరడింపు, సమాధానములచేతను ఇది విడువదగినది, ఇది తీసికొనదగినది అను విభాగముతోను చిత్తము పుష్టిని పొందును.

అహంకార వికారముచేతను, మమకార మాలిన్యవిలాసము చేతను, ఇది నాది అను భావముతోను చిత్తము, బలమును పొందును.

స్నేహముచేతను, ధనాశచేతను, కామినీకాంచనముల లాభము చేతను, ఆపాతరమణీయములు (పైపైన అందముగా కన్పడునవి) అనాలోచనదశలో అందముగా అగువానిచేత చిత్తము బలమును పొందును.

చిత్తమనెడి సర్పము దురాశ అను క్షీరమును త్రాగుట చేతను, భోగములనెడు వాయువుయొక్క బలముచేతను, భోగ్య వస్తువులు సత్యములని భ్రమించి సంచరించుటచేతను పుష్టిని పొందుచున్నది.

'ఆస్థ' అనగా ప్రపంచమునందు సత్యత్వబుద్ధి, దానిని స్వీకరించుట. అంగీకరించుటయే చారము, గమనాగమనక్రియ. దానిచేత ఈవిధముగా నశింపజేయదగిన వాసనా, మనస్సుల యొక్క స్వరూపము నిరూపింపబడినది.

## జీవన్ముక్తివివేకః

అథ వాసనాక్షయ మనోనాశౌ క్రమేణ నిరూప్యేతే। తత్ర వాసనాక్షయప్రకార మాహ వసిష్ఠః-

శ్లో॥ బన్ధో హి వాసనాబన్ధో మోక్షః స్యాద్ వాసనాక్షయః।
వాసనా స్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపి త్యజ॥
మానసీ ర్వాసనాః పూర్వం త్యక్త్వా విషయవాసనాః।
మైత్ర్యాది భావనానామ్నీ గృహాణామలవాసనాః॥
తా అప్యన్తః పరిత్యజ్య తాభి ర్వ్యవహరన్నపి।
అన్తః శాన్తతమస్నేహో భవ చిన్మాత్రవాసనః॥
తామప్యన్తః పరిత్యజ్య మనోబుద్ధిసమన్వితామ్।
శేషే స్థిరసమాసీనో యేన త్యజసి తత్త్యజ॥

ల. వా. 18, 20-23 ఇతి।

## భావప్రకాశిక

అనంతరము వాసనాక్షయ, మనోనాశములు క్రమముగా నిరూపింపబడుచున్నవి. వానిలో వాసనాక్షయప్రకారము వసిష్ఠుడు ఇట్లు చెప్పెను.

"బన్ధో హి వాసనాబన్ధో మోక్షః స్యా ద్వాసనాక్షయః।
వాసనా స్త్వం పరిత్యజ్య మోక్షార్థిత్వమపి త్యజ॥"

ఓ రామా! బంధమనగా వాసనాబంధమే అయి ఉన్నది; మోక్ష మనగా వాసనాక్షయమే అగును. నీవు వాసనలను వదలి పెట్టి, మోక్షమును కోరుకొనుటను గూడ, వదలిపెట్టుము.

మొదట, విషయవాసనారూపములగు మానస, మలిన

వాసనలను వదలిపెట్టి, మైత్రి, ముదిత, కరుణ, ఉపేక్షాదిరూపమగు శుద్ధవాసనలను స్వీకరించుము. ఆ శుద్ధ వాసనలను గూడ, లోపల పరిత్యజించి, వానితో లోకదృష్టిలో వ్యవహరించువాడవైనను, లోపల శాంతి గలవాడవై, అంతట సమానమైన స్నేహము కల వాడవై 'భవ చిన్మాత్రవాసనః' చిన్మాత్రవాసనతో ఉండుము. మనోబుద్ధిసమన్వితమగు ఆ చిన్మాత్రవాసనను గూడ, లోపల పరిత్యజించి, మిగిలిన శుద్ధాత్మస్వరూపమునందు స్థిరముగా ఉన్నవాడవై, దేనితో ఈ త్యాగములను చేయుచున్నావో, ఆ చిత్తమును (అహంకారమును) వదలిపెట్టుము అని చెప్పెను.

జీవన్ముక్తివివేకః

అత్ర మానస వాసనాశబ్దేన పూర్వోక్తాస్తిస్రో లోకశాస్త్ర దేహవాసనా వివక్షితాః। విషయవాసనాశబ్దేన దంభ దర్పాద్యాసుర సంపద్వివక్షితా। మృదు తీవ్రత్వే తద్వివక్షాభేదకారణే। యద్వా శబ్ద స్పర్శ రూప రస గంధా విషయాః, తేషాం కామ్యమానత్వ దశాజన్యః సంస్కారో మానస వాసనా। భుజ్యమానత్వదశాజన్యః సంస్కారో విషయవాసనా। అస్మిన్ పక్షే పూర్వోక్తానాం చతసృణా మనయోరేవ అంతర్భావః। అంతర్బాహ్యవ్యతిరేకేణ వాసనాన్త రాసంభవాత్। నను వాసనాయాః పరిత్యాగః కథం ఘటతే? న హి తాసాం మూర్తి రస్తి యేన సమ్మార్జనీ సమూహిత ధూలి తృణవత్ హస్తేన ఉద్ధృత్య బహి స్త్యజ్యేమః। మైవమ్; ఉపవాస జాగరణవత్ తదుపపత్తేః। స్వభావప్రాప్త యో ర్భుజిక్రియా నిద్రయో రమూర్తత్వేఽపి తత్పరిత్యాగరూపే ఉపవాసజాగరణే సర్వై రప్యనుష్ఠీయేతే, తద్వదత్రాప్యస్తు। 'అద్య స్థిత్వా నిరా హారః' ఇత్యాది మంత్రేణ సంకల్పం కృత్వా సావధానత్వే నా వస్థానం తత్ర త్యాగ ఇతి చేత్, అత్రాపి న తద్దండనివారితమ్, పైషమంత్రేణ సంకల్ప్యాప్రమత్తత్వే నావస్థాతుం శక్యత్వాత్।

వైదికమంత్రానధికారిణాం తు భాషయా సంకల్పో అస్తు। యది తత్ర శాకసూపౌదనాది సంనిధిత్యాగ స్తర్హ్యత్రాపి ప్రక్చందన వనితాసన్నిధి పరిత్యాగోఽస్తు। అథ తత్ర బుభుక్షా నిద్రాలస్యాది విస్మారణైః పురాణ శ్రవణ దేవపూజా నృత్య గీత వాదిత్రదిభిః చిత్త ముపలాల్యేత, తర్హ్యత్రాపి మైత్ర్యాదిభిః తదుపలాలయేత్। మైత్ర్యాదయశ్చ పాతంజలినా సూత్రితాః- 'మైత్రీ కరుణా ముదితోపేక్షాణాం సుఖ దుఃఖ పుణ్యాపుణ్య విషయాణాం భావనాత శ్చిత్తప్రసాదనమ్' యో. సూ. 1-33 ఇతి।

భావ ప్రకాశిక

ఇచట మానస వాసనాశబ్దముచేత వెనుక చెప్పబడిన లోక వాసన, శాస్త్రవాసన, దేహవాసనలు మూడు వివక్షితములు. విషయ వాసనాశబ్దముచేత దంభ, దర్పాది ఆసుర సంపద వివక్షితము. మృదు తీవ్రత్వములు వాని వివక్షాభేదమునకు కారణములు. లేదా శబ్ద, స్పర్శ, రూప, రస గంధములు విషయములు. వానిని కోరుకొనుదశలో ఉన్న సంస్కారము మానసవాసన. అనుభవించు దశలో ఉన్న సంస్కారము విషయవాసన. ఈ పక్షమునందు వెనుక చెప్పిన నాలుగు వాసనలకు ఈ మానసవాసనా విషయవాసనలను రెంటియందే అంతర్భావము. అంతరములు, బాహ్యములు కాకుండా అన్య వాసనలు సంభవములు కావు.

ఓయీ! వాసనను పరిత్యజించుట ఎట్లు కుదురును ? ఆ వాసనలకు ఆకారము లేదు కదా! చీపురుకట్టతో ధూళి, తృణాదులను ఒకచోటకు ప్రోగుచేసి ఎత్తిపారవేసినట్లుగా వాసనలను ఎట్లు పారవేయగలము? అట్లు కాదు. ఉపవాసముచేతను, జాగరణచేతను వాసనాత్యాగము సంభవము. (ఉపవాస జాగరణములవలె వాసనా త్యాగము సంభవించును) స్వభావముచే ప్రాప్తములగు భోజన, నిద్రలు అమూర్తములు అయినను, వానిని పరిత్యజించుట అను

ఉపవాస జాగరణలు, అందరిచేతను అనుష్ఠింపబడుచున్నవి. అదేవిధముగా వాసనాత్యాగముకూడ అగుగాక! 'నేడు నిరాహారముగా ఉండి' అను మంత్రముతో సంకల్పము చేసి సావధానముగా ఉండుటయే అచట త్యాగ మనినచో, ఈ వాసనాత్యాగమందు గూడ, ఆ సావధానావస్థానము దండముచేత నివారింపబడలేదు కదా! ప్రేషమంత్రముచే సంకల్పించి అప్రమత్తుడవుగా ఉండుట శక్యమగునా ? వైదికమంత్రముల యందు అధికారము లేనివారలకు వారి వ్యవహారభాషతోనే సంకల్పము చేయవచ్చును. ఉపవాసాదులందు కూర, పప్పు, అన్నము మొదలగు ఆహారపదార్థముల యొక్క సన్నిధి త్యాగము అయినచో, వాసనాత్యాగమునందు గూడ, స్రక్చందన వనితాది సన్నిధిని పరిత్యజించుట చేయవచ్చును. అచట ఆకలి, నిద్ర, అలసత మొదలగువాటిని నివారించుకొనుటకు పురాణ శ్రవణ, దేవపూజ, నృత్య, గీత, వాదిత్రాదులతో చిత్తమును లాలనచేయుదుము అనినచో, ఈ వాసనాత్యాగమునకు గూడ మైత్ర్యాదులచే మనస్సును లాలించుకొనవలెను. మైత్ర్యాదులు పతంజలిచే సూత్రితములు. సుఖపడువారియందు మైత్రి, దుఃఖించువారియందు కరుణ, పుణ్యాత్ములందు ముదిత, పాపాత్ములందు ఉపేక్ష భావన చేయుటవలన మనస్సు నిర్మలమగును అని సూత్రీకరింపబడినవి.

జీవన్ముక్తివివేకః

చిత్తం హి రాగ ద్వేష పుణ్యపాపైః కలుషీక్రియతే। రాగ ద్వేషౌ చ పతంజలి రసూత్రయత్— 'సుఖానుశయీ రాగః, దుఃఖానుశయీ ద్వేషః' ఇతి। స్వేనానుభూయమానం సుఖ మనుశేతే కశ్చిద్ వృత్తి విశేషః సుఖజాతీయం మే సర్వం భూయాదితి। తచ్చ దృష్టాదృష్ట సామగ్ర్యభావా న్న సంపాదయితుం శక్యమ్।

అతః స రాగ శ్చిత్తం కలుషీకరోతి। యదా సుఖిష్వయం మైత్రీం భావయేత్ సర్వేఽప్యేతే సుఖినో మదీయా ఇతి తదా తత్సుఖం స్వకీయమేవ సంపన్నమితి భావయత స్తత్ర రాగో నివర్తతే। యథా స్వస్య రాజ్యాభావేఽపి పుత్రాదిరాజ్యమేవ స్వకీయం రాజ్యం తద్వత్। నివృత్తే రాగే వర్షాస్వతీతాసు శరత్సరిదివ చిత్తం ప్రసీదతి। తథా దుఃఖ మనుశేతే కశ్చి త్ప్రత్యయః, ఈదృశం సర్వం దుఃఖం సర్వథా మే నా భూదితి। తచ్చ రోగ శత్రు వ్యాఘ్రాదిషు సత్సు న నివారయితుం శక్యమ్। న చ సర్వే దుఃఖహేతవో హన్తుం శక్యన్తే। అతః స ద్వేషః సదా హృదయం దహతి। యదా స్వస్యేవ పరేషాం ప్రతికూలం దుఃఖం మాభూది త్యనేన ప్రకారేణ కరుణాం దుఃఖిషు ప్రాణిషు భావయే త్తదా వైర్యాది ద్వేషనివృత్తౌ చిత్తం ప్రసీదతి। అత ఏవ స్మర్యతే-

శ్లో॥ ప్రాణా యథాఽఽత్మనోఽభీష్టా భూతానా మపి తే తథా।
ఆత్మౌపమ్యేన భూతానాం దయాం కుర్వన్తి సాధవః॥ ఇతి।

తత్ప్రకారం చ మహాన్తో దర్శయన్తి-

శ్లో॥ సర్వేఽత్ర సుఖినః సన్తు సన్తు సర్వే నిరామయాః।
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిద్ దుఃఖ మాప్నుయాత్॥
ఇతి।

### భావప్రకాశిక

చిత్తము అయితే రాగముచేతను, ద్వేషముచేతను, పుణ్యము చేతను, పాపము చేతను కలుషిత మగును. రాగద్వేషముల గూర్చి, పతంజలి సూత్రించెను-

"సుఖానుశయీ రాగః, దుఃఖానుశయీ ద్వేషః।"

సుఖమును అనుసరించి కలుగు అంతఃకరణవృత్తి విశేషము రాగము, దుఃఖమును అనుసరించి కలుగు అంతఃకరణ వృత్తి,

ద్వేషము అని అర్థము. తనచేత అనుభవింపబడు సుఖమును అనుసరించి ఇటువంటి సుఖములే అన్నియు నాకు కలుగుగాక! అనెడి అంతఃకరణవృత్తి, రాగము. ఆ సుఖము లన్నియు లభించుటకు తగిన కారణసముదాయము దృష్టముగాని, అదృష్టముగాని తనచేత సంపాదించుటకు శక్యము కాదు. అందువలన, ఆ రాగము చిత్తమును కలుషిత మొనర్చుచున్నది. ఎప్పుడైతే, సుఖపడువారియందు 'ఈ సుఖపడువారందరు నావారు' అని ఇతడు మిత్రభావమును భావన చేసిన, అప్పుడు వారి సుఖము తన సుఖమే అయినది గనుక, ఆ సుఖములందు రాగము నివర్తించును. ఎట్లనగా, తాను రాజ్యము చేయక పోయినను, పుత్రాదులు రాజ్యము చేయుచున్నప్పుడు, ఆ రాజ్యము తనదే అని తండ్రి భావించును. ఈవిధముగా రాగము నివృత్తము కాగా, వర్షఋతువు గడచిపోయినపిమ్మట, శరత్కాల నదివలె చిత్తము నిర్మలమగుచున్నది. అట్లే, ఒకానొక అంతఃకరణవృత్తి, దుఃఖమును అనుసరించి కలుగును. ఇటువంటి దుఃఖములు ఎవ్వియు ఎన్నడును నాకు కలుగకుండుగాక' అని భావించును. రోగము, శత్రువులు, వ్యాఘ్రములు మొదలైనవి బాధాకరములు ఉండగా ఆ దుఃఖము నివారించుటకు శక్యముకాదు. దుఃఖకారణము లన్నియు, నివారించుకొనుట తనచేత శక్యము కాదు. ఇందువలన, ఆ ద్వేషము ఎల్లప్పుడు హృదయమును దహించుచుండును. ఎప్పుడైతే, తనకువలెనే ఇతరులకు గూడ, ప్రతికూలమగు దుఃఖము కలుగకుండుగాక! అను విధముగా, దయను దుఃఖిజనులందు ఎపుడు భావించునో అప్పుడు, శత్రువులు మొదలైనవారియందు ద్వేషము నివృత్తము కాగా, చిత్తము ప్రసన్నమగును. ఇందువలననే ఇట్లు స్మరింపబడినది–

తనకు ప్రాణములు ఎంత అభీష్టములో, ఇతర ప్రాణులకు

గూడ, ఆ ప్రాణములు అంత ప్రియములైనవి. సాధుజనులు తాము దృష్టాంతముగా చేసికొని భూతదయను పాటించుచున్నారు.

ఆ భూతదయాప్రకారమును మహాత్ములు ఇట్లు చూపుచున్నారు–

"సర్వేఽత్ర సుఖినః సన్తు సన్తు సర్వే నిరామయాః।
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చి ద్దుఃఖ మాప్నుయాత్॥"

అనగా, ఈ సృష్టిలో అందరును, శుభములనే చూతురుగాక! ఎవ్వడును దుఃఖమును పొందకుండుగాక! అని భూతదయాప్రకారమును ప్రదర్శించినారు.

### జీవన్ముక్తివివేకః

తథా హి ప్రాణినః స్వభావత ఏవ పుణ్యం నానుతిష్ఠన్తి, పాపం త్వనుతిష్ఠన్తి। తదాహుః–

శ్లో॥ పుణ్యస్య ఫలమిచ్ఛన్తి పుణ్యం నేచ్ఛన్తి మానవాః।
న పాపఫల మిచ్ఛన్తి పాపం కుర్వన్తి యత్నతః॥ ఇతి।

తే చ పుణ్యపాపే పశ్చాత్తాపం జనయతః। స చ తాపః శ్రుత్యాఽనూద్యతే– 'కిమహం సాధు నాకరవమ్, కిమహం పాపమకరవమ్' తై. ఉ. 2–6 ఇతి। యద్యసౌ పుణ్యపురుషేషు ముదితాం భావయేత్ తదా తద్వాసనయా స్వయమేవాప్రమత్తః పుణ్యేషు ప్రవర్తేత। తథా పాపిషూపేక్షాం భావయన్ స్వయమపి పాపా న్నివర్తేత। అతః పశ్చాత్తాపస్యాభావేన చిత్తం ప్రసీదతి। సుఖిషు మైత్రీం భావయతో న కేవలం రాగనివృత్తిః, కిన్తు అసూయేర్ష్యాదయోఽపి నివర్తన్తే। గుణేషు దోషావిష్కరణమసూయా, పరగుణానా మసహన మీర్ష్యా। యదా మైత్రీవశాత్పరకీయం సుఖం స్వకీయమేవ సంపద్యతే, తదా పరగుణేషు కథ మసూయాదికం సంభవేత్? ఏవం దోషాన్తరనివృత్తిరపి యథాయోగ మున్నేయా। దుఃఖిషు కరుణాం భావయతః శత్రు

వధాదికరో ద్వేషో యదా నివర్తతే, తదా దుఃఖిత్వప్రతియోగిక స్వసుఖిత్వప్రయుక్తో దర్పోఽపి నివర్తతే। స చ దర్ప ఆసుర సంపద్యహంకారప్రస్తావే పూర్వం నిరూపితః—

శ్లో॥ ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ।
ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా॥

భ. గీ. 16, 14-15 ఇత్యాది।

### భావప్రకాశిక

అట్లే కదా! ప్రాణులు, స్వభావముచేతనే పుణ్యమును ఆచరించరు. పాపమును అయితే ఆచరింతురు. ఆ విషయమును ఇట్లు చెప్పుచున్నారు—

"పుణ్యస్య ఫల మిచ్ఛన్తి పుణ్యం నేచ్ఛన్తి మానవాః।
న పాపఫల మిచ్ఛన్తి పాపం కుర్వన్తి యత్నతః॥"

మనుష్యులు పుణ్యముయొక్క ఫలమును (సుఖమును) కోరుచున్నారు. పుణ్యమును కోరరు (చేయరు). పాపఫలమును (దుఃఖమును) కోరుకొనరు. కాని, పాపమును పనిగట్టుకొని చేయుదురు అని భావము.

ఆ పుణ్యపాపములు పశ్చాత్తాపమును కలిగించుచున్నవి. ఆ తాపము శ్రుతిచేత ఇట్లు అనువదింపబడినది. 'నేను పుణ్యకర్మను ఎందుకు చేయకపోతిని ?' నేను ఎందులకు పాపమును ఆచరించితిని? అని పశ్చాత్తాపము చెందుదురు. ఇతడు పుణ్య పురుషులందు ముదితను (సంతోషమును, హర్షమును) భావన చేసినచో, అప్పుడు ఆ వాసనచేత తానే అప్రమత్తుడై పుణ్య కార్యములందు ప్రవర్తించును. అదేవిధముగా, పాపము చేసినవారి యందు ఉపేక్షను భావన చేసినచో, తాను గూడ, పాపమునుండి నివృత్తుడగును. ఇందువలన, తరువాత తాపము కలుగదు గనుక, చిత్తము నిర్మలమగును. సుఖించువారియందు మైత్రిని భావన

చేసినచో, రాగము ఒక్కటి నివర్తించుటయే కాదు; అసూయ, ఈర్ష్యాది దోషములు గూడ, నివర్తించును. ఇతరుల గుణము లందు దోషమును వెలువరించుట అసూయ. ఇతరుల గుణములను సహించలేకపోవుట ఈర్ష్య. మైత్రీభావనచే పరసుఖము తనదైనపుడు, పరగుణములందు అసూయాదులు ఎట్లు సంభ వించును? ఈవిధముగా, మరికొన్ని దోషముల నివృత్తి కూడ, ఆ యా సందర్భములను బట్టి ఊహింపనగును. దుఃఖించు జనులందు దయను భావన చేసినచో, శత్రువధాదులకు గూడ కారణమగు ద్వేషము నివర్తించును. అప్పుడు, దుఃఖిత్వమునకు విరోధిగా నున్న స్వసుఖిత్వము వలన కలుగు దర్పము గూడ, తొలగి పోవును. ఆ దర్పము ఆసుర సంపదయందు అహంకారప్రస్తావ మున నిరూపింపబడినది.

నేను ప్రభువును, నేను భోగిని, నేను అన్నియు కలవాడను, బలవంతుడను, సుఖిని, ధనాఢ్యుడను, గొప్ప కులమునందు పుట్టినవాడను, నాతో సమానుడు మరి ఎవ్వరు గలరు? మొదలైనది.

## జీవన్ముక్తివివేకః

నను పుణ్యాత్మసు ముదితాం భావయతః పుణ్యప్రవృత్తిః ఫలత్వేనోక్తా, సా చ యోగినో న యుక్తా, మలినాయాం శాస్త్ర వాసనాయాం పుణ్యమన్తర్భావ్య పూర్వ ముదాహృతత్వాత్। మైవమ్, పునర్జన్మకారణస్య కామ్యేష్టాపూర్తాదేస్తత్ర మలినత్వే నోదాహరణాత్। ఇహ తు యోగాభ్యాసజన్య మశుక్లాకృష్ణత్వేన జన్మానాపాదకం పుణ్యం వివక్షితమ్। అశుక్లాకృష్ణత్వం పతంజలిః సూత్రయామాస– 'కర్మాశుక్లాకృష్ణం యోగిన స్త్రివిధ మితరేషామ్' (4–7) ఇతి కామ్యం కర్మ విహితత్వా చ్ఛుక్లమ్, నిషిద్ధం కృష్ణమ్, మిశ్రం శుక్లకృష్ణమ్। తదేతత్త్రియ మితరేషా మయోగినాం

సంపద్యతే। తచ్చ త్రివిధం జన్మ ప్రయచ్ఛతి। తదాహు ర్విశ్వ రూపాచార్యాః-

శ్లో॥ శుభైః ప్రాప్నోతి దేవత్వం నిషిద్ధై ర్నారకీం గతిమ్।

ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం లభతేఽవశః॥

నై. 1-41 ఇతి।

నను యోగస్యానిషిద్ధత్వా దకృష్ణత్వేఽపి విహితత్వాత్ శుక్లత్వ మితి చే న్నైవమ్, అకామ్యత్వాభిప్రాయేణ అశుక్లత్వాభిధానాత్। అతోఽశుక్లకృష్ణే పుణ్యే ప్రవృత్తిః యోగినోఽపేక్షితా।

**భావప్రకాశిక**

ఓయీ! పుణ్యపురుషులందు, (ముదితను) సంతోషమును భావన చేయుగా, పుణ్యకార్యములందు ప్రవృత్తి, ఫలముగా చెప్పబడినది. అది, యోగికి యుక్తము కాదు. మీరు పూర్వము మలినమైన శాస్త్రవాసన యందు పుణ్యమును గూడ చేర్చి, ఉదాహరించి ఉన్నారు. అట్లు కాదు. అచట, పునర్జన్మకు కారణమగు కామ్యములైన ఇష్టాపూర్తాది కర్మలు మలినములుగా ఉదహరింపబడినవి. ఇచటనైతే యోగాభ్యాసము వలన, కలిగిన అశుక్ల కృష్ణరూపమగు పుణ్యము పునర్జన్మకు హేతువు కానిది అభిమతమైనది. అశుక్లకృష్ణకర్మను పతంజలి సూత్రించెను- 'యోగి యొక్క కర్మ, అశుక్లకృష్ణము; ఇతరులయొక్క కర్మ శుక్లము, కృష్ణము, శుక్లకృష్ణము అని మూడు విధములు. కామ్య కర్మలు శాస్త్రవిహితములు గనుక, శుక్లములు. శాస్త్రనిషిద్ధములు కృష్ణ కర్మలు. మిశ్రకర్మ, శుక్లకృష్ణము యోగులు కానివారికి ఉండును. ఈ మూడు విధములైన కర్మలు తిరిగి జన్మను ఇచ్చును. విశ్వ రూపాచార్యులు ఈ విషయమును ఇట్లు చెప్పుచున్నారు-

"శుభైః ప్రాప్నోతి దేవత్వం నిషిద్ధై ర్నారకీం గతిమ్।

ఉభాభ్యాం పుణ్యపాపాభ్యాం మానుష్యం లభతేఽవశః"

శుభములగు పుణ్యకర్మల వలన దేవత్వము ప్రాప్తించును. నిషిద్ధములగు పాపకర్మలచేత నరకలోకమును పొందును. పుణ్య పాపములు రెంటిచేతను అవశుడై మనుష్యజన్మను పొందును.

ఓయీ! యోగము నిషిద్ధము కాదు గనుక, కృష్ణము కాక పోయినను విహితమే. కనుక, శుక్లకర్మ అగును గదా! అనినచో అట్లు కాదు. యోగము విహితమైనను, కామ్యకర్మ కాదు గనుక, అశుక్లము అని చెప్పబడినది. కనుక, అశుక్లకృష్ణమగు పుణ్యము నందు యోగికి ప్రవృత్తి అపేక్షింపబడినది (ఆవశ్యకమైనది).

## జీవన్ముక్తి వివేకః

నను యోగినోఽప్యనేన న్యాయేన యథోచితం పుణ్యాత్మసు ముదితాం భావయిత్వా పుణ్యేష్వేవ ప్రవర్తేరన్నితి చే త్ప్రవర్తన్తాం నామ; యే మైత్ర్యాదిభి శ్చిత్తం ప్రసాదయన్తి తేషామేవ యోగిత్వాత్। మైత్ర్యాది చతుష్టయ ముపలక్షణమ్। తేన 'అభయం సత్త్వ సంశుద్ధిః' ఇత్యాది దైవసంపత్ 'అమానిత్వ మదంభిత్వమ్' ఇత్యాది జ్ఞానసాధనాని జీవన్ముక్త స్థితప్రజ్ఞాది వచనోక్తా ధర్మా శ్చోపలక్ష్యన్తే, సర్వేషా మేతేషాం శుభవాసనారూపత్వేన మలినవాసనానివర్తకత్వాత్। నను సన్త్యనన్తాః శుభవాసనాః, న చైకేన తాః సర్వా అభ్యసితుం శక్యన్తే, నిరర్థకశ్చ తదభ్యాస ప్రయాస ఇతి చే న్న, తన్నివర్త్యానాం అనన్తానాం మలిన వాసనానా మేకస్య మనస్యసంభవాత్। న హ్యాయుర్వేదోక్తాని సర్వాణ్యౌషధాని ఏకేన సేవితుం శక్యన్తే। నాపి తన్నివర్త్యాః సర్వే రోగా ఏకస్య దేహే సంభవన్తి। ఏవం తర్హి స్వచిత్తం ప్రథమతః పరీక్ష్య తత్ర యదా యావత్యో మలినవాసనా స్తదా తావతీ ర్విరోధినీః శుభవాసనా అభ్యసేత్। యథా పుత్ర మిత్ర కలత్రాదిభిః పీడ్యమాన స్తతో విరక్త స్తన్నివర్తకం పారి వ్రాజ్యం గృహ్ణాతి, తదా విద్యామద ధనమద కులాచారమదాది

మలినవాసనాభిః పీడ్యమానః తద్విరోధినం వివేక మభ్యసేత్। స చ వివేకో జనకేన దర్శితః-

శ్లో॥ అద్య యే మహతాం మూర్ధ్ని తే దినై ర్నిపత న్త్యధః।
హన్త చిత్తమహత్తాయాః కైషా విశ్వస్తతా తవ॥
ల. వా. 19-39

శ్లో॥ క్వ ధనాని మహీపానాం బ్రహ్మణః క్వ జగన్తి వా।
ప్రాక్తనాని ప్రయాతాని కేయం విశ్వస్తతా తవ॥
కోటయో బ్రహ్మణాం యాతా గతాః స్వర్గపరంపరాః।
ప్రయాతాః పాంసువద్ భూపాః కా ధృతి ర్మమ జీవితే॥
ల. వా. 19, 41-42.

యేషాం నిమేషణోన్మేషౌ జగతః ప్రలయోదయౌ।
తాదృశాః పురుషా నష్టా మాదృశాం గణనైవ కా॥
ల. వా. 19-49 ఇతి।

భావప్రకాశిక

ఓయీ! వెనుక చెప్పిన విధముగా ఈ యోగికి గూడ, పుణ్యపురుషులందు ముదితను భావన జేసి, పుణ్యకార్యములందు ప్రవర్తించవలసివచ్చును' అనినచో- సరే. యోగులు గూడ పుణ్య కార్యములందు ప్రవర్తింతురు గాక! మైత్రి, ముదిత, కరుణ, ఉపేక్ష అను భావనలచే చిత్తమును నిర్మలము చేసికొనినవారే యోగులు. ఈ మైత్ర్యాది చతుష్టయము ఉపలక్షణము. ఇంకను, మరికొన్నింటికి సూచకము. అందుచేత 'అభయం సత్త్వ సంశుద్ధిః' మొదలుగా చెప్పబడిన దైవసంపత్తు, 'అమానిత్వ మదం భిత్వం' మొదలుగా చెప్పబడిన జ్ఞానసాధనములు, జీవన్ముక్త, స్థిత ప్రజ్ఞాది వచనములందు చెప్పబడిన ధర్మములు కూడ, గ్రహింప దగును. ఇవి అన్నియు, శుభవాసనారూపములు గనుక, మలిన వాసనానివర్తకములు అగుచున్నవి.

ఓయీ! ఈ శుభవాసనలు అనేకములు కలవు. అవి అన్నియు, ఒకనిచేత అభ్యసింపబడుటకు శక్యములు కావు. ఆ అభ్యాసప్రయత్నము నిరర్థకము అనినచో- అట్లు కాదు. ఆ శుభవాసనలచే నివర్తించదగిన మలినవాసనలు అనంతములు. ఒకని మనస్సునందే అన్ని మలినవాసనలు సంభవము కావు. ఆయుర్వేదమునందు చెప్పబడిన ఔషధములన్నియు, ఒకనిచే సేవింపబడుట శక్యము కాదు. ఒకని దేహమునందే ఆ ఔషధములచే నివర్తింపబడదగిన సర్వరోగములు సంభవములు కావు. కనుక, తన చిత్తమును మొదట పరీక్ష చేసికొని, ఆ చిత్తమునందు ఏ మలినవాసనలు కలవో, వానికి విరోధులగు శుభవాసనలను అభ్యసింపవలయును. ఎట్లనగా, పుత్ర, మిత్ర, కళత్రాదులచే బాధింపబడువాడు విరక్తుడై, తద్బాధానివారకమగు సంన్యాసమును ఎట్లు గ్రహించునో, అదేవిధముగా విద్యామద, ధనమద, కులాచారమదాది మలినవాసనలచే పీడింపబడువాడు వానికి విరోధియగు వివేకమును అభ్యసించవలెను. ఆ వివేకము జనకునిచే చూపబడినది-

ఓ చిత్తమా! నేడు పెద్దల శిరస్సుమీద ఎవరుండిరో, వారు కొన్ని దినములకు క్రిందపడుచున్నారు. అయ్యో! నిలుకడ లేని ఈ మహత్త్వయందు నీకు ఈ విశ్వాసమేల ?

రాజుల ధనము లేమైనవి? బ్రహ్మయొక్క జగత్తులు ఎన్ని గడచిపోయినవి? వెనుకటివన్నియు గతించిపోయినవి గనుక, ఈ ధనాదులందు విశ్వాసము ఏల ?

బ్రహ్మలు కోట్లకొలది గతించిరి. స్వర్గపరంపరలు పోయినవి. రాజులు ధూళివలె గతించిరి. నాకు జీవితమునందు స్థిరత యేమి ?

ఎవరియొక్క నిమిషోన్మేషములు జగత్తుయొక్క ప్రళయ, ఉదయము లయిఉన్నవో, అట్టి పురుషులే అదృశ్యులైరి. మావంటి వారి లెక్క ఏమున్నది?

## జీవన్ముక్తివివేకః

నన్వయమపి వివేక స్తత్త్వజ్ఞానోదయా త్ప్రాచీనః, నిత్యానిత్య వస్తువివేకాది సాధనవ్యతిరేకేణ బ్రహ్మజ్ఞానాసంభవాత్, ఇహ తూత్పన్న బ్రహ్మసాక్షాత్కారస్య జీవన్ముక్తయే వాసనాక్షయాది సాధనం వక్తు ముపక్రాన్తమ్; అతః కిమిద మకాండే తాండవమితి చేత్, నాయం దోషః। సాధనచతుష్టయ సంపన్నస్య పశ్చాద్ బ్రహ్మజ్ఞాన మిత్యేష సర్వపురుషసాధారణః ప్రౌఢో రాజమార్గః। జనకస్య తు పూర్వపుణ్యపుంజపరిపాకేణ ఆకాశఫలపాతవత్ అకస్మాత్సిద్ధ గీతాశ్రవణమాత్రేణ తత్త్వజ్ఞాన ముత్పన్నమ్। తతశ్చ చిత్తవిశ్రాన్తయే వివేకోఽయం క్రియత ఇతి కాండ ఏవేద ముచితం తాండవమ్। నన్వేవ ముఖ్యస్య వివేకస్య జ్ఞానసమనన్తర భావిత్వేన మలినవాసనానువృత్త్యభావాత్ శుద్ధవాసనాభ్యాసో నాపేక్షిత ఇతి చేన్న, జనకస్య తదనువృత్త్యభావేఽపి యాజ్ఞవల్క్య భగీరథాదే స్తదనువృత్తిదర్శనాత్। అస్తి హి యాజ్ఞవల్క్యస్య తత్ప్రతివాదినా ముషస్త కహోలాదీనాం చ భూయాన్విద్యామదః, తైః సర్వైరపి విజిగీషుకథాయాం ప్రవృత్తత్వాత్। నను తేషాం విద్యాన్తరమేవాస్తి న తు బ్రహ్మవిద్యేతి చేన్న; కథాగతయోః ప్రశ్నోత్తరయోః బ్రహ్మవిషయత్వాత్। నను బ్రహ్మవిషయత్వేఽపి తేషా మాపాతతో జ్ఞానమేవ న తు సమ్యగ్వేదనమితి చేన్న, తథా సత్యస్మాకమపి తదీయ వాక్యై రుత్పన్నాయా బ్రహ్మవిద్యాయా అసమ్యక్త్వప్రసంగాత్। నను సమ్యక్త్వేఽపి పరోక్షజ్ఞాన మేవేతి చేన్న, 'యత్సాక్షాదపరోక్షాద్ బ్రహ్మ' ఇతి ముఖ్యాపరోక్ష విషయతయైవ విశేషతః ప్రశ్నప

లంభాత్। నన్వాత్మజ్ఞానినో విద్యామద ఆచార్యై ర్నాభ్యుప గమ్యతే। తథా చోపదేశసాహస్ర్యా మభిహితమ్-

శ్లో॥ బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా స ఆత్మజ్ఞో న చేతరః॥

12-13 ఇతి। నైష్కర్మ్యసిద్ధావపి-

న చాధ్యాత్మాభిమానోఽపి విదుషోఽస్త్యాసురత్వతః।
విదుషోఽప్యాసురశ్చే త్స్యా న్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్॥
ఇతి।

ఇతి చేత్, నాయం దోషః। జీవన్ముక్తిపర్యన్తస్య తత్త్వజ్ఞానస్య తత్ర వివక్షితత్వాత్। న ఖలు వయమపి జీవన్ముక్తానాం విద్యామద మభ్యుపగచ్ఛామః।

## భావప్రకాశిక

ఓయీ! ఈ వివేకము, తత్త్వజ్ఞానము జనించుటకు పూర్వమే జ్ఞానసాధనముగా అంగీకరింపబడుచున్నది. నిత్యానిత్యవస్తు వివేకాది సాధనములు లేకుండా బ్రహ్మజ్ఞానమే సంభవించదు గదా! ఇచ్చటనైనచో బ్రహ్మసాక్షాత్కారము కలిగినవానికి జీవన్ముక్తి కొరకు వాసనాక్షయము మొదలగు సాధనములను చెప్పుటకు ఉపక్రమింపబడినది. కనుక, ఇప్పుడు వివేకప్రస్తావము అకాండ తాండవము అనినచో, ఇది దోషము కాదు. సాధన చతుష్టయ సంపన్నునకు తరువాత బ్రహ్మజ్ఞానము అనునది సర్వపురుష సాధారణమైన ప్రౌఢమగు రాజమార్గము. జనకునకైనచో, పూర్వ పుణ్యపూజ పరిపాకవశమున, ఆకాశఫలపతనమువలె సిద్ధపురుష గీతాశ్రవణమాత్రముచేతనే తత్త్వజ్ఞానము ఉత్పన్నమైనది. తరువాత, చిత్తవిశ్రాంతి కొరకు ఈ వివేకము చేయబడుచున్నది. కనుక, యథాసమయముననే ఈ తాండవము ఉచితమైనది.

ఓయీ! ఇట్లైనను, ఈ వివేకము జ్ఞానానంతరము చెప్పబడు చున్నది. మలినవాసనానివృత్తి లేదు గనుక, శుద్ధవాసనాభ్యాసము

అపేక్షితము కాదు అనినచో, అట్లుకాదు. జనకునకు మలినవాసనా నివృత్తి లేకపోయినను, యాజ్ఞవల్క్య, భగీరథాదులకు మలిన వాసనానువృత్తి కప్పడుచున్నది. యాజ్ఞవల్క్యునకు ప్రతివాదులగు ఉషస్త, కహోలాదులకును విస్తారముగా విద్యామదము కలదు, వారందరు ఒకరినొకరు జయింపవలయును అను విజిగీషు కథలో ప్రవర్తించిరి.

ఓయీ! వారికి మరికొన్ని విద్యలు ఉండవచ్చును. కాని, బ్రహ్మవిద్య లేదు అని అందుము అనినచో, అట్లు కాదు. జనక సభలో విజిగీషుకథలో బ్రహ్మవస్తు విషయమై ప్రశ్నోత్తరములు నడచినవి. అట్లయినచో, వారికి బ్రహ్మ విషయమగు అపాతజ్ఞానమే గాని, సమ్యగ్జ్ఞానము లేదందుము. అట్లు కాదు. అట్లయినచో, మనకు గూడ వారి వాక్యములచే కలిగిన బ్రహ్మవిద్య సమ్యగ్ జ్ఞానము కాకపోవలసివచ్చును.

ఓయీ! అది సమ్యగ్జ్ఞానమే అయినను, పరోక్షజ్ఞానమే అని అనినచో, అట్లు కాదు. 'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ' అని ముఖ్య అపరోక్ష బ్రహ్మవిషయమై విశేషముగా ప్రశ్న కన్పించుచున్నది.

ఓయీ! ఆత్మజ్ఞానికి విద్యామదము ఆచార్యులచే అంగీకరింపబడలేదు. ఉపదేశ సాహస్రియందు ఇట్లు చెప్పబడినది–

"బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా స ఆత్మజ్ఞో నచేతరః।"

విద్యామదమును వదలిపెట్టియే బ్రహ్మవేత్త అగును. అతడే ఆత్మజ్ఞుడు, ఇతరుడు కాడు.

నైష్కర్మ్యసిద్ధియందుకూడ– తత్త్వజ్ఞానికి నేను ఆత్మజ్ఞానిని అను అభిమానము ఉండదు. ఆ అభిమానము ఆసుర స్వభావము. జ్ఞానికి గూడ, ఆసుర భావము ఉన్నచో, బ్రహ్మ దర్శనము నిష్ఫలము అని.

అనినచో, ఇది దోషము కాదు. అచట, జీవన్ముక్తి పర్యంత మగు తత్త్వజ్ఞానము వివక్షితము. మేము గూడ, జీవన్ముక్తులకు విద్యామదమును అంగీకరించము గదా!

జీవన్ముక్తి వివేకః

నను విజిగీషో రాత్మబోధ ఏవ నాస్తి-

శ్లో॥ రాగో లిఙ్గ మబోధస్య చిత్తవ్యాయామభూమిషు।
కుతః శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః॥

నై. 4-67 ఇత్యాచార్యై రభ్యుపగమాదితి చేన్న।

శ్లో॥ రాగాదయః సన్తు కామం న తద్భావోఽపరాధ్యతి।
ఉత్ఖాతదంష్ట్రోరగవ దవిద్యా కిం కరిష్యతి॥

బృ. వా. 4-1746

ఇత్యత్ర తైరేవ రాగాద్యభ్యుపగమాత్। నచాత్ర పరస్పర వ్యాహతిః; స్థితప్రజ్ఞో జ్ఞానిమాత్రే చ వచనద్వయస్య వ్యవస్థాప నోపయుక్తత్వాత్। నను జ్ఞానినో రాగాద్యభ్యుపగమే ధర్మాధర్మ ద్వారేణ జన్మాంతరప్రసఙ్గ ఇతి చేన్నైమమ్, అదగ్ధబీజవ దవిద్యాపూర్వక కామాదేరేవ ముఖ్యరాగాదిత్వేన పునర్జన్మ హేతుత్వాత్। జ్ఞానినస్తు దగ్ధబీజవదాభాసమాత్రా ఏవ రాగాదయః। ఏతదేవాభిప్రేత్యోక్తమ్-

శ్లో॥ ఉత్పద్యమానా రాగాద్యా వివేకజ్ఞానవహ్నినా।
తదా తదైవ దహ్యన్తే కుతస్తేషాం ప్రరోహణమ్॥ ఇతి।

పంచ. 7

తర్హి స్థితప్రజ్ఞస్యాపి తే సన్త్వితి చేన్న, తత్కాలే ముఖ్య వదేవ ఆభాసమానాం బాధకత్వాత్; రజ్జుసర్పోఽపి ముఖ్యసర్పవ దేవ తదానీం భీషయన్నుపలభ్యతే, తద్వత్; తర్హ్యాభాసత్వాను సంధానానువృత్తౌ న కోఽపి బాధ ఇతి చేచ్చిరం జీవతు భవాన్। ఇయమేవ అస్మదభిమతా జీవన్ముక్తిః।

భావప్రకాశిక

ఓయీ! విజిగీషువునకు (విజయము కోరువానికి) ఆత్మ జ్ఞానమే లేదు. చిత్తవ్యాపారభూములందు రాగము (ఇచ్ఛ) అజ్ఞానమునకు చిహ్నము. ఏ వృక్షముయొక్క తొఱ్ఱయందు అగ్ని ఉండునో, ఆ చెట్టునకు ఆకుపచ్చదనముతో కళకళలాడుట ఎట్లు సంభవము? అని ఆచార్యులచే అంగీకరింపబడినది కదా! అనినచో- అట్లు కాదు.

"రాగాదయః సన్తు కామం న తద్భావోఽపరాధ్యతి।
ఉత్ఖాత దంష్ట్రోరగవదవిద్యా కిం కరిష్యతి॥"

చిత్తమునందు రాగాదులు ఉండిన ఉండుగాక! అంతమాత్రము చేత దోషమేమియు లేదు. విషపు కోరలను పెరకివేసిన తరువాత సర్పము ఏమి బాధించగలదు? ఆత్మజ్ఞానము ప్రాప్తమైనతరువాత అవిద్య (అజ్ఞానము) ఏమి చేయుగలదు?"

అనుచోట, ఆ ఆచార్యులచేతనే రాగాదులు అంగీకరింపబడుచున్నవి గదా! అయితే, ఇచట పరస్పర విరుద్ధార్థ కథనము లేదా? అని శంకించరాదు. స్థితప్రజ్ఞునియందు రాగము ఉండదనియు, సాధారణ జ్ఞానివిషయమున, రాగాదులు ఒకప్పుడు మిగిలి ఉండుననియు, వ్యవస్థచే ఆ పరస్పర విరోధమును పరిహరించుకొనవచ్చును.

ఓయీ! జ్ఞానికి రాగాదులను అంగీకరించినచో, పాపపుణ్యములు ద్వారా మరియొక జన్మ, ప్రసక్తమగును అనినచో అట్లు జరగదు. దగ్ధబీజములు అంకురజనన సామర్థ్యము కలవి కానట్లు, జ్ఞానపూర్వక రాగాదులు పునర్జన్మారంభకములు కావు. అవిద్యాపూర్వకమైన కామ, కర్మాదులే బంధహేతురాగాదు లగుట చేత, పునర్జన్మకు కారణములగును. జ్ఞానియొక్క రాగాదులైనచో దగ్ధబీజములవలె ఆభాసమాత్రములే. ఈ అభిప్రాయముతోనే

ఇట్లు చెప్పబడినది-

పుట్టుచున్న రాగాది దోషములు వివేకజ్ఞాన మను వహ్నిచే ఎప్పటికప్పుడు దహింపబడుచుండును గనుక, ఆ రాగాదులు అంకురించుట ఎట్లు?

అట్లయినచో, స్థితప్రజ్ఞునకు గూడ, ఆ రాగాదులు ఉండ నిండు! దోషమేమి? అనినచో, అట్లు కాదు. స్థితప్రజ్ఞుడు సమాధి స్థితియందు అవిద్యాపూర్వక రాగాదులను వలె ఆభాసమాత్ర మగు రాగాదులను గూడ, అంగీకరించడు. స్థితప్రజ్ఞస్థితి ఆభాస రాగాదులకు గూడ, బాధకమై యున్నది. రజ్జుసర్పము గూడ, ముఖ్యసర్పము వలెనే ప్రతిభాసకాలమున, భయపెట్టుచున్నట్లే ఆభాసరాగము కూడ, స్థితప్రజ్ఞస్థితికి భంగకర మగును. అట్లయినచో, ఆభాసత్వానుసంధానము అనువర్తించినచో, బాధ లేదు కదా! అనినచో, 'చిరం జీవతు భవాన్' చిరకాలము నీవు వర్ధిల్లుము, ఇదియే మాకు అభిమతమైన జీవన్ముక్తి.

## జీవన్ముక్తివివేకః

యాజ్ఞవల్క్యస్తు విజిగీషుదశాయాం న హీదృశః, చిత్త విశ్రాన్త యే విద్వత్సంన్యాసస్య తేన కరిష్యమాణత్వాత్। న కేవలమస్య విజిగీషా కిన్తు ధనతృష్ణాఽపి మహతీ జాతా, యతో బహూనాం బ్రహ్మవిదాం పురతః స్థాపితం సాలంకారం గోసహస్ర మపహృత్య స్వయమేవేద మాహ- నమో వయం బ్రహ్మిష్ఠాయ కుర్మో గోకామా ఏవ వయం స్మః' (బృ. ఉ. 3-1-2) ఇతి। ఇతరాత్ బ్రహ్మవిదోఽవజ్ఞాతు మియం కాచి ద్వచోభంగీతి చేత్, అయమపి తర్హ్యపరో దోషః। ఇతరే చ బ్రహ్మవిదః స్వకీయం ధన మనేనాపహృత మితి మత్వా చుక్రుధుః।

### భావప్రకాశిక

యాజ్ఞవల్క్యుడైతే జనకవిద్వత్సభలో విజిగీషువుగా ఉన్న

దశలో ఇట్టివాడు కాడు (జీవన్ముక్తుడు, స్థితప్రజ్ఞుడు కాడు). చిత్తవిశ్రాంతికై విద్వత్సంన్యాసమును యాజ్ఞవల్క్యుడు ఉత్తర కాలమునందు చేయబోవుచున్నాడు. ఈ యాజ్ఞవల్క్యునకు కేవలము విద్వాంసులను విద్యచే గెలువవలయును అను కోరిక మాత్రమే కాదు, మరేమనగా, విస్తారమగు ధనతృష్ణ గూడ, కలదు. బ్రహ్మవేత్తలైన బహువిద్వాంసులముందు సాలంకృత గోసహస్రమును జనకమహారాజు ఉంచగా, ఆగోవులను ఇంటికి తోలుకొనిపొమ్మని శిష్యునితో చెప్పి,

"నమో వయం బ్రహ్మిష్ఠాయ కుర్మో గోకామా ఏవ వయం స్మః॥"

'బ్రహ్మిష్ఠునకు మేము నమస్కరింతుము, మేము గోవులు కావలయును అను కోరిక గలవారము' అని పలికెను. ఇతరులైన బ్రహ్మవిదులను అవమానించుటకు యాజ్ఞవల్క్యుడు తన వాక్నైపుణ్యమును చూపెను అనినచో, ఇది గూడ, మరియొక దోషము. తక్కిన బ్రహ్మవిదులు తమ ధనము యజ్ఞవల్క్యునిచే అపహరింపబడినదని తలచి, క్రోధపరవశులైరి.

జీవన్ముక్తివివేకః

స్వయం చ క్రోధపరవశః శాకల్యం శాపేన మారయామాస। న చాస్య బ్రహ్మఘ్నో మోక్షాభావః శంకనీయః। యతః కౌషీతకినః సమామనన్తి – 'నాస్య కేన చ కర్మణా లోకో మీయతే న మాతృవధేన న పితృవధేన న స్తేయేన న భ్రూణహత్యయా' ఇతి। శేషోఽపి స్వకృతాయా మార్యాపంచాశీత్యా మిదమాహ–

శ్లో॥ హయమేధ శతసాహస్రాణ్యథ కురుతే బ్రహ్మఘాతలక్షాణి।
పరమార్థవి న్న పుణ్యై ర్న చ పాపైః స్పృశ్యతే విమలః॥ 77. ఇతి।

తస్మాత్ కిం బహునా, బ్రహ్మవిదాం యాజ్ఞవల్క్యాదీనా మస్త్యేవ మలినవాసనానువృత్తిః, భగీరథస్తు తత్త్వం

విదిత్వాఽపి రాజ్యం పాలయన్మలినవాసనాభిః చిత్తవిశ్రాన్త్యభావేసతి సర్వం పరిత్యజ్య పశ్చాత్ విశ్రాన్తవానితి వసిష్ఠేనోపాఖ్యాయతే।

భావప్రకాశిక

ఇదిగాక, యాజ్ఞవల్క్యుడు స్వయముగా క్రోధపరవశుడై శాకల్యుని, శాపముచేత చంపెను. బ్రహ్మహత్య చేసిన ఈ యాజ్ఞవల్క్యునకు మోక్షము రాదని శంకించవలదు. ఎందువలననగా, కౌషీతకిశాఖలోనివారు ఇట్లు వేదమున, పఠించుచున్నారు.

"నాస్య కేన చ కర్మణా లోకో మీయతే న మాతృవధేన
న పితృవధేన న స్తేయేన న భ్రూణహత్యయా॥"

ఈ జ్ఞానికి ఏ కర్మచేతను, హాని కలుగనేరదు. మాతృవధచేతగాని, పితృవధ చేతగాని, దొంగతనము చేతగాని, భ్రూణహత్యచేతగాని, ఏ అనర్థము కలుగనేరదు' అని భావము. శేషుడు కూడ, తనచే రచింపబడిన 'ఆర్యాపంచాశీతి' యందు ఇట్లు చెప్పెను-

బ్రహ్మవేత్త, లక్ష అశ్వమేధయాగములు చేసినను, లక్ష బ్రహ్మహత్యలు చేసినను, ఆ పుణ్యములచేతగాని, ఈ పాపముల చేతగాని, స్పృశింపబడడు. స్వచ్ఛముగానే, శుద్ధుడుగానే ఉండును'

కనుక, ఇన్ని మాటలేల? బ్రహ్మవేత్తలైన యాజ్ఞవల్క్యాదులకు గూడ, మలినవాసనలు అనువర్తించియే యున్నవి. భగీరథుడైతే, తత్త్వము తెలిసికొనినపిమ్మట గూడ, రాజ్యమును పరిపాలించుచు మలినవాసనలచే చిత్తవిశ్రాంతి లేకపోగా, సర్వమును పరిత్యజించి, తరువాత విశ్రాంతిని పొందినవాడాయెను అని వసిష్ఠునిచే ఉపాఖ్యానము చెప్పబడినది.

## జీవన్ముక్తివివేకః

అతః స్వకీయం వర్తమానం మలినవాసనాదోషం పరకీయ దోషవత్సమ్యగుత్ప్రేక్ష్య తత్ప్రతీకార మభ్యస్యేత్। అన్యైనైవాభి ప్రాయేణ స్మర్యతే-

శ్లో॥ యథా సునిపుణః సమ్యక్పరదోషేక్షణే రతః।
తథా చేన్నిపుణః స్వేషు కో న ముచ్యేత బంధనాత్॥ ఇతి।

నన్వాదౌ తావద్విద్యామదస్య కః ప్రతీకార ఇతి చేత్, కిం స్వనిష్ఠస్య పరవిషయస్య మదస్య, కిం వా స్వవిషయస్య పర నిష్ఠస్య? ఆద్యే భంగోఽవశ్యం క్వచిద్ భవిష్యతీతి నిరన్తరం భావయేత్। తద్యథా శ్వేతకేతు ర్విద్యయా మత్తః ప్రవాహణస్య రాజ్ఞః సభాం గత్వా తేన పంచాగ్నివిద్యాయాం పృష్టాయాం స్వయమజానానో నిరుత్తరో రాజ్ఞా బహుధా భర్త్సితః, పితుః సమీప మాగత్య స్వనిర్వేద ముదాజహార। పితా తు నిర్మద స్తమేవ రాజాన మనుసృత్య తాం విద్యాం లేభే। దృప్త బాలాకి శ్చాజాతశత్రుణా రాజ్ఞా భర్త్సితో దర్పం సంత్యజ్య రాజాన ముపససాద। ఉషస్త కహోలాదయశ్చ మదేన కథాం కృత్వా పరాజితాః। యదా స్వవిషయః పరనిష్ఠో మదః ప్రవర్తేత స పరో మాం నిన్దతు, అవమన్యతాం వా సర్వథాఽపి న మే హానిరితి భావయేత్। తథా హి।

శ్లో॥ ఆత్మానం యది నిందన్తి నిందన్తి స్వయమేవ హి।
శరీరం యది నిందన్తి సహాయాస్తే మతా మమ॥
నిందావమానావత్యన్తం భూషణం యస్య యోగినః।
ధీవిక్షేపః కథం తస్య వాచాట్యైః క్రియతా మిహ॥ ఇతి।

### భావప్రకాశిక

ఇందువలన, తనయందు ఉన్న మలినవాసనాదోషమును పరుల దోషముల వలెనే బాగుగా పరిశీలించి, దానికి

ప్రతీకారమును అభ్యసింపవలెను. ఈ అభిప్రాయము చేతనే స్మృతియందు ఇట్లు చెప్పబడుచున్నది-

ఇతరుల తప్పులను ఎన్నుటలో ఎంత నైపుణ్యముతో బాగుగా ఆసక్తి గలవాడు అగునో, అట్లే తన దోషములను కనుగొనుటకు నిపుణుడైనచో, ఎవడు బంధమునుండి ముక్తుడు కాకుండును? అని చెప్పబడినది.

ఓయీ! మొదట, విద్యామదమునకు ప్రతీకారమేమి? అని ప్రశ్నించినచో, ఇతరులను గురించి తనకున్న విద్యాగర్వమునకు, మదమునకు ప్రతీకారమా, లేక తననుగురించి ఇతరులకున్న విద్యా మదమును గురించియా ? తనయందున్న విద్యామదమును గురించి ఎప్పుడో ఒకప్పుడు, భంగపాటు కలుగును. కనుక, విద్యా మదము పనికిరాదు అని నిరంతరము మనస్సులో తలంచ వలయును. ఎట్లనగా, శ్వేతకేతువు విద్యామదమత్తుడై ప్రవాహణు డను రాజు వద్దకు వెళ్ళెను. ఆ రాజు, సభలో శ్వేతకేతువును పంచాగ్నివిద్యను గురించి చెప్పవలసినది అని అడిగెను. తనకు తెలియక, రాజునకు సమాధానము చెప్పజాలక, అవమానితుడై తండ్రి సమీపమునకు వచ్చి, తన ఖేదమును వివరించెను. అతని తండ్రి, విద్యామదము లేనివాడు గనుక, ఆ రాజువద్దకు వెళ్ళి, పంచాగ్నివిద్యను గ్రహించెను. ఇట్లే, దృప్తుడగు బాలాకి అజాత శత్రువను రాజు వద్దకు వెళ్ళి, నీకు బ్రహ్మవిద్యను చెప్పెదను అనెను. కాని, ఆ బ్రహ్మవిద్యలో పారంగతుడు కాకపోవుటచే, అజాతశత్రువుచే చులకనగా చూడబడినవాడై, తన దర్పమును విడనాడి, అజాతశత్రువు వద్ద బ్రహ్మవిద్యను పరిపూర్ణముగా గ్రహించెను. ఉషస్తుడు, కహోలుడు మొదలగువారు విద్యా మదముచే యాజ్ఞవల్క్యునితో వాదము చేసి, పరాజితులైరి.

ఇక, తననుగురించి ఇతరులు విద్యామదము కలవారై

ప్రవర్తించినచో, అప్పుడు ఇతరులు మదముచే తనను నిందించినను, అవమానించినను– దానివలన, నాకు ఎట్టి హానియు లేదు అని తలంపవలెను. అట్లే కదా! తనను ఇతరులు నిందించినచో వారు తమనే తాము నిందించుకొనుచున్నారు. ఆత్మ ఒక్కటియే కదా! వారు తన శరీరమును నిందించినచో, నాకు సహాయము ఆచరించువారే అయి ఉన్నారు. ఏ యోగికి నిందావమానములు మిక్కిలి భూషణము లగునో, ఆ యోగికి బుద్ధి విక్షేపము కలుగనేరదు, ఏకాగ్రధ్యానమునకు భంగము కలుగదు. వాచాటులు ఆ యోగులను ఏమి చేయగలరు? అని చెప్పుచున్నారు.

జీవన్ముక్తి వివేకః

నైష్కర్మ్యసిద్ధౌ–

శ్లో॥ వర్చస్కే సంపరిత్యక్తే దోషత శ్చావధారితే।
యది దోషం వదే త్తస్మై తత్రోచ్చరితు ర్భవేత్॥ 2–16
తద్వత్థూలే తథా సూక్ష్మే దేహే త్యక్తే వివేకతః।
యది దోషం వదేత్ తాభ్యాం కిం తత్ర విదుషో భవేత్॥
2–17.

శోక హర్ష భయ క్రోధ లోభ మోహ స్పృహాదయః।
అహంకారస్య దృశ్యన్తే జన్మ మృత్యుశ్చ నాత్మనః॥ ఇతి।

నిందాయా భూషణత్వం చ జ్ఞానాంకుశే దర్శితమ్–

శ్లో॥ మన్నిందాయా యది జనః పరితోషమేతి నన్వ ప్రయత్న
సులభోఽయ మనుగ్రహో మే।
శ్రేయోర్థినో హి పురుషాః పరితుష్టిహేతో
ర్దుఃఖార్జితాన్యపి ధనాని పరిత్యజన్తి॥
సతతసులభదైన్యే నిఃసుఖే జీవలోకే
యది మమ పరివాదాత్ ప్రీతి మాప్నోతి కశ్చిత్।

పరివదతు యథేష్టం మత్సమక్షం తిరో వా జగతి హి
బహుదుఃఖే దుర్లభః ప్రీతియోగః॥ ఇతి।

అవమానస్య భూషణత్వం స్మర్యతే-

శ్లో॥ తథా చరేత వై యోగీ సతాం ధర్మ మదూషయన్।
జనా యథావమన్యేరన్ గచ్ఛేయు ర్నైవ సంగతిమ్॥ ఇతి।

యాజ్ఞవల్క్యోషస్తాదీనాం యౌ స్వనిష్ఠపరనిష్ఠౌ విద్యామదౌ తయోర్యథా వివేకేన ప్రతీకార స్తథా ధనాభిలాషక్రోధయో రప్యవగన్తవ్యః।

శ్లో॥ అర్థానా మర్జనే క్లేశ స్తథైవ పరిపాలనే।
నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాన్క్లేశకారిణః॥

ఇతి ధనవిషయయే వివేకః॥

క్రోధోఽపి ద్వివిధః- స్వనిష్ఠః పరవిషయః, పరనిష్ఠః స్వవిషయశ్చేతి। తత్ర స్వనిష్ఠం పరవిషయం ప్రతి ఏవముక్తమ్-

శ్లో॥ అపకారిణి కోపశ్చేత్ కోపః కోపే కథం నతే।
ధర్మార్థకామ మోక్షాణాం ప్రసహ్య పరిపన్థిని॥
ఫలార్థినో ధర్మయశోఽర్థనాశనః
స చేదపార్థః స్వశరీరతాపనః।
న చేహ నాముత్ర హితాయ యః సతాం మనాంసి కోపః
సముపాశ్రయేత్ కథమ్॥ ఇతి।

స్వవిషయం పరనిష్ఠం ప్రత్యేవమీరితమ్-

శ్లో॥ న మేఽపరాధః కిమకారణే నృణాం
మదభ్యసూయేత్యపి నైవ చిన్తయేత్।
న యత్కృతా ప్రాగ్భవ బన్ధనిష్కృతి
స్తతోఽపరాధః పరమోఽనుచిన్త్యతామ్॥
నమోఽస్తు కోపదేవాయ స్వాశ్రయజ్వాలినే భృశమ్।
కోప్యస్య మమ వైరాగ్యదాయినే దోషబోధినే॥ ఇతి।

ధనాభిలాషక్రోధవద్ యోషిత్పుత్రాభిలాషావపి వివేకేన నివర్తనీయౌ॥

భావప్రకాశిక

నైష్కర్మ్యసిద్ధియందు ఇట్లు చెప్పబడెను–

పురీషము విడువబడి, దానియందు దోషము నిర్ధారణ చేయబడగా, ఇతరుడు ఆ దోషమును చెప్పినచో, పురీషోత్సర్గము చేసినవానికి ఏమి నష్టము కలుగును? అదేవిధముగా స్థూలశరీరము నందును, సూక్ష్మశరీరమునందును వివేకముచే అభిమానమును త్యజించిన ఆత్మజ్ఞానికి శరీరములందు దోషములను ఇతరులు ఉద్ఘాటన చేసినచో, ఆత్మవిదునకు ఏమియు నష్టము కలుగదు. శోకము, హర్షము, భయము, క్రోధము, లోభము, మోహము, కోరిక మొదలగునవి అహంకారమునకు సంబంధించినవి అయి ఉన్నవి. జననమరణములు కూడ, శరీరమునకే గాని, ఆత్మకు కావు అని పై వచనముల భావము.

నింద కూడ, అలంకారమే అని 'జ్ఞానాంకుశము' అను గ్రంథమున చెప్పబడినది.

లోకమునందు జనులు నన్ను నిందించి సంతోషమును పొందినచో, వారు నా ప్రయత్నము లేకుండగనే సులభముగా నన్ను అనుగ్రహించినవారు అగుచున్నారు. లోకమందు పురుషులు శ్రేయస్సుకోరువారు సంతోషమునకై కష్టపడి సంపాదించిన ధనమును గూడ వ్యయము చేయుచున్నారు. ఈ జీవలోకము సుఖము లేక, దైన్యముతో పరితపించుచుండగా, నన్ను నిందించుటవలన సుఖసంతోషములను ఎవడైనను పొందినచో, వాడు నాయెదుటగాని, చాటునగాని, యథేష్టముగా నిందింపనిమ్ము. దుఃఖబహుళమైన ఈ లోకమున సంతోషలాభము అరుదు కదా! అవమానము కూడ, భూషణముగా స్మరింపబడు చున్నది.

యోగి, సత్పురుషుల ధర్మముననుసరించుచు జనులు ఎట్లు తనను అవమానింతురో, తనదగ్గరకు ఎట్లు చేరరో, ఆవిధముగా సంచరించవలెను.

యాజ్ఞవల్క్య, ఉషస్త్రాదులకు తమయందు, ఇతరులయందు ఉన్న విద్యామదములు వివేకముచే ప్రతిక్రియ (పోగొట్టుకొనుట) చేయవగియున్నవో, అట్లే ధనాభిలాష, క్రోధములకు గూడ వివేకముచే ప్రతీకారము చేసికొనవలయును.

ధనమును సంపాదించుటలో క్లేశము, అట్లే రక్షించుకొనుటలో క్లేశము. ధననాశనమున దుఃఖము, వ్యయమున దుఃఖము. ఇంత క్లేశము కలిగించు ధనమును గురించి నింద అగుగాక. ఇది ధనమును గురించిన వివేకము.

ఇక, క్రోధము స్వనిష్ఠము ఇతరులను గురించి; పరనిష్ఠము తనను గురించి అని రెండు విధములు. స్వనిష్ఠమగు క్రోధము గురించి ఇట్లు చెప్పబడెను-

తనకు అపకారము కలిగించినవారియందు కోపము కలుగును. కోపము మనకు అపకారియే కదా! ధర్మార్థ, కామ, మోక్షములకు బలవద్విరోధియగు ఆ కోపమునందు నీకు ఎందుకు కోపము కలుగరాదు? ఫలము కోరువానికి కోపము ధర్మమును, యశస్సును, ధనమును నశింపజేయును. ఆ కోపము వ్యర్థమైనది. తన శరీరమును తపింపజేయును. క్రోధము ఇహలోక హితము, పరలోక సుఖసాధనము గూడ కాదు. కనుక, సత్పురుషులయొక్క మనస్సును కోపము ఎట్లు ఆశ్రయించును?

తనను గురించి, ఇతరుల కోపమును గురించి ఇట్లు చెప్పబడినది-

'నా తప్పిదము ఏమియు లేదు. ఇతరులు నిష్కారణముగా నాయందు అసూయపడుచున్నారు' అనియు, చింతించరాదు.

పూర్వ జన్మ బంధము ఈవిధముగా తీర్చుకొనబడుచున్నది. పూర్వ జన్మవాసనలే ఈ కోపమునకు ముఖ్యకారణము అని తలంచవలెను.

"నమోఽస్తు కోపదేవాయ స్వాశ్రయజ్వాలినే భృశమ్।
కోప్యస్య మమ వైరాగ్యదాయినే దోషబోధినే॥"

తన ఆశ్రయమునే మిక్కిలి దహించివేయు కోపమనెడి దైవమునకు నా నమస్కారము అగుగాక! దోషములను తెలియజేసి వైరాగ్యమును ప్రసాదించునట్టి ఈ కోపదేవునకు నా అంజలి.

ధనాభిలాషాక్రోధముల వలెనే భార్యాపుత్రాభిలాషలను గూడ, వివేకముచే నివర్తించుకొనవలయును.

## జీవన్ముక్తివివేకః

తత్ర యోషిద్వివేకో వసిష్ఠేన దర్శితః–

శ్లో॥ మాంసపాంచాలికాయాస్తు యన్త్రలోలేఽఙ్గపంజరే।
స్నాయ్వస్థి గ్రన్థిశాలిన్యాః స్త్రియాః కిమివ శోభనమ్॥
త్వఙ్మాంస రక్తబాష్పాంబు పృథక్కృత్వా విలోచనే।
సమాలోకయ రమ్యం చేత్ కిం ముధా పరిముహ్యసి॥
మేరుశృంగతటోల్లాసి గంగాజలరయోపమా।
దృష్టా యస్మిన్స్తనే ముక్తాహారస్యోల్లాసశాలితా॥
శ్మశానేషు దిగంతేషు స ఏవ లలనాస్తనః।
శ్వభి రాస్వాద్యతే కాలే లఘు పిండ ఇవాన్ధసః॥
కేశకజ్జలధారిణ్యో దుఃస్పర్శా లోచనప్రియాః।
దుష్కృతాగ్నిశిఖా నార్యో దహన్తి తృణవన్నరాన్॥
జ్వలతా మతిదూరేఽపి సరసా అపి నీరసాః।
స్త్రియో హి నరకాగ్నీనా మిన్ధనం చారు దారుణమ్॥
కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసామ్।
నార్యో నరవిహంగానా మంగబంధనవాగురాః॥

జన్మపల్వల మత్స్యానాం చిత్తకర్దమచారిణామ్।
పుంసాం దుర్వాసనా రజ్జు నారీ బడిశపిండికా॥
సర్వేషాం దోషరత్నానాం సుసముద్గికయాఽనయా।
దుఃఖశృంఖలయా నిత్యమలమస్తు మమ స్త్రియా॥
ఇతో మాంస మితో రక్త మితోఽస్థీనీతి వాసరైః।
బ్రహ్మన్కతిపయైరేవ యాతి స్త్రీ విషచారుతామ్॥
యస్య స్త్రీ తస్య భోగేచ్ఛా నిఃస్త్రీకస్య క్వ భోగభూః।
స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీ భవేత్॥
ల. వా. 2, 90-100

### భావప్రకాశిక

ఆ భార్యాపుత్రాభిలాషల విషయములో స్త్రీ విషయమున, వివేకము వసిష్ఠునిచే ఇట్లు చూపబడినది-

మాంసపు గుడ్డబొమ్మయు, నరములు, ఎముకలు, గ్రంథులతో ఒప్పిన యంత్రమువలె చలించునట్టి స్త్రీ శరీర పంజరమున మంగళకరమైనది ఏమి కలదు ?

చర్మము, మాంసము, రక్తము, కన్నీరు వేరుగా చేసి కంటితో చూచినచో, మనోహరమైనది ఏమి కలదు ? ఎందుకు వ్యర్థముగా మోహము చెందుచున్నావు ?

మేరుశిఖరమున, చరియలందు ప్రవహించు గంగాప్రవాహ జలవేగముతో పోలిక గల ముత్యాలహారము యొక్క విలాసయుత శోభ ఏ స్తనమునందు చూడబడెనో, ఆ వనితా స్తనమే శ్మశానములం, దిగంతములందు కాలాంతరమున చిన్న అన్నపుపిండము వలె కుక్కలచే ఆస్వాదింపబడుచున్నది.

కేశములు అనెడు మసి కాటుకను ధరించినట్టియు, స్పృశించుటకు అలవికాని కన్నులకు మాత్రమే ఇంపైన పాపాగ్ని

శిఖలగు స్త్రీలు తృణములవలె నరుని దహించుచున్నారు.

అతిదూరమునందు మండుచున్న నరకాగ్నులకు ఆర్ద్రములయినను, నీరసములు (శుష్కకాష్ఠములు) అగు స్త్రీలు దారుణము, మనోహరమును అగు ఇంధనములయి ఉన్నారు.

కాముడను కిరాతునిచే వెదజల్లబడిన స్త్రీలు అను వలలు మూఢులైన మనుష్యపక్షులకు శరీరబంధనహేతువులైయున్నారు. జన్మ అనెడు చిన్న నీటిగుంటయందు మత్స్యములైనట్టి, చిత్తమనెడి బురదలో సంచరించునట్టి పురుషులను దుర్వాసనలనెడి రజ్జువులతో గ్రథించబడిన (గ్రుచ్చబడిన) గాలములోని ఎర అయి ఉన్నారు.

సమస్త దోషరత్నములకు మంచి భరిణవంటి దుఃఖశృంఖల యగు స్త్రీతో ఇకమీదట నాకు సంబంధము లేకుండుగాక!

ఇటువైపు మాంసము, ఇటు రక్తము, ఇటు ఎముకలు అనురీతిగా కొద్ది దినములలోనే మనోహరత్వమును కోల్పోయి, ఓ బ్రాహ్మణోత్తమా! స్త్రీ, వికారముగా కన్పించును.

ఎవనికి స్త్రీ కలదో, వానికి భోగేచ్ఛ కలుగును. స్త్రీ లేనివానికి భోగస్థానమెద్ది? స్త్రీని వదలిపెట్టిన, జగత్తును వదలిపెట్టినట్లు అగును. జగత్తును వదలిపెట్టి, సుఖి యగును అని వసిష్ఠుడు చెప్పెను.

జీవన్ముక్తివివేకః

వృత్తవివేకో బ్రహ్మానందే దర్శితః-

శ్లో॥ అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరమ్।
లబ్ధోఽపి గర్భపాతేన ప్రసవేన చ బాధతే॥
జాతస్య గ్రహరోగాదిః కుమారస్య చ మూర్ఖతా।
ఉపనీతే త్వవిద్యత్వ మనుద్వాహశ్చ పండితే॥
యూనశ్చ పరదారాది ర్దారిద్ర్యం చ కుటుంబినః।

పిత్రో ర్దుఃఖస్య నా స్త్యన్తో ధనీ చే న్మ్రియతే తదా॥ ఇతి।

యథా విద్యా ధన క్రోధ యోషి త్పుత్రవిషయాణాం మలినవాసనానాం వివేకేన ప్రతీకార స్తథాఽన్యాసామపి వాసనానాం యథాయోగం శాస్త్రైః స్వయుక్త్యా చ దోషం వివిచ్య ప్రతీకారం కుర్యాత్। కృతే చ ప్రతీకారే జీవన్ముక్తిలక్షణం పరమం పదం లభ్యతే।

తదాహ వసిష్ఠః—

శ్లో॥ వాసనానాం పరిత్యాగో యది యత్నం కరోష్యలమ్।
తత్తే శిథిలతాం యాన్తి సర్వాధివ్యాధయః క్షణాత్॥
పౌరుషేణ ప్రయత్నేన బలాత్సంత్యజ్య వాసనాః।
స్థితిం బధ్నాసి చే త్తర్హి పద మాసాదయస్యలమ్॥

ఇతి।

## భావప్రకాశిక

పుత్రవివేకము బ్రహ్మానందమునందు ఇట్లు చూపబడినది— లభించని పుత్రుడు తల్లిదండ్రులను చిరకాలము క్లేశమునకు గురిచేయును. ఒకవేళ, పుత్రుడు లభ్యమైనను, గర్భపాతము చేతనో, ప్రసవము చేతనో బాధించును.

పుట్టిన తరువాత, గ్రహరోగాదుల వలన బాధించును. కొంత పెరిగి, చదువులేనివాడై మూర్ఖతచేత కుమారుడు బాధకలుగచేయుచున్నాడు. ఉపనీతుడైనచో, వేదవిద్య రానందువలన, బాధ కలుగజేయును. పండితుడైనను, పెండ్లి కాలేదని బాధకు గురిచేయును.

యువకుడైన తరువాత, పరదారగ్రహణముచే బాధించును. కుటుంబి అయినచో, దారిద్ర్యబాధ కలుగును. కనుక, తల్లిదండ్రులకు పుత్రునివలన దుఃఖమునకు అంతము లేదు. ఇక, ధనవంతుడై చనిపోయినచో, ఆ బాధ చెప్పనలవి కాదు.

ఏవిధముగా విద్య, ధనము, క్రోధము, స్త్రీ, పుత్రుడు- వీరల గురించి మలినవాసనలను వివేకముతో ప్రతిక్రియ చేసికొనవలయునో, అట్లే ఇంకను, ఇతరములైన దుష్టవాసనలను గూడ తగినట్లుగా శాస్త్రములచేత, యుక్తితోను దోషమును విడమరచి తెలిసికొని, ప్రతిక్రియ చేసికొనవలయును.

ఈవిధముగా మలినవాసనలకు విచారణ జరుగగా, జీవన్ముక్తి లక్షణమగు పరమపదము లభ్యమగును. ఈ విషయమునే వసిష్ఠుడు ఇట్లు చెప్పెను-

వాసనాపరిత్యాగమునకు బాగుగా ప్రయత్నము చేసినచో, అవి క్రమముగా శిథిలములు అగును (సడలును). ఆధివ్యాధులు తగ్గిపోవును. పురుషప్రయత్నముతో వాసనలను పరిత్యజించిన స్థితిని సంపాదించినచో, అప్పుడు పరమపదమును పొందును.

## జీవన్ముక్తివివేకః

నన్వత్ర పౌరుషః ప్రయత్నో నామ పూర్వోక్తో విషయదోషవివేకః। స చ పునః పునః క్రియమాణోఽపి ప్రబలేన్ద్రియవ్యవహారేణాభిభూయతే। తదుక్తం భగవతా-

శ్లో॥ యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥

భ.గీ. 2-60

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥

భ. గీ. 2-67 ఇతి।

ఏవం తర్హ్యుత్పన్నవివేకరక్షార్థమింద్రియాణి నిరోద్ధవ్యాని। తదపి తత్రైవోత్తరశ్లోకాభ్యాం దర్శితమ్-

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।

వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥
భ. గీ. 2-61.

శ్లో॥ తస్మాదస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥
భ. గీ. 2-67 ఇతి। స్మృత్యన్తరేపి-

శ్లో॥ న పాణిపాదచపలో న నేత్రచపలో యతిః।
న చ వాక్చపలశ్చైవమితి శిష్టస్య లక్షణమ్॥ ఇతి।

భావప్రకాశిక

ఓయీ! ఇచట, పురుషప్రయత్నమనగా వెనుక చెప్పిన విషయవివేకదోషమే కదా! ఆ వివేకము ఘాటిమాటికి చేయబడు చున్నను, ప్రబలమగు ఇంద్రియవ్యవహారముచే లుప్తమగు చున్నది. శ్రీకృష్ణభగవానునిచే ఇట్లు చెప్పబడెను-

"యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।
ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః।"

"ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి॥"

ఓ అర్జునా! ప్రయత్నశీలుడు, వివేకియునగు పురుషునకు గూడ, ఇంద్రియములు పెడద్రోవను బట్టి, మనస్సును బలాత్కారముగా ఆకర్షించుచున్నవి.

విషయములందు సంచరించు ఇంద్రియములు మనస్సు వెంట అనుసరించినచో, అది, వాయువు జలమునందు నావనువలె వీని బుద్ధిని హరించి వైచును.

అట్లయినచో, కలిగిన వివేకమును రక్షించుకొనుటకు ఇంద్రియములను నిరోధించవలయును. ఆ విషయము కూడ అచటనే ఉత్తరశ్లోకములచే చూపబడెను.

ఆ ఇంద్రియముల నన్నింటిని విషయములమీదికి

పోకుండునట్లు సంయమనము చేసి, మనస్సును నాయందు తత్పరతతో ఉంచవలయును. ఎవనికి ఇంద్రియములు వశము నందుండునో, 'తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా' వాని బుద్ధి నిలుకడగా నుండును.

కనుక, ఓ అర్జునా! ఇంద్రియములను విషయములనుండి నిగ్రహించినవానికి బుద్ధి, నిలుకడ గలది అగును.

మరియొక స్మృతియందును, ఇట్లు చెప్పబడెను-

పాణి చాపలమనగా, చేతులతో తృణాదులను ఊరకనే త్రుంచుట, పాదచాపలమనగా, కూడని చోటికి నడచి వెళ్ళుట, నేత్రచాపలమనగా, రాగముతో చూచుట, వాక్చాపలమనగా ఏదియో మాట్లాడుట, వదరుట- ఇవి యతికి ఎంతమాత్రము తగవు. చాపలము లేకపోవుట శిష్టలక్షణము.

జీవన్ముక్తివివేకః

ఏతదేవాన్యత్ర సంగ్రహవివరణాభ్యాం స్పష్టీకృతమ్-

శ్లో॥ అజిహ్వః షండకః పంగు రంధో బధిర ఏవ చ।
ముగ్ధశ్చ ముచ్యతే భిక్షుః షడ్భిరేతై ర్న సంశయః॥
ఇద మిష్ట మిదం నేతి యోఽశ్నన్నపి న సజ్జతే।
హితం సత్యం మితం వక్తి తమజిహ్వం ప్రచక్షతే॥
అద్యజాతాం యథా నారీం తథా షోడశవార్షికీమ్।
శతవర్షాం చ యో దృష్ట్వా నిర్వికారః స షండకః॥
భిక్షార్థ మటనం యస్య విణ్మూత్రకరణాయ చ।
యోజనా న్న పరం యాతి సర్వథా పంగురేవ సః॥
తిష్ఠతో వ్రజతో వాఽపి యస్య చక్షు ర్న దూరగమ్।
చతుర్యుగాం భువం త్యక్త్వా పరివ్రాట్ సోఽన్ధ ఉచ్యతే॥
హితం మితం మనోరమ్యం వచః శోకాపహం చ యత్।
శ్రుత్వా యో న శృణోతీవ బధిరః స ప్రకీర్తితః॥

సంనిధౌ విషయాణాం చ సమర్థోఽవికలేంద్రియః।
సుప్తవద్వర్తతే నిత్యం భిక్షుర్ముగ్ధః స ఉచ్యతే॥
న నిందం న స్తుతిం కుర్యా న్న కించి న్మర్మాణి స్పృశేత్।
నాతివాదీ భవేత్ తద్వత్ సర్వత్రైవ సమో భవేత్॥
న సంభాషేత్ స్త్రియం కాంచిత్ పూర్వదృష్టాం న చ స్మరేత్।
కథాం చ వర్జయే త్తస్యా న పశ్యే ల్లిఖితామపి॥ ఇతి॥

### భావప్రకాశిక

ఈ విషయమే మరియొక గ్రంథమునందు సంగ్రహ వివరణములతో స్పష్టము చేయబడినది.

అజిహ్వుడు (నాలుక లేనివాడు), షండుడు (నపుంసకుడు), పంగువు (కుంటివాడు), అంధుడు గ్రుడ్డివాడు), బధిరుడు (చెవిటి వాడు), మూఢుడు అగు ప్రాణి ముక్తుడగును. సంశయము లేదు.

అజిహ్వుడనగా, ఇది నాకు ఇష్టము, ఇది ఇష్టము కాదు అని అనకుండా ఎవడు భుజించునో, ఆహారమునందు ఆసక్తి కలవాడు కాడో, హితమును, సత్యమును, మితము నగు భాషణ మును చేయునో అతడు, అజిహ్వుడు అని చెప్పుచున్నారు.

ఇప్పుడు పుట్టిన ఆడపిల్లను, పదునారేళ్ళ ప్రాయము గల స్త్రీని, నూరేళ్ళ వృద్ధురాలను చూచినపుడు, ఎవడు నిర్వికారముగా ఉండునో, అతడు షండుడు.

భిక్షార్థము నడుచుట, మూత్రపురీషోత్సర్జనము కొరకు నడచుట తప్ప, యోజన దూరము దాటి వెళ్ళనివాడు పంగువు.

నిలుచున్నను, నడచుచున్నను, ఎవని దృష్టి ఎనిమిది గజములు దాటి వెళ్ళదో, ఆ పరివ్రాజకుడు అంధుడు.

హితము, మితము, మనోహరము నగు వాక్కును, అట్లే కష్టమును తీర్చునట్టి వాక్కును విని కూడ విననట్లుండునో, అతడు బధిరుడు.

సమర్థుడు, ఇంద్రియవైకల్యము లేనివాడునగు భిక్షువు విషయసన్నిధిలో నిద్రించినవానివలె ఉండునో, అతడు ముగ్ధుడు. (మూఢుడు- ఏమియు తెలియనివాడు)

యతి, ఎవరిని గూడ, నిందించరాదు, స్తుతించరాదు. ఎవరికిని, నొప్పి కలిగించరాదు. అతిగా మాట్లాడరాదు. సర్వ సముడుగా ఉండవలెను. స్త్రీతో మాట్లాడరాదు. వెనుక చూసిన స్త్రీని స్మరించరాదు. స్త్రీప్రసంగము చేయరాదు. చిత్తరవునందున్న స్త్రీని గూడ చూడరాదు.

జీవన్ముక్తివివేకః

యథా కశ్చిద్ వ్రతీ నక్తైకభుక్తోపవాస మౌనాదివ్రతం సంకల్ప్య సావధానో భ్రంశమకృత్వా సమ్యక్పాలయతి, తథైవా జిహ్వాత్వాది వ్రతే స్థితః సావధానో వివేకం పాలయేత్। తదేవం వివేక ఇంద్రియనిరోధాభ్యాం దీర్ఘకాల నైరంతర్యసత్కారసేవి తాభ్యాం మైత్ర్యాది భావనాసు ప్రతిష్ఠితా స్వాసురసంప్రదూపా మలినవాసనాః క్షీయన్తే। తతో నిఃశ్వాసోచ్ఛ్వాసవ న్నిమేషో న్మేషవచ్చ పురుషప్రయత్నమంతరేణ ప్రవర్తమానాభిః మైత్ర్యాదివాసనాభిః లోకే వ్యవహరన్నపి తదీయ సాకల్య వైకల్యానుసంధానం చిత్తే పరిత్యజ్య నిద్రా తంద్రా మనో రాజ్యాదిరూపాః సమస్త చేష్టాః ప్రయత్నేన శాంతాః కృత్వా చిన్మాత్రవాసనా మభ్యసేత్। స్వత స్తావ దిదం జగ చ్చిజ్జడో భయాత్మకం భాసతే; యద్యపి శబ్ద స్పర్శాది జడవస్తుభాసనా యైవ ఇంద్రియాణి సృష్టాని 'పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః' కఠ. 2-1-1 ఇతి శ్రుతేః; తథాఽపి చైతన్య స్యోపాదానతయా వర్జయితు మశక్యత్వా చ్చైతన్యపూర్వకమేవ జడం జగద్ భాసతే; 'తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి' కఠ. 2-2-15 ఇతి శ్రుతేః। తథా సతి

పశ్చాద్ భాసమానస్య జడస్య ప్రథమతో భాసమానమేవ చైతన్యం వాస్తవం రూపమితి నిశ్చిత్య జడ ముపేక్ష్య చిన్మాత్రం చిత్తే వాసయేత్। ఏతచ్చ బలిశుక్రయోః ప్రశ్నోత్తరాభ్యాం విస్పష్ట మవగమ్యతే–

శ్లో॥ కిమిహాస్తీహ కింమాత్ర మిథం కిమయమేవ చ।
కస్త్వం కోఽహం క ఏతే వా లోకా ఇతివదాశుమే॥

ల.వా. 21–50

శ్లో॥ చిదిహాస్తీహ చిన్మాత్ర మిదం చిన్మయమేవ చ।
చిత్త్వం చిదహ మేతే లోకా శ్చిదితి సంగ్రహః॥

ల.వా. 21–52 ఇతి।

యథా సువర్ణకామః కటకం క్రీణన్నపి వలయాకారస్య గుణదోషా వుపేక్ష్య గురుత్వవర్ణయోరేవ మనః ప్రణిధిత్సతి, తథా చిన్మాత్రే మనః ప్రణిధాతవ్యమ్। యావతా కాలేన జడం సర్వథైవోపేక్ష్య చిన్మాత్ర మనసః ప్రవృత్తి ర్నిశ్శ్వాసాదివత్ స్వాభావికీ సంపద్యతే, తావన్తం కాలం చిన్మాత్ర వాసనాయాం ప్రయతేత। నన్వాదావేవ చిన్మాత్రవాసనాఽస్తు, తయైవ మలిన వాసనానివృత్తేః। కిమనేనాంతర్గడునా మైత్ర్యాది అభ్యాసేనేతి చే న్న, చిద్వాసనాయా అప్రతిష్ఠితత్వ ప్రసంగాత్।

## భావప్రకాశిక

ఏ విధముగా ఒకానొక వ్రతపరుడు నక్తము, ఏకభుక్తము, ఉపవాసము, మౌనము మొదలగు వ్రతములను సంకల్పించి సావధానుడై వ్రతభంగము కలుగకుండ చక్కగా ఆవ్రతనియమము మును పాలించునో, అట్లే అజిహ్వ, షండ, పంగు, అంధ, బధిర, ముగ్ధవ్రతములందు సావధానుడై వివేకముతో పాలించుకొన వలెను. ఈవిధముగా వివేక, ఇంద్రియనిరోధములను దీర్ఘకాలము

నిరంతరముగా ఆదరముతో సేవించి, మైత్ర్యాదివాసనలు ప్రతిష్ఠితములు కాగా, ఆసురసంపదరూపములగు మలినవాసనలు క్షీణించును. పిమ్మట, ఉచ్ఛ్వాస, నిఃశ్వాసములవలెను, రెప్పలను మూయుట, తెరచుటవలెను పురుషప్రయత్నము లేకుండగనే ప్రవర్తించు మైత్ర్యాది వాసనలచే లోకమున, వ్యవహరించుచున్నను, ఆ వ్యవహారమున, గుణదోషములను, సమగ్రత, అపరిపూర్ణతలను అనుసంధానము చిత్తమునందు పరిత్యజించి నిద్ర, కునికిపాటు (అలసత), మనోరాజ్యము మొదలగు సమస్త చేష్టలను ప్రయత్నముచే శాంతములుగా చేసి, చిన్మాత్రవాసనలను అభ్యసింపవలెను. ఈ జగత్తు, సహజముగా జడచేతన ఉభయరూపముగా భాసించుచున్నది. విచారించగా, శబ్ద, స్పర్శాది జడవస్తువులను ప్రకాశింపజేయుటకే ఇంద్రియములు సృజింపబడినవి.

"పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూః।"

'బ్రహ్మ ఇంద్రియములను బహిర్ముఖములనుగా సృజించి, హింసించెను అని శ్రుతి కలదు కదా! అట్లయినను, ఆ శబ్ద స్పర్శాది విషయములకు చైతన్యము ఉపాదానమగుటచే విడిచిపెట్టుటకు శక్యము కానందున, చైతన్యపూర్వకముగానే జడమగు జగత్తు భాసించును.

"తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి।"

ఆ పరమాత్మయే ప్రకాశించుచుండగా, ఆ ప్రకాశము ననుసరించి, సమస్తమైన జగత్తు, ఆయన ప్రకాశముచేతనే అనుభానము కలదియగుచున్నది. (సూర్యప్రకాశము ననుసరించి చంద్రునకు అనుభానము కలదు.) అట్లే సూర్యప్రకాశము కూడ, పరమాత్మ చైతన్యప్రకాశము యొక్క అనుభానము అయి ఉన్నది అని

శ్రుతి కలదు. అట్లు కాగా, తరువాత, ప్రకాశించు జడవస్తువునకు మొదట ప్రకాశించిన చైతన్యమే వాస్తవరూపము అని నిశ్చయించి, జడము నుపేక్షించి చిన్మాత్రమునే చిత్తమునందు భావన చేయవలయును. ఈ విషయము బలిచక్రవర్తి, శుక్రాచార్యుల ప్రశ్నోత్తరముల వలన విస్పష్టముగా తెలియవచ్చుచున్నది.

ఓ ఆచార్యా! ఈ లోకమున ఏది కలదు? ఇది, దేని స్వరూపము? దేని కార్యము? నీవు ఎవడవు? నేను ఎవడను? వీరందరు ఎవరు? ఈ లోకములు దేని స్వరూపము? ఈవిషయములను నాకు శీఘ్రముగా చెప్పుము. శుక్రాచార్యుడు ఇట్లు చెప్పెను– ఈ లోకమున, చిద్వస్తువే ఉన్నది. ప్రతి వస్తువు చిన్మాత్రము. జగత్తు, చిన్మయము. నీవు, చిత్స్వరూపుడవు. నేను చిత్స్వరూపుడను. వీరందరు చిత్స్వరూపులే. లోకములన్నియు చిద్రూపములే. సంగ్రహముగా చెప్పితిని'.

ఏవిధముగా బంగారమును కోరువాడు బంగారు కంకణమును కొనుచున్నాడో, ఆ ఆభరణముయొక్క ఆకార, గుణదోషములను ఉపేక్షించి, బరువు, వన్నెలను మాత్రమే మనస్సున ఏకాగ్రముగా గ్రహించునో, అట్లే, జగదాకారమునందు దృష్టిని పెట్టుట, అధిష్ఠానమగు కేవల చిత్స్వరూపమునందు మనస్సును ఏకాగ్రమొనరించుటచేయవలెను. ఎంతకాలమువరకు జడమును పూర్తిగా ఉపేక్ష చేసి చిన్మాత్రమునందే మనస్సు యొక్క ప్రవృత్తి, నిఃశ్వాసాదులవలె స్వాభావికమగునో, అంతకాలమువరకు చిన్మాత్రవాసన (భావన) యందు ప్రయత్నించవలయును.

ఓయీ! మొదటనే చిన్మాత్రవాసన అభ్యసించ వచ్చును కదా! దానిచేతనే మలినవాసనలు నివృత్తములగును కదా! మధ్యలో గడువైన (వ్రణమువంటి బాధాకరమైన) మైత్ర్యాది

వాసనాభ్యాసమేల? అనినచో, అట్లు కాదు. మైత్ర్యాది వాసనాభ్యాసము లేనిదే చిన్మాత్రవాసన, ప్రతిష్ఠితము కానేరదు.

## జీవన్ముక్తివివేకః

యథా కుట్టిమదార్ఢ్య వ్యతిరేకణ క్రియమాణమపి స్తంభకుడ్యాత్మకం గృహం న ప్రతితిష్ఠతి, యథా వా విరేచనేన ప్రబలదోష మనిఃసార్య సేవిత మప్యౌషధం నారోగ్యకరం తద్వత్। నను 'తా మప్యథ పరిత్యజేత్' ఇతి చిన్మాత్రవాసనాయా అపి పరిత్యాగో అవగమ్యతే, తదప్యయుక్తమ్। చిన్మాత్రం పరిత్యజ్యాన్యస్య కస్యచి దుపాదేయస్యాభావాత్। నాయం దోషః। ద్వివిధా చిన్మాత్రవాసనా- మనోబుద్ధి సమన్వితా, తద్రహితా చేతి। కరణం మనః, కర్తృత్వోపాధి ర్బుద్ధిః। తథా చ సత్యప్రమత్తోఽహ మేకాగ్రేణ మనసా చిన్మాత్రం భావయిష్యామీతి ఏతాదృశేన కర్తృకరణానుసంధానేన సమన్వితా ప్రాథమికీ యా చిన్మాత్రవాసనా ధ్యానశబ్దాభిధేయా తాం పరిత్యజేత్। యా త్వభ్యాసపాటవేన కర్తృత్వాద్యనుసంధాన వ్యవధానరహితా సమాధిశబ్దాభిధేయా తాముపాదదీత। ధ్యానసమాధ్యోస్తు లక్షణం పతంజలిః సూత్రయామాస- 'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్' (౩-౨), 'తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః' (౩-౩) ఇతి। తాదృశే సమాధౌ దీర్ఘకాల నైరంతర్య సత్కారైః సేవితే స్థైర్యం లబ్ధ్వా పశ్చాత్ కర్తృకరణానుసంధానపరిత్యాగార్థో యః ప్రయత్నస్తమపి పరిత్యజేత్। నన్వేవం సతి తత్త్యాగప్రయత్నోఽపి పరిత్యాజ్య ఇత్యనవస్థా స్యాత్। మైవమ్। కతక రజోన్యాయేన స్వపరనివర్తకత్వాత్। యథా కలుషితే జలే ప్రక్షిప్తం కతక రజ ఇతర రజసా సహ స్వాత్మానమపి నివర్తయతి తథా త్యాగార్థః ప్రయత్నః కర్తృకరణానుసంధానం నివర్తయన్ స్వాత్మానమపి నివర్తయిష్యతి। నివృత్తేచ తస్మిన్ మలినవాసనా

వత్ శుద్ధవాసనామపి క్షీణత్వాత్ నిర్వాసనం మనోఽవతిష్ఠతే।

భావప్రకాశిక

ఏవిధముగా పునాదిరాళ్ళతో ధృఢముగా నిబద్ధమైన ఆధార భూమి గట్టిగా లేకుండగా, నిర్మించబడిన స్తంభకుడ్యాత్మకమగు గృహము స్థిరముగా నిలబడనేరదో, ఏవిధముగా విరేచనముచేత శరీరమందలి ప్రబలదోషమును మొదట తొలగించకుండా సేవింపబడిన ఔషధము ఆరోగ్యకరము కాదో, ఆవిధముగా మైత్ర్యాది అభ్యాసము ఆవశ్యకము. 'ఓయీ! ఆ చిన్మాత్రవాసనను గూడ, పరిత్యజించవలెను' అని వచనము కనబడుచున్నది. అది అయుక్తము. ఆ చిన్మాత్రవాసనను గూడ, పరిత్యజించినచో, మఱియొకటి ఉపాదేయమైనది ఏది కలదు? ఇది దోషము కాదు; చిన్మాత్రవాసన, రెండు విధములు. ఒకటి, మనోబుద్ధిసహితమైనది, రెండవది మనోబుద్ధిరహితమైనది. మనస్సు కరణము, బుద్ధి కర్తృత్వోపాధి. ఇట్లు కాగా 'అప్రమత్తుడనై నేను ఏకాగ్ర మనస్సుతో, చిన్మాత్రమును భావన చేయుదును' అను ఈ రీతిగా కర్తృకరణానుసంధానముతో కూడిన చిన్మాత్రవాసన మొదటిది; 'ధ్యానము' అని పేరు కలది. దానిని పరిత్యజించవలెను. తరువాత, అభ్యాసపాటవముచే, కర్తృత్వకరణానుసంధాన వ్యవధాన రహితముగా 'సమాధి' అను శబ్దముతో పిలువబడు చిన్మాత్రవాసనను స్వీకరింపవలయును. ధ్యాన, సమాధుల లక్షణమును పతంజలి సూత్రించెను. 'ప్రత్యయైకతానత' ఏకాకార చిత్తవృత్తి ప్రవాహము ధ్యానము. అర్థము మాత్రమే (ధ్యేయము) భాసించుచు, స్వరూప శూన్యముపలెనున్నది సమాధి.

"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్,
తదేవార్థమాత్రనిర్భాసం స చ రూపశూన్యమివ సమాధిః।"

అట్టి సమాధియందు దీర్ఘకాలము నిరంతరము ఆదరముతో సేవించి

స్థైర్యమును పొంది, పిమ్మట, కర్తృకరణానుసంధాన పరిత్యాగ ప్రయత్నమును గూడ, మానవలయును.

ఓయీ! ఇట్లయినచో, ఆ ప్రయత్నపరిత్యాగమునందు ప్రయత్నము చేయవలసివచ్చుటచే అనవస్థాదోషము సంప్రాప్తమగును కదా! అట్లు కాదు. కతక రజోన్యాయముచే ఆ ప్రయత్న పరిత్యాగము స్వపరనివర్తకము. ఎట్లనగా, వర్షఋతువునందు కాలుష్యముతోనున్న నదీజలమునందు ఉంచబడిన చిళ్ళగింజ గంధము నీటిలోనున్న రజస్సును క్రిందకు త్రోసివైచి, తాను కూడ, రజస్సే అగుటచే క్రిందకు దిగిపోవును. అట్లే, కర్తృకరణానుసంధాన ప్రయత్నపరిత్యాగము ఆ అనుసంధానమును నివర్తింపజేయుచు, తనను గూడ, నివర్తింపజేయగలదు. ఆవిధముగా నివృత్తి కలుగగా, మలినవాసనల వలెనే శుద్ధవాసనలు కూడ, క్షీణించుటచే మనస్సు, వాసనారహితమై నిలచి ఉండును.

జీవన్ముక్తివివేకః

ఏతదేవ అభిప్రేత్య వసిష్ఠ ఆహ–

శ్లో॥ తస్మాద్వాసనయా బద్ధం ముక్తం నిర్వాసనం మనః।
రామ నిర్వాసనీభావ మాహరాశు వివేకతః॥

సమ్యగాలోచనాత్ సత్యాద్వాసనా ప్రవిలీయతే।
వాసనావిలయే చేతః శామ్యత్యస్నేహదీపవత్॥

ల.వా. 16, 45–46 ఇతి।

శ్లో॥ యో జాగర్తి సుషుప్తిస్థో యస్య జాగ్రన్న విద్యతే।
యస్య నిర్వాసనో బోధః స జీవన్ముక్త ఉచ్యతే॥

ల.వా. 5–92 ఇతి చ।

శ్లో॥ సుషుప్తవత్ప్రశమిత భావవృత్తినా
స్థితం సదా జాగ్రతి యస్య చేతసా।

కలాన్వితో విధురివ యః సదా బుధైర్నిషేవ్యతే
ముక్త ఇతీహ స స్మృతః॥ ఇతి చ।

శ్లో॥ హృదయాత్ సంపరిత్యజ్య సర్వమేవ మహామతిః।
యస్తిష్ఠతి గతవ్యగ్రః స ముక్తః పరమేశ్వరః॥

శ్లో॥ సమాధి మథ కర్మాణి మా కరోతు కరోతు వా।
హృదయేనాస్తసర్వాశో ముక్త ఏవోత్తమాశయః॥
నైష్కర్మ్యేణ న తస్యార్థ స్తస్యార్థోఽస్తి న కర్మభిః।
న సమాధానజప్యాభ్యాం యస్య నిర్వాసనం మనః॥
విచారితమలం శాస్త్రం చిర ముద్గ్రాహితం మిథః।
సంత్యక్తవాసనా న్మౌనాదృతే నాస్త్యుత్తమం పదమ్॥ ఇతి చ।

న చ నిర్వాసనమనస్కస్య జీవనహేతు ర్వ్యవహారో లుప్యేతేతి శంకనీయమ్। కిం చక్షురాది వ్యవహారస్య లోపః, కిం వా మానస వ్యవహారస్య?

తత్రాద్యముద్దాలకో నిరాచష్టే–

శ్లో॥ వాసనాహీన మప్యేత చ్చక్షురాదీన్ద్రియం స్వతః।
ప్రవర్తతే బహిః స్వార్థే వాసనా నాత్ర కారణమ్॥ ఇతి।

## భావప్రకాశిక

ఈ అభిప్రాయముతోనే వసిష్ఠుడు ఇట్లు చెప్పెను–

అందువలన, మనస్సు వాసనచే బద్ధమగుచున్నది. వాసనా రహితమగు మనస్సు, ముక్తమగుచున్నది. ఓ రామా! వివేకముచే శీఘ్రముగా మనస్సునకు నిర్వాసనభావమును సంపాదింపుము. చక్కని ఆలోచన వలనను, సత్యము వలనను, (యథార్థవస్తు సమాలోచనవలన) వాసన విలీనమగును. వాసనావిలయము కాగా, మనస్సు, దీపమువలె శమమును పొందును. ఎవడు సుషుప్తి యందున్నను, ఆత్మస్వరూపమునందు మెలకువగలిగి ఉన్నాడో, ఎవనికి జాగ్రదవస్థయే లేదో, ఎవనికి జ్ఞానము నిర్వాసనమో,

అతడు జీవన్ముక్తుడు అని చెప్పబడుచున్నాడు.

సుషుప్తియందు వలె భావవృత్తులన్నియు, శమించిన మనస్సుతో జాగ్రదవస్థయందు ఎల్లపుడు ఉనికి కలదో, కళలతో నిండిన చంద్రునివలె విజ్ఞులచే ఎవడు ఎల్లపుడు సేవింపబడుచుండునో, అతడు ముక్తుడు అని ఇచట స్మరింపబడుచున్నాడు.

ఎవడు, మహాబుద్ధిశాలియై హృదయమునుండి సర్వవిషయములను దూరముచేసి, చింత లేనివాడై ఉండునో అతడు ముక్తుడు, సాక్షాత్ పరమేశ్వరుడు.

సమాధిని అభ్యసించినను, కర్మలను చేసినను, చేయక పోయినను, హృదయమునందు సమస్తమైన ఆశలను విడనాడిన శుద్ధాంతఃకరణము కలవాడు ముక్తుడే అగుచున్నాడు.

ఎవని మనస్సు వాసనారహితమైనదో, వానికి సంన్యాసముతోను పని లేదు, కర్మలతోను పని లేదు, సమాధిని అభ్యసించ నక్కరలేదు. జపముతో పనిలేదు. శాస్త్రమును బాగుగా విచారించి, బ్రహ్మవిచారశీలురు పరస్పరము చిరకాలము, ఒకరికి తెలిసిన విషయములను మరియొకరికి చెప్పుకొనుచు వాసనలను విడనాడి మౌనముగా ఉన్నచో, అంతకంటె ఉత్తమమైన స్థానము మరియొకటి లేదు.

వాసనారహితమగు మనస్సు కలవానికి జీవనహేతువగు వ్యవహారము లోపించునేమో అని శంకించరాదు. చక్షురాది ఇంద్రియవ్యవహారమునకు లోపమా? లేక, మానస వ్యవహారమునకు లోపమా? అందు మొదటిదగు చక్షురాదీంద్రియవ్యవహార లోపమును ఉద్దాలకుడు నిరాకరించుచున్నాడు. జ్ఞాని మనస్సు, వాసనాహీనమైనను, చక్షురాదీంద్రియములు బాహ్యమునందున్న స్వవిషయములందు ప్రవర్తించును. బహిరింద్రియప్రవృత్తికి వాసన, కారణము కాదు అని వచించెను.

## జీవన్ముక్తివివేకః

ద్వితీయం వసిష్ఠో నిరాచష్టే-

శ్లో॥ అయత్నోపనతేష్వక్షి దృగ్ద్రవ్యేషు యథా పునః।
నీరాగమేవ పతతి తద్వత్ కార్యేషు ధీరధీః॥ ఇతి।

తాదృశ్యా ధియా ప్రారబ్ధభోగం స ఏవోపపాదయతి-

శ్లో॥ పరిజ్ఞాయోపభుక్తో హి భోగో భవతి తుష్టయే।
విజ్ఞాయ సేవిత శ్చోరో మైత్రీ మేతి న చోరతామ్॥
అశంకితోపసంప్రాప్తా గ్రామయాత్రా యథాఽధ్వగైః।
ప్రేక్ష్యతే తద్వదేవ జ్ఞై ర్భోగశ్రీ రవలోక్యతే॥

ల. వా. 15-14-15 ఇతి।

భోగకాలేఽపి సవాసనేభ్యో నిర్వాసనానాం విశేషమాహ-

శ్లో॥ నాపది గ్లాని మాయాన్తి హేమపద్మం యథా నిశి।
నేహన్తే ప్రకృతా దన్యద్రమన్తే శిష్టవర్త్మని॥

ల. వా. 1-43

శ్లో॥ నిత్య మాపూర్ణతా మన్తరక్షుబ్ధా మిన్దుసుందరీమ్।
ఆపద్యపి న ముంచన్తి శశినః శీతతామివ॥ ల. వా. 1-43
అబ్ధివద్ ధృతమర్యాదా భవన్తి వితతాశయాః।
నియతిం న విముంచన్తి మహాన్తో భాస్కరా ఇవ॥

ల. వా. 1-45 ఇతి।

జనకస్యాపి సమాధివ్యుత్థితస్యేదృశమేవాచరణం పఠ్యతే-

శ్లో॥ తూష్ణీ మథ చిరం స్థిత్వా జనకో జనజీవితమ్।
వ్యుత్థిత శ్చిన్తయామాస మనసా శమశాలినా॥

కిముపాదేయ మస్తీహ యత్నాత్ సంసాధయామి కిమ్।
స్వతః స్థితస్య శుద్ధస్య చితః కా మేఽస్తి కల్పనా॥

నాభివాంఛా మ్యసంప్రాప్తం సంప్రాప్తం న
త్యజా మ్యహమ్।
స్వస్థ ఆత్మని తిష్ఠామి యన్మమాస్తి తదస్తు మే॥
ఇతి సంచిన్త్య జనకో యథాప్రాప్త క్రియా మసౌ।
అసక్తః కర్తు ముత్తస్థౌ దినం దినపతిర్యథా॥
భవిష్యన్నానుసంధత్తే నాతీతం చిన్తయత్యసౌ।
వర్తమాన నిమేషం తు హసన్నేవానువర్తతే॥
ల. వా. 19, 60-64. ఇతి।

తదేవం యథోక్తేన వాసనాక్షయేణ యథోక్తా జీవన్ముక్తి ర్భవిష్యతీతి సుస్థితమ్॥

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకే
వాసనాక్షయనిరూపణం నామ ద్వితీయం ప్రకరణమ్॥

భావప్రకాశిక

రెండవది యగు మానస వ్యవహారలోపమును వసిష్ఠుడు నిరాకరించుచున్నారు-

యత్నము లేకుండగనే, యాదృచ్ఛికముగా గోచరించు పదార్థములందు కన్ను, రాగము లేకుండగనే ఎట్లు ప్రసరించునో, అదేవిధముగా జ్ఞానియొక్క బుద్ధియు, ఆ యా కార్యములందు ప్రసరించును.

అట్టి బుద్ధితోనే ప్రారబ్ధకర్మభోగమును ఆ వసిష్ఠుడే ఉపపాదించుచున్నాడు.

తెలిసికొని అనుభవింపబడు భోగము సంతోషము కొరకు అగును. తెలిసికొని సేవించునట్టి చోరుడు స్నేహమును నెరపునే కాని, దొంగతనము చేయడు. బాటసారులచే అనుకొనకుండా సంప్రాప్తమైన గ్రామయాత్ర ఏవిధముగా చూడబడుచున్నదో,

ఆ విధముగానే జ్ఞానులచే భోగలక్ష్మి చూడబడుచున్నది.

భోగకాలమునందు గూడ, విషయవాసనలు కలవారికంటె వాసనారహితులయందు విశేషము కలదు. వాసనారహితులు ఆపద వచ్చినను, రాత్రియందు బంగారు పద్మము వలె ముకుళించుకొనిపోరు. ప్రాప్తమైనదానికంటె అన్యమును కోరరు. శిష్టమార్గమున విహరింతురు.

మనస్సులోపల క్షోభము నొందని నిండుతనమును, చంద్రునివలె మనోహరమైనదానిని నిత్యము ఆపదయందు గూడ చంద్రుని చల్లదనమువలె వదలిపెట్టరు.

నిర్వాసనులగు మహానుభావులు సముద్రమువలె హద్దులలో మెలగుదురు. మహాత్ములు సూర్యులవలె నియతినియమమును విడనాడరు.

జనకునకు గూడ, సమాధినుండి వ్యుత్థానములోనికి వచ్చిన తరువాత, ఇట్టి ఆచరణమే పఠింపబడుచున్నది.

జనకుడు, చిరకాలము సమాధినిష్ఠుడై వ్యుత్థితుడు (దేహస్ఫురణము వచ్చినవాడు) అయినతరువాత శమముతో నొప్పిన మనస్సుతో జనుల జీవితమును గురించి ఇట్లాలోచించెను-

ఈ లోకమున, సంపాదింపదగిన వస్తువు ఏమి కలదు? యత్నముతో దేనిని సాధింతుము? స్వతఃసిద్ధ, శుద్ధ చిద్రూపుడనైన నాకు ఏ కల్పన కలదు? దగ్గరకు రాని వస్తువును కోరను. సంప్రాప్తమగు వస్తువును వదలిపెట్టను. స్వస్థుడనై ఆత్మయందు ఉండెదను. ఏది నాకు ఉన్నదో, అది ఉండిన చాలును. ఈవిధముగా ఆలోచించి, ఈ జనకుడు యథాప్రాప్తములగు క్రియలను అసక్తుడై ఆచరించుటకు, సూర్యుడు దినమున ఉదయించినట్లు లేచినవాడాయెను.

ఇతడు, రాబోవుదానిని మనస్సునకు తెచ్చుకొనడు. గడచిన దానిని ఆలోచించడు. వర్తమాన విషయమునే నవ్వుచు అనుసరించుచుండును.

ఈవిధముగా వెనుక చెప్పినరీతిగా వాసనాక్షయముచేత వెనుక చెప్పబడిన జీవన్ముక్తి లభించగలదు అని పర్యవసానము.

శ్రీమద్విద్యారణ్య ప్రణీతమైన జీవన్ముక్తివివేకమున,
వాసనాక్షయ నిరూపణము అను పేరు గల
ద్వితీయ ప్రకరణము సమాప్తము.

  

# 3. తృతీయం మనోనాశప్రకరణమ్

అథ జీవన్ముక్తిసాధనం మనోనాశం నిరూపయామః। యద్యపి అశేష వాసనాక్షయే సతి అర్థాన్మనో నశ్యత్యేవ, తథాఽపి స్వాతంత్ర్యేణ మనోనాశే సమ్యగభ్యస్తే సతి, వాసనాక్షయో రక్షితో భవతి। న చాజిహ్వత్వ షండత్వాభ్యాసేనైవ తద్రక్షా సిద్ధేతి వాచ్యమ్, నష్టే మనస్యజిహ్వత్వాదీనా మర్థసిద్ధత్వే నాభ్యాసాభావాత్। నను మనోనాశాభ్యాసప్రయాస స్తత్రాప్యస్తీతి చే దస్తు నామ, తస్యావశ్యకత్వాత్। అన్తరేణ మనోనాశ మభ్యస్తా అప్యజిహ్వత్వాదయో న స్థిరా భవన్తి। అత ఏవ మనసో నాశనీయత్వం జనక ఆహ-

శ్లో॥ సహస్రాంకురశాఖాత్మ ఫల పల్లవశాలినః।
అస్య సంసారవృక్షస్య మనో మూలమితి స్థితమ్॥
సంకల్ప మేవ తన్మన్యే సంకల్పోపశమే న తత్।
శోషయామి యథా శోషమేతి సంసారపాదపః॥
ప్రబుద్ధోఽస్మి ప్రబుద్ధోఽస్మి దృష్టశ్చోరో మయాఽఽత్మనః।
మనో నామేహ హన్మ్యేనం మనసాఽస్మి చిరం హతః॥

ల. వా. 19, 52-55 ఇతి।

భావప్రకాశిక

# 3. మనోనాశప్రకరణము

వాసనాక్షయ నిరూపణానంతరము జీవన్ముక్తిసాధనమగు మనోనాశమును నిరూపించుచున్నాము. విచారించగా నిఖిల వాసనాక్షయమైనప్పుడు, అర్థాత్ (అర్థాపత్తి ప్రమాణముచే) మనస్సు, నశించుచునే యున్నది. అట్లయినను, స్వతంత్రముగా మనోనాశమును చక్కగా అభ్యసించినచో, వాసనాక్షయము రక్షింప

బడినట్లగును. అజిహ్వాత్వాది అభ్యాసముచే వాసనాక్షయము యొక్క రక్ష సిద్ధించునుకదా అని అనరాదు. మనోనాశమయి నప్పుడు, అజిహ్వాత్వాదులు అర్థసిద్ధము లగుటచే వానిని అభ్యసించుటకు ప్రయాస ఉండదు.

ఓయీ! మనోనాశాభ్యాసప్రయాస కలదు కదా అనినచో, అవును. మనోనాశాభ్యాసము అవశ్యము చేయవలసియున్నది. మనోనాశము లేనిచో, అభ్యస్తములైనను, అజిహ్వాత్వాదులు స్థిరములు కావు. ఇందువలననే మనస్సును అవశ్యము నాశ మొందించవలయునని జనకుడు పలికెను—

"సహస్రాంకురశాఖాత్మ ఫలపల్లవశాలినః।
అస్య సంసారవృక్షస్య మనోమూల మితి స్థితమ్।
సంకల్పమేవ తన్మన్యే సంకల్పోపశమే న తత్॥"

వేలకొలది అంకురశాఖాగ్రఫల పల్లవములతో నొప్పారు ఈ సంసార వృక్షమునకు మనస్సే, మూలమై యున్నది. ఆ మనస్సు సంకల్పస్వరూపమే అని తలంచుచున్నాను. సంకల్పములు ఉపశమించినచో, ఇక మనస్సు ఉండదు. ఈ సంసారవృక్షము ఎట్లు శోషించునో, ప్రయత్నింతును. ఇపుడు నేను మేల్కొంటిని. ఆత్మచోరుడు నాచేత చూడబడెను. మనస్సే, ఆ చోరుడు. ఈ చోరుని వధింతును. ఇన్నాళ్ళుగా చోరుడగు ఈ మనస్సు చేతనే నేను హతుడనైతిని.

జీవన్ముక్తివివేకః

వసిష్ఠోఽప్యాహ—

శ్లో॥ అస్య సంసారవృక్షస్య సర్వోపద్రవదాయినః।
ఉపాయ ఏక ఏవాస్తి మనసః స్వస్య నిగ్రహః॥

ల. వా. 17, 1.

మనసోఽభ్యుదయో నాశో మనోనాశో మహోదయః।

జ్ఞమనోనాశ మభ్యేతి మనోఽజ్ఞస్య హి శృంఖలా॥
ల. వా. 15, 23.

ప్రక్షీణచిత్తదర్పస్య నిగృహీతేంద్రియద్విషః।
పద్మిన్య ఇవ హేమన్తే క్షీయన్తే భోగవాసనాః॥
ల. వా. 15, 22

హస్తం హస్తేన సంపీడ్య దంతైర్దంతాన్ విచూర్ణ్య చ।
అంగాన్యంగైః సమాక్రమ్య జయేదాదౌ స్వకం మనః॥
ల. వా. 15, 18.

ఏతావతి ధరణితలే సుభగాస్తే సాధుచేతసః పురుషాః।
పురుషకథాసు చ గణ్యా న జితా యే చేతసా స్వేన॥
ల. వా. 15, 19.

శ్లో॥ హృదయబిలే కృతకుండల ఉల్బణకలనావిషో మనోభుజగః।
యస్యోపశాన్తి మగమచ్చన్ద్రవదుదితం తమవ్యయం వందే॥
ల. వా. 15, 20

చిత్తం నాభిః కిలాస్యేదం మాయాచక్రస్య సర్వతః।
స్థీయతే చేత్తదాక్రమ్య తన్న కించిత్ప్రబాధతే॥
ల. వా. 23, 92 ఇతి।

గౌడపాదాచార్యైరప్యుక్తమ్-

శ్లో॥ మనసో నిగ్రహాయత్త మభయం సర్వయోగినామ్।
దుఃఖక్షయః ప్రబోధశ్చాప్యక్షయా శాన్తిరేవ చ॥
మా. ఉ. 3, 40 ఇతి।

యత్త్వర్జునేనోక్తమ్-

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥
భ. గీ. 6, 34 ఇతి।

తద్వచనం హఠయోగవిషయమ్।

భావప్రకాశిక

వసిష్ఠుడు కూడ, ఇట్లు చెప్పెను–

సర్వోపద్రవములను కలిగించు ఈ సంసారవృక్షమును ఛేదించుటకు ఒకే ఒక ఉపాయము కలదు. అది, తన మనో నిగ్రహము అయి ఉన్నది. మనస్సునకు అభ్యుదయము ఆత్మ నాశము, మనోనాశము ఆత్మకు మహోదయము. జ్ఞానియొక్క మనస్సు, నాశమును పొందును. అజ్ఞునకు మనస్సు బంధన శృంఖల అయి ఉన్నది.

దృఢాభ్యాసముచే మనస్సు జయింపబడనంతవరకు అర్ధరాత్రిసమయమున భేతాళములు (పిశాచములు) వలె హృదయమునందు వాసనలు సంచరించుచుండును. చిత్తదర్పము ఉడుగగా, ఇంద్రియము లను శత్రువులు నిగ్రహింపబడగా, భోగ వాసనలు హేమంతమున తామరతీగలవలె క్షీణించును. చేతితో చేతిని గట్టిగా ఒత్తుకొని, దంతములతో దంతములను చూర్ణము చేసికొని, శరీరావయవములతో అవయవములను ఒడిసిపట్టుకొని మొదట తన మనస్సును జయించవలెను.

ఈ భూతలమున, మనస్సుచే ఎవరు జయింపబడరో, ఆ సాధుపురుషులు ధన్యులు, పురుషుల కథలలో లెక్కింపదగినవారు.

హృదయరంధ్రమున, కుండలాకారము కలిగి తీవ్రసంకల్ప విషము కల మనస్సు అను సర్పము ఎవనికి ఉపశాంతమగునో, చంద్రునివలె ఉదయించిన ఆ అవ్యయాత్మను నమస్కరించు చున్నాను.

ఈ మాయాచక్రము చింతనలచేత (విషయానుసంధానముల చేత) కదా ఉన్నది, ఆ చింతనలకు మూలమగు మనస్సును ఆక్రమించి ముముక్షువు ఉన్నచో, ఏదియు బాధించనేరదు.

గౌడపాదాచార్యులచేతగూడ, ఇట్లు చెప్పబడెను–

యోగులందరికి భయము లేకపోవుట (మోక్షము), మనో నిగ్రహము మీద ఆధారపడి ఉన్నది. మనోనిగ్రహము వలననే ప్రబోధము, దుఃఖక్షయము, పరమశాంతి లభించును.

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్।"

అర్జునుడు, ఓ కృష్ణా! మనస్సు చంచలము, ఉపద్రవకరము. దృఢ బలము కలది. ఆ మనస్సును నిగ్రహించుట వాయువును నిగ్రహించుటవలె మిక్కిలి దుష్కరము అని పలికెను. ఈవచనము హఠయోగ విషయముగా గ్రహించవలయును.

## జీవన్ముక్తి వివేకః

అత ఏవ వసిష్ఠ ఆహ–

శ్లో॥ ఉపవిశ్యోపవిశ్యైకచిత్తకేన ముహుర్ముహుః।
న శక్యతే మనో జేతుం వినా యుక్తి మనిందితామ్॥
అంకుశేన వినా మత్తో యథా దుష్ట మతంగజః।
విజేతుం శక్యతే నైవ తథా యుక్త్యా వినా మనః॥

ల.వా. 28, 16–17

మనోవిలయహేతూనాం యుక్తీనాం సమ్యగీరణమ్।
వసిష్ఠేన కృతం తావత్ తన్నిష్ఠస్య వశే మనః॥
హఠతో యుక్తితశ్చాపి ద్వివిధో నిగ్రహో మతః।
నిగ్రహో ధీక్రియాక్షాణాం హఠో గోలకనిగ్రహాత్॥
కదాచి జ్జాయతే కశ్చి న్మన స్తేన విలీయతే।
అధ్యాత్మవిద్యాధిగమః సాధుసంగమ ఏవ చ॥
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పందన నిరోధనమ్।
ఏతాస్తు యుక్తయః పుష్టాః సన్తి చిత్తజయే కిల॥
సతీషు యుక్తిష్వేతాసు హఠా న్నియమయన్తి యే।

చేత స్తే దీప ముత్సృజ్య వినిఘ్నన్తి తమోఽఞ్జనైః॥
విమూఢాః కర్తు ముద్యుక్తా యే హఠా చ్చేతసో జయమ్।
తే నిబధ్నన్తి నాగేన్ద్ర మున్మత్తం బిసతన్తుభిః॥
ల.వా. 28, 28-31 ఇతి।

భావప్రకాశిక

ఇందువలననే, వసిష్ఠుడు ఇట్లు చెప్పెను-

ఎచ్చటో ఒకచోట, ఎవనిచేతనో ఊరక కూర్చుండి దోషము లేని యుక్తి, ఉపాయము లేకుండగా ఎంత ప్రయత్నించినను, మనస్సును జయించుట శక్యము కాదు. అంకుశము లేకుండా దుష్ట మదగజము ఎట్లు స్వాధీనము కాదో, అట్లే యుక్తి, ఉపాయము లేకుండా మనస్సు స్వాధీనము కాదు. మనోలయము చెందుటకు అనేకోపాయములు వసిష్ఠునిచే చెప్పబడినవి. తదుపాయనిష్ఠనకు మనస్సు వశమునందుండును. మనోనిగ్రహము హఠము చేతను, యుక్తిచేతను రెండు విధములుగానున్నది. జ్ఞానేంద్రియములను గోళకములందే నిగ్రహించుట (నిరోధించుట) హఠము. అందుచేత ఒకప్పుడు ఒకానొకడు ఈ హఠముచే మనస్సును విలయము చేసికొనును. చిత్తజయమునకు ఉపాయములు పరిపుష్టములైనవి అధ్యాత్మవిద్యాధిగమము, సాధుసాంగత్యము, వాసనాపరిత్యాగము, ప్రాణస్పందనిరోధము అనునవి నాలుగు యుక్తులు (ఉపాయములు). ఈ ఉపాయములు మనోజయమునకు ఉండగా హఠముచే మనస్సును నియమింపదలచినవాడు తమస్సును (చీకటిని) పోగొట్టుకొనుటకు దీపమును వదలిపెట్టి, కాటుకలతో ప్రయత్నించునట్టివాడు. హఠయోగముచే మనోజయమును సంపాదించుటకు ఉద్యుక్తులైన మూఢులు బిసతంతువులచే (తామర తూడులోని దారములచే) మత్తగజేంద్రమును బంధించుటకు పూనుకొనుచున్నారు.

## జీవన్ముక్తివివేకః

నిగ్రహో ద్వివిధః, హఠనిగ్రహః క్రమనిగ్రహశ్చేతి। తత్ర చక్షుః శ్రోత్రాది జ్ఞానేంద్రియాణి వాక్పాణ్యాది కర్మేంద్రియాణి చ తత్తద్గోలకోపరోధమాత్రేణ హఠాన్నిగృహ్యన్తే, తద్ దృష్టాన్తేన మనోఽపి తథా నిగ్రహిష్యామీతి మూఢస్య భ్రాన్తిర్భవతి, న తు తన్నిగ్రహీతుం శక్యతే, తద్గోలకస్య హృదయకమలస్య నిరోద్ధుమశక్యత్వాత్। అతః క్రమనిగ్రహ ఏవ యోగ్యః। క్రమనిగ్రహే చాధ్యాత్మవిద్యాప్రాప్త్యాదయ ఏవోపాయాః। సా చ విద్యా దృశ్యమిథ్యాత్వం దృగ్వస్తునః స్వప్రకాశత్వం చ బోధయతి। తథా చ సత్యేతన్మనః స్వగోచరేషు దృశ్యేషు ప్రయోజనాభావం ప్రయోజనవతి దృగ్వస్తున్యగోచరత్వం చ బుద్ధ్వా నిరిన్ధనాగ్నివత్ స్వయమేవోపశామ్యతి। తథా చ శ్రూయతే–

శ్లో॥ యథా నిరిన్ధనో వహ్నిః స్వయోనా వుపశామ్యతి।
తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనా వుపశామ్యతి॥
మై. ఉ. 4, 4 ఇతి।

యోనిరాత్మా। యస్తు బోధితమపి తత్త్వం సమ్యగ్బుధ్యతే యశ్చ విస్మరతి, తయోరుభయోః సాధుసంగమ ఏవోపాయః। సాధవో హి పునః పునః బోధయన్తి, స్మారయన్తి చ। యస్తు విద్యామదాది దుర్వాసనయా పీడ్యమానో న సాధూననువర్తితుముత్సహతే, తస్య పూర్వోక్త వివేకేన వాసనాపరిత్యాగ ఉపాయః। వాసనానాం ప్రాబల్యేన త్యక్తుమశక్యత్వే ప్రాణస్పన్దనిరోధనముపాయః। ప్రాణస్పన్దవాసనయోశ్చిత్తప్రేరకత్వాత్తయోర్నిరోధే చిత్తశాన్తిరుపపద్యతే। ప్రేరకత్వం చ వసిష్ఠ ఆహ–

శ్లో॥ ద్వే బీజే చిత్తవృక్షస్య వృత్తిప్రవతతిధారిణః।

ఏకం ప్రాణస్పందో ద్వితీయం దృఢవాసనా॥

ల. వా. 28, 38

శ్లో॥ సతీ సర్వగతా సంవిత్ప్రాణస్పందేన బోధ్యతే।
సంవేదనానన్తాని తతో దుఃఖాని చేతసః॥ ల.వా. 28-40 ఇతి।

యథా భస్మచ్ఛన్నమగ్నిం లోహకారాదృతిభ్యాం ధమన్తి తత్ర చ ధ్రుత్యుత్పన్నేన వాయునా సోఽగ్నిర్జ్వలతి, తథా చిత్తోపాదానేన కాష్ఠస్థానీయేనాజ్ఞానేనావృతా సంవిత్ప్రాణస్పందేన బోధ్యమానా చిత్తవృత్తిరూపేణ ప్రజ్వలతి। తస్మాచ్చిత్తవృత్తి నామకాత్ సంవిజ్జ్వాలారూపాత్ సంవేదనాద్ దుఃఖాన్యుత్పద్యన్తే। సేయం ప్రాణస్పందేన ప్రేరితా చిత్తోత్పత్తిః।

భావప్రకాశిక

హఠనిగ్రహము, క్రమనిగ్రహము అని (మనో) నిగ్రహము రెండు విధములు. వానిలో చక్షుస్సు, శ్రోత్రము మొదలగు జ్ఞానేంద్రియములను, వాక్కు, హస్తము మొదలగు కర్మేంద్రియములను ఆ యా గోళకములందు ఉపరోధముచే హఠాత్తుగా (బలాత్కారముగా) నిగ్రహింపబడుచున్నవి. ఆ దృష్టాంతముతో మనస్సును గూడ, అదేవిధముగా నిగ్రహించ గలను అని మూఢునకు భ్రాంతి కలుగును. కాని, ఆవిధముగా మనస్సును నిగ్రహించుట శక్యము కాదు. మనస్సునకు గోళకమగు హృదయకమలము నిరోధించుటకు శక్యము కాదు. అందువలన, మనస్సు విషయమున, క్రమనిగ్రహమే కలిగియున్నది. క్రమ నిగ్రహమందు అధ్యాత్మవిద్యాప్రాప్తి మొదలగు ఉపాయములు అవశ్యము అవలంబింపదగినవి. అధ్యాత్మవిద్య, దృశ్యము మిథ్య యనియు, దృగ్వస్తువు స్వప్రకాశమనియు బోధించును. అట్లు కాగా, ఈ మనస్సు, తనకు గోచరములగు దృశ్యములందు ప్రయోజనము లేదనియు, ప్రయోజనము గల దృగ్వస్తువునందు

తనకు గోచరము కాదనియు గ్రహించి, ఇంధనములు లేని అగ్ని వలె తనంతట తానే ఉపశమించును.

ఇట్లు వినబడుచున్నది-

"యథా నిరిన్ధనో వహ్నిః స్వయోనావుపశామ్యతి।
తథా వృత్తిక్షయా చ్చిత్తం స్వయోనావుపశామ్యతి॥"

ఇంధనములు లేని అగ్ని, ఏ విధముగా తన కారణమునందు ఉపశమించునో, అదేవిధముగా చిత్తము, వృత్తిక్షయము కాగా, ఆత్మయందు ఉపశమించును. ఇచట, యోనిశబ్దార్థము ఆత్మ.

ఎవడైతే బోధింపబడిన తత్త్వమును సరిగా గ్రహింప జాలడో, గ్రహింపబడినను, మఱచిపోవుచుండునో, వారిరువురికి సాధుసాంగత్యమే ఉపాయమై యున్నది. సాధువులగు మహానుభావులు మరల మరల తత్త్వమును బోధింతురు, స్మరింప జేయుదురు.

ఎవడైతే విద్యామదము మొదలగు దుర్వాసనలచే పీడింపబడుచు, సాధుపురుషుల సాంగత్యానువర్తనమును ఉత్సహింపడో, వానికి వెనుక చెప్పిన వివేకముచే వాసనాపరిత్యాగము ఉపాయమై యున్నది.

వాసనలు ప్రబలములగుటచే విడనాడుటకు శక్యము కానప్పుడు, ప్రాణస్పందనిరోధము ఉపాయము. ప్రాణస్పందము, వాసనలు చిత్తప్రేరకములు గనుక, వానిని నిరోధించినపుడు చిత్తశాంతి కలుగును. ప్రేరకత్వమును వసిష్ఠుడు చెప్పుచున్నాడు-

వృత్తులు అను తీగలతో నిండిన చిత్తవృక్షమునకు రెండు బీజములు కలవు. ఒకటి, ప్రాణపరిస్పందము; రెండవది, దృఢవాసన. సర్వగతముగానున్న సంవిత్తు, ప్రాణస్పందముచే మేల్కొల్పబడును. ఆ సంవేదనము వలన, మనస్సునకు అనంతమైన దుఃఖములు కలుగుచున్నవి. ఏవిధముగా బూడిదచే

కప్పబడిన అగ్నిని తోలుతిత్తులచే లోహకారులు ఊదుదురో అపుడు ఆ ద్రుతులవలన, ఉత్పన్నమగు వాయువుచే భస్మచ్ఛన్నమగు అగ్ని జ్వలించునో, ఆ విధముగానే చిత్తమునకు ఉపాదానము, కాష్ఠస్థానీయమైన అజ్ఞానముచే ఆవరింపబడిన సంవిత్తు, ప్రాణ స్పందముచే రగుల్కొల్పబడును. అట్లు కాగా, చిత్తవృత్తి రూపముతో ప్రజ్వలించును. కనుక, చిత్తవృత్తి యను పేరు గల సంవిజ్జ్వాలారూప మగు సంవేదనము వలన, దుఃఖములు పుట్టుచున్నవి. ఇది, ప్రాణస్పందముచేత ప్రేరేపింపబడిన చిత్తము యొక్క ఉత్పత్తి అయి ఉన్నది.

జీవన్ముక్తివివేకః

అన్యాం చ స ఏవాహ :-

శ్లో॥ భావసంవిత్ప్రకటితా మనుభూతాం చ రాఘవ।
చిత్తస్యోత్పత్తి మపరాం వాసనాజనితాం శృణు॥
దృఢాభ్యస్త పదార్థైకభావనా దతిచంచలమ్।
చిత్తం సంజాయతే జన్మ జరామరణకారణమ్॥ ఇతి।

న కేవలం ప్రాణవాసనయో శ్చిత్తప్రేరకత్వమ్, కిన్తు పరస్పర ప్రేరకత్వ మప్యస్తి। తదాహ వసిష్ఠః-

శ్లో॥ వాసనావశతః ప్రాణస్పంద స్తేన చ వాసనా।
జాయతే చిత్తవృక్షస్య తేన బీజాంకుర క్రమః॥

ల.వా. 28, 65 ఇతి।

అత ఏవాన్యతరనాశేనోభయనాశన మప్యాహ-

శ్లో॥ ద్వే బీజే చిత్తవృక్షస్య ప్రాణస్పందన వాసనే।
ఏకస్మింశ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః॥

ల.వా. 28-34 ఇతి।

తయో ర్నాశోపాయం నాశఫలం చాహ-

శ్లో॥ ప్రాణాయామదృఢాభ్యాసై ర్యుక్త్యా చ గురుదత్తయా।

ఆసనాశనయోగేన ప్రాణస్పన్దో నిరుధ్యతే॥
అసంగవ్యవహారిత్వాద్ భవభావన వర్జనాత్।
శరీరనాశదర్శిత్వాద్ వాసనా న ప్రవర్తతే॥
ల.వా. 28, 122-123

వాసనాసంపరిత్యాగా చ్చిత్తం గచ్ఛత్యచిత్తతామ్।
ప్రాణస్పందనిరోధాచ్చ యథేచ్ఛసి తథా కురు॥
ల. వా. 28, 121

ఏతావన్మాత్రం మన్యే రూపం చిత్తస్య రాఘవ।
యద్భావనం వస్తునోఽన్తర్వస్తుత్వేన రసేన చ॥
ల. వా. 28, 57

యదా న భావ్యతే కించి ద్ధేయోపాదేయరూపి యత్।
స్థీయతే సకలం త్యక్త్వా తదా చిత్తం న జాయతే॥
అవాసనాత్ సతతం యదా న మనుతే మనః।
అమనస్తా తదోదేతి పరమోపశమప్రదా॥
ల.వా. 28, 54-55 ఇతి।

అమనస్తానుదయే శాస్త్ర్యభావమాహ-

శ్లో॥ చిత్తక్షయదృఢాక్రాన్తం న మిత్రాణి న బాంధవాః।
శక్నువన్తి పరిత్రాతుం గురవో న చ మానవాః॥ ఇతి।

ఆసనాశనయోగేనేతి యదుక్తం తత్రాసనస్య లక్షణ ముపాయం ఫలం చ త్రిభిః సూత్రైః పతంజలిః సూత్రయామాస-

'స్థిరసుఖమాసనమ్' 2, 46;
'ప్రయత్నశైథిల్యానన్తసమాపత్తిభ్యామ్' 2, 47;
'తతో ద్వన్ద్వానభిఘాతః' 2, 48 ఇతి।

భావప్రకాశిక

దృఢవాసనామూలకమగు మరియొక చిత్తోత్పత్తిని ఆ

వసిష్ఠుడే ఇట్లు చెప్పుచున్నాడు-

ఓ రాఘవా! భావ (పదార్థ) విషయకమగు చిత్తవృత్తిచే ప్రకటితము, సాక్షిచే అనుభూతము, వాసనాజనితము నగు మరియొక చిత్తోత్పత్తిని చెప్పుచున్నాను, వినుము.

దృఢముగా అభ్యసింపబడిన పదార్థభావన వలన, అతి చంచలమగు చిత్తము జన్మ, జరా, మరణకారణమై జనించుచున్నది. ఈ ప్రాణవాసనలు కేవలము చిత్తమునకే ప్రేరకములు కావు. ఇకనేమనగా, ప్రాణమునకు వాసన, వాసనకు ప్రాణము, పరస్పరము ప్రేరకము లగుచున్నవి. ఆ విషయమునే వసిష్ఠుడు ఇట్లు చెప్పుచున్నాడు-

వాసనావశమువలన ప్రాణస్పందము, ప్రాణస్పందముచే వాసన జనించుచున్నది. అందుచే చిత్తవృక్షమునకు బీజాంకుర క్రమము వర్తించుచున్నది. ఇందువలననే, ఆ రెంటిలో ఒకటి నశించినను, రెండును నశించునని చెప్పుచున్నాడు-

చిత్తవృక్షమునకు ప్రాణస్పందము, వాసన అనునవి రెండు బీజములు. వానిలో ఒకటి క్షీణించినను శీఘ్రమే రెండును నశించును.

ఆ ప్రాణస్పంద, వాసనలయొక్క నాశోపాయమును, నాశ ఫలమును చెప్పుచున్నాడు-

ప్రాణస్పందము ప్రాణాయామ దృఢాభ్యాసముచేతను, గురుదత్తమగు యుక్తిచేతను ఆసన, ఆహారయోగముచేతను నిరోధింపబడుచున్నది. అసంగ వ్యవహారము వలనను, సంసార భావనను వర్జించుటవలనను, శరీరనాశమును దర్శించుటవలనను, వాసన, నివర్తించును. చిత్తము, వాసనా సంపరిత్యాగము వలనను ప్రాణస్పందనిరోధము వలనను, అచిత్త మగును. ఈ రెంటిలో ఏది నీకు ఇష్టమో దానిని అవలంబించుము. ఓ రామా! చిత్తము

యొక్క స్వరూపము ఇంతమాత్రమే అయి ఉన్నది అని తలంచుచున్నాను. లోపలి వస్తువును వస్తువుగాను, ప్రీతితోను భావించుటయే మనస్సుయొక్క రూపము. ఇది హేయమనిగాని, ఇది ఉపాదేయమనిగాని, భావించక, సత్వమును విడనాడి ఉన్నచో అపుడు చిత్తము ఉదయించనేరదు. వాసన లేనందువలన, ఎపుడు మనస్సు, విషయములను భావించుటలేదో పరమశాంతిప్రదమగు అమనస్కత అపుడు ఉదయించును. అమనస్కత ఉదయించనపుడు, శాంతి ఉండదు అని చెప్పుచున్నాడు.

చిత్తమనెడి యక్షము (పిశాచము) మీద ఎక్కి ఆక్రమించినప్పుడు, వానిని రక్షించుటకు మిత్రులు సమర్థులు కారు. బంధువులు కారు, గురువులు కారు, మనుష్యులెవరును వానిని రక్షింపనేరరు.

'ఆసనాశన యోగేన' అని ఏది చెప్పబడినదో, అచట ఆసనమునకు లక్షణము, ఉపాయము, ఫలము మూడు సూత్రములచే పతంజలి సూత్రించెను–

"స్థిరసుఖ మాసనమ్"
స్థిరసుఖము ఆసనము.
"ప్రయత్నశైథిల్యానన్త సమాపత్తిభ్యామ్।
తతో ద్వన్ద్వానభిఘాతః॥"

ప్రయత్నశైథిల్యము, అనంత (శేష) తాదాత్మ్య భావనలచే ఆసనము సిద్ధించును. శీతోష్ణాది ద్వంద్వాభిఘాతము లేకపోవుట ఆసనమునకు ఫలము.

**జీవన్ముక్తివివేకః**

పద్మక స్వస్తికాదినా యాదృశేన దేహస్థాపనరూపేణ యస్య పురుషస్యావయవవ్యథాఽనుత్పత్తి లక్షణం సుఖం స్వదేహ

చలనరాహిత్యలక్షణం స్థైర్యం చ సంపద్యతే, తస్య తదేవ సుఖమాసనమ్। తస్య చ ప్రయత్నశైథిల్యం లౌకిక ఉపాయః। గమన గృహకృత్య తీర్థయాత్రా స్నాన హోమాదివిషయో యః ప్రయత్నో మానస ఉత్సాహ స్తస్య శైథిల్యం కర్తవ్యమ్। అన్యథా స ఉత్సాహో బలాద్ దేహ ముత్థాప్య యత్ర క్వాపి ప్రేరయతి। అలౌకికోపాయశ్చ 'ఫణాసహస్రేణ ధరణీం ధారయిత్వా స్థైర్యేణావతిష్ఠతే యోఽయ మనన్తః స ఏవాహమస్మి' ఇతి ధ్యానం చిత్తస్యానన్త సమాపత్తిః। తయా యథోక్తాసన సంపాదక మదృష్టం నిష్పద్యతే। సిద్ధే చాసనే శీతోష్ణసుఖదుఃఖమానావమానాదిద్వన్ద్వైర్యథాపూర్వం నాభిహన్యన్తే। తథావిధస్య చాసనస్య యోగ్యో దేశః శ్రూయతే—

శ్లో॥ వివిక్తదేశే చ సుఖాసనస్థః శుచిః సమగ్రీవశిరః శరీరః॥

కై. ఉ. 4 ఇతి।

సమే శుచౌ శర్కర వహ్ని వాలుకావివర్జితే
శబ్దజలాశయాదిభిః।
మనోనుకూలే న తు చక్షుపీడనే గుహానివాతాశ్రయణే
ప్రయోజయేత్॥ శ్వే. ఉ. 2, 10 ఇతి చ।

సోఽయ మాసనయోగః।

భావప్రకాశిక

ఏవిధముగా దేహమును ఉంచినచో, ఏ పురుషునకు అవయవ వ్యథ (బాధ) కలుగకపోవుట అను సుఖము, తన శరీరమును కదల్చకుండుట అను స్థైర్యము లభించునో, అది వానికి సుఖమగు ఆసనము. పద్మాసనము, స్వస్తికాసనము మొదలైనవి. ఆ సుఖాసనసిద్ధికి ప్రయత్నశైథిల్యము, సహస్రఫణములతో గూడిన ఆదిశేషుని తాదాత్మ్యభావన ఉపాయములు. అందు, ప్రయత్న

శైథిల్యము లౌకికమగు ఉపాయము. నడచుట, గృహకృత్యములను నిర్వహించుట, తీర్థయాత్రలు, స్నాన, హోమాదులు- వీనియందు మానసమగు ఉత్సాహమే ప్రయత్నము. ఆసనసిద్ధికి ఆ ప్రయత్నశైథిల్యము ఆవశ్యకము. అట్లు కానిచో, ఆ ఉత్సాహము బలవంతముగా లేవదీసి ఎచ్చటికో ప్రేరేపించును. ఇక, అలౌకికోపాయము, అనంతసమాపత్తి. అనగా వేయిపడగలతో భూమిని ధరించి కదలక స్థిరముగా నుండువాడు అనంతుడు- ఆదిశేషుడు. 'ఆ ఆదిశేషుడే నేనై ఉన్నాను' అను ధ్యానము చిత్తముయొక్క అనంతసమాపత్తి. దీనివలన, పూర్వమునందు చెప్పబడిన ఆసనముయొక్క సిద్ధికి అదృష్టము జనించును. ఆసనము సిద్ధించినచో, శీతోష్ణ సుఖదుఃఖ, మానావమానాది రూపములగు ద్వంద్వములు వెనుకటివలె బాధించవు. అట్టి ఆసనమునకు తగిన దేశము ఇట్లు వినబడుచున్నది-

విజనప్రదేశమున, సుఖాసనమునందుండి పరిశుద్ధుడై, మెడ, శిరస్సు, శరీరము ఋజురేఖలో నుండునట్లు ఉండవలయును. మరియు, ఎత్తుపల్లములు లేనట్టియు, గోమయాదులచే శుద్ధము చేయబడినట్టియు,గులకరాళ్ళు, అగ్ని, ఇసుకరేణువులు లేనట్టియు ధ్వని, జలాశయము, దగ్గరలేని మనస్సునకు అనుకూల మయిన, దోమలచే కన్నులకు బాధలేని, గాలి వీచని గుహాది ప్రదేశము యోగ్యమగు దేశము అనియు చెప్పబడెను.

ఇదియే ఆసనయోగము.

జీవన్ముక్తివివేకః

అశనయోగస్తు మితాహారత్వమ్-

'అత్యాహార మనాహారం నిత్యం యోగీ వివర్జయేత్' ఇతి శ్రుతేః। భగవతాఽప్యుక్తమ్-

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్త మనశ్నతః।

న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥
భ. గీ. 6, 16- 17. ఇతి।

జితాసనస్య ప్రాణాయామేన మనోవినాశః శ్వేతాశ్వతరై రామ్నాయతే-

శ్లో॥ 'త్రిరున్నతం స్థాప్య సమం శరీరం హృదీంద్రియాణి మనసా సంనివేశ్య।
బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని॥
ప్రాణాన్ ప్రపీడ్యేహ స యుక్తచేష్టః క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీత।
దుష్టాశ్వయుక్తమివ వాహమేనం విద్వాన్మనో ధారయేతాప్రమత్తః॥ శ్వే. ఉ. 2, 8-9 ఇతి।

భావప్రకాశిక

అశనయోగ మనగా, మితాహారత్వము.

'యోగి, ప్రతిదినము అతిగా ఆహారమును తీసికొనరాదు. ఆహారమును తీసికొనుట మానివేయరాదు, మితాహారి కావలెను' అని, శ్వేతాశ్వతర శ్రుతి చెప్పుచున్నది.

కృష్ణభగవానునిచేత గూడ ఇట్లు చెప్పబడెను-

అతిగా భుజించువానికి యోగము సిద్ధించదు. పూర్తిగా భోజనము మానినవానికి యోగసిద్ధి లేదు. ఓ అర్జునా! అతిగా నిద్రపోవువానికి, అతిగా మేల్కొనువానికి యోగము లేదు. ఆహార విహారములు తగినట్లు ఉండవలయును. అట్లే చేయునట్టి ప్రనులు, జాగ్రత్స్వప్నములు యుక్తములుగా నుండవలెను. అట్టి వానికి దుఃఖమును పోగొట్టునట్టి యోగము సిద్ధించుచున్నది.

ఆసనసిద్ధి కలవానికి ప్రాణాయామముచే మనోనాశము శ్వేతాశ్వతర ఉపనిషత్తునందు చెప్పబడినది. శరీరము, వక్షః స్థలము, మెడ, శిరస్సు సమముగా నిలిపి, మనస్సుచే ఇంద్రియములను హృదయమునందు ఉంచి, విద్వాంసుడు (యోగి) ప్రణవబ్రహ్మానుసంధాన మను నావచే భయావహము లగు ప్రవాహముల నన్నింటిని ఈదవలెను. ఆ యోగి, ప్రాణము లను నిరోధించి యుక్తమగు చేష్ట కలవాడై ఆ ప్రాణము క్షీణించగా, ముక్కుతో ఉచ్ఛ్వాసము చేయవలయును. ఈ రథమును (శరీరమును) దుష్టాశ్వములతో కట్టబడినదివలె తెలిసికొని, అప్రమత్తుడై మనస్సును ధారణ చేయవలయును.

## జీవన్ముక్తివివేకః

యోగో ద్వివిధః; విద్యామదా ద్యాసురసంపద్రహిత స్తత్సహితశ్చేతి। తయోరాద్యస్య బ్రహ్మధ్యానేన మనసి నిరుద్ధే సతి, తన్నాన్తరీయకతయా ప్రాణో నిరుధ్యతే। తం ప్రతి 'త్రిరున్నతమ్-' ఇతి మన్త్రః పఠితః। ద్వితీయస్యాభ్యాసేన ప్రాణే నిరుద్ధే, తన్నాన్తరీయకతయా మనో నిరుధ్యతే। తం ప్రతి 'ప్రాణాన్ ప్రపీడ్య' ఇతి మన్త్రః ప్రవృత్తః। ప్రాణపీడనప్రకారో వక్ష్యతే। తేన చ పీడనేన యుక్తచేష్టో భవతి। మనశ్చేష్టా విద్యా మదాదయో నిరుధ్యన్తే। ప్రాణనిరోధేన చిత్తదోషనిరోధే దృష్టాన్తో ఽన్యత్ర శ్రూయతే-

శ్లో॥ యథా పర్వతధాతూనాం దహ్యన్తే ధమనాన్మలాః।
తథేన్ద్రియకృతా దోషా దహ్యన్తే ప్రాణ నిగ్రహాత్॥

అ. నా. ఉ. 7 ఇతి।

అత్రోపపత్తిర్వసిష్ఠేన దర్శితా-

శ్లో॥ యః ప్రాణపవనస్పన్ద శ్చిత్తస్పన్దః స ఏవ హి।

ప్రాణస్పన్దక్షయే యత్నః కర్తవ్యో ధీమతోచ్చకైః॥
ల. వా. 28, 125 ఇతి।

మనోవాక్చక్షురాదీంద్రియదేవతాః స్వస్వవ్యాపారం నిరన్తరం కరిష్యామ ఇతి వ్రతం ధృత్వా శ్రమరూపేణ మృత్యునా గ్రస్తాః। స చ మృత్యుః ప్రాణం నాప్నోత్। తతో నిరన్తర ముచ్ఛ్వాసనిఃశ్వాసౌ కుర్వన్నప్యయం ప్రాణో న శ్రామ్యతి। తదా విచార్య దేవతాః ప్రాణరూపం ప్రావిశన్। సోఽయమర్థో వాజసనేయిభి రామ్నాయతే- 'అయం వై నః శ్రేష్ఠో యః సంచరంశ్చాసంచరంశ్చ న వ్యథతే అథో న రిష్యతి హన్తాస్యైవ సర్వే రూప మసామేతి। ఏతస్యైవ సర్వే రూప మభవం స్తస్మాదేత ఏతేనాఖ్యాయన్తే ప్రాణాః' బృ. ఉ. 1, 5, 21. ఇతి। అత ఇన్ద్రియాణాం ప్రాణరూపత్వం నామ ప్రాణాధీన చేష్టావత్త్వమ్।

భావప్రకాశిక

యోగము రెండు విధములు. యోగి, విద్యామదము మొదలగు ఆసుర సంపద లేనివాడు ఒకడు, ఆసుర సంపద కలవాడు రెండవవాడు.

వారిలో మొదట యోగి, బ్రహ్మధ్యానము చేత మనస్సు నిరోధింపబడగా ఆ మనోనిరోధముతోపాటు, అవినాభూతముగా ప్రాణనిరోధము సిద్ధించినవాడగును. వానిని గూర్చి 'త్రిరున్నతం' అను మంత్రము పఠింపబడినది. ఇక, విద్యామదము మొదలగు ఆసుర సంపద గల రెండవ యోగికి అభ్యాసముచేత ముందు ప్రాణము నిరోధింపబడగా, తదవినాభూతమగు మనోనిరోధము సిద్ధించును. వానిని గూర్చి 'ప్రాణాన్ ప్రపీడ్య' అను మంత్రము ప్రవృత్తమైనది. ప్రాణపీడనప్రకారము ముందు చెప్పబడును. ఆ ప్రాణనిరోధముచే యుక్తములగు చేష్టలు కలవాడగును.

మనశ్చేష్టలగు విద్యామదాదులు నిరోధింపబడును. ప్రాణనిరోధముచే చిత్తదోషనిరోధము కలుగు ననుటలో దృష్టాంతము మరియొకచోట వినబడుచున్నది. ఏవిధముగా గైరికధాతు దోషములు ధమనముచే (ఊదుటచే) దహింపచేయుబడునో, అట్లే ప్రాణనిగ్రహమువలన ఇంద్రియదోషములు దహింపబడును.

"యః ప్రాణపవనస్పన్ద శ్చిత్త స్పన్దః స ఏవ హి।
ప్రాణస్పన్దక్షయే యత్నః కర్తవ్యో ధీమతోచ్చకైః॥"

ఈ విషయమున, ఉపపత్తి వసిష్ఠునిచే చూపబడినది. ప్రాణ వాయువుయొక్క స్పందమేది కలదో, అదియే చిత్తస్పందము. కనుక, బుద్ధిమంతుడు ప్రాణస్పందమును క్షీణింపజేయుటలో అధిక ప్రయత్నము చేయవలయును.

మనోవాక్చక్షురాది ఇంద్రియానుగ్రాహక దేవతలు తమ తమ వ్యాపారమును ఎడతెగకుండా ఎల్లప్పుడు చేయుదము అని వ్రతమును పట్టి, శ్రమరూపమగు మృత్యువుచే గ్రసింపబడిరి. ఆ మృత్యువు, ప్రాణమును గ్రసింపలేకపోయెను. కనుకనే నిరంతరము ఉచ్ఛ్వాస, నిఃశ్వాసములు జరుపుచున్నను, ఈ ప్రాణము అలసట నొందుటలేదు. అప్పుడు, ఆ దేవతలు ప్రాణ రూపమును ప్రవేశించిరి. ఈ అర్థము శుక్లయజుశ్శాఖీయులచే ఇట్లు ఆమ్నాయము చేయబడుచున్నది.

"అయం వై నః శ్రేష్ఠో యః సంచరం శ్చాసంచరంశ్చ న వ్యథతే యో న రిష్యతి హంతాస్యైవ సర్వే రూపమసామేతి ఏత స్యైవ సర్వే రూప మభవం స్తస్మాదేత ఏతేనాఖ్యాయన్తే ప్రాణాః।"

"ఈ ప్రాణమే మనలో శ్రేష్ఠమైనది. సంచరించుచున్నను, సంచరించకపోయినను, వ్యథ నొందదు, బాధపడదు. ఆహా! మన మ్మందరము ఈ ప్రాణముయొక్క రూపమునే ధరింతము.

పిమ్మట, ఆ ఇంద్రియదేవతలు అందరు ప్రాణరూపమును పొందిరి. ఇందుచేతనే ఇంద్రియములు 'ప్రాణములు' అని పిలువబడుచున్నవి అని పై శ్రుతికి అర్థము.

దీనివలన ఇంద్రియములకు ప్రాణరూపత్వము అనగా, ప్రాణాధీనమైన చేష్ట కలిగియుండుట వర్ణింపబడినది.

జీవన్ముక్తివివేకః

తచ్చాన్తర్యామిబ్రాహ్మణే సూత్రాత్మప్రస్తావే శ్రూయతే- 'వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణాయం చ లోకః పరశ్చ లోకః సర్వాణి భూతాని సందృబ్ధాని భవన్తి। తస్మాద్వై గౌతమ పురుషం ప్రేతమాహుర్వ్యస్రంసిషతాస్యాంగానీతి। వాయునా హి గౌతమ సూత్రేణ సందృబ్ధాని భవన్తి' బృ. ఉ. 3, 7, 2 ఇతి। అతః ప్రాణమనఃస్పన్దయోః సహభావిత్వాత్ ప్రాణనిగ్రహే మనో నిగృహ్యతే। నను సహస్పన్దో న యుక్తః సుషుప్తౌ చేష్టమానేఽపి ప్రాణే మనసోఽచేష్టమానత్వాత్। న, విలీనత్వేన తదానీం మనసః సత్త్వాభావాత్। నను క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీతేతి వ్యాహతమ్। న హి క్షీణప్రాణస్య మృతస్య శ్వాసం క్వచిత్పశ్యామః। నాపి శ్వసతో జీవతః ప్రాణక్షయోఽస్తి। మైవమ్, అనుల్బణత్వస్య క్షయత్వేనాత్ర వివక్షితత్వాత్। తథా ఖననచ్ఛేదనాదిషు వ్యాప్రియమాణస్య పర్వతమారోహితః శీఘ్రం ధావతో వా శ్వాసవేగో యావాన్భవతి, న తావాన్ స్థితస్యాసీనస్య నిద్రితస్య వా విద్యతే, తథా ప్రాణాయామపాటవోపేత స్యేతరస్మాదల్పః శ్వాసో భవతి। ఏతదేవాభిప్రేత్య శ్రూయతే-

'భూత్వా తత్రాయతప్రాణః శనైరేవ సముచ్ఛ్వసేత్' ఇతి।

భావప్రకాశిక

ఆవిధముగానే, అంతర్యామిబ్రాహ్మణమున, సూత్రాత్మ

ప్రస్తావమునందు ఇట్లు వినబడుచున్నది-

ఓ గౌతమా! ఆ సూత్రము వాయువే అయి ఉన్నది. ఓ గౌతమా! వాయువను సూత్రముచేతనే ఈ లోకము, పరలోకము, సర్వభూతములు దృఢముగా బంధింపబడినవై, తమ తమ స్థానములందు ఉండునట్లు చేయబడినవి. కనుకనే, ఓ గౌతమా! పురుషుడు మరణించినపుడు ఇతని అవయవములు సడలినవి అని అందురు. వాయువు అను సూత్రముచేతనే శరీరావయవములు ఒకదానినొకటి పట్టుకొని ఉండును అని అంతర్యామి బ్రాహ్మణమున కలదు.

ఇందువలన, ప్రాణస్పంద, మనస్పందములు కలిసి ఉండుటవలన ప్రాణనిగ్రహమున, మనస్సు నిగ్రహింపబడుచున్నది.

ఓయీ! ప్రాణ, మనస్సులకు సహస్పందమనుట యుక్తము కాదు. సుషుప్తి సమయమున, ప్రాణము చేష్ట కలది అయినను, (ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసలు చేయుటవలన) మనఃస్పందము లేదు కదా! అవును.కాని సుషుప్తి సమయమున, మనస్సు లీనమయినందున, అప్పుడు మనస్సునకు ఉనికియే లేదు. ఓయీ! ప్రాణము క్షీణించగా ముక్కుతో ఉచ్ఛ్వాసము చేయవలయును అని చెప్పబడినది. ఇది 'మమ మాతా వంధ్యా' అనుచోటవలె వ్యాఘాతదోషగ్రస్తము. ప్రాణము క్షీణించగా, మృతుడగువానికి శ్వాస ఎక్కడిది? ఎవరును క్షీణప్రాణునకు శ్వాసను చూచుటలేదు. శ్వాస ఉండి జీవించి ఉన్నవానికి ప్రాణక్షయము ఎట్లు? ఇట్లు కాదు, ఇచట, ప్రాణక్షయ మనగా, వేగాధిక్యము లేకపోవుట వివక్షితము. ఎట్లనగా, భూమిని త్రవ్వుట, చెట్లు నరుకుట, పర్వతము నధిరోహించుట, శీఘ్రముగా పరుగెత్తుట మొదలగు

పనులు చేయువానికి శ్వాసవేగము ఎంత ఉండునో, అంత నిలుచున్నవానికి, కూర్చున్నవానికి, నిద్రపోవువానికి శ్వాస ఉండదు. ప్రాణాయామాభ్యాసముచే పాటవము సంపాదించిన వానికి ఇతరులకంటె అల్పశ్వాసము ఉండును. ఈ అభిప్రాయము తోనే శ్రుతియందు

"భూత్వా తత్రాయతప్రాణం సముచ్ఛ్వసేత్।"

ప్రాణాయామము చేసినతరువాత, మెల్లగా సముచ్ఛ్వాసము చేయవలయును అని చెప్పబడినది.

జీవన్ముక్తివివేకః

యథా దుష్టై రశ్వై రుపేతో రథో మార్గం త్యక్త్వా యత్ర క్వాపి నీయతే, స చ సారథినా దృఢ మశ్వం రజ్జుష్వాకృష్య సుఖమార్గే పునర్ధార్యతే, తథేన్ద్రియైః వాసనాదిభిః తతో నీయ మానం చిత్తం ప్రాణరజ్జౌ దృఢం ధృతాయాం ధార్యతే।

'ప్రాణాన్ ప్రపీడ్య' ఇతి యదుక్తం తత్ర ప్రాణపీడన ప్రకారోఽన్యత్ర శ్రూయతే—

శ్లో॥ సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ।
త్రిః పఠే దాయతప్రాణః ప్రాణాయామః స ఉచ్యతే॥
ప్రాణాయామాస్త్రయః ప్రోక్తాః రేచ పూరక కుంభకాః।
ఉత్క్షిప్య వాయుమాకాశం శూన్యం కృత్వా నిరాత్మకమ్॥
శూన్యభావేన యుంజీత రేచకస్యేతి లక్షణమ్।
వక్త్రేణోత్పలనాళేన తోయ మాకర్షయేన్నరః॥
ఏవం వాయుర్గ్రహీతవ్యః పూరకస్యేతి లక్షణమ్।
నోచ్ఛ్వసే న్నిఃశ్వసే న్నైవ నైవ గాత్రాణి చాలయేత్॥
ఏవం తావన్నియుంజీత కుంభకస్యేతి లక్షణమ్।

అ. నా. ఉ. 11-14 ఇతి।

## భావ ప్రకాశిక

దుష్టములగు అశ్వములచే పూన్చబడిన రథము దారి తప్పి, ఎచటికో తీసికొనిపోబడినపుడు, సారథి దృఢమైన అశ్వ రజ్జువును (కళ్ళెమును) లాగి, సుఖకరమగు మార్గమున, ప్రవేశ పెట్టు రీతిగా, ఇంద్రియములచే వాసనాదివశమున, ఇటునటు తీసికొనిపోబడు చిత్తమును ప్రాణరజ్జువు, దృఢముగా ధరించగా చిత్తము నిలుకడ కలదై, ప్రాణరజ్జువునందు ధరింపబడును.

'ప్రాణాన్ ప్రపీడ్య' అని ఏది చెప్పబడినదో, ఆ ప్రాణ పీడన ప్రకారము మరియొకచోట, వినబడుచున్నది.

"సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ।
త్రిః పఠే దాయతప్రాణః ప్రాణాయామః స ఉచ్యతే॥"

ప్రణవము, వ్యాహృతులు, గాయత్రి, శిరస్సుతోసహా

"ఓమాపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్"

అని ఆయతప్రాణుడై మూడు పర్యాయములు పఠించినచో, అది ప్రాణాయామము అగును.

ప్రాణాయామములు– రేచక, పూరక, కుంభకములు అని మూడు చెప్పబడినవి.

కోష్ఠవాయువును పైకి ఎత్తి, కోష్ఠమునందు వాయువు లేనటుల ఆకాశమును శూన్యముగా చేసి, గాలిని విడిచి, ఆ శూన్య భాగముతోనే ఉండినచో, ఇది రేచకమునకు లక్షణము.

మానవుడు తామరతూడునాళముతో నీటిని మెల్లగా ఆకర్షించునటుల (నోటితో) వాయువును మెల్లగా గ్రహించవలెను. ఇది పూరకమునకు లక్షణము.

ఉచ్ఛ్వాసమును చేయరాదు (గాలిని లోనికి పీల్చరాదు), నిఃశ్వాసమును విడువరాదు. శరీరావయవములను కదలించరాదు. ఇట్లు చేసినచో, కుంభక ప్రాణాయామము అగును.

జీవన్ముక్తివివేకః

అత్ర శరీరాన్తర్గతం వాయుం బహిర్నిఃసారయితుం ఉత్క్షిప్య శారీరమాకాశం శూన్యం నిరాత్మకం వాయురహితం కృత్వా స్వల్పమపి వాయుమప్రవేశ్య శూన్యభావేనైవ నియమయేత్। సోఽయం రేచకో భవతి। కుంభకో ద్వివిధః। ఆన్తరో బాహ్యశ్చేతి। తదుభయం చ వసిష్ఠ ఆహ-

శ్లో॥ అపానేఽస్తంగతే ప్రాణో యావన్నాభ్యుదితో హృది।
తావత్సా కుంభకావస్థా యోగిభి ర్యాఽనుభూయతే॥

ల. వా. 29-211

బహిరస్తంగతే ప్రాణే యావన్నాపాన ఉద్గతః।
తావత్ పూర్ణసమావస్థాం బహిఃష్ఠం కుంభకం విదుః॥

ల. వా. 29-216 ఇతి।

తత్రోచ్ఛ్వాస ఆన్తరకుంభకవిరోధీ, నిఃశ్వాసో బాహ్యకుంభక విరోధీ, గాత్రచాలన ముభయవిరోధీ, తస్మిన్సతి నిఃశ్వాసోచ్ఛ్వాసయోః అన్యతరస్యావశ్యం భావిత్వాత్। పతంజలిరప్యాసనానన్తరభావినం ప్రాణాయామం సూత్రయామాస- 'తస్మిన్ సతి నిఃశ్వాసోచ్ఛ్వాసయోః గతివిచ్ఛేదః ప్రాణాయామః' 2-49 ఇతి। నను కుంభకే గత్యభావేఽపి రేచక పూరకయోరుచ్ఛ్వాసనిఃశ్వాసగతీ విద్యేతే ఇతి చే న్న, అధికమాత్రాభ్యాసేన స్వభావసిద్ధాయాః సమప్రాణగతే ర్విచ్ఛేదాత్। తమేవాభ్యాసం సూత్రయతి- 'బాహ్యాభ్యన్తరస్తంభవృత్తి ర్దేశకాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘః సూక్ష్మః' 2-50 ఇతి। రేచకో బాహ్యవృత్తిః। పూరక ఆభ్యన్తరవృత్తిః। కుంభకః స్తంభవృత్తిః। తత్రైకైకో దేశాదిభిః పరీక్షణీయః। తద్యథా- స్వభావసిద్ధే రేచకే హృదయాన్నిర్గత్య నాసాగ్రసంముఖే ద్వాదశాంగులపర్యన్తే శ్వాసః సమాప్యతే; అభ్యాసేన తు క్రమేణ నాభేరాధారాద్వా

వాయు ర్నిర్గచ్ఛతి, చతుర్వింశత్యంగులపర్యన్తే షట్త్రింశదంగులపర్యన్తే వా సమాప్తిః। అత్ర రేచకే ప్రయత్నాతిశయే సతి నాభ్యాదిప్రదేశక్షోభేణాన్తర్నిశ్చేతుం శక్యమ్; బహిశ్చ సూక్ష్మం తూలం ధృత్వా తచ్చాలనేన నిశ్చేతవ్యమ్। సేయం దేశపరీక్షా రేచకకాలే ప్రణవస్యావృత్తయో దశ వింశతి స్త్రింశదిత్యాదిభిః కాలపరీక్షా। అస్మిన్మాసే ప్రతిదినం దశ రేచకాః ఆగామిమాసే వింశతిః, ఉత్తరమాసే త్రింశదిత్యాదిభిః సంఖ్యాపరీక్షా। యథోక్త దేశకాలవిశిష్టాః ప్రాణాయామా ఏకస్మిన్ దినే దశ వింశతి స్త్రింశదిత్యాభిః సంఖ్యాపరీక్షా। పూరకేఽప్యేవం యోజనీయమ్। యద్యపి కుంభకే దేశవ్యాప్తి విశేషో నావగమ్యతే, తథాఽపి కాలసంఖ్యావ్యాప్తి రవగమ్యత ఏవ। యథా ఘనీభూత స్థూలపిండః ప్రసార్యమాణో దీర్ఘో విరలతయా సూక్ష్మశ్చ భవతి, తథా ప్రాణోఽపి దేశకాలసంఖ్యాధిక్యేనాభ్యాసమానో దీర్ఘో దుర్లక్షతయా సూక్ష్మశ్చ సంభవతి।

## భావప్రకాశిక

ఈ ప్రాణాయామములలో శరీరములోపల ఉన్న వాయువును వెలుపలికి పంపుటకు పైకి ఎత్తి, శరీరములోని ఆకాశమును శూన్యముగా, వాయురహితముగా చేసి స్వల్పమగు వాయువును గూడ, లోనికి ప్రవేశింపనీయకుండ, శూన్యభావముతోనే వాయునిరోధమును చేయవలయును. ఇది రేచక ప్రాణాయామము అగుచున్నది.

కుంభకము ఆంతరము, బాహ్యము అని రెండు విధములు. ఆ రెంటిని వసిష్ఠుడు ఇట్లు చెప్పుచున్నాడు—

అపానమునందు స్తంభింపజేయబడిన ప్రాణము హృదయమునందు పైకి వచ్చినది (అభ్యుదితము) కానంతవరకు, కుంభకావస్థ. ఇది, యోగులచే అనుభవింపబడుచున్నది. ప్రాణ

వాయువు వెలుపలికి పోయి, అధర్శనమును చెందక అపాన వాయువు ఉద్గతము కానంతవరకు ఆ పూర్ణావస్థను బహిష్ఠ (బాహ్య) కుంభకము అని తెలియుచున్నారు.

ఇచట, ఉచ్ఛ్వాసము (లోనికి గాలిని పీల్చుకొనుట) అంతర కుంభకమునకు విరోధి. నిఃశ్వాసము (వెలుపలికి గాలి విడచుట) బాహ్యకుంభకమునకు విరోధి. గాత్రచాలనము (శరీరమును కదలించుట) రెంటికి విరోధి. శరీరము కదలినచో, నిఃశ్వాసో చ్ఛ్వాసములలో ఏదియో ఒకటి తప్పక ఉండును. పతంజలి కూడ, ఆసనానంతరము అనుష్ఠించు ప్రాణాయామమును

'తస్మిన్ సతి నిశ్శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః'

అని సూత్రించెను. ఓయీ! కుంభకమున, వాయుగతి లేక పోయినను, రేచక పూరకములందు నిఃశ్వాసోచ్ఛ్వాసగతులు ఉండునుగదా! గతివిచ్ఛేదము ఎట్లు? అని శంకించరాదు. అధిక మాత్రాభ్యాసముచే స్వభావమాత్రసిద్ధమగు సమప్రాణగతికి విచ్ఛేదము కలుగును. ఆ అభ్యాసమునే

'బాహ్యాంతరస్తంభవృత్తిః దేశకాల సంఖ్యాభిః పరిదృష్టః దీర్ఘః సూక్ష్మః''

అని సూత్రించినాడు. రేచకము బాహ్యవృత్తి కలది. పూరకము అంతర్వృత్తి కలది. కుంభకము స్తంభవృత్తి కలది. వీనిలో ఒక్కొక్కదానిని దేశ, కాల సంఖ్యలచే పరీక్షింపవలయును. అది ఎట్లనగా, స్వభావసిద్ధమగు రేచకమున, హృదయమునుండి వెలువడి నాసారంధ్రముద్వారా ద్వాదశాంగుళ పర్యంతము, శ్వాస సమాప్తమగుచున్నది. అభ్యాసము చేత క్రమముగా నాభి నుండియు, మూలాధారమునుండియు వాయువు బయల్వెడలును. 24 అంగుళముల పర్యంతము, లేదా 36 అంగుళముల పర్యంతము సమాప్తము అగుచున్నది. ఈ రేచకమున ప్రయత్న

అతిశయము కలుగగా, నాభి మొదలగు ప్రదేశములందు క్షోభముచే లోపల నిశ్చయించుటకు శక్యమగును. వెలుపల అయితే పలుచని దూదిని దూరముగా కట్టి, దాని కదలికచే నిశ్చయింపవచ్చును. ఇది, దేశపరీక్ష. రేచకకాలమున, ప్రణవమునకు ఆవృత్తులు పది, ఇరువది, ముప్పది మొదలగువానిచే కాలపరీక్ష. ఈ మాసమున ప్రతిదినము పది రేచకములు, రాబోవు మాసమున ఇరువది, తరువాతి మాసమున ముప్పది. వీనిచే సంఖ్యాపరీక్ష: వెనుక చెప్పిన దేశ, కాలములతో కూడిన ప్రాణాయామములు ఒకరోజున పది, ఇరువది, ముప్పది మొదలగువానిచే సంఖ్యా పరీక్ష. పూరకమునందు గూడ ఇట్లే యోజన చేయవలయును. విచారించగా కుంభకమున, దేశవ్యాప్తివిశేషము తెలియబడదు. అట్లయినను, కాలసంఖ్యావ్యాప్తి తెలియబడుచుండును. ఎట్లనగా ఒత్తిడి చేయబడిన దూదిపింజ పరచినచో, పొడవై, పలుచనై, సూక్ష్మ మగును. అట్లే, ప్రాణము కూడ, దేశ, కాల, సంఖ్యాధిక్యముతో అభ్యసింపబడినదై పొడవై గ్రహించుటకు వీలులేనంత సూక్ష్మమై సంభవించును.

## జీవన్ముక్తివివేకః

రేచకాదిభ్య స్త్రిభ్యోఽన్యం ప్రకారం సూత్రయతి- 'బాహ్యాభ్యన్తర విషయాపేక్షీ చతుర్థః' 2-51 ఇతి। యథాశక్తి సర్వం వాయుం విరేచ్యానన్తరం క్రియమాణో బహిష్కుంభకః యథాశక్తి వాయుం ఆపూర్యానన్తరం క్రియమాణోఽన్తః కుంభకః, ఇతి రేచక పూరకా వనాదృత్య కేవలః కుంభకోఽభ్యస్యమానః పూర్వత్రయాపేక్షయా చతుర్థో భవతి। నిద్రా తంద్రాది ప్రబల దోషయుక్తానాం రేచకాది త్రయమ్, దోషరహితానాం చతుర్థ ఇతి వివేకః। ప్రాణాయామఫలం సూత్రయతి- 'తతః క్షీయతే ప్రకాశావరణమ్' 2-52 ఇతి। ప్రకాశస్య సత్త్వస్య ఆవరణం తమో నిద్రా

లస్యాదిహేతుః, తస్య క్షయో భవతి। క్షయే సతి ఫలాన్తరం సూచయతి- 'ధారణాసు చ యోగ్యతా మనసః' 2-53 ఇతి। ఆధార నాభిచక్ర హృదయ భ్రూమధ్య బ్రహ్మరంధ్రాది దేశ విశేషే వికృష్య చిత్తస్య స్థాపనం ధారణా, 'దేశబన్ధ శ్చిత్తస్య ధారణా' 3-1 ఇతి సూత్రణాత్। శ్రుతిశ్చ-

శ్లో॥ మనః సంకల్పకం ధ్యాత్వా సంక్షిప్యాత్మని బుద్ధిమాన్।
ధారయిత్వా తథాఽఽత్మానం ధారణా పరికీర్తితా॥

అ. నా. ఉ. 15 ఇతి।

ప్రాణాయామేన రజోగుణకార్యా చ్చాంచల్యా త్తమోగుణ కార్యాత్ ఆలస్యాదేశ్చ నివారితం మన స్తస్యాం ధారణాయాం యోగ్యం భవతి।

'ప్రాణాయామ దృఢాభ్యాసై ర్యుక్త్యా చ గురుదత్తయా।' ల. వా. 18, 122 ఇత్యత్రత్యేన యుక్తిశబ్దేన యోగిజనప్రసిద్ధం శిరోరూప మేరుచాలనమ్, జిహ్వాగ్రేణ ఘంటికాభ్రమణమ్, నాభి చక్రే హృదయే చ జ్యోతిర్ధ్యానమ్, విస్మృతిప్రదౌషధసేవా చేత్యేవమాదికం గృహ్యతే।

తదేవ మధ్యాత్మవిద్యా సాధుసంగమ వాసనాక్షయ ప్రాణ నిరోధా శ్చిత్తనాశోపాయా దర్శితాః। అథ తదుపాయభూతం సమాధిం వక్ష్యామః। పంచభూమ్యుపేతస్య చిత్తస్య భూమిత్రయ త్యాగేనావశిష్టం భూమిద్వయం సమాధిః। భూమయశ్చ యోగ భాష్యకృతా దర్శితాః- 'క్షిప్తం మూఢం విక్షిప్త మేకాగ్రం నిరుద్ధమితి పంచ చిత్తస్య భూమయః' యో. సూ. భా. 1-1 ఇతి। ఆసురసంప ల్లోక శాస్త్ర దేహవాసనాసు వర్తమానం చిత్తం క్షిప్తమ్। నిద్రా తంద్రాదిగ్రస్తం మూఢమ్। కాదాచిత్క ధ్యాన యుక్తం క్షిప్తా ద్విశిష్టతయా విక్షిప్తమ్।

భావప్రకాశిక

వెనుక చెప్పిన రేచక, పూరక, కుంభకములు మూడింటికంటె, మరియొక విధమైన కుంభక ప్రాణాయామమును సూచించు చున్నారు–

"బాహ్యాంభ్యంతర విషయానపేక్షీ చతుర్థః"

అని శక్త్యనుసారము కోష్ఠములో ఉన్న వాయువు నంతయు బయటకు విడచిన తరువాత చేయబడునది బహిష్కుంభకము. అట్లే శక్త్యనుసారము బాహ్యవాయువును లోపలకు నింపుకొని(పూరించి) చేయబడు కుంభకము, అంతఃకుంభకము. ఇక, రేచక, పూరకము లను ఆదరించకుండా కేవలము కుంభకము అభ్యసింపబడునది వెనుకటి మూడింటికంటె నాలుగవది అగుచున్నది. నిద్ర, మగత, మొదలగు ప్రబల దోషములు గలవారికి రేచకాదిత్రయము. అట్టి దోషము లేనివారికి ఈ నాలుగవది – కేవల కుంభకము అని వివేకము. ప్రాణాయామ ఫలమును సూత్రించుచున్నారు–

"తతః క్షీయతే ప్రకాశావరణమ్"

ప్రకాశమగు సత్త్వమునకు ఆవరణమగు తమస్సు నిద్రకు, అలసతకు కారణమైనది ఈ ప్రాణాయామము వలన, క్షీణించును. ఆ విధముగా తమస్సు, క్షయము రాగా, మరియొక ఫలమును సూత్రించుచున్నారు.

"ధారణాసు చ మనసః యోగ్యతాః"

'ఆధార, నాభిచక్ర, హృదయ, భ్రూమధ్య, బ్రహ్మరంధ్రాది దేశవిశేషమునందు చిత్తమును లాగి నిలుపుట ధారణ అగును.

"దేశబంధ శ్చిత్తస్య ధారణా।"

అని సూత్రము. శ్రుతియు కలదు.

"మనః సంకల్పకం ధ్యాత్వా సంక్షిప్యాత్మని బుద్ధిమాన్।

ధారయిత్వా తథాఽఽత్మానం ధారణా పరికీర్తితా॥"

బుద్ధిమంతుడు సంకల్పము చేయు మనస్సును ధ్యానము చేసి, ఆత్మయందు ఆత్మాకారముతో లయమొనర్చి, అట్లే ఆత్మను

ప్రాణాయామముచే రజోగుణకార్యమగు చాంచల్యము నుండియు, తమోగుణకార్యమగు అలసత మొదలగువాని నుండియు నివారింపబడినదై మనస్సు, ఆ ధారణయందు యోగ్యమగుచున్నది.

"ప్రాణాయామ దృఢాభ్యాసైః యుక్త్యా చ గురుదత్తయా"

అనుచోట, 'యుక్తి' శబ్దముచేత యోగిజనప్రసిద్ధమగు శిరోరూప మేరుచాలనము, జిహ్వాగ్రముతో కొండనాలుకను త్రిప్పుట, నాభి చక్రమునందు, హృదయమునందు జ్యోతిర్ధ్యానము, విస్మృతిని కలిగించు ఔషధముయొక్క సేవ మొదలైనవి గ్రహింపబడును.

కనుక, ఈవిధముగా అధ్యాత్మవిద్య, సాధుసాంగత్యము, వాసనాక్షయము, ప్రాణనిరోధము చిత్తనాశమునకు ఉపాయములు చూపబడినవి. పిమ్మట, ఆ చిత్తనాశమునకు ముఖ్యోపాయమగు సమాధిని గురించి చెప్పెదుము. చిత్తమునకు అయిదు భూమికలు కలవు. అందు, మొదట మూడు భూమికలను వదలిపెట్టగా మిగిలిన రెండు భూమికలు 'సమాధి' అని వ్యవహరింపబడును. యోగభాష్యకారునిచేత చిత్తభూములు ప్రదర్శింపబడినవి.

"క్షిప్తం, మూఢం, విక్షిప్తం, ఏకాగ్రం నిరుద్ధమితి పంచ
చిత్తస్య భూమయః"

అందు ఆసుర సంపద, లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసనలతో కూడిన చిత్తము 'క్షిప్త' మగుచున్నది. నిద్ర, కునికిపాటు, మొదలగువానితో కూడిన చిత్తము మూఢము. ఎప్పుడో ఒకప్పుడు ధ్యానముతో కూడినది క్షిప్తముకంటె కొంత విలక్షణమైనది విక్షిప్తము.

## జీవన్ముక్తివివేకః

తత్ర క్షిప్తమూఢయోః సమాధిశంకైవ నాస్తి। విక్షిప్తే తు చేతసి విక్షేపోపసర్జనీభూతః సమాధి ర్యోగపక్షే న వర్తతే। విక్షేపాన్తర్గతతయా దహనాంతర్గత బీజవత్ స సద్యఏవ వినశ్యతి। యస్త్వేకాగ్రే చేతసి సంభూత మర్థం ద్యోతయతి, క్షిణోతి చ క్లేశాన్, కర్మబంధనాని శ్లథయతి, నిరోధ మభిముఖీకరోతి, స సంప్రజ్ఞాతయోగ ఇత్యాఖ్యాయతే। సర్వవృత్తినిరోధే తు అసంప్రజ్ఞత సమాధిభూమిం ఏకాగ్రతాం సూత్రయతి- 'శాన్తోదితౌ తుల్యప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతాపరిణామః' 3-12 ఇతి। శాన్తోఽతీతః। ఉదితో వర్తమానః। ప్రత్యయ శ్చిత్తవృత్తిః। అతీతః ప్రత్యయోఽయం పదార్థం గృహ్ణాతి తమేవ చేదుదితో గృహ్ణీయాత్। తదా తావుభౌ తుల్యౌ భవతః। తాదృశశ్చిత్తస్య పరిణామ ఏకాగ్రతేతి ఉచ్యతే। ఏకాగ్రతాభివృద్ధిలక్షణం సమాదిం సూత్రయతి- 'సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధిపరిణామః' 3-11 ఇతి। రజోగుణేన చాల్యమానం చిత్తం క్రమేణ సర్వాన్పదార్థాన్ గృహ్ణాతి। తస్య రజోగుణస్య నిరోధాయ క్రియమాణేన యోగినః ప్రయత్నవిశేషేణ దినే దినే సర్వార్థతా క్షీయతే, ఏకాగ్రతా చోదేతి, తాదృశ శ్చిత్తస్య పరిణామః సమాధి రిత్యుచ్యతే। తస్య సమాధే రష్టస్వంగేషు యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహారాః పంచ బహిరంగాని। తత్ర యమా సూత్రయతి- 'అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహా యమాః' 2-30 ఇతి। హింసాదిభ్యో నిషిద్ధధర్మేభ్యో యోగినం యమయన్తీతి యమాః। నియమాన్సూత్రయతి- 'శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః, 2-32 ఇతి, జన్మహేతోః కామ్యధర్మా న్నివర్త్య మోక్షహేతౌ నిష్కామధర్మే నియమయన్తి ప్రేరయన్తీతి నియమాః। యమ నియమయోః

అనుష్ఠానవైలక్షణ్యం స్మర్యతే-

శ్లో॥ యమాన్ కుర్వీత సతతం న కుర్యాత్ నియమాన్ బుధః।
యమాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్॥
పతతి నియమాన్ యమేష్వసక్తో న తు యమవా
న్నియమాలసోఽవసీదేత్।
ఇతి యమనియమౌ సమీక్ష్య బుద్ధ్యాయమబహులేష్వను
సందధీత బుద్ధిమ్॥ ఇతి

యమనియమఫలాని సూత్రయతి-తత్సంనిధౌ వైరత్యాగః, క్రియాఫలాశ్రయత్వమ్, సర్వరత్నోపస్థానమ్, వీర్యలాభః, జన్మకథంతాసంబోధః, జననాది భయాభావః, శౌచాత్ స్వాంగ జుగుప్సాపరైరసంసర్గః, సత్త్వశుద్ధిసౌమనస్యైకాగ్ర్యేంద్రియ జయాత్మదర్శన యోగ్యత్వాని చ సంభవన్తి। సంతోషా దనుత్తమః సుఖలాభః, కాయేంద్రియ బుద్ధిశుద్ధిః, అశుద్ధిక్షయాత్ తపసః స్వాధ్యాయాదిష్ట దేవతాసంప్రయోగః, సమాధిసిద్ధిరీశ్వర ప్రణిధానాత్ 2, 35-45 ఇతి। ఆసనప్రాణాయామౌ వ్యాఖ్యాతౌ।

## భావప్రకాశిక

వానిలో క్షిప్త, మూఢ భూములందు సమాధిశంకయే లేదు. విక్షిప్తమునందైతే, విక్షేపమునకు ఉపసర్జనముగా కాదా చిత్కముగా ధ్యానసమాధి ఉన్నను, అది యోగాంతర్భూతము కాదు. అగ్నిమధ్యమున్న బీజమువలె విక్షేపాంతర్గతమగు ధ్యానము వెంటనే నశించును. ఇక, చిత్తము ఏకాగ్రమైనపుడు, యోగము వాస్తవమైన అర్థమును ప్రకాశింపజేయును. క్లేశములను క్షీణింప జేయును. కర్మబంధములను సడలించును. నిరోధమునకు అభి ముఖముగా జేయును. అది సంప్రజ్ఞాతయోగము అని పిలువబడు చున్నది. సర్వవృత్తినిరోధము కలుగగా, 'అసంప్రజ్ఞాత సమాధి' కలుగును. వానిలో సంప్రజ్ఞాత సమాధిభూమి యగు ఏకాగ్రతను

సూత్రించుచున్నారు-

"శాంతోదితౌ తుల్యప్రత్యయౌ చిత్తస్య ఏకాగ్రతా పరిణామః"

శాంతః అతీతః- గడచినది, ఉదితః- వర్తమానము, ప్రత్యయః- చిత్తవృత్తి. అతీతమగు చిత్తవృత్తి ఏ విషయమును గ్రహించినదో, ఆ విషయమునే తరువాత ఉదయించునట్టి చిత్త వృత్తి గ్రహించినచో, ఆ చిత్తవృత్తులు రెండును, తుల్యములు అగును. అట్టి చిత్తముయొక్క పరిణామము 'ఏకాగ్రత' అని చెప్పబడును. ఏకాగ్రతాభివృద్ధి లక్షణమగు సమాధిని సూత్రించు చున్నారు.

"సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధిః పరిణామః"

రజోగుణముచే చలింపబడిన చిత్తము క్రమముగా సర్వపదార్థము లను గ్రహించును. ఆ రజోగుణమును నిరోధించుటకు చేయబడు యోగియొక్క ప్రయత్నవిశేషముచేత రోజురోజుకు ఆ చిత్తము నకు సర్వార్థత క్షీణించును, ఏకాగ్రత ఉదయించును. అట్టి చిత్తముయొక్క పరిణామము 'సమాధి' అని చెప్పబడును. ఆ సమాధికి ఎనిమిది అంగములలో యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములు అయిదు బహిరంగములు. వానిలో యమములను సూత్రించుచున్నారు-

"అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్య అపరిగ్రహా యమాః"

హింస మొదలగు నిషిద్ధకార్యములనుండి 'యమయన్తి నివర్త యన్తి' మరలించుచున్నవి గనుక, అవి యమములు. నియమము లను సూత్రించుచున్నారు-

"శౌచ, సంతోష, తపః, స్వాధ్యాయ, ఈశ్వరప్రణిధానాని నియమాః"

జన్మకు కారణమగు కామ్య ధర్మములనుండి మరలించి, మోక్ష

హేతువగు నిష్కామధర్మమునందు 'నియమయన్తి ప్రేరయన్తి' ప్రేరేపించుచున్నవి గనుక, ఇవి నియమములు.

యమ, నియమములకు అనుష్ఠానవైలక్షణ్యము శ్రుతియందు పేర్కొనబడినది.

"యమా న్సేవేత సతతం న నిత్యం నియమాన్బుధః।
యమా న్పతత్యకుర్వాణో నియమా న్కేవలాన్భజన్॥"

వివేకి యమములను ఎల్లప్పుడు తప్పక పాటించవలెను. అంతగా నియమములను ఆచరించనక్కరలేదు. కేవలము నియమములనే పాటించుచు, యమములను పాటించనివాడు పతితుడగును. యమ, నియమములను రెంటిని పాటించలేనివాడు యమములను వదలి, కేవలము నియమములనే పాటించినచో, పతితుడగును.నియమములందు అలసత కలిగి, యమములను ఆచరించువాడు పతితుడు కాడు. ఈవిధముగా బుద్ధితో యమ, నియమములను సమీక్ష చేసి, యమములతో నిండిన కార్యములండే బుద్ధిని ప్రవేశపెట్టవలెను.

యమ, నియమ ఫలమును సూత్రించుచున్నాడు–

"తత్సన్నిధౌ వైరత్యాగః' క్రియాఫలాశ్రయత్వం, సర్వరత్నోపస్థానం, వీర్యలాభః, జన్మకథంతాసంబోధః, జననాది భయాభావః, శౌచాత్ స్వాంగజుగుప్సా, పరై రసంసర్గః, సత్త్వశుద్ధి సౌమనస్య, ఏకాగ్రతా, ఇంద్రియజయ, ఆత్మదర్శన యోగ్యత్వాని చ భవన్తి।"

అహింసాపరుని సాన్నిధ్యమునందు విరోధత్యాగము. సత్యనిష్ఠ ప్రాప్తమైనప్పుడు 'ధార్మికుడవు కమ్ము, స్వర్గఫలమును పొందుము' అను మాటచేతనే ధర్మస్వర్గాదిఫలము. ఇతరుల వస్తువును ఆశించకుండుట మనస్సులో అడుగున గూడ ప్రతిష్ఠితమైనచో, గుప్తమైన సమస్త శ్రేష్ఠ వస్తువులు ప్రకటమగును. బ్రహ్మచర్యము ప్రతిష్ఠితమైనచో, వీర్యలాభము, అధికశక్తి

సంపన్నత. ఒకరిచ్చిన వస్తువును తాను పరిగ్రహించకపోవుట అనునది పూర్ణముగా స్థిరపడినచో, పూర్వాపర జన్మవిజ్ఞానము కలుగును. జన్మ, మరణభయము లేకపోవుట, శౌచమువలన తన శరీరమునందు జుగుప్స, విరక్తిభావము, ఇతరులతో కలియక, ఏకాంతముగా ఉండుట, అంతఃకరణశుద్ధి, సౌమనస్యము, ఏకాగ్రత, ఇంద్రియజయము, ఆత్మసాక్షాత్కారయోగ్యత కలుగుచున్నవి. సంతోషము వలన సర్వోత్తమ సుఖలాభము. తపస్సువలన మాలిన్యము, పాపక్షయము ద్వారా శరీరేంద్రియ బుద్ధి శుద్ధి, స్వాధ్యాయము వలన ఇష్ట దేవతా దర్శనము, ఈశ్వర ప్రణిధానముచే సమాధిసిద్ధి కలుగును. ఆసన, ప్రాణాయామములు ఇదివరకే వ్యాఖ్యానము చేయబడినవి.

## జీవన్ముక్తి వివేకః

ప్రత్యాహారం సూత్రయతి–

"స్వవిషయాసంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవ ఇంద్రియాణాం ప్రత్యాహారః" 2-54 ఇతి। శబ్ద స్పర్శ రూప రస గంధాః విషయాః, తేభ్యో నివర్తితాః శ్రోత్రాదయ శ్చిత్త స్వరూప మనుకుర్వన్త ఇవావతిష్ఠన్తే। శ్రుతిశ్చ భవతి–

శ్లో॥ శబ్దాది విషయాన్ పంచ మనశ్చైవాతిచంచలమ్।
చిన్తయే దాత్మనో రశ్మీన్ ప్రత్యాహారః స ఉచ్యతే॥

అ. నా. ఉ. 5 ఇతి।

శబ్దాదయో విషయా యేషాం శ్రోత్రాదీనాం తే శ్రోత్రాదయః పంచ, మనః షష్ఠానా మేతేషా మనాత్మరూపేభ్యః శబ్దాదిభ్యో నివర్తన మాత్మరశ్మిత్వేన చిన్తనమ్, ప్రత్యాహారః స ఇత్యర్థః। ప్రత్యాహారఫలం సూత్రయతి– 'తతః పరమా వశ్యతేన్ద్రియాణామ్' 2-55 ఇతి। ధారణాధ్యానసమాధీన్ సూత్రై స్త్రిభిః సూత్రయతి– 'దేశబన్ధ శ్చిత్తస్య ధారణా' 3-1, 'తత్ర

ప్రత్యయైకతానతా ధ్యానమ్' 3-2, 'తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః' 3-3 ఇతి। ఆధారాదిదేశాః పూర్వ ముక్తాః। దేశాన్తరం శ్రూయతే-

మనః సంకల్పకం ధ్యాత్వా సంక్షిప్యాత్మని బుద్ధిమాన్।
ధారయిత్వా తథాఽఽత్మానం ధారణా పరికీర్తితా॥
అ. నా. ఉ. 15 ఇతి।

'యత్సర్వవస్తు సంకల్పకం మనః, తదాత్మానమేవ సంకల్పయతు న త్వన్యత్' ఇత్యేవంవిధః ప్రయత్న ఆత్మని సంక్షేపః। ప్రత్యయస్త్వేకతానతా తత్త్వైకవిషయః ప్రవాహః। స చ ద్వివిధః- విచ్ఛిద్య విచ్ఛిద్య జాయమానః, సంతతశ్చేతి। తావుభౌ క్రమేణ ధ్యానసమాధీ భవతః। తదుభయం సర్వానుభవ యోగినా దర్శితమ్-

శ్లో॥ చిత్తైకాగ్ర్యాద్యతో జ్ఞానముక్తం సముపజాయతే।
తత్సాధనమతో ధ్యానం యథావదుపదిశ్యతే॥
విలాప్య వికృతిం కృత్స్నాం సంభవవ్యత్యయక్రమాత్।
పరిశిష్టంచ సన్మాత్రం చిదానన్దం విచిన్తయేత్॥ ఇతి।
బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహోఽహంకృతిం వినా।
సంప్రజ్ఞాతసమాధిః స్యాద్ ధ్యానాభ్యాసప్రకర్షజః॥ ఇతి చ।
తం చ భగవత్పాదా ఉదాజహ్రుః-

శ్లో॥ దృశి స్వరూపం గగనోపమం పరం సకృద్విభాతం
త్వజమేకమక్షరమ్।
అలేపకం సర్వగతం యదద్వయం తదేవ చాహం
సతతం విముక్త ఓమ్॥

శ్లో॥ దృశిస్తు శుద్ధోఽహమవిక్రియాత్మకో న మేఽస్తి
కశ్చిద్విషయః స్వభావతః।

పురస్తిరశ్చోర్ధ్వమధశ్చ సర్వతః సంపూర్ణభూమా
త్వజ ఆత్మని స్థితః॥
అజోఽమరశ్చైవ తథాఽజరోఽమృతః స్వయంప్రభః
సర్వగతోఽహ మద్వయః।
న కారణం కార్యమతీవ నిర్మలః సదైవ తృప్తశ్చ
తతో విముక్త ఓమ్॥ ఉప. 10, 1-3 ఇతి।

నను సంప్రజ్ఞాతసమాధిరంగీ, స కథం ధ్యానానన్తరభావినో ఽష్టమాంగస్య సమాధేః స్థాన ఉదాహ్రియతే? నాయం దోషః। అత్యన్తభేదాభావాత్। యథా వేద మధీయానో మాణవకః పదే పదే స్ఖలన్ పునః పునః సమాదధాతి, అధీతవేదస్తు సావధానో న స్ఖలతి, అధ్యాపకో నిరవధాన స్తంద్రాం కుర్వన్నపి న స్ఖలతి, తథా విషయైక్యేఽపి పరిపాకతారతమ్యేన ధ్యానసమాధిసంప్రజ్ఞాతానా మవాన్తరభేదోఽవగన్తవ్యః।

భావప్రకాశిక

ప్రత్యాహారమును సూత్రించుచున్నారు-

"స్వవిషయాసంప్రయోగే చిత్తస్య స్వరూపానుకార ఏవ ఇంద్రియాణాం ప్రత్యాహారః"

శ్రోత్రాది ఇంద్రియములను తమ విషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులనుండి మరలించినతరువాత చిత్తముయొక్క స్వరూపమును అనుకరించునవి వలె ఆ ఇంద్రియములు ఉండును. శ్రుతి కూడ కలదు. శబ్దాది విషయములు గల శ్రోత్రాది జ్ఞానేంద్రియములను అయిదింటిని, అతిచంచలమగు మనస్సును ఆత్మయొక్క కిరణములు (రజ్జువులు) గా చింతించవలెను. దీనినే 'ప్రత్యాహారము' అందురు. ప్రత్యాహారమునకు ఫలమును సూత్రించుచున్నారు-

"తతః పరమా వశ్యతా ఇంద్రియాణామ్।"

ప్రత్యాహారము వలన ఇంద్రియములు మిక్కిలి స్వాధీనములై ఉండును. ధారణా, ధ్యాన, సమాధులను మూడు సూత్రములచే సూత్రించుచున్నారు.

"దేశబంధః చిత్తస్య ధారణా।"

"తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్।"

"తదేవ అర్థమాత్ర నిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః।"

ధారణకు పూర్వము, మూలాధార, హృదయ, భ్రూమధ్యాది దేశములు చెప్పబడినవి. మరియొక దేశము కూడ, వినబడు చున్నది. మనస్సును సంకల్పముచేయునదిగా గుర్తెరిగి బుద్ధి మంతుడు ఆత్మయందు సంక్షేపముచేసి ఆత్మనే ధారణ చేయవలెను. ఇదియే 'ధారణ' అని చెప్పబడుచున్నది. మనస్సు, అనేక విషయములను సంకల్పించునది అయి ఉన్నది. కనుక, ఇతర విషయమునందు పోనీయక, ఆత్మనే సంకల్పించునట్లు చేయు ప్రయత్నము ఆత్మని సంక్షేపము. 'ప్రత్యయైకతానతా' అనగా తత్త్వైక విషయ (ఆత్మతత్త్వమును గురించియే) చిత్తవృత్తి ప్రవాహము. అది, రెండు విధములు. ఒకటి, ఆగి ఆగి కలుగు చిత్తవృత్తి ప్రవాహము. రెండవది, నిరంతర చిత్తవృత్తి ప్రవాహము. మొదటిది, ధ్యానము. రెండవది సమాధి. ఆ రెంటిని సర్వానుభవయోగి ఇట్లు చూపెను— చిత్తైకాగ్రతవలన, జ్ఞానము కలుగుచున్నందున, ఆ చిత్తైకాగ్రతకు సాధనమైన ధ్యానము తగురీతిగా ఉపదేశింపబడుచున్నది. సమస్తమైన వికృతికార్యము లను సృష్టి, ప్రళయక్రమము ననుసరించి, కారణమునందు (ప్రకృతియందు) విలాపన మొనర్చి, చివరకు అబాధితమై మిగిలియున్న సన్మాత్ర చిదానంద స్వరూపమును ధ్యానించ వలెను. అహంకార విరహితమైన ధ్యానాభ్యాసప్రకర్షవలన,

కలుగు బ్రహ్మాకార మనోవృత్తి ప్రవాహము సంప్రజ్ఞాత సమాధి యగును. ఆ సమాధిని భగవత్పాదులు ఇట్లు ఉదహరించిరి-

దృశి (క్) స్వరూపము ఆకాశమును పోలినది. శ్రేష్ఠమైనది. ఎల్లపుడు ప్రకాశించునది. అతీంద్రియమైనది. నాశములేనిది. ఎట్టి దోషములు అంటనిది. సర్వవ్యాపకమైనది. అఖండమైనది ఏది కలదో, ప్రణవప్రతిపాద్యమైన అదియే నేను అయి ఉన్నాను. ఎప్పుడును, బంధము లేనివాడను. శుద్ధమైన దృగ్వస్తువు నేను అయి ఉన్నాను. వికారము లేనివాడను. స్వభావముచే నాకు ఏ విషయమును లేదు. ముందు, వెనుక, పైన, క్రింద, అంతట వ్యాపించిన భూమ స్వరూపుడను. స్వరూపమునందే ఉన్నవాడను. పుట్టుక లేనివాడను. మరణము లేనివాడను. ముసలితనము లేనివాడను. ఆనందస్వరూపుడను. స్వయంప్రకాశుడను. సర్వ వ్యాపకుడను. కారణము, కార్యము లేనివాడను. అత్యంత పరిశుద్ధుడను. సదా సంతృప్తుడను. విముక్తుడను. బ్రహ్మ స్వరూపుడను అని భావము.

ఓయీ! సంప్రజ్ఞాత సమాధి అంగి కదా? యోగాంగము లలో ధ్యానానంతరమున కలుగు అష్టమాంగము యొక్క స్థానము నందు ఈ సంప్రజ్ఞాతసమాధి ఉదహరింపబడుచున్నదేమి? ఇది దోషము కాదు. ఏలయనగా, అంగమగు సమాధికిని, అంగి యగు సమాధికిని అత్యంత భేదము లేదు. ఎట్లనగా, వేదాధ్యయనము చేయు మాణవకుడు (బాలుడు) ప్రతి పదమున తొట్రుపాటు పడుచు మాటిమాటికి ఏకాగ్రతకు వచ్చును. పూర్తిగా వేదాధ్యయ నము చేసినవాడు సావధానుడై పదములను చెప్పునపుడు, తొట్రుపాటు పడడు. అధ్యాపకుడైతే, అవధానము లేకపోయినను, నిద్ర, మగత వచ్చుచున్నను పదములందు తొట్రుపాటు పడడు. ఆ విధముగానే విషయము ఒకటే అయినను, పరిపాక

తారతమ్యముచే ధ్యానము, అంగభూతమగు సమాధి, అంగియగు సంప్రజ్ఞాత సమాధి, వీనికి అవాంతరభేదము అని తెలిసికొనదగును.

జీవన్ముక్తివివేకః

ధ్యానధారణాసమాధిత్రయం మనోవిషయత్వాత్ సంప్రజ్ఞాత సమాధేః అన్తరంగమ్, యమాదిపంచకం తు బహిరంగమ్। తదేతత్సూత్రయతి- 'త్రయమన్తరంగం పూర్వేభ్యః' 3-7 ఇతి। తతః కేనాపి పుణ్యేనాన్తరంగే ప్రథమం లబ్ధే బహిరంగలాభాయ నాతిప్రయాసః కర్తవ్యః। యద్యపి పతంజలినా భౌతిక భూత తన్మాత్రేంద్రియాహంకారాదివిషయాః సంప్రజ్ఞాత సవికల్ప సమాధయో బహుధా ప్రపంచితాః, తథాఽపి తేషా మన్తర్ధానాది సిద్ధిహేతుతయా ముక్తిహేతు సమాధివిరోధిత్వా న్నాస్మాభి స్తత్రాదరః క్రియతే। తథా చ సూత్రితమ్- 'తే సమాధావుపసర్గా వ్యుత్థానే సిద్ధయః' 3-38 ఇతి, 'స్థాన్యుపనిమంత్రణే సంగస్మయా కరణం పునరనిష్టప్రసంగాత్' 3-52 ఇతి చ। స్థానినో దేవాః। ఉద్దాలకో, దేవై రాపన్తితోఽప్యవజ్ఞాయ తాన్దేవా న్నిర్వికల్ప సమాధిమేవ చకారేత్యుపాఖ్యాయతే। ప్రశ్నోత్తరాభ్యా మప్యేవ మేవావగమ్యతే।

శ్రీరామః-

శ్లో॥ జీవన్ముక్తశరీరాణాం కథ మాత్మవిదాంవర।
శక్తయో నేహ దృశ్యన్త ఆకాశగమనాదికాః॥ ల.వా. 28-1

వసిష్ఠః-

శ్లో॥ అనాత్మవిదముక్తోఽపి నభో విహరణాదికమ్।
ద్రవ్యమంత్రక్రియాకాలశక్త్యాఽఽప్నో త్యేవ రాఘవ॥
నాత్మజ్ఞస్యైష విషయ ఆత్మజ్ఞో హ్యాత్మమాత్రదృక్।
ఆత్మనాఽఽత్మని సంతృప్తో నావిద్యా మనుధావతి॥
ల.వా. 28, 2-3

యే కేచన జగద్భావా స్తా నవిద్యామయాన్ విదుః।

కథం తేషు కిలాత్మజ్ఞ స్త్యక్తావిద్యో నిమజ్జతి॥ ల. వా. 28,5

ద్రవ్యమంత్ర క్రియాకాలశక్తయః సాధుసిద్ధిదాః।
పరమాత్మపదప్రాప్తౌ నోపకుర్వన్తి కాశ్చన॥
ల. వా. 28, 7

సర్వేచ్ఛాజాలసంశాన్తా వాత్మలాభోదయో హి యః।
స కథం సిద్ధివాంఛాయాం మగ్నచిత్తేన లభ్యతే॥
ల. వా. 28, 9

న కేచన జగద్భావా స్తత్త్వజ్ఞం రంజయన్త్యమీ।
నాగరం నాగరీకాన్తం కుగ్రామలలనా ఇవ॥ ఇతి।

అపి శీతరుచావర్కే సుతీక్ష్ణేఽపీన్దుమండలే।
అప్యధః ప్రసరత్యగ్నౌ జీవన్ముక్తో న విస్మయీ॥
ల. వా. 28, 66

చిదాత్మన ఇమా ఇత్థం ప్రస్ఫురన్తీహ శక్తయః।
ఇత్యస్యాశ్చర్యజాలేషు నాభ్యుదేతి కుతూహలమ్॥
ల. వా. 28, 68

యస్తు వా భావితాత్మాఽపి సిద్ధిజాలాని వాంఛతి।
స సిద్ధిసాధకై ర్ద్రవ్యై స్తాని సాధయతి క్రమాత్॥ ఇతి చ।

భావప్రకాశిక

ధారణా, ధ్యాన, సమాధులు మూడును, మనోవిషయములు గనుక, సంప్రజ్ఞాతసమాధికి అంతరంగములు. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ ప్రత్యాహారములు అయిదు బహిరంగములు— దీనినే సూత్రించుచున్నారు.

"త్రయం అన్తరంగం పూర్వేభ్యః।"

అని. కనుక, ఒకానొకనికి ఏదియో పుణ్యవశముచేత అంతరంగము లగు ధారణా, ధ్యాన, సమాధులు మొదట లభించగా, బహిరంగములు అంతకు పూర్వము సంపాదింపబడకపోయినను,

వానికొరకు అతిప్రయాస చేయనక్కరలేదు. పతంజలి భౌతిక, భూత, తన్మాత్ర, ఇంద్రియ, అహంకారాదులయందు సంయమముచే సంప్రజ్ఞాత, సవికల్ప సమాధులను అనేకవిధములుగా విస్తరించి ఉన్నారు. అయినను, అవి అంతర్ధానాది సిద్ధులకు కారణమగుటవలనను, ముక్తి హేతువగు సమాధికి విరోధులగుట వలనను, వానియందు ఆదరము మాచేత చూపబడలేదు. అట్లే, పతంజలి మహర్షిచే సూత్రింపబడెను.

"తే సమాధౌ ఉపసర్గాః, వ్యుత్థానే సిద్ధయః।"

అవి ముక్తి హేతువగు సమాధికి విఘ్నకరములు. వ్యుత్థానమున (లోకవ్యవహారమున) సిద్ధులు.

"స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణమ్ పునః అనిష్ట ప్రసంగాత్।"

స్థానులు అనగా దేవతలు. ఉద్దాలకుడు దేవతలచే స్వర్గమునకు రావలసినదిగా ఆహ్వానింపబడెను. కాని, వారి ఆహ్వానమును ఆదరింపక, నిర్వికల్పసమాధినే స్వీకరించెను అని ఉపాఖ్యానము కలదు. (ఉద్దాలకుడు ఆ దేవతలతో సంగమును పెట్టుకొనలేదు. వారు పిలిచినందున, తాను గొప్పవాడనని గర్వించలేదు. ఇప్పుడు స్వర్గమునకు వెళ్ళినను, తరువాత క్రిందికి దిగవలసియుండును గదా! అని తలంచెను.) ప్రశ్నోత్తరములచే ఈ విషయమే తెలియబడుచున్నది. శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు–

ఆత్మజ్ఞానులలో శ్రేష్ఠుడవైన ఓ మహర్షీ! జీవన్ముక్తులైన మహానుభావుల శరీరములకు ఆకాశగమనాది శక్తులు గోచరించుట లేదే ?

వసిష్ఠుడు ఇట్లు బదులు చెప్పెను–

ఆత్మవేత్త కానివాడు, ముక్తుడు కానివాడు గూడ, ఆకాశ విహరణాదులను, అణిమాది అష్టసిద్ధులను వాంఛించును. ఓ

రాఘవా! అతడు ద్రవ్యశక్తిచేతను, మంత్రశక్తిచేతను, క్రియాశక్తిచేతను, కాలశక్తిచేతను ఆ ఫలమును పొందుచునే యున్నాడు. ఆత్మజ్ఞునకు ఆకాశగమనాదులు అపేక్షితములు కావు. ఆత్మజ్ఞుడు ఆత్మస్వరూపమునందే దృష్టి ఉంచును. ఆత్మయందే సంతృప్తుడగును. అవిద్య వెంట పరుగిడడు. ఆకాశ విహరణ, అణిమాది సిద్ధిరూపములగు ఏ జగద్భావములు కలవో, అవి అవిద్యామయములు. ఆత్మజ్ఞుడు అవిద్యను విడనాడినవాడు గనుక, ఆ సిద్ధులు, మహిమలలో మునుగడు. ద్రవ్య, మంత్ర, క్రియా, కాలశక్తులు సిద్ధిప్రదములే అగును. కాని, అవి పరమాత్మ పదప్రాప్తికి ఉపకరించవు. అన్ని కోరికలు ఉడిగినతరువాత కాని, ఆత్మలాభము కలుగనేరదు. సిద్ధులను కోరుకొనుటలో నిమగ్నమైన చిత్తము గలవానికి ఆత్మలాభోదయము ఎట్లు కలుగును ? ఈ జగద్భావములు నాగరికుని, కుగ్రామవాసిని అయిన లలన వలె తత్త్వజ్ఞుని రంజింపచేయజాలవు. సూర్యుడు చల్లబడినను, చంద్రమండలము ఉష్ణతాపము కలదైనను, అగ్ని, క్రిందికి ప్రసరించినను, జీవన్ముక్తుడు ఆశ్చర్యమునొందడు. ఈవిధముగా ఈ శక్తు లన్నియు చిదాత్మనుండియే ప్రసరించి ప్రకాశించుచున్నవి అని తలంచి, ఆ ఆశ్చర్యజాలమునందు కుతూహలము కలవాడు కాడు. ఎవడు, ఆత్మభావన చేసియు, సిద్ధిజాలములను వాంఛించుచున్నాడో, అతడు సిద్ధిసాధక ద్రవ్యములచే ఆ సిద్ధులను బడయుచున్నాడు.

### జీవన్ముక్తివివేకః

ఆత్మవిషయస్తు సంప్రజ్ఞాతసమాధి ర్వాసనాక్షయస్య నిరోధసమాధేశ్చ హేతుః। తస్మా దత్రాదరః కృతః।

'అథ పంచమభూమిరూపో నిరోధసమాధి ర్నిరూప్యతే। తం చ నిరోధం సూత్రయతి– 'వ్యుత్థాన నిరోధ సంస్కారయోః

అభిభవప్రాదుర్భావౌ నిరోధక్షణచిత్తాన్వయో నిరోధపరిణామః' 39- ఇతి। వ్యుత్థానసంస్కారాః సమాధివిరోధినః। తే చోద్దాలకస్య సమాధా వుదాహృతాః-

శ్లో॥ కదాఽహం త్యక్తమననే పరమపావనే।
చిరం విశ్రాన్తి మేష్యామి మేరుశృంగ ఇవాంబుదః॥
ఇతి చిన్తాపరవశో బలా దుద్దాలకో ద్విజః।
పునః పునస్తూపవిశ్య ధ్యానాభ్యాసం చకార హ॥
విషయై ర్నీయమానే తు చిత్తే మర్కట చంచలే।
న స లేభే సమాధానే ప్రతిష్ఠాం ప్రీతిదాయినీమ్॥
కదాచిద్ బాహ్యసంస్పర్శ పరిత్యాగా దనన్తరమ్।
తస్యాగచ్ఛ చ్చిత్తకపి రాన్తరస్పర్శసంచయాన్॥
కదాచి దాన్తరస్పర్శాద్ బాహ్యం విషయ మాదదే।
తస్యోడ్డీయ మనో యాతి కదాచిత్ త్రస్తపక్షివత్॥
కదాచి దుదితార్కాభం తేజః పశ్యతి విస్తృతమ్।
కదాచిత్ కేవలం వ్యోమ కదాచి న్నిబిడం తమః॥

ల. వా. 24, 29, 35-39

శ్లో॥ ఆగచ్ఛతో యథాకామం ప్రతిభాసన్ పునః పునః।
అచ్ఛిన న్మనసా శూరః ఖడ్గేనేవ రణే రిపూన్॥
వికల్పౌఘే సమాధానే సోఽపశ్యద్ హృదయాంబరే।
తమశ్ఛన్న వివేకార్కం లోలకజ్జల మేచకమ్॥
తదప్యుత్సాదయామాస సమ్యగ్జ్ఞానవివస్వతా।
తమస్యుపరతే స్వాన్తే తేజఃపుంజం దదర్శ సః।
తల్లులావ స్థలాబ్జానాం వనం బాల ఇవ ద్విపః॥
తేజస్యుపరతే తస్య ఘూర్ణమానం మనో మునేః।
నిశాబ్జవదగా న్నిద్రాం తామప్యాశు లులావ సః॥
నిద్రాప్యపగమే తస్య వ్యోమసంవి త్సముద్యయౌ।

వ్యోమసంవిది నష్టాయాం మూఢం తస్యాభవన్మనః।
మోహ మప్యేష మనస స్తం మమార్జ మహాశయః॥
తత స్తేజ స్తమో నిద్రామోహాది పరివర్జితామ్।
కామప్యవస్థా మాసాద్య విశశ్రామ మనః క్షణమ్॥

ల. వా. 24, 109-114 ఇతి।

త ఏతే వ్యుత్థానసంస్కారా నిరోధహేతునా యోగి ప్రయత్నేన ప్రతిదినం ప్రతిక్షణం చాభిభూయ న్తే, తద్విరోధినశ్చ నిరోధసంస్కారాః ప్రాదుర్భవన్తి। తథా సతి నిరోధ ఏకైకస్మిన్ క్షణే చిత్త మనుగచ్ఛతి। సోఽయ మీదృశ శ్చిత్తస్య నిరోధ పరిణామో భవతి।

**భావప్రకాశిక**

ఆత్మవిషయమగు సంప్రజ్ఞాత సమాధి అయినచో, వాసనా క్షయమునకు, నిరోధసమాధికిని కారణము గనుక, దీనియందు ఆదరము చేయబడినది.

అనంతరము, పంచమ భూమిరూపమగు నిరోధసమాధి నిరూపింపబడుచున్నది-

ఆ నిరోధమును సూత్రించుచున్నారు-

"వ్యుత్థాన నిరోధసంస్కారయోః అభిభవప్రాదుర్భావౌ।
నిరోధక్షణ చిత్తాన్వయః నిరోధపరిణామః।"

వ్యుత్థాన సంస్కారములకు అభిభవము, నిరోధ సంస్కారములకు ప్రాదుర్భావము. నిరోధక్షణమునుండి చిత్తమును అనుసరించునది నిరోధపరిణామము. వ్యుత్థానసంస్కారములు సమాధికి విరోధులు. అవి ఉద్దాలకుని సమాధియందు ఉదాహరింపబడినవి. నేను మేరు శిఖరమున మేఘమువలె పరమ పావనమైన ముక్తపురుషుల యొక్క మననమునందు చిరకాలము ఎప్పుడు విశ్రాంతిని పొంద

గలను? అని బలాత్కారముగా చింతాపరవశుడై ఉద్దాలకుడను బ్రాహ్మడు, మాటిమాటికి కూర్చుండి ధ్యానాభ్యాసమును చేసెను. కోతివలె చంచలమైన చిత్తము విషయములచే దూరముగా తీసికొని పోబడగా, తనకు ప్రీతికరమగు సమాధియందు స్థిరతను అతడు పొందలేకపోయెను. తరువాత ఒకప్పుడు ఈ చిత్తమను కోతి బాహ్యవిషయములను పరిత్యజించినను, అంతరవిషయములందు సంచారము చేసెను. ఒకప్పుడు అంతరవిషయములను వీడనాడినచో, మనస్సు భయపడిన పక్షివలె ఎగిరి బాహ్య విషయములను పట్టుకొనును, ఒకప్పుడు ఉదయించు సూర్యుని పోలిన విస్తారమగు తేజస్సును చూచును. ఒకప్పుడు కేవలము ఆకాశమును, మరియొకప్పుడు కటికచీకటిని చూచును. ఈవిధముగా మాటిమాటికి మనస్సునకు వచ్చు ప్రతిభాసములను శూరుడు ఖడ్గముచే శత్రువులను వలె, మనస్సుచే ఛేదించును. వికల్ప సమూహము, లయము చెందగా, అతడు హృదయాకాశమున, చలించు కాటుకవలె (నిగనిగలాడుట) నల్లని తమస్సుచే కప్ప బడిన వివేక మనెడు సూర్యుని దర్శించును. సమ్యగ్జ్ఞాన సూర్యునిచే ఆ తమస్సును నశింపజేయుగా, హృదయమున తేజః పుంజమును దర్శించును. ఆ తేజస్సును గూడ, ఏనుగు గున్న మెట్టతామరలనువలె నాశమగునట్లు చేయగా, ఇటునటు తిరుగు చున్న మునియొక్క మనస్సు రాత్రియందు పద్మమువలె నిద్రా వశమగును. ఆ నిద్రను గూడ, తొలగించుకొనగా, ఆకాశసంవిత్తు ఉదయించును. తరువాత, ఆ ఆకాశసంవిత్తు కూడ నష్టము కాగా, అతని మనస్సు మోహమును (మూర్ఛను) స్తబ్ధము చెందును. మహాశయుడగు ఆ ఉద్దాలకుడు ఆ మనస్సుయొక్క మోహమును గూడ, శోధించుకొనెను (పోగొట్టుకొనెను). పిమ్మట తేజస్సు, చీకటి, నిద్ర, మోహము మొదలగునవి లేని ఒకానొక అవస్థను

ఆస్వాదించి అతని మనస్సు క్షణకాలము విశ్రాంతి చెందెను.

అ, యీ వ్యుత్థానసంస్కారములు నిరోధహేతువగు యోగి ప్రయత్నముచే ప్రతిదినము, ప్రతిక్షణము అభిభవింపబడు చుండును, వ్యుత్థానసంస్కారములకు విరోధులగు నిరోధ సంస్కారములు ప్రాదుర్భవించుచుండును. అట్లు కాగా, నిరోధము ఒక్కొక్కక్షణమున చిత్తమును అనుసరించుచుండును. ఇట్టి ఈ విరోధము, చిత్తమునకు నిరోధపరిణామము అగుచున్నది.

## జీవన్ముక్తివివేకః

నను 'ప్రతిక్షణ పరిణామినో హి భావా ఋతే చితిశక్తేః' ఇతి న్యాయేన చిత్తస్య సర్వదా పరిణామప్రవాహో వక్తవ్యః। బాఢమ్। తత్ర వ్యుత్థితచిత్తస్య వృత్తిప్రవాహః స్ఫుటః, నిరుద్ధ చిత్తస్య తు కథ మిత్యాశంక్యోత్తరం సూత్రయతి— 'తతః ప్రశాన్తవాహితా సంస్కారాత్' 3-10 ఇతి। యథా సమిధాజ్యా హుతిప్రక్షేపే వహ్ని రుత్తరోత్తరవృద్ధ్యా ప్రజ్వలతి, సమిధాది క్షయే ప్రథమక్షణే కించిచ్ఛామ్యతి, ఉత్తరోత్తరక్షణే శాంతి ర్వర్ధతే తథా నిరుద్ధచిత్తస్యోత్తరోత్తరాధికః ప్రశమః ప్రవహతి। తత్ర పూర్వపూర్వ ప్రశమజనితః సంస్కార ఏవోత్తరోత్తర ప్రశమస్య కారణమ్। తామేతాం ప్రశాన్తవాహితాం భగవాన్ విస్పష్ట ముదాజహార—

శ్లో॥ యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే।
నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥
యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః॥
యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥
సుఖమాత్యన్తికం యత్తద్ బుద్ధిగ్రాహ్య మతీన్ద్రియమ్।

వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః॥
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥
తం విద్యాద్ దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥
భ.గీ. 6, 18-23 ఇతి।

నిరోధసమాధేః సాధనం సూత్రయతి- 'విరామప్రత్యయాభ్యాసపూర్వకః సంస్కారశేషోఽన్యః' 1-18 ఇతి। విరామో వృత్త్యుపరమః, తస్య ప్రత్యయః కారణం వృత్త్యుపరమార్థః పురుషప్రయత్నః, తస్య అభ్యాసః పౌనఃపున్యేన సంపాదనమ్, తత్పూర్వక స్తజ్జన్యః, అనంతరాతీత సూత్రే సంప్రజ్ఞాతసమాధే రుక్తత్వాత్। తదపేక్షయాఽన్యోఽసంప్రజ్ఞాతః సమాధిః తత్ర వృత్తిరహితస్య చిత్తస్వరూపస్య దుర్లక్షత్వాత్ సంస్కారరూపేణ చిత్తం శిష్యతే। విరామప్రత్యయజన్యత్వం భగవాన్విస్పష్టమాహ-

శ్లో॥ సంకల్పప్రభవాన్కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః।
మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥
శనైః శనైః ఉపరమేద్ బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్॥
యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్॥
భ.గీ. 6, 24-26 ఇతి।

## భావప్రకాశిక

ఓయీ!

"ప్రతిక్షణపరిణామినో హి భావాః ఋతే చితిశక్తేః"

చైతన్యశక్తితప్ప, పదార్థములన్నియు ప్రతిక్షణము పరిణామమును చెందునవి అను న్యాయముచే చిత్తమునకు ఎల్లపుడు

పరిణామ ప్రవాహమును చెప్పవలసియున్నది గదా! అవును. లోకవ్యవహారమునందు నిమగ్నమైన చిత్తముగలవానికి చిత్తవృత్తి ప్రవాహము స్పష్టము. చిత్తనిరోధము చేసినవానికి వృత్తి ప్రవాహము ఎటుల సంభవించును? అని శంకించుకొని, తరువాత, సూత్రమును రచించుచున్నారు–

"తతః ప్రశాంతవాహితా సంస్కారాత్"

సమిధలు, ఆజ్యము మొదలగు ఆహుతుల నుంచినపుడు, అగ్ని, ఉత్తరోత్తరము వృద్ధిచెంది, ప్రజ్వలించును. ఆ సమిధాది ఆహుతులు క్షీణించగనే మొదటి క్షణమున, కొంత శమించును. ఉత్తరోత్తర క్షణమున, ఆ శాంతి వర్ధిల్లును. అట్లే చిత్తమును నిరోధించినవారికి ఆ చిత్తవృత్తి ప్రశమము ఉత్తరోత్తరము అధికముగా ప్రవహించును. పూర్వపూర్వ ప్రశమసంస్కారము ఉత్తరోత్తర ప్రశమమునకు కారణము. ఈ 'ప్రశాంతవాహితను' కృష్ణభగవానుడు విస్పష్టముగా ఉదహరించెను.

ఎప్పుడైతే చిత్తము నియమింపబడినదై ఆత్మయందే ఉండునో, ఏ వస్తువును కోరడో, అప్పుడు 'యుక్తః' యుక్తుడు అని చెప్పబడును. యోగాభ్యాసము చేయుచు చిత్తమును నియమించిన యోగికి ఉపమానము గాలిలేనిచోట నిశ్చలముగా నుండు దీపము అయి ఉన్నది. యోగాభ్యాసముచే చిత్తము నిరుద్ధమై ఉపరతిని పొందునో, ఆత్మచేతనే ఆత్మను ఆత్మయందు చూచుచు, ఏ దశయందు సంతోషించుచుండునో, బుద్ధిచే గ్రహింపబడుట్టి అతీంద్రియమగు పరమసుఖమును ఏ దశయందు తత్త్వమునుండి చలించనివాడై గ్రహించనేరడో, దేనిని ఉత్తమ లాభముగా నెంచి, అంతకంటె మరియొకటి అధికమైన లాభముగా తలంచడో, దేనియందుండి ఎంత దుఃఖము వచ్చినను, చలించడో, దుఃఖసంబంధము ఎంతమాత్రము లేనిదానిని 'యోగము' అని

పిలుతురు. ఆయోగము విసుగుచెందని మనస్సుతో నిశ్చయముగా అభ్యసింపనగును.

నిరోధసమాధికి సాధనమును సూత్రించుచున్నారు—

"విరామప్రత్యయాభ్యాసపూర్వకః సంస్కారశేషోఽన్యః।"

చిత్తవృత్తియొక్క ఉపరమమునకు కారణమైన పురుషప్రయత్న అభ్యాసము మాటిమాటికి చేయగా, దానివలన జనించు సంస్కార శేషము నిరోధసమాధికి సాధనము. వెనుకటి సూత్రమున సంప్రజ్ఞాతసమాధి చెప్పబడెను. ఇపుడు చెప్పినది అసంప్రజ్ఞాత సమాధి. చిత్తము వృత్తిరహితమైనది అగోచరముగావున సంస్కార రూపముగా మిగిలియుండును. విరామప్రత్యయము వలన అసంప్రజ్ఞాత సమాధి కలుగును అని శ్రీకృష్ణభగవానుడు కూడ విస్పష్టముగా చెప్పెను—

సంకల్పమువలన కలుగునట్టి కోరికల నన్నిటిని పూర్తిగా విడనాడి, మనస్సుచేతనే ఇంద్రియముల నన్నిటిని, పూర్తిగా నియమించి, నిబ్బరము గల బుద్ధితో మెల్లమెల్లగా వృత్తులను ఉపరమింపజేయవలయును. మనస్సును ఆత్మయందు నిల్పి, మరిదేనిని భావించరాదు. చంచలము, అస్థిరము నగు మనస్సు ఒకవేళ, ఆత్మను వీడి, ఏ విషయము మీదనైయినను, సంచరించు చున్నచో ప్రయత్నముతో ఆ మనస్సును విషయములనుండి వెనుకకులాగి ఆత్మయందే నిలుచునట్లు వశము చేసికొనవలెను అని శ్రీకృష్ణుడు వచించెను.

జీవన్ముక్తివివేకః

కామ్యమానాః స్రక్చందన వనితా పుత్ర మిత్ర గృహ క్షేత్రాదయో మోక్షశాస్త్రకుశల వివేకిజనప్రసిద్ధై ర్బహుభి ర్దోషై రుపేతా అప్యనాద్యవిద్యావశాత్ తాన్దోషా నాచ్ఛాద్య తేషు విషయేషు సమ్యక్త్వం మనః కల్పయతి। తస్మాచ్చ సంకల్పా

ద్విధం ఘ్నే స్వ్యాదిత్యేవంరూపాః కామాః ప్రభవన్తి। తథా చ స్మర్యతే–

శ్లో॥ సఙ్కల్పమూలః కామో వై యజ్ఞాః సంకల్పసంభవాః।
కామ జానామి తే మూలం సఙ్కల్పాత్ కిల జాయసే॥
న త్వాం సంకల్పయిష్యామి సమూలస్త్వం వినంక్ష్యసి॥

ఇతి।

తత్ర వివేకేన విషయదోషేషు సాక్షాత్కృతేషు శునా వాన్తే పాయస ఇవ కామాంస్త్యజన్తే। స్రక్చన్దనాదిష్వివ బ్రహ్మలోకాదిషు అణిమాద్యైశ్వర్యేషు చ కామాస్త్యాజ్యా ఇత్యభిప్రేత్య సర్వానిత్యుక్తమ్। మాన్తోపవాస్త్రవతినాం తస్మిన్నాసేఽన్నే త్యక్తేఽపి కామః పునః పునరుదేతి, తద్వ్యావృత్త్యర్థం మనోగతానిత్యశేషత ఇత్యుక్తమ్। కామత్యాగే మనఃపూర్వక ప్రవృత్త్యభావేఽపి చక్షురాదీనాం రూపాదిషు యా స్వభావసిద్ధా ప్రవృత్తిః సాఽపి ప్రయత్నయుక్తేన మనసైవ నియన్తవ్యా। దేవతాదర్శనాదిష్వప్యనుసరణాయ సతున్త త్, ఇత్యుక్తమ్। భూమికాజయ క్రమేణోపరమస్య వివక్షితత్వాచ్ఛనైః శనైరిత్యుక్తమ్। తాశ్చ భూమికాశ్చ కఠవల్లీషు శ్రూయన్తే–

శ్లో॥ యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని।
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని॥

1–3–13 ఇతి।

వాగ్వ్యాపారో ద్వివిధః– లౌకికో, వైదికశ్చ। జల్పాదిరూపో లౌకికః, జపాదిరూపో వైదికః। తత్ర లౌకికస్య బహువిక్షేప కరత్వాద్ వ్యుత్థానకాలేఽపి యోగీ తం పరిత్యజేత్। అత ఏవ స్మర్యతే–

శ్లో॥ మౌనం యోగాసనం యోగస్తితిక్షైకాన్తశీలతా।
నిఃస్పృహత్వం సమత్వం చ సప్తైతాన్యేకదండినః॥ ఇతి॥

జపాదికం నిరోధసమాధౌ పరిత్యజేత్। సేయం వాగ్భూమిః ప్రథమా। తాం భూమిం ప్రయత్నమాత్రేణ కతిపయైః దినైర్మాసైర్వత్సరైర్వా దృఢం విజిత్య పశ్చాద్ ద్వితీయాయాం మనోభూమౌ ప్రయతేత; అన్యథా బహుభూమికాప్రాసాదవత్ ప్రథమభూమిపాతే నైవోపరితన యోగభూమయః సర్వా వినశ్యేయుః। యద్యపి చక్షురాదయో నిరోద్ధవ్యాః, తథాఽపి తేషాం వాగ్భూమౌ మనోభూమౌ వాఽన్తర్భావో ద్రష్టవ్యః।

భావప్రకాశిక

కామములు, అనగా కామ్యమానములు- కోరబడునవి. స్రక్చందన, వనితా, పుత్ర, మిత్ర, గృహ, క్షేత్రాదులు. మోక్షశాస్త్ర కుశలులు అయిన వివేకిజనుల ప్రసిద్ధిచే బహుదోషములతో కూడినవి అయినను, అనాది అవిద్యవలన ఆ దోషములను గ్రహింపనేరక, ఆచ్ఛాదింపబడుటచే ఆ విషయములందు సమ్యక్త్వబుద్ధియే -బాగున్నది అను బుద్ధియే జనులు కలిగి యున్నారు, కల్పించుకొనుచున్నారు. అందువలన, 'ఇది నాకు కావలయును' అను రూపముగా ఈ కామములు పుట్టుచున్నవి. ఈ కామములను గూర్చి స్మృతియందు ఇట్లు చెప్పబడినది:-

"సంకల్పమూలాః కామా వై యజ్ఞాః సంకల్పసంభవాః।
కామ జానామి తే మూలం సంకల్పాత్కిల జాయసే॥"

కామము సంకల్పమువలన జనించును. యజ్ఞములు సంకల్పముచేతనే అనుష్ఠింపబడును. ఓ కామమా! నీ మూలమును నేను ఎరుగుదును. సంకల్పమువలన కదా నీవు పుట్టుచున్నావు.

నేను నిన్ను సంకల్పమునే చేయను. అప్పుడు నీవు సమూలముగా నశించగలవు.

వివేకముచేత విషయములందలి దోషములు సాక్షాత్కరించు కొనబడగా, కుక్కచే క్రక్కబడిన పాయసమునందువలె కోరికలు

విడనాడబడుచున్నవి. స్రక్చందన వనితాది విషయములందు వలెనే బ్రహ్మలోకాదులందును, అణిమాది అష్టైశ్వర్యములందును గూడ కోరికలు విడనాడదగినవి అను అభిప్రాయముతో 'సర్వాన్' అని చెప్పబడినది. ఒక మాసము ఉపవాసము చేయుదును అని వ్రతము పట్టినవాడు ఆ మాసము అన్నము విడనాడినను, తరువాత మరల అన్నమునందు కోరిక జనించుచునే యున్నది. అట్లు త్యక్తమైనదానియందు మరల కోరిక జనించకూడదు అని తెలుపుటకు 'అశేషతః' అని చెప్పబడినది. కామమును వదలి నప్పుడు, మనఃపూర్వకముగా ప్రవృత్తి లేకపోయినను, చక్షు రాదులకు రూపాదివిషయములందు స్వభావసిద్ధముగా ప్రవృత్తి ఉండును. ఆ ప్రవృత్తిని గూడ, మనస్సుచేతనే ప్రయత్న పూర్వకముగ వారించవలయును. దేవతాదర్శనాదులందు గూడ, (దేవాలయ) అనుసరణమును వారించుటకొరకు భూమికాజయ క్రమముతో ఈ ఉపరమమును అభ్యసింపవలెను అను తలంపుతో 'శనైః శనైః' అని చెప్పబడెను. ఆ భూమికలు నాలుగు కఠవల్లి అందు వినబడుచున్నవి.

"యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని।
జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే త్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని॥"

వివేకి వాక్కును, మనస్సునందు నియమింపవలెను. ఆ మనస్సును ప్రకాశశీలమగు బుద్ధ్యాత్మయందు నియమించవలెను. ఆ బుద్ధిని సమష్టి బుద్ధితత్త్వమగు మహదాత్మయందు నియమించవలెను. ఆ మహదాత్మను శాంతాత్మయందు నియమించవలెను అని కఠవల్లి.

వాగ్వ్యాపారము రెండు విధములు. లౌకికము, వైదికము. జల్పము మొదలైన వ్యర్థసంభాషణము లౌకికము. జపాదికము,

వైదికము. వానిలో లౌకిక జల్పవాగ్వ్యాపారము చాల విక్షేపము కలిగించును గనుక, వ్యుత్థానకాలమునందు గూడ, (సమాధి చాలించి దేహస్ఫురణతో ఉండుకాలము) యోగి ఆ లౌకిక వ్యాపారమును పరిత్యజించవలెను. కనుకనే, స్మృతియందు ఇట్లు చెప్పబడినది– ఏకదండి సంన్యాసికి మౌనము, యోగాసనము, యోగము, తితిక్ష, ఏకాంతవాస స్వభావము, వీతరాగత మరియు సమత్వము– ఈ యేడును ఆచరింపదగినవి. వైదికమగు జపాదికము సంన్యాసి, నిరోధసమాధికాలమున, పరిత్యజించవలెను. ఈ వాగ్భూమిక మొదటిది.

ఆ భూమికను ప్రయత్నముతో కొన్ని రోజులో, మాసములో, వత్సరములో దృఢముగా జయించినతరువాత రెండవ మనోభూమికలో ప్రవేశించవలెను. అట్లు కానిచో, అనేకము లగు అంతస్తులు గల మేడను అధిరోహించుటకు ప్రథమభూమిక గట్టిపడనిచో పై భూమికలకు చేరనివిధముగా యోగభూములలో గూడ, ఒక్కొక్క భూమికను దృఢముగా అభ్యసించి, పై పై భూమికలకై ప్రయత్నించవలెను. అట్లు కానిచో, పై భూమికలు నిలబడవు. విచారించగా, వాక్కునువలె చక్షురాదులను గూడ, నిరోధించవలయును. కాని, ఆ చక్షురాది నిరోధములు వాగ్భూమిలో గాని, లేదా మనోభూమిలో గాని అంతర్భావములని తలంచ వలెను.

జీవన్ముక్తివివేకః

నను వాచం మనసి నియచ్ఛే దిత్యనుపపన్నమ్; న హి ఇంద్రియస్యేంద్రియాన్తరే ప్రవేశోఽస్తి। మైవమ్, ప్రవేశస్యా వివక్షితత్వాత్। నానా విక్షేపకారిణో ర్వ్యాఞ్జనసయోర్మధ్యే ప్రథమతో వాగ్వ్యాపారనియమనేన మనోవ్యాపారమాత్రపరిశేష ఇహ వివక్షితః। గోమహిషాశ్వాదీనామివ వాఙ్నియమే స్వాభావికే

సంపన్నే తతో జ్ఞానాత్మని మనో నియచ్ఛేత్। ఆత్మా త్రివిధః, జ్ఞానాత్మా, మహాత్మా, శాంతాత్మా చేతి। జ్ఞానాత్మ్యత్ర స్థిత ఆత్మేతి జ్ఞాతృత్వోపాధి రహంకారోఽత్ర జ్ఞానశబ్దేన వివక్షితః, కరణస్య మనసో నియమత్వేన పృథగుపాత్తత్వాత్। అహంకారో ద్వివిధః- విశేషరూపః, సామాన్యరూపశ్చేతి। 'అహమేతస్య పుత్రః' ఇత్యేవం వ్యక్తి మభిమన్యమానో విశేషరూపః। 'అస్మి' ఇత్యేతావన్మాత్ర మభిమన్యమానః సామాన్యరూపః। స చ సర్వవ్యక్తిషు వ్యాప్తత్వా న్మహానిత్యుచ్యతే। తాభ్యా మహంకారాభ్యాం ద్వాభ్యా ముపహితౌ ద్వావాత్మానౌ। నిరుపాధికః శాన్తాత్మా। తదేతత్సర్వ మన్తర్బహి ర్భావేన వర్తతే। శాన్త ఆత్మా సర్వాన్తరః చిదేకరసః। తస్మి న్నాశ్రితం జడశక్తిరూప మవ్యక్తం మూలప్రకృతిః। సా చ ప్రథమం సామాన్యాహంకారరూపేణ మహత్తత్త్వనామ్నా వ్యక్తీ భవతి। తతో బహిర్వాగాదీంద్రియరూపేణ। తదేతదభిప్రేత్య ఉత్తరోత్తర మాన్తరత్వం వివినక్తి శ్రుతిః-

శ్లో॥ ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహాన్పరః॥
మహతః పర మవ్యక్త మవ్యక్తాత్ పురుషః పరః।
పురుషా న్నపరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః॥

కఠ. ఉ. 1, 3, 10-11 ఇతి।

ఏవం సత్యత్ర నానావిధ సంకల్ప వికల్పసాధనం కరణ రూపం మనోఽహంకర్తరి నియచ్ఛేత్। మనోవ్యాపారా న్పరిత్య జ్యాహంకారమాత్రం శేషయేత్। న చైతదశక్యమితి వాచ్యమ్,

శ్లో॥ తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥

భ. గీ. 6, 34

ఇతి వదన్త మర్జునం ప్రతి భగవతోత్తరాభిధానాత్-

శ్లో॥ 'అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।

అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః॥
భ. గీ. 6, 35-36 ఇతి।

భావప్రకాశిక

ఓయీ! 'వాచం మనసి నియచ్ఛేత్' వాక్కును మనస్సులో చేర్చవలెను అనుట అనుపపన్నము (సరిగాదు, యుక్తి యుక్తము కాదు). ఒక ఇంద్రియము మరియొక ఇంద్రియములో ప్రవేశించదు కదా! అట్లు కాదు. ఇచట, ప్రవేశము వివక్షితము కాదు. నానా విక్షేపములను కలిగించు వాఙ్మనస్సులలో మొదట వాగ్వ్యాపారమును నియమించుటచే మనోవ్యాపారము మాత్రమే మిగిలిఉండునట్లుచేయుట ఇచట వివక్షితము. గోమహిషాశ్వాదులకువలె వాఙ్నియమము స్వాభావికము కాగా, అప్పుడు జ్ఞానాత్మయందు మనస్సును నియమించవలయును.

జ్ఞానాత్మ, మహాత్మ, శాంతాత్మ అని ఆత్మ మూడు విధములు. నేను ఇచ్చటఉండి తెలిసికొనుచున్నాను అను జ్ఞాతృత్వమునకు ఉపాధియగు అహంకారము ఇచట 'జ్ఞానాత్మ' శబ్దముచేత వివక్షితము. కరణమగు మనస్సు, నియమింపబడునట్లుగా వేరుగా పూర్వమే చెప్పబడినది. అది జ్ఞానాత్మ కాదు. అహంకారము రెండు విధములు. విశేషరూపము కలది, సామాన్యరూపముతో ఉన్నది. నేను వీరి కుమారుడను అనురీతిగా వ్యక్తిస్వరూపమును అభిమానించు అహంకారము విశేషరూపము. 'ఉన్నాను' అను రూపముతో అభిమానింపబడు అస్మిత 'అస్మిభావః అస్మితా' సామాన్యరూపము. ఈ సామాన్యరూపము వ్యక్తులందరియందు వ్యాపించి ఉండుటవలన, 'మహాన్' అని చెప్పబడుచున్నది. ఆ రెండు అహంకారములతోను ఉపహితము

లగు (ఉపాధితోకూడినవి) ఆత్మలు రెండు (విశేషం జ్ఞానాత్మ, సామాన్యం మహాత్మ). ఉపాధి లేనట్టి శుద్ధమైన ఆత్మ, శాంతాత్మ. ఇది అంతయు బహిరంతర్భావముతో ఉండును. శాంతాత్మ, సర్వాంతరము, చిదేకరసము. ఆ శాంతాత్మను ఆశ్రయించుకొని జడశక్తిరూపమగు అవ్యక్తము, మూలప్రకృతి అయి ఉన్నది. ఆ మూలప్రకృతియే, మొదట సామాన్యాహంకార రూపమగు మహత్తత్త్వము అను నామమును ధరించి ప్రకటము (వ్యక్తము) అగుచున్నది. పిమ్మట, బాహ్యమగు విశేషాహంకార రూపముతోను, అంతకంటె బాహ్యమగు మనోరూపముతోను, పిమ్మట బాహ్య వాగాదింద్రియరూపముతోను ప్రకటమగుచున్నది. ఈ అభి ప్రాయముతోనే శ్రుతి ఉత్తరోత్తరము ఆంతరత్వమును వివేచనతో చెప్పుచున్నది–

> "ఇన్ద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః।
> మనసస్తు పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః॥
> మహతః పర మవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః।
> పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరా గతిః॥"

ఇంద్రియములు విషయములకంటె శ్రేష్ఠములు. ఇంద్రియములకంటె మనస్సు శ్రేష్ఠము. మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠము. బుద్ధికంటె సామాన్య సమష్టిరూపమగు మహాత్మ శ్రేష్ఠము. మహాత్మకంటె అవ్యక్తము శ్రేష్ఠమైనది. జడమగు ఆ అవ్యక్తముకంటె చేతనుడగు పురుషుడు గొప్పవాడు. పురుషుని కంటె శ్రేష్ఠమైనది ఏదియు మరియొకటి లేదు. అదియే పర్యవ సానము, ఆ పురుషుడే గమ్యము.

ఇట్లయినచో, ఇచట నానావిధ సంకల్ప, వికల్పసాధన కరణమగు మనస్సును అహంకర్తయందు నియమించవలెను (చేర్చవలెను). అనగా, మనోవ్యాపారమును వదలిపెట్టి– అరికట్టి,

అహంకారమాత్రమును శేషింపజేయవలయును. ఇది అశక్యము కాదా? అని అనరాదు. వాయునిగ్రహమువలె మనోనిగ్రహము దుష్కరము అని పలికిన అర్జునుని గూర్చి కృష్ణభగవానుడు ఇట్లు ఉత్తరము చెప్పెను—

మహాబాహో! చంచలమగు మనస్సును నిగ్రహించుట కష్టతరమే. సంశము లేదు. అయినను, ఓ కౌంతేయా! అభ్యాసము చేతను, వైరాగ్యముచేతను మనస్సు నిగ్రహింపబడుచున్నది. మనస్సు వశములో లేనివానికి యోగము అందుబాటులో ఉండదు. మనస్సును స్వాధీనము చేసికొనినవానిచే ఉపాయముతో ప్రయత్నించినచో యోగము లభ్యమగును అని నా అభిప్రాయము అని చెప్పెను.

జీవన్ముక్తివివేకః

అభ్యాసవైరాగ్యే పతంజలిసూత్రోదాహరణేన వ్యాఖ్యాస్యేతే। పూర్వపూర్వభూమిదార్ఢ్యరహితో ఽసంయతాత్మా। తత్సహితో వశ్యాత్మా। ఉపాయతః ప్రాప్తిం గౌడపాదాచార్యాః సదృష్టాన్త మాహుః—

శ్లో॥ ఉత్సేక ఉదధే ర్యద్వత్ కుశాగ్రేణైకబిన్దునా।
మనసో నిగ్రహ స్తద్వద్ భవే దపరిఖేదతః॥ 3, 41 ఇతి।

శ్లో॥ బహుభి ర్న విరోద్ధవ్య మేకేనాపి బలీయసా।
స పరాభవ మాప్నోతి సముద్ర ఇవ టిట్టిభాత్॥

అత్ర సంప్రదాయవిద ఆఖ్యాయికా మాచక్షతే— కస్యచిత్కిల పక్షిణోఽణ్డాని తీరస్థా న్యుదధి రుత్సేకేనాపజహార। తంచ సముద్రం శోషయామీతి ప్రవృత్తః స చ పక్షీ స్వముఖాగ్రేణ ఏకైకం జలబిన్దుం బహిః ప్రక్షిపతి స్మ। తదా బహుభిః పక్షిభి ర్బన్ధువర్గై ర్వార్యమాణోఽప్యనుపరతః, ప్రత్యుత తానపి సహకారిణో వవ్రే। తాంశ్చ పతనోత్పతనాభ్యాం బహుధా క్లిశ్యతః సర్వా నవలోక్య

కృపాలు ర్నారదో గరుడం సమీపే ప్రేషయామాస। తతో గరుడ పక్షవాతేన శుష్య న్సముద్రో భీత స్తాన్యణ్డాన్యానీయ పక్షిణో దదౌ। ఏవ మఖేదేన మనోనిరోధే పరమధర్మే ప్రవర్తమానం యోగిన మీశ్వరోఽనుగృహ్ణాతి। అఖేదశ్చ మధ్యే మధ్యే తదనుకూల వ్యాపారమిశ్రణేన సంపద్యతే, యథౌదనం భుంజానః తత్తద్ గ్రాసాన్తరే చోష్య లేహ్యాదీ నాస్వాదయతి తద్వత్।

ఇదమేవాభిప్రేత్య వసిష్ఠ ఆహ–

శ్లో॥ చిత్తస్య భోగై ర్ద్వౌ భాగౌ శాస్త్రేణైకం ప్రపూరయేత్।
గురుశుశ్రూషయా భాగ మవ్యుత్పన్నస్య సత్క్రమే॥
కించిద్ వ్యుత్పత్తియుక్తస్య భాగం భోగైః ప్రపూరయేత్।
గురుశుశ్రూషయా భాగౌ భాగం శాస్త్రార్థచిన్తయా॥
వ్యుత్పత్తి మనుయాతస్య పూరయే చ్చేతసోఽన్వహమ్।
ద్వౌ భాగౌ శాస్త్రవైరాగ్యైః ద్వౌ ధ్యానగురుపూజయా॥
ల.వా. 21, 36–38 ఇతి।

భోగశబ్దేనాత్ర జీవనహేతు ర్భిక్షాటనాది వ్యాపారో వర్ణాశ్రమోచిత వ్యాపారశ్చోచ్యతే। ఘటికామాత్రం ముహూర్తం వా యథాశక్తి యోగ మభ్యస్య తతో ముహూర్తం శాస్త్రశ్రవణేన పరిచర్యయా వా గురూ ననుగమ్య ముహూర్తం స్వదేహ మనుసృత్య ముహూర్తం యోగశాస్త్రం పర్యాలోచ్య పునర్ముహూర్తం యోగ మభ్యస్యేత్। ఏవం యోగప్రాధాన్యేన వ్యాపారా న్తరాణి మేలయం స్తాని ప్రాగభ్యస్య శయనకాలే తద్దినగతాన్ యోగముహూర్తాన్ గణయేత్। తతః పరేద్యుర్వా పరే పక్షే వా పరమాసే వా యోగముహూర్తాన్ వర్ధయేత్। తథా చైకైకస్మి న్ముహూర్త ఏకైకక్షణయోగేఽపి సంవత్సరమాత్రేణ భూయా న్యోగకాలో భవతి। న చైవం యోగైకశరణత్వే

వ్యాపారాన్తరాణి లుప్యేరన్నితి శంకనీయమ్।

**భావప్రకాశిక**

అభ్యాసవైరాగ్యములు పతంజలి, సూత్ర ఉదాహరణముల చేతనే వ్యాఖ్యానము చేయబడగలవు. పూర్వపూర్వ భూమికలను జయించకుండా ఉత్తరభూమికలకొరకు ప్రయత్నించువాడు 'అసంయతాత్మ'. క్రమముగా పూర్వపూర్వ భూమికలను అధిరోహించి, ఉత్తరభూమికలకై ప్రయత్నించువాడు 'వశ్యాత్మ' (సంయతాత్మ). ఉపాయముచే మనస్సు వశమగుటను, గౌడపాచాచార్యులు సోదాహరణముగా చెప్పుచున్నారు-

కుశాగ్రముతో సముద్రముయొక్క ఒక్కొక్క బిందువుచే నీరు పైకి తీయుట ఏవిధముగా జరుగునో, మనోనిగ్రహము కూడ, ప్రయాసలేకుండ ఆ విధముగానే సంపాదింపనగును.

తాను బలవంతుడైనను, ఒక్కడు పలువురితో విరోధమును పెట్టుకొనరాదు. వాడు టిట్టిభమువలన సముద్రము వలె పరాభవమును పొందును.

ఇచట, సంప్రదాయజ్ఞులు ఒక ఆఖ్యాయికను చెప్పుదురు. తీరమునందున్న ఒక పక్షియొక్క గ్రుడ్లను సముద్రుడు గర్వముచే వెల్లువతో అపహరించెను. 'ఆ సముద్రమును శుష్కింప జేయుదును' అను పట్టుదలతో ఆ పక్షి ప్రవర్తించి, తన ముక్కు కొనతో ఒక్కొక్క జలబిందువును సముద్రమునుండి ఒడ్డున ఉంచుచుండెను. అప్పుడు, బంధువర్గములో చేరిన బహుపక్షులచే వారింపబడినను, తన ప్రయత్నమును చాలింపక, వారిని గూడ, సహాయము చేయుటకు రండు అని కోరెను. ఆ పక్షులన్నియు, పడుచు, పైకిలేచుచు కష్టపడుచుండెను. ఆ పక్షులను చూచి, దయాళువగు నారదుడు గరుడుని, ఆ పక్షుల వద్దకు పంపెను. పిమ్మట, గరుత్మంతునియొక్క రెక్కల గాలికి ఎండిపోవుచున్న

సముద్రము భయపడినదై ఆ గ్రుడ్లను తెచ్చి పక్షికిచ్చెను. ఈ విధముగ విసుగు చెందక, మనోనిరోధరూపమగు పరమ ధర్మము నందు ప్రవర్తించు యోగిని ఈశ్వరుడు అనుగ్రహించుచున్నాడు.

శ్రమ లేకపోవుట– విసుగుచెందకపోవుట, మధ్యే మధ్యలో అనుకూలవ్యాపారమును జోడించుటచే కలుగును. ఎట్లనగా–

అన్నమును భుజించువాడు ముద్దకు, ముద్దకు మధ్య చోష్యమును, లేహ్యమును ఆస్వాదించుటవలన, తృప్తిగా అన్నమును భుజించును. ఈ అభిప్రాయముతోనే వసిష్ఠుడు కూడ చెప్పుచున్నాడు–

చిత్తమునకు భోగములచేత రెండు భాగములు కలవు. శాస్త్రముచేత ఒక భాగమును పూరించుకొనవలెను. గురుశుశ్రూష చేత ఒక భాగమును పూరింపవలెను. అవ్యుత్పన్ననకు గురు శుశ్రూష వలన ఈ భాగము సంక్రమించును.

అల్పమైన వ్యుత్పత్తి కలవానికి భోగముచేత ఒక భాగమును పూరించవలెను. గురుశుశ్రూషచేత భాగము, అనగా శాస్త్రార్థ విమర్శచేత భాగము అని గ్రహించవలెను. బాగుగా శాస్త్ర వ్యుత్పత్తి కలవాడు మనస్సుయొక్క రెండు భాగములను ప్రతి దినము పూరించవలెను. శాస్త్ర, వైరాగ్యములచేత రెండు భాగములు, ధ్యాన, గురుపూజలతో రెండు భాగములు పూరించ వలెను.

ఇచట 'భోగ' శబ్దముచేత ప్రాణములు నిలుచుటకు కారణ మైన భిక్షావ్యాపారము, వర్ణాశ్రమోచిత వ్యాపారము గ్రహింప నగును. ఒక ఘడియ, లేదా ముహూర్తకాలము యథాశక్తి యోగము నభ్యసించి, పిమ్మట ముహూర్తకాలము శాస్త్రశ్రవణము చేతను, పరిచర్యచేతను గురువులను సమీపించి, ముహూర్త

కాలము తన దేహము ననుసరించి, తరువాత ఒక ముహూర్త కాలము యోగశాస్త్ర పర్యాలోచనము చేసి, మరల ఒక ముహూర్తము యోగము అభ్యాసము చేయవలెను. ఈవిధముగా యోగమును ప్రధానముగా చేసి, ఇతర వ్యాపారములను మధ్యలో మేళవించి, వానిని శీఘ్రముగా అభ్యసించి తాను శయనించు సమయమున, ఆ దినమునందు ఎన్ని ముహూర్తముల కాలము యోగమును అభ్యసించినది గణన చేయవలెను. తరువాత, మరునాడు గాని, తరువాతి పక్షమునందు గాని, తదనంతర మాసమునందుగాని, యోగముహూర్తములను వృద్ధి చెందింప వలెను. అట్లు కాగా, ఒక్కొక్క ముహూర్తమున ఒక్కొక్క క్షణము అధికముగా కలసినను, పూర్తి సంవత్సరకాలమునకు యోగకాల విస్తారము అధికమగును. ఓయీ! ఈవిధముగా యోగమునే శరణు పొందినచో, తక్కిన వ్యాపారములు లోపించిపోవును అని శంకించరాదు.

జీవన్ముక్తివివేకః

లుప్తేతర కృత్స్నవ్యాపారస్యైవ యోగేఽధికారాత్। అత ఏవ విద్వత్సంన్యాసోఽపేక్ష్యతే। తస్మాత్ తదేకనిష్ఠః పుమానధ్యేతృ వణిగాదివత్ క్రమేణ యోగారూఢో భవతి। యథాఽధ్యేతా మాణవకః పాదాంశం పాద మర్ధర్చ మృచ మృగ్ద్వయం వర్గం చ క్రమేణ పఠన్ దశ ద్వాదశవర్షై రధ్యాపకో భవతి, యథా చ వాణిజ్యం కుర్వన్నేకనిష్క ద్వినిష్కాది క్రమేణ లక్షపతిః కోటిపతిర్వా భవతి తథా తాభ్యాం వణిగధ్యేతృభ్యాం సహైవో పక్రమ్య మత్సరగ్రస్త ఇవ యుంజాన స్తావతా కాలేన కుతో న యోగమారోహేత్? తస్మాత్ పునః పునః ప్రాప్యమాణా న్సంకల్ప వికల్పా నుద్దాలకవత్ పౌరుషప్రయత్నేన పరిత్యజ్యాహంకర్తరి జ్ఞానాత్మని మనో నియచ్ఛేత్। తామేతాం భూమికాం విజిత్య బాల

మూలాదివ న్నిర్మనస్త్వే స్వాభావికే సతి, తతో విశేషాహంకార రూపం విస్పష్టం జ్ఞానాత్మాన మస్పష్టే సామాన్యాహంకారే మహత్తత్త్వే నియచ్ఛేత్। యథా స్వల్పాం తంద్రాం ప్రాప్తవతో విశేషాహంకారః స్వత ఏవ సంకుచతి, వినైవ తంద్రాం తథా విస్మరణే ప్రయతమానస్యాహంకారసంకోచో భవతి। సేయం లోక ప్రసిద్ధయా తన్ద్రియా తార్కికాభిమత నిర్వికల్పకజ్ఞానేన చ సమానా మహత్తత్త్వమాత్రపరిశేషావస్థా తృతీయా భూమిః। అస్యాం చాభ్యాసపాటవేన వశీకృతాయాం తమేతం సామాన్యాహంకారరూపం మహాన్త మాత్మానం నిరుపాధికతయా శాన్తే చిదేకరసస్వభావే నియచ్ఛేత్।

శ్లో॥ మహత్తత్త్వం తిరస్కృత్య చిన్మాత్రం పరిశోషయేత్।

అత్రాపి పూర్వోక్త విస్మృతిప్రయత్న ఏవ తతోఽప్యతిశయేనోపాయతా మాపద్యతే। యథా శాస్త్రాభ్యాస ప్రవృత్తస్య వ్యుత్పత్తేః ప్రాక్ ప్రతిగ్రన్థవ్యాఖ్యానాపేక్షాయామపి వ్యుత్పన్నస్య స్వత ఏవోత్తరగ్రన్థార్థః ప్రతిభాతి, తథా సమ్యగ్వశీకృత పూర్వభూమే ర్యోగిన ఉత్తరభూమ్యుపాయః స్వత ఏవ ప్రతిభాతి। తదాహ యోగభాష్యకారః-

శ్లో॥ యోగేన యోగో జ్ఞాతవ్యో యోగో యోగాత్ ప్రవర్తతే।
యోఽప్రమత్తస్తు యోగేన స యోగీ రమతే చిరమ్॥ ఇతి।

నను మహత్తత్త్వ శాన్తాత్మనో ర్మధ్యే మహత్తత్త్వోపాదాన మవ్యక్తాఖ్యం తత్త్వం శ్రుత్యోదాహృతమ్। తత్ర కుతో నియమనం నాభిధీయత ఇతి చేన్న, లయప్రసంగాదితి బ్రూమః। యథా ఘటోఽనుపాదానే జలే నిరుధ్యమానో న లీయతే ఉపాదానభూతాయాం తు మృది లీయతే, తథా మహత్తత్త్వ మాత్మని న లీయతే, అవ్యక్తే తు లీయతే। న చ స్వరూపలయః పురుషార్థః, ఆత్మదర్శనానుపయోగాత్। 'దృశ్యతే త్వగ్ర్యయా

బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః' ఇతి పూర్వవాక్యే ఆత్మదర్శనం విధాయ సూక్ష్మత్వసిద్ధయే నిరోధస్యాభిధానాత్, లయస్య ప్రతిదినం సుషుప్తౌ స్వతః సిద్ధత్వేన ప్రయత్నవైయర్థ్యాచ్చ।

భావప్రకాశిక

అన్ని పనులు మానుకొన్నవారికే యోగమునందు అధికారము. ఇందువలననే విద్వత్సంన్యాసము అపేక్షిత మగుచున్నది. కనుక, పురుషుడు వేదాధ్యయన, వాణిజ్యాదులు చేయువానివలె తదేకనిష్ఠుడగుచో, క్రమముగా యోగారూఢుడగును. ఎట్లనగా, అధ్యయనము చేయు మాణవకుడు ఋక్కులో ఒక పాదమును, అర్ధమును, ఋక్కును, రెండు ఋక్కులను క్రమముగా పఠించుచు పద్రెండు వత్సరములకు అధ్యాపకుడగుచున్నాడు. అట్లే, వ్యాపారము చేయువాడు ఒక పైసను, రెండు పైసలను క్రమముగా గడించి, లక్షాధికారి, లేదా కోటీశ్వరుడు అగుచున్నాడు. అట్లే, ఆ అధ్యేతృ, వణిక్కులవలె తన పనిని మొదలుపెట్టి, వారితో పోటీపడునట్లుగా యోగసాధన చేసినచో, అంతకాలములో ఏల యోగారూఢుడు కానేరడు ? అందువలన, మాటిమాటికి వచ్చు సంకల్ప, వికల్పములను ఉద్దాలకునివలె పురుషప్రయత్నముతో పరిత్యజించి, అహంకర్తయగు జ్ఞానాత్మయందు మనస్సును నియమించవలయును. ఆ యీ రెండవ భూమికను జయించి, బాలురవలె, మూగవారివలె నిర్మనస్కత, స్వభావసిద్ధము కాగా, పిమ్మట విశేష అహంకార రూపమగు ఈ జ్ఞానాత్మను సామాన్యాహంకారరూపమగు మహత్తత్త్వమునందు నియమించవలెను. ఎట్లనగా, కొద్ది కునికిపాటు పొందుచున్నవానికి విశేషాహంకారము స్వయముగానే సంకోచము పొందును. అట్టి కునికిపాటులేకయే విశేషాహంకార విస్మరణమునకై

ప్రయత్నించువానికి అహంకార సంక్షోభము కలుగును. ఇది, లోకప్రసిద్ధమగు కునికిపాటుతోను, తార్కికులకు అభిమతమగు నిర్వికల్పక జ్ఞానముతోను సమానమైనది. సామాన్యాహంకార రూపమగు ఈ మహత్తత్త్వమాత్ర పరిశేషావస్థ మూడవ భూమిక అయి ఉన్నది. అభ్యాసపాటవముచేత ఈ భూమిక వశము కాగా, ఆ యీ సామాన్యాహంకారరూపమగు మహాత్మను నిరుపాధికము, చిదేకరసస్వభావము, శాంతమును అగు ఆత్మయందు నియమింప వలెను. మహత్తత్త్వమును లయింపజేసి, చిన్మాత్రమే మిగులునట్లు చేయవలయును.

ఇచట గూడ, వెనుక చెప్పిన విస్మృతిప్రయత్నమే ఎక్కువగా ఉపాయభావమును పొందుచున్నది. ఎట్లనగా, శాస్త్రా భ్యాసమునందు ప్రవృత్తుడగువానికి వ్యుత్పత్తికి పూర్వము గ్రంథమునందు ప్రతి భాగమునకు వ్యాఖ్యానాపేక్ష ఉన్నను, వ్యుత్పన్నుడైనవానికి స్వయముగానే ఉత్తరగ్రంథార్థము భాసించుచుండును. అట్లే క్రమముగా పూర్వపూర్వ భూమికలు వశమైన యోగికి ఉత్తరోత్తర భూమికోపాయము స్వయముగానే భాసించు చుండును. యోగభాష్యకారుడు ఇట్లు చెప్పెను—

"యోగేన యోగో జ్ఞాతవ్యో యోగో యోగాత్ప్రవర్తతే।
యోఽప్రమత్తస్తు యోగేన స యోగీ రమతే చిరమ్॥"

యోగముచే (యోగము=ఉపాయము) యోగమును తెలిసికొన వలెను. ఒక యోగము నుండి మరొక యోగము ప్రవర్తించును. ఏమరుపాటు లేని యోగి చిరకాలము యోగముచేత ఆనందించును.

ఓయీ! మహత్తత్త్వ, శాంతాత్మల మధ్యలో మహ త్తత్త్వమునకు ఉపాదానమగు అవ్యక్తము శ్రుతియందు ఉద హరింపబడినది. ఆ అవ్యక్తమునందు నియమనము ఏల చెప్పబడ లేదు? అట్లు కాదు. ప్రకృతిలయము ప్రసక్తమగును గనుక అని

సమాధానము చెప్పుచున్నాము. ఏవిధముగా ఘటము ఉపాదాన కారణముకాని జలమునందు నిరోధింపబడినచో, లయము చెందదు. ఉపాదానమయిన మృత్తుయందయినచో ఆ ఘటము లయమగును అదేవిధముగా మహత్తత్త్వము ఆత్మయందు లయము చెందదు. అవ్యక్తమునందైనచో, లయము చెందును. స్వరూపలయము మహత్తత్త్వమునకు పురుషార్థము కాదు కదా! ఏలన, ఆత్మ దర్శనమునకు ఉపయోగించదు.

"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అను పూర్వవాక్యమునందు ఆత్మదర్శనమును విధించి, సూక్ష్మత్వసిద్ధికై నిరోధము చెప్పబడుచున్నది. ప్రతి దినము సుషుప్తియందు అహంకారమునకు ప్రకృతిలయము స్వతఃసిద్ధమై లభించుటచేత ఆ ప్రకృతిలయము కొరకు ప్రయత్నము వ్యర్థము.

## జీవన్ముక్తివివేకః

నను ధారణాధ్యానసమాధిభిః సాధ్యస్య సంప్రజ్ఞాతస్యైకాగ్ర్య వృత్తిరూపత్వేన దర్శనహేతుత్వేఽపి శాంతాత్మన్యవరుద్ధ స్యాసంప్రజ్ఞాత సమాధి మాపన్నస్య చిత్తస్య వృత్తిరహితత్వేన సుషుప్తివన్న దర్శనహేతుత్వమితి చేన్న। స్వతః సిద్ధస్య దర్శనస్య నివారయితు మశక్యత్వాత్। అత ఏవ శ్రేయో మార్గో ఽభిహితమ్—

శ్లో॥ ఆత్మానాత్మాకారం స్వభావతోఽవస్థితం సదా చిత్తమ్।
ఆత్మైకాకారతయా తిరస్కృతానాత్మదృష్టిం విదధీత॥ ఇతి।

యథా ఘట ఉత్పద్యమానః స్వతో వియత్పూర్ణ ఏవోత్పద్యతే, జలతండులాదిపూర్ణం తూత్పన్నే ఘటే పశ్చాత్ పురుషప్రయత్నేన భవతి; యథా తత్ర జలధౌ నిఃసారితోఽపి న వియన్నిఃసారయితుం శక్యతే, ముఖపిధానేఽప్యన్తర్వియ

దవతిష్ఠత ఏవ, తథా చిత్త ముత్పద్యమాన మాత్మచైతన్య పూర్ణ మేవోత్పద్యతే। ఉత్పన్నే చిత్తే పశ్చా న్మూషానిషిక్త ద్రుత తామ్ర వద్ ఘట పట రూప రస సుఖదుఃఖాది వృత్తిరూపత్వం భోగహేతు ధర్మాధర్మాదివశాత్ భవతి। తత్ర రూపరసాద్యనాత్మాకారే నివారితేఽపి నిర్నిమిత్త శ్చిదాకారో న నివారయితుం శక్యతే। తతో నిరోధసమాధినా నిర్వృత్తికేన సంస్కారమాత్రశేషతయా సూక్ష్మేణ చిదాత్మమాత్రాభిముఖత్వా దేకాగ్రేణ చిత్తేన నిర్విఘ్న మాత్మాఽనుభూయతే, అనేనైవాభిప్రాయేణ వార్తికకార సర్వాను భవయోగినా వాహతుః—

శ్లో॥ సుఖదుఃఖాదిరూపత్వం ధియో ధర్మాదిహేతుతః।
నిర్హేతుత్వాత్మసంబోధరూపత్వం వస్తువృత్తితః॥
ప్రశాన్తవృత్తికం చిత్తం పరమానన్దదీపకమ్।
అసంప్రజ్ఞాత నామాయం సమాధి ర్యోగినాం ప్రియః॥
ఇతి।

ఆత్మదర్శనస్య స్వతః సిద్ధత్వేఽప్యనాత్మదర్శనివార ణాయనిరోధాభ్యాసః। అత ఏవోక్తమ్—

శ్లో॥ ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్।
భ.గీ. 6, 25 ఇతి।

యోగశాస్త్రస్య చిత్తచికిత్ససమాధిమాత్రే ప్రవృత్తత్వాత్ నిరోధ సమాధా వాత్మదర్శనం తత్ర న సాక్షాదుక్తమ్, భంగ్యన్తరేణ త్వభ్యుపగమ్యతే, 'యోగశ్చిత్తవృత్తినిరోధః' 1–2 ఇతి సూత్రయిత్వా 'తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్' 1–3 ఇతి సూత్రణాత్। తథాఽపి వృత్తిషూత్పద్యమానాసు తత్ర చిచ్ఛాయాయాం ప్రతిబింబితాయాం తదవివేకాదస్వస్థ ఇవ ద్రష్టా భవతి, తదప్యనన్తరసూత్రేణోక్తమ్— 'వృత్తిసారూప్య మితరత్ర' 1–4 ఇతి। అన్యత్రాపి సూత్రితమ్— 'సత్త్వపురుషయో

రత్యన్తాసంకీర్ణయోః ప్రత్యయావిశేషో భోగః పరార్థత్వాత్' 3-36 ఇతి। 'చితే రప్రతిసంక్రమాయా స్తదాకారాపత్తౌ స్వబుద్ధి సంవేదనమ్' 4-22 ఇతి చ।

## భావప్రకాశిక

ఓయీ! ధారణా, ధ్యాన, సమాధులచే సాధ్యమగు సంప్రజ్ఞాత సమాధి, ఏకాగ్రవృత్తిరూపము గనుక, ఆత్మదర్శనమునకు కారణమైనను, శాంతాత్మయందు అవరుద్ధమైనట్టియు (మునిగిపోయిన), అసంప్రజ్ఞాత సమాధిరూపమును పొందిన చిత్తము వృత్తిరహితమగుటచే సుషుప్తికాలమునందువలె ఆత్మదర్శనమునకు కారణము కాజాలదు కదా? అనినచో, అట్లు కాదు. ఎందుచేతననగా స్వతస్సిద్ధమగు ఆత్మదర్శనము స్వప్రకాశము అగుటచే నివారించుటకు శక్యము కాదు. ఇందువలననే శ్రేయోమార్గమునందు ఇట్లు చెప్పబడెను.

"ఆత్మానాత్మాకారం స్వభావతోఽవస్థితం సదా చిత్తమ్।
ఆత్మైకాకారతయా తిరస్కృతానాత్మదృష్టిం విదధీత॥

చిత్తము, స్వభావముచే ఎల్లప్పుడు ఆత్మాకారముగానో, అనాత్మాకారముగానో ఉండును. ఆత్మైకాకారతను పొందించి అనాత్మాకారదృష్టిని తిరస్కరించుట చేయవలయును.

ఎట్లనగా, ఘటము (కుండ) పుట్టుచువే స్వభావముచేత ఆకాశముతో పూర్ణమై పుట్టును. జలతండులాదులతో పూరించుట, తరువాత ఉత్పన్నమైన ఘటమునందు పురుషప్రయత్నముచేత సాధ్యమగును. అక్కడ జలాదులను ఘటమునుండి దూరముగా తీసివేసినను, ఆకాశమును మాత్రము ఘటమునుండి తీసివేయుట సాధ్యము కాదు. నోరు మూసికొనినను, లోపల ఆకాశము ఉండనే యున్నది. అట్లే, చిత్తము పుట్టినపుడే ఆత్మచైతన్యముతో నిండినదై పుట్టుచున్నది. ఉత్పన్నమైన చిత్తమునందు తరువాత

మూసలో పోసిన కరిగిన రాగి వలె, ఘట, పట, రూప, రస, సుఖ దుఃఖాది వృత్తి రూపము, భోగకారణములగు ధర్మాధర్మాదుల వశమువలన ఏర్పడుచున్నది. అపుడు రూప, రసాది అనాత్మాకారమును చిత్తమునందు నివారించినను, నిమిత్తముయొక్క అపేక్ష లేని చిదాత్మాకారమును నివారించుటకు శక్యము కాదు. అందువలన, వృత్తి రహితమగు నిరోధ సమాధిచే సంస్కారము మాత్రమే మిగిలి ఉండుటచే సూక్ష్మమగు ఆ చిత్తము చిదాత్మకు అభిముఖమగుటచే ఏకాగ్రచిత్తముతో నిర్విఘ్నముగా ఆత్మ, అనుభవింపబడును. ఈ అభిప్రాయముతోనే వార్తికకారులు, సర్వానుభవయోగి ఇట్లు చెప్పిరి—

బుద్ధికి ధర్మాధర్మాది కారణముల వలన సుఖ, దుఃఖాది రూపములు ఏర్పడును. కారణము లేకుండగానే ఆత్మసంబోధ రూపము, వస్తుస్వభావము ననుసరించి కలుగును. ప్రశాంతవృత్తి గల ఈ చిత్తము పరమానందప్రకాశకము. ఈ అసంప్రజ్ఞాతమను సమాధి, యోగులకు ఇష్టమైనది. ఆత్మదర్శనము స్వతస్సిద్ధమైనను, అనాత్మవారణము కొరకు నిరోధాభ్యాసమును చేయవలయును. కనుకనే

"ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చిన్తయేత్"

మనస్సును ఆత్మయందుంచి మరి దేనిని (అనాత్మను) తలంచరాదు అని చెప్పబడినది.

యోగశాస్త్రము చిత్తమునకు చికిత్స చేయు సమాధియందు మాత్రమే ప్రవృత్తమైనందున, నిరోధసమాధియందు ఆత్మదర్శనము కలుగును అని సాక్షాత్తుగా స్పష్టముగా చెప్పబడలేదు. కాని, మరియొకతీరుగా ఆత్మదర్శనము అంగీకరింపబడుచునేయున్నది. 'యోగశ్చిత్తవృత్తినిరోధః' అని సూత్రించి,

"తదా ద్రష్టుః స్వరూపే అవస్థానమ్।"

అను సూత్రమును రచించిరి. ఈ స్వరూపావస్థానమునందే ఆత్మ దర్శనము అంగీకరింపబడినట్లు గ్రహించవలయును. విచారించగా, ద్రష్ట యగు ఆత్మ, ఎల్లపుడును నిర్వికారుడు, స్వరూపమునందే ఉండును. అట్లయినను, చిత్తమునందు వృత్తులు ఉదయించగా, అచట చైతన్యరూపమగు ఆత్మయొక్క ఛాయ ప్రతిబింబించగా ఆ ప్రతిబింబమునకు, బింబభూతమగు చిద్రూపాత్మకు వివేకము చేయజాలక, అస్వస్థునివలె (స్వరూపావస్థానమును వదలి, వికారము పొందినవానివలె) ద్రష్ట యగు ఆత్మ యగుచున్నాడు. ఆ విషయము కూడ,

"వృత్తిసారూప్యం ఇతరత్ర।"

అను అనంతరసూత్రముచే చెప్పబడినది. మరియొకచోట గూడ, ఇట్లు సూత్రములు వ్రాయబడినవి–

"సత్త్వపురుషయోః అత్యన్త అసంకీర్ణయోః ప్రత్యయ అవిశేష భోగః పరార్థత్వాత్।"

"చితేః అప్రతిసంక్రమాయాః తదాకారాపత్తౌ స్వబుద్ధి సంవేదనమ్॥"

సత్త్వమనగా అంతఃకరణము, జడము. పురుషుడనగా చేతనుడగు ఆత్మ. ఈ ఆత్మాంతఃకరణములు అత్యంత విలక్షణ స్వభావము కలవి. అయినను, అంతఃకరణమునకు ఆత్మతో ఏకరూపముగా భాసించుట 'అవిశేషతః'. ఆ రెంటికి వివేకము చేయలేకపోవుట భోగమైయున్నది. చేతనుడగు ఆత్మ, పరిణమించడు, వికారము నొందడు. అంతఃకరణము ఆత్మాకారమును పొందగా బుద్ధియందు అనుభవము (విషయానుభవము) కలుగుచున్నది.

జీవన్ముక్తివివేకః

నిరోధసమాధినా శోధితే త్వంపదార్థే సాక్షాత్కృతేఽపి తస్య

బ్రహ్మత్వం గోచరయితుం మహావాక్యేన బ్రహ్మవిద్యానామకం వృత్త్యన్తర ముత్పద్యతే। న చ శుద్ధ త్వంపదార్థసాక్షాత్కారే నిరోధసమాధిరేక ఏవోపాయః। కింతు చిజ్జడవివేకేనాపి పృథక్కృతే తత్ర సాక్షాత్కారసంభవాత్। అత ఏవ వసిష్ఠ ఆహ-

శ్లో॥ ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం చ రాఘవ।
యోగస్తద్వృత్తిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్॥

ల.వా. 27, 72 ఇతి।

శ్లో॥ అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిజ్జ్ఞాననిశ్చయః।
ప్రకారౌ ద్వౌ తతో దేవో జగాద పరమేశ్వరః॥

ల.వా. 29, 60 ఇతి చ।

నను వివేకోఽపి యోగే పర్యవస్యతి, దర్శనవేలాయాం ఆత్మమాత్రగోచరాయా ఏకాగ్రవృత్తేః క్షణిక సంప్రజ్ఞాత రూపత్వాత్। బాఢమ్। తథాఽపి సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతయోః స్వరూపతః సాధనతశ్చాస్త్యేవ మహద్వైలక్షణ్యమ్। వృత్త్యవృత్తిభ్యాం స్ఫుటః స్వరూపభేదః, సాధనం తు సంప్రజ్ఞాతస్య సజాతీయత్వాత్। ధారణాదిత్రయ మన్తరంగమ్, అసంప్రజ్ఞాతస్య త్వవృత్తికస్య విజాతీయత్వా ద్బహిరంగమ్। తథా చ సూత్రమ్- 'తదపి బహిరంగం నిర్బీజస్య' 3-8 ఇతి। విజాతీయత్వేఽపి బహువిధానాత్మవృత్తి నివారణే నోపకారితయా బహిరంగత్వ మవిరుద్ధమ్। తదేవోపకారిత్వం విశదయితుం సూత్రయతి- 'శ్రద్ధా వీర్య స్మృతి సమాధి ప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్' 1-20 ఇతి। కేషాంచిత్ దేవాదీనాం పూర్వసూత్రే జన్మనైవ సమాధిముక్త్వా మనుష్యాన్ ప్రతిఏతదుచ్యతే మహాయం యోగ ఏవ పరమ పురుషార్థసాధనమితి ప్రత్యయః శ్రద్ధా। సా చోత్కర్షశ్రవణేనోప జాయతే। తదుత్కర్షశ్చ స్మర్యతే-

శ్లో॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।

కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥

భ.గీ. 6-46 ఇతి।

ఉత్తమలోకసాధనత్వాత్ కృచ్ఛ్ర చాంద్రాయణాది తపసో జ్యోతిష్టోమాది కర్మణశ్చ యోగోఽధికః। జ్ఞానం ప్రతి అన్తరఙ్గత్వా చ్చిత్తవిశ్రాన్తి హేతుతయా చ జ్ఞానాదప్యధికః। ఏవం జ్ఞానతో యోగే శ్రద్ధా జాయతే। తస్యాం చ శ్రద్ధాయాం వాసితాయాం వీర్య ముత్సాహో భవతి- సర్వథా యోగం సంపాదయిష్యామీతి। ఏతాదృశేనోత్సాహేన తదా తదాఽనుష్ఠేయాని యోగాంగాని స్మర్యన్తే। తయా చ స్మృత్యా సమ్యగనుష్ఠితసమాధే రధ్యాత్మ ప్రసాదే సతి ఋతంభరా ప్రజ్ఞోదేతి। తత్ప్రజ్ఞానపూర్వక స్తత్ప్రజ్ఞాకారణకోఽసంప్రజ్ఞాతసమాధి రితరేషాం దేవాదిభ్యో ఽర్వాచీనానాం మనుష్యాణాం సిద్ధ్యతి।

## భావప్రకాశిక

నిరోధసమాధిచే శోధితమై 'త్వం' పదార్థము (ప్రత్యగాత్మ స్వరూపము) సాక్షాత్కరింపబడినను, ఆ 'త్వం' పదార్థమునకు బ్రహ్మత్వమును గ్రహింపజేయుటకై మహావాక్యముచే 'బ్రహ్మ విద్య' అను పేరు గల అఖండ బ్రహ్మాత్మైక్యాకారవృత్తి మరి యొకటి ఉత్పన్న మగుచున్నది. శుద్ధ 'త్వం' పదార్థ సాక్షాత్కార మున, నిరోధసమాధి ఒకటియే ఉపాయము కాదు. ఇకనేమనగా, చిజ్జడవివేకముచేత గూడ, జడములగు దేహాదులకంటె చేతనమగు 'త్వం' పదార్థము, జడములగు దేహములు, ఇంద్రియములు నేను కాదు, అను రీతిగా, 'త్వం' పదార్థమగు చిదాత్మ వేరుచేయబడి నప్పుడు కూడ, 'త్వం' పదార్థ సాక్షాత్కారము సంభవించును. ఇందువలననే వసిష్ఠుడు ఇట్లు చెప్పుచున్నాడు.

చిత్తనాశమునకు యోగము, జ్ఞానము అను రెండు ఉపాయములు కలవు. ఓ రాఘవా! యోగమనగా, చిత్తవృత్తి

నిరోధము. జ్ఞానమనగా, సమ్యగ్విచారణ. ఒకనొకనికి యోగము అసాధ్యము. మరియొకనికి జ్ఞానము అసాధ్యము. కనుకనే పరమేశ్వరుడు రెండు ఉపాయములను బోధించెను.

ఓయీ! వివేకము కూడ, యోగమునందే పర్యవసించును. ఆత్మదర్శన సమయమున ఆత్మమాత్రగోచరమగు ఏకాగ్రవృత్తి క్షణిక సంప్రజ్ఞాతసమాధిరూపము కదా! అవును. అయినను, సంప్రజ్ఞాతసమాధికిని, అసంప్రజ్ఞాతమునకును స్వరూపము చేత ఎంతో వైలక్షణ్యము కలదు. సంప్రజ్ఞాతసమాధిలో వృత్తి ఉండును, అసంప్రజ్ఞాతములో వృత్తి ఉండదు. ఇట్లే సాధనము కూడ, భిన్నమైనది. సంప్రజ్ఞాతమునకు సజాతీయములైన ధారణా ధ్యానాదులు సాధనములు. అది, అంతరంగము. అసంప్రజ్ఞాతము వృత్తిరహితము గనుక, ఈ ధారణాదులు విజాతీయములు అగుటచే బహిరంగము. ఈ విషయమును 'తదపి బహిరంగం నిర్బీజస్య' అను సూత్రముచే నిర్బీజ (అసంప్రజ్ఞాత) సమాధికి ధారణాది త్రయము బహిరంగము అని పేర్కొనినారు. అసంప్రజ్ఞాత సమాధికి ఈ ధారణాదికము విజాతీయమైనను, అనేకవిధములగు అనాత్మవృత్తులను నివారించుటచేత ఉపకరించుచు, బహిరంగ సాధనమగుట అవిరుద్ధము. ఆ ఉపకారము విశదపరచుచు సూత్రించుచున్నారు–

"శ్రద్ధావీర్య స్మృతి సమాధి ప్రజ్ఞాపూర్వక ఇతరేషామ్।"

అని పూర్వసూత్రమున కొందరికి అనగా దేవాదులకు జన్మచేతనే సమాధిని చెప్పి, మనుష్యులను గూర్చి ఈ సూత్రము ప్రవృత్తమైనది. శ్రద్ధ, అనగా 'ఈ యోగమే నాకు పరమపురుషార్థ సాధనము' అను విశ్వాసము. ఆ శ్రద్ధ, యోగముయొక్క ఉత్కర్షను వినుటవలన కలుగుచున్నది. యోగోత్కర్ష, స్మృతి యందు (భగవద్గీతలో) ఇట్లు వర్ణింపబడినది–

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున॥"

ఉత్తమ లోకమునకు సాధనమగు కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సు కంటెను, జ్యోతిష్టోమాది కర్మలకంటెను యోగము అధికమైనది. జ్ఞానమునకు గూడ, ఈ యోగము అంతరంగమగుటచే, చిత్తవిశ్రాంతికి కారణ మగుటచేతను, జ్ఞానముకంటె గూడ, యోగమునకు ఆధిక్యము కలదు. ఇట్లు తెలిసికొనినవానికి యోగమునందు శ్రద్ధ జనించుచున్నది. ఆ శ్రద్ధ మనస్సునందు వాసితమైనపుడు 'వీర్యము' అనగా ఉత్సాహము కలుగుచున్నది. 'ఏమైనను, సరే, నేను యోగమును సంపాదింతును' అనునట్టి ఉత్సాహముచేత అప్పుడప్పుడు, అనుష్ఠింపదగిన యోగాంగములు స్మరింపబడును. ఆ స్మృతిచే యోగానుష్ఠానబలముచే సమాధి వలన అధ్యాత్మప్రసాదము, అనగా అంతఃకరణనైర్మల్యము కలుగగా, 'ఋతంభర' అను ప్రజ్ఞ ఉదయించును. ఆ ప్రజ్ఞ కారణముగా అసంప్రజ్ఞాతసమాధి దేవాదులకంటె భిన్నులు, అర్వాచీనులునయిన మనుష్యులకు సిద్ధించుచున్నది.

## జీవన్ముక్తివివేకః

తాం చ ప్రజ్ఞాం సూత్రయతి- 'ఋతంభరా తత్ర ప్రజ్ఞా' 1-48 ఇతి। ఋతం సత్యం వస్తుయాథాత్మ్యం బిభర్తి ప్రకాశయతీతి ఋతంభరా। తత్ర తస్మిన్ సమాధ్యుత్కర్షజన్యేఽధ్యాత్మప్రసాదే సతీత్యర్థః। ఋతంభరత్వోపపత్తిం సూత్రయతి- 'శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యాం అన్యవిషయావిశేషార్థత్వాత్' 1-49 ఇతి। సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట వస్తుష్వయోగిప్రత్యక్షం న ప్రవర్తతే। ఆగమానుమానాభ్యాం తాని వస్తూన్యయోగిభిః జ్ఞాయన్తే। తే చ శాస్త్రానుమానజన్యే ప్రజ్ఞే వస్తుసామాన్యమేవ గోచరయతః। ఇదం తు యోగిప్రత్యక్షం వస్తువిశేషగోచరత్వా

దృతంభరమ్, తస్య చ యోగిప్రత్యక్షస్య అసంప్రజ్ఞాత సమాధౌ బహిరంగత్వసిద్ధ్యర్థ ముపకారిత్వం సూత్రయతి- 'తజ్జః సంస్కారోఽన్య సంస్కారప్రతిబంధీ' 1-50 ఇతి। అసంప్రజ్ఞాత సమాధే ర్బహిరంగసాధనముక్త్వా తన్నిరోధ ప్రయత్న స్యాన్తరంగసాధనతాం సూత్రయతి- 'తస్యాపి నిరోధే సర్వనిరోధా న్నిర్బీజః సమాధిః' 1-51 ఇతి। సోఽయం సమాధిః సుషుప్తి సమానః సాక్షిచైతన్యేనానుభవితుం శక్యః। న చాసౌ సర్వ ధీవృత్తిరాహిత్యాత్ సుషుప్తిరేవేతి శంకనీయమ్। మనఃస్వరూపస్య సదసత్త్వాభ్యాం విశేషాత్। తదుక్తం గౌడపాదాచార్యైః-

శ్లో॥ నిగృహీతస్య మనసో నిర్వికల్పస్య ధీమతః।
ప్రచారః స తు విజ్ఞేయః సుషుప్తేరన్యో న తత్సమః॥
లీయతే హి సుషుప్తౌ తన్నిగృహీతం న లీయతే।
తదేవ నిర్భయం బ్రహ్మ జ్ఞానలోకం సమన్తతః॥

3, 34, 35 ఇతి।

శ్లో॥ ద్వైతస్యాగ్రహణం తుల్య ముభయోః ప్రాజ్ఞ తుర్యయోః।
బీజనిద్రాయుతః ప్రాజ్ఞః సా చ తుర్యే న విద్యతే॥
స్వప్ననిద్రాయుతావాద్యౌ ప్రాజ్ఞ స్త్వస్వప్న నిద్రయా।
న నిద్రాం నైవ చ స్వప్నం తుర్యే పశ్యన్తి నిశ్చితాః॥
అన్యథా గృహ్ణతః స్వప్నో నిద్రా తత్త్వ మజానతః।
విపర్యాసే తయోః క్షీణే తురీయం పద మశ్నుతే॥

1, 13-15 ఇతి చ।

ఆద్యౌ విశ్వ తైజసౌ। అద్వైతస్య వస్తునోఽన్యథా గ్రహణం నామ ద్వైతరూపేణ ప్రతిభాసః। స చ విశ్వ తైజసయోః వర్తమానః స్వప్న ఇత్యుచ్యతే। తత్త్వస్యాజ్ఞానం నిద్రా। సా చ విశ్వ తైజసప్రాజ్ఞేషు వర్తతే। తయోః స్వప్ననిద్రయోః

స్వరూపభూతయో ర్విపర్యాసో మిథ్యాజ్ఞానమ్। తస్మిన్ విద్యయా క్షీణే సతి తురీయం పద మద్వైతం వస్త్వశ్నుతే అనుభవతీత్యర్థః। నన్వ స్త్యేవ మసంప్రజ్ఞాతసమాధి సుషుప్త్యోః మహాన్ భేదః। తత్ర తత్త్వవిదిదృక్షో ర్దర్శనసాధనత్వేన సమాధ్యపేక్షాయామపి దృష్ట తత్త్వస్య జీవన్ముక్తయే నాస్తి తదపేక్షా। రాగద్వేషాది క్లేశబన్ధస్య సుషుప్త్యాఽపి నివృత్తేః।

## భావప్రకాశిక

ఆ ప్రజ్ఞను సూత్రించుచున్నారు-

"ఋతంభరా తత్ర ప్రజ్ఞా।"

"ఋతం సత్యం వస్తుయాథాత్మ్యం బిభర్తి ప్రకాశయతీతి ఋతంభరా।"

'ఋత' మనగా సత్యమైన వస్తుయథార్థస్వరూపము. దానిని ప్రకాశింపజేయు ప్రజ్ఞ ఋతంభర. సమాధ్యుత్కర్షవలన అధ్యాత్మ ప్రసాదము కలుగగా, ఈ ప్రజ్ఞ జనించును. ఉపపత్తిని

"శ్రుతానుమానాభ్యాం అన్యవిషయా విశేషార్థత్వాత్।"

అని సూత్రించినారు. యోగులు కానివారికి సూక్ష్మవస్తువు యొక్కయు, కాలముచే వ్యవహితమైన వస్తువులయొక్కయు, దూరదేశమందున్న వస్తువులయొక్కయు దర్శనము ప్రత్యక్షముగా కలుగనేరదు. శాస్త్రముచేతను, అనుమాన ప్రమాణముచేతను వారు ఆ వస్తువులను తెలిసికొనుచున్నారు. శాస్త్రానుమాన ప్రమాణములచే కలిగిన ప్రజ్ఞలు వస్తువులయొక్క సామాన్యస్వరూపమునే తెలియు జేయును. యోగులు సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట వస్తువులను గూడ, విశేషరూపముతో ప్రత్యక్షము చేసికొనుచున్నారు. కనుక, యోగిప్రజ్ఞ, ఋతంభరాప్రజ్ఞ. ఆ యోగిప్రత్యక్షము అసంప్రజ్ఞాత సమాధికి బహిరంగము అయినను, ఆ యోగిప్రత్యక్షమునకు అసంప్రజ్ఞాత సమాధిలో (ఋతంభరాప్రజ్ఞ) ఉపకరించుటను

సూత్రించుచున్నారు.

"తజ్జః సంస్కారః అన్యసంస్కార ప్రతిబన్ధీ।"

ఋతంభరా ప్రజ్ఞవలన గలిగిన సంస్కారము సమాధికి అడ్డువచ్చు ఇతర సంస్కారములను త్రోసిపుచ్చి, సమాధికి తోడ్పడును. అసంప్రజ్ఞాతసమాధికి ధారణాదిత్రయము బహిరంగము అని చెప్పి ఆ చిత్తవృత్తులను నిరోధించు ప్రయత్నము అంతరంగసాధనము అని చెప్పుచున్నారు-

"తస్యాపి నిరోధే సర్వనిరోధాత్ నిర్బీజం సమాధిః।"

ఆద్యనాది వృత్తిత్రయమును నిరోధించగా సర్వచిత్తవృత్తి నిరోధము లభించుట వలన, నిర్బీజ సమాధి (అసంప్రజ్ఞాత సమాధి) కలుగును. ఆ యీ సమాధి, సుషుప్తివంటిది. సాక్షి చైతన్యముచే అనుభవించుటకు శక్యమైనది. సమాధియందు చిత్త వృత్తులన్నియు నిరోధింపబడినవి గనుక, సుషుప్తియే అని యేల అనుకొనరాదు? అని శంకించరాదు. మనఃస్వరూపము ఉండుట, లేకపోవుటలవలన భేదము కలదు. గౌడపాదాచార్యులచే ఈ విషయము చెప్పబడినది-

బుద్ధిశాలి, నిర్వికల్పకసమాధిలో నిగ్రహించబడిన మనస్సు యొక్క ప్రచారము కలిగియున్నాడు. సుషుప్తియందు మనః ప్రచారము ఇంతకంటె వేరైనది, దానితో సమానమైనది కాదు.

"లీయతే హి సుషుప్తౌ తన్నిగృహీతం న లీయతే।
తదేవ నిర్భయం బ్రహ్మ జ్ఞానాలోకం సమన్తతః॥"

సుషుప్తియందు మనస్సు లయము చెందును. సమాధియందు నిగ్రహింపబడునే గాని, లయము చెందదు. అపుడు జ్ఞానా లోకముతో నిర్భయమగు బ్రహ్మ అంతట, ప్రకాశించును.

ప్రాజ్ఞుడు (సుషుప్తుడు), తురీయస్థితిలో ఉన్నవాడు-

భా. ప్ర. 40 ]

ఈ యిరువురికి ద్వైతముయొక్క (ప్రపంచముయొక్క) భావము లేకపోవుట సమానము. ప్రాజ్ఞుడు ద్వైతబీజముతో గూడిన, నిద్ర కలవాడు. తురీయస్థితియందు ఆ బీజనిద్ర లేదు. విశ్వ, తైజసులు స్వప్న, నిద్రలు కలవారు. ప్రాజ్ఞుడు స్వప్ననిద్రలు లేనివాడు. తురీయస్థితిలోనివారు నిద్రనుగాని, స్వప్నమునుగాని చూడరు.

స్వప్న మనగా అన్యథాగ్రహణము. నిద్ర అనగా యథార్థ స్వరూపముయొక్క అజ్ఞానావరణము. విద్యచేత అగ్రహణ, అన్యథాగ్రహణ, విపర్యాసములు క్షీణించగా, తురీయ స్థితిని పొందుచున్నాడు.

మాండూక్యకారికలలో గల 'ఆద్యౌ' అనగా విశ్వతైజసులు. వస్తువు, అద్వైత మగుటచే అన్యథాగ్రహణ మనగా, ద్వైత రూపముగా భాసించుట. అది విశ్వతైజసులు ఇరువురికి కలదు గనుక, స్వప్నము అని చెప్పబడును. నిద్ర అనగా, తత్త్వము యొక్క అజ్ఞానము.అది విశ్వ, తైజస, ప్రాజ్ఞులు ముువ్వురియందు కలదు. స్వరూప భూతములయిన ఆ స్వప్న, నిద్రలకు విపర్యాసము మిథ్యాజ్ఞానము. అది, విద్యచేత క్షీణింపగా, తురీయ పదమును అనుభవించుచున్నాడు అని అర్థము.

ఓయీ! అసంప్రజ్ఞాత సమాధికి, సుషుప్తికి భేదము అత్యంతము ఉండుగాక! తత్త్వదర్శనాభిలాషికి సాధనముగా సమాధి అపేక్షితము అగుగాక! ఒకమారు, తత్త్వము దర్శించిన వానికి జీవన్ముక్తికొరకు సమాధియొక్క అపేక్ష లేదు కదా! రాగ ద్వేషాది క్లేశబంధము సుషుప్తిలో గూడ నివర్తించుచున్నది.

జీవన్ముక్తివివేకః

మైవమ్। కిం ప్రతిదినం స్వతః ప్రాప్తా కాదాచిత్కా సుషుప్తిః బంధనివర్తికా, కిం వాఽభ్యాసేన నిరన్తరవర్తినీ? ఆద్యేఽపి కిం సుషుప్తికాలీనస్య క్లేశబంధస్య నివృత్తిః, కిం వా

కాలాన్తరవర్తినః? నాద్యః అప్రసక్తేః। న హి మూఢానామపి సుషుప్తౌ క్లేశబంధః,అన్యథాఽఽయాసః ప్రసజ్యేత। న ద్వితీయః, అసంభవాత్। న హ్యన్యకాలీనయా సుషుప్త్యా కాలాన్తరవర్తినః క్లేశస్య క్షయః సంభవతి। అన్యథా మూఢానామపి జాగరణ స్వప్నయోః క్లేశస్య క్షయః ప్రసజ్యేత। నాపి సుషుప్తౌ నైరంతర్య మభ్యసితుం శక్యమ్। తస్యాః కర్మక్షయ నిమిత్తత్వాత్। తస్మాత్ తత్త్వవిదోఽపి, క్లేశక్షయాయ అస్త్యేవ అసంప్రజ్ఞాతసమాధ్యపేక్షా। తస్య చ సమాధే ర్గవాశ్వాదిష్వివ వాఙ్నిరోధః ప్రథమా భూమిః। బాల మూఢాదిష్వివ నిర్మనస్త్వం ద్వితీయా। తంద్రాయా మివాహంకారరాహిత్యం తృతీయా। సుషుప్తావివ మహత్తత్త్వరాహిత్యం చతుర్థీ। తదేతద్ భూమి చతుష్టయ మభిప్రేత్య 'శనైః శనై రుపరమేత్' ఇత్యుక్తమ్। అత్రచోపరమే ధృతిగృహీతా బుద్ధిః సాధనమ్। మహదహంకార మనోవాగాదీనాం స్వతఏవ తీవ్రవేగేన బహిఃప్రవహతాం కూలంకషాయా నద్యా ఇవ నిరోధే ధైర్యం మహ దపేక్షితమ్। బుద్ధి ర్వివేకః। పూర్వా భూమి ర్జితా వా నవేతి పరీక్ష్య, జితాయాం ఉత్తరభూమ్యుపక్రమః। అజితాయాం తు సైవ పునరభ్యాస నీయేతి తదా తదా వివిచ్యాత్। 'ఆత్మసంస్థమ్' ఇత్యాదినా సార్ధకేన చతుర్థభూమ్యభ్యాసోఽపి స్మృతః। గౌడపాదాచార్యా ఆహుః-

శ్లో॥ ఉపాయేన నిగృహ్ణీయాద్ విక్షిప్తం కామభోగయోః।
సుప్రసన్నం లయేచైవ యథా కామో లయ స్తథా॥

దుఃఖం సర్వ మనుస్మృత్య కామభోగా న్నివర్తయేత్।
అజం సర్వ మనుస్మృత్య జాతం నైవ తు పశ్యతి॥

లయే సంబోధయే చ్చిత్తం విక్షిప్తం శమయేత్ పునః।
సకషాయం విజానీయాత్ సమప్రాప్తం న చాలయేత్॥

నాస్వాదయేత్ సుఖం తత్ర నిఃసంగః ప్రజ్ఞయా భవేత్।

నిశ్చలం నిశ్చరం చిత్త మేకీకుర్యాత్ ప్రయత్నతః॥
యదా న లీయతే చిత్తం న చ విక్షిప్యతే పునః।
అలిఙ్గన మనాభాసం నిష్పన్నం బ్రహ్మ తత్తదా॥
3, 42-46 ఇతి।

లయ విక్షేప కషాయ సమప్రాప్తయ శ్చతస్ర శ్చిత్తస్యావస్థాః। తత్ర నిరుధ్యమానం చిత్తం విషయేభ్యో వ్యావృత్తం సత్పూర్వాభ్యాసవశా ద్యది లయాయ సుషుప్తయే ఽభిముఖం భవేత్, తదానీం ఉత్థాపనప్రయత్నేన లయకారణ నివారణేన వా తచ్చిత్తం సమ్యక్ ప్రబోధయేత్।

భావ ప్రకాశిక

ఇట్లు కాదు. ప్రతిదినము స్వాభావికముగా వచ్చునట్టి, కొంత కాలమే ఉండునట్టి సుషుప్తి, రాగద్వేషాది క్లేశబంధ నివర్తక మగునా? లేక, అభ్యాసముచేత మాటిమాటికి ఎడతెగక సంపాదించునట్టి సుషుప్తి, బంధనివర్తకమగునా? మొదటిపక్షము నందు గూడ, సుషుప్తికాలమునందలి క్లేశబంధమునకు నివృత్తియా, లేక జాగ్రత్స్వప్నకాలములందలి క్లేశబంధమునకు నివృత్తియా? మొదటి పక్షము సరి కాదు. ఎందుచేతననగా సుషుప్తికాలమున, క్లేశబంధమునకు ప్రసక్తియే లేదు. మూఢులు కూడ సుషుప్తికాలమున క్లేశబంధమును అనుభవించరు. అట్లు కానిచో సుషుప్తికాలములో గూడ, ప్రయాసపడుట సంభవించును. రెండవ పక్షముగూడ, అసంభవము గనుక సరి కాదు. ఒకకాలములో ఉన్న సుషుప్తి మరియొక కాలములో ఉన్న క్లేశబంధమును ఎట్లు క్షీణింపజేయును? అట్లయినచో, మూఢులు కూడ, సుషుప్తిలో క్లేశక్షయము కలిగి ఉన్నారు గనుక, జాగరణ, స్వప్నములందు గూడ, వారికి క్లేశక్షయము కలుగవలసియుండును. సుషుప్తిని నిరంతరము అభ్యసించుట సంభవించదు. సుషుప్తి, భోగప్రదకర్మ

క్షయాధీనము. కనుక, తత్త్వజ్ఞానికి గూడ, క్లేశక్షయము కొరకు అసంప్రజ్ఞాత సమాధియొక్క అపేక్ష కలదు. ఆ సమాధికి గవాశ్వాదులకు వలె వాఙ్నిరోధము, మౌనము మొదటి భూమిక. బాల్ఖరు, మూగివారియందువలె నిర్మనస్కత రెండవ భూమిక. కునికిపాటుయందువలె అహంకారరాహిత్యము మూడవ భూమిక. సుషుప్తియందువలె సమష్టిమహత్తత్వరాహిత్యము (అహంకార సామాన్యము లేకపోవుట) నాలుగవ భూమిక. ఈ నాలుగు చిత్త భూములను మనస్సులో ఉంచుకొని 'శనైః శనైః ఉపరమేత్' మెల్లమెల్లగా ఉపరమము– చిత్తవ్యాపారవిరతి చేయవలెను అని చెప్పబడినది. ఈ ఉపరమమునకు ధృతి (నిబ్బరము) తో కూడిన బుద్ధి, సాధనము. మహదహంకార మనోవాగాదులు స్వయముగానే తీవ్రవేగముతో దరులను ఒరయునట్టి నదీప్రవాహము వలె వెలుపలి (బాహ్య) విషయములందు ప్రసరించును. కావున, వానిని నిరోధించుటకు ఎక్కువ ధైర్యము అపేక్షితము. బుద్ధి అనగా వివేకము. పూర్వభూమి, జయింపబడినదా లేదా? అని పరీక్షించు కొని అది జయింపబడిన పిమ్మటనే ఉత్తరభూమికై ఉపక్రమించ వలెను. పూర్వభూమి జితము కానిచో, ఆ భూమియే మరల అభ్యసించవలెను, అప్పుడపుడు వివేచన చేసికొనవలెను.

"ఆత్మసంస్థం మనఃకృత్వా న కించిదపి చిన్తయేత్"

అను శ్లోకముచే చతుర్థభూమియొక్క అభ్యాసము కూడ, స్మరింప బడినది.

గౌడపాదాచార్యులు ఇట్లు చెప్పిరి–

కామభోగములందు విక్షిప్తమైన చిత్తమును ఉపాయముతో నిగ్రహించవలెను. లయమునందు ప్రసక్తమైనను, ఉపాయముచే నిగ్రహింపవలెను. లయము కూడ, కామమువంటిదే. సర్వము దుఃఖమని స్మరించి కామభోగములనుండి మనస్సును నివర్తింప

జేయవలయును. సర్వము 'అజమ్' బ్రహ్మాత్మకము అని స్మరించి దృశ్యమగు ప్రపంచమును జాతమైనదానిని చూడడు. నిద్రకు ఒరుగుచున్న చిత్తమును మేల్కొల్పవలెను. విక్షిప్తమగు దానిని శమింపజేయవలయును. విక్షేపమున, మనస్సు విషయ వాసనలు కలదిగా తెలిసికొనవలెను. సమప్రాప్తి (బ్రహ్మప్రాప్తి) యందు మనస్సును కదలించరాదు. ఆ సమాధియందును, ప్రీతిని ఆస్వాదించరాదు. ప్రజ్ఞచే నిస్సంగుడై ఉండవలయును. నిశ్చలమగు చిత్తము బయటకు కదలబోవుచున్నపుడు ప్రయత్నముతో వారించవలెను. ఎప్పుడు చిత్తము, లయము నొందునో, విక్షేపమునకు లోను కాదో, చలించక, ఆభాసము లేక ఉండునో, అపుడు, మనస్సు బ్రహ్మస్వరూపమును పొందును.

లయము, విక్షేపము, కషాయము, సమప్రాప్తి అనునవి చిత్తముయొక్క నాలుగు అవస్థలు. నిరోధింపబడిన చిత్తము విషయములనుండి మరలి, పూర్వాభ్యాసవశమున, లయము (సుషుప్తి) కొరకు అభిముఖమయినప్పుడు, మేల్కొలుపు ప్రయత్నముచే గాని, లయకారణము నివారించుటచేత గాని, ఆ చిత్తమును ప్రబోధదశకు తీసికొనిరావలయును.

జీవన్ముక్తివివేకః

లయహేతవో నిద్రాశేషాజీర్ణ బహ్వశనశ్రమాః। అత ఏవాహుః-

శ్లో॥ సమాపయ్య నిద్రాం సుజీర్ణాల్పభోజీ
శ్రమత్యాగబాధే వివిక్తే ప్రదేశే।
సదాఽఽసీత నిస్తృష్ణ ఏవాప్రయత్నోఽథవా
ప్రాణరోధో నిజాభ్యాసమార్గాత్॥ ఇతి।

లయాదుత్థాపితం చిత్తం దైనందినప్రబోధాభ్యాసవశాద్యది కామభోగయోర్విక్షిప్యేత, తదా వివేకిజనప్రసిద్ధ భోగవస్తుగత సర్వదుఃఖానుస్మరణేన శాస్త్రప్రసిద్ధ జన్మాదిరహితాద్వితీయ

బ్రహ్మతత్త్వానుస్మరణపూర్వకేణ భోగ్యవస్తుదర్శనేన చ పునః పునః విక్షేపాచ్చిత్తం శమయేత్। కషాయ స్త్రీప్రశ్చిత్తదోషః। తీవ్రరాగద్వేషాది వాసనయా గ్రస్తం చిత్తం కదాచిత్ సమాహిత మివ లయవిక్షేపరహితం దుఃఖైకాగ్ర మవతిష్ఠతే। తాదృశం తచ్చిత్తం విజానీయాత్। సమాహితచిత్తా ద్వివేకేనావగచ్ఛేత్। అసమాహితం ఏత దిత్యవగమ్య లయవిక్షేపవత్ కషాయస్య ప్రతీకారం కుర్యాత్। సమశబ్దేన బ్రహ్మాభిధీయతే।

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।

భ. గీ. 13, 28 ఇతి స్మృతేః।

లయ విక్షేప కషాయేషు పరిహృతేషు పరిశేషా చ్చిత్తేన సమం బ్రహ్మ ప్రాప్యతే। తచ్చ సమప్రాప్తం చిత్తం లయ కషాయభ్రాన్త్యా న చాలయేత్। సూక్ష్మయా బుద్ధ్యా లయకషాయ ప్రాప్తీ వివిచ్య తస్యాం సమప్రాప్తా వతిప్రయత్నేన చిరం స్థాపయేత్। స్థాపితే తస్మిన్ బ్రహ్మస్వరూపభూతః పరమానందః సమ్యగావిర్భవతి। తథా చోదాహృతమ్–

శ్లో॥ సుఖ మాత్యన్తికం యత్తద్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్॥
భ. గీ. 6–?11 ఇతి। శ్రుతిశ్చ భవతి–

శ్లో॥ సమాధి నిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని
యత్సుఖం భవేత్।
న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదన్తఃకరణేన
గృహ్యతే॥ మై. ఉ. 4, 9 ఇతి।

నను సమాధ్యావిర్భూతస్య బ్రహ్మనందస్య బుద్ధిగ్రాహ్యత్వం శ్రుతి స్మృతిభ్యా మభిహితమ్। ఆచార్యైస్తు 'నాస్వాదయేత్ సుఖం తత్ర' ఇతి బుద్ధిగ్రాహ్యత్వం ప్రతిషిధ్యత ఇతి చేత్, నాయం దోషః।

భావప్రకాశిక

మనోలయమునకు కారణములు నిద్ర మిగిలిఉండుట, అజీర్ణ దోషము, బహ్వాహారము, బడలిక అయిఉన్నవి. కనుకనే ఇట్లు చెప్పిరి–

నిద్రను పూర్తిచేసికొని, బాగుగా జీర్ణమగు అల్పభోజనము కలవాడై, శ్రమ, ఉపద్రవాదులు లేని విజనప్రదేశమున, తృష్ణ లేనివాడై, ధ్యానమునకై ఎల్లప్పుడు కూర్చుండవలయును. లేదా, తన అభ్యాసపద్ధతిని అనుసరించి ప్రాణాయామము చేయవలెను.

లయమునుండి ప్రయత్నముతో చిత్తము ప్రతిదినము ప్రబోధ, అభ్యాసములచేత మేల్కొల్పబడినదై ఒకవేళ కామ, భోగములందు విక్షిప్తమైనచో, అప్పుడు వివేకి జనమునందు ప్రసిద్ధమైన భోగ్యవస్తువులయందలి దుఃఖానుస్మరణముచేతను, శాస్త్రప్రసిద్ధ జన్మాదిరహిత అద్వితీయ బ్రహ్మవస్తువుయొక్క అనుస్మరణముచేతను, మాటిమాటికి విక్షేపమునుండి చిత్తమును శమింపజేయవలెను.

కషాయము అనగా, తీవ్ర చిత్తదోషము అగు తీవ్ర రాగ, ద్వేషవాసన. ఆ వాసనచే వాసితమైన చిత్తము ఒకప్పుడు సమాహితము వలెను, లయవిక్షేపరహితముగాను, దుఃఖమే ఉత్తర కాలమునందు ఇచ్చునదిగాను ఉండును. అట్టి చిత్తమును సమాహితచిత్తమునుండి వివేకముతో గ్రహించవలెను. వాసనా వశమగు చిత్తము సమాహితము కాదని తెలిసికొని, లయ, విక్షేపములకు వలెనే కషాయమునకు (వాసనలకు) ప్రతిక్రియ చేయవలయును. 'సమప్రాప్తి' అనుచోట, 'సమ' శబ్దముచే బ్రహ్మ చెప్పబడుచున్నది.

"సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।"

అను భగవద్గీతావచనము వలన, 'సమ' శబ్దముచేత బ్రహ్మ వివక్షితమని తెలియవలయును.

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని।
శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః॥"

అనుచోటను 'సమ' శబ్దముచేత బ్రహ్మ చెప్పబడుచున్నది.

లయ, విక్షేప, కషాయములు తొలగించుకొనబడగా, పరిశేష న్యాయముచేత చిత్తముచే సమమగు బ్రహ్మ పొందబడుచున్నది. అపుడు, సమప్రాప్తస్థితియందు ఈ అవస్థ కూడ కషాయ, లయములని భ్రాంతిపడి, చిత్తమును చలింపజేయరాదు. సూక్ష్మ బుద్ధితో లయ, కషాయప్రాప్తిని వివేచన చేసికొని, సమప్రాప్తి యందు అతిప్రయత్నముతో చిత్తమును నిలుపవలెను. చిత్తము నిలుకడగా ఉన్నప్పుడు, బ్రహ్మస్వరూపమగు పరమానందము, ఆ చిత్తమునందు బాగుగా ఆవిర్భవించును (ప్రతిబింబించును). ఇట్లే ఉదహరింపబడినది–

"సుఖం ఆత్యన్తికం యత్ తత్ బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్।"

బ్రహ్మస్వరూపమగు పరమ సుఖము బుద్ధిగ్రాహ్యము, ఇంద్రియములకు గోచరము కానిది అని భావము.

శ్రుతి కూడ కలదు–

"సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని
యత్సుఖం భవేత్।
న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం
తదన్తఃకరణేన గృహ్యతే॥"

సమాధి అభ్యాసముచే మాలిన్యము పోయిన మనస్సును ఆత్మ యందు నిలిపినపుడు ఏ సుఖము లభించునో, ఆ సుఖమును మాటలతో వర్ణించుట శక్యము కాదు. అది కేవలము తన అంతః కరణముచేతనే గ్రహింపబడుచున్నది అని అర్థము.

ఓయీ! సమాధియందు ఆవిర్భవించు బ్రహ్మానందము

బుద్ధిగ్రాహ్యము అని శ్రుతి స్మృతులయందు చెప్పబడినది. గౌడపాదాచార్యులవారిచేత నైతే 'నాస్వాదయేత్ సుఖం తత్ర' ఆ సమాధిదశయందు సుఖమును ప్రీతితో ఆస్వాదించరాదు అని బుద్ధిగ్రాహ్యత్వమును నిరాకరించుచున్నారు కదా! అనినచో, ఇది దోషము కాదు.

## జీవన్ముక్తివివేకః

తత్ర నిరోధసుఖం బుద్ధిగ్రాహ్యం న ప్రతిషిధ్యతే। కింతు సమాధివిరోధినో వ్యుత్థానరూపస్య పరామర్శస్యైవ ప్రతిషేధాత్। యథా నిదాఘదివసేషు మధ్యాహ్నే జాహ్నవీహ్రదనిమగ్నే నానుభూయమానమపి శైత్యసుఖం తదా వక్తు మశక్యం, పశ్చా దున్మగ్నేన అభిధీయతే। యథా వా సుషుప్తా వవిద్యావృత్తిభి రతిసూక్ష్మైభిః అనుభూయమానమపి స్వరూపసుఖం తదానీం సవికల్పకేన అన్తఃకరణవృత్తిజ్ఞానేన గ్రహీతు మశక్యమ్। ప్రబోధ కాలే తు స్మృత్యా విస్పష్టం పరామృశ్యతే। తథా సమాధౌ వృత్తిరహితేన సంస్కారమాత్రశేషతయా సూక్ష్మేణ వా చిత్తేన సుఖానుభవః శ్రుతిస్మృత్యో ర్వివక్షితః। 'మహదిదం సమాధిసుఖ మన్వభూవమ్' ఇత్యేతాదృశో వ్యుత్థితస్య సవికల్పకః పరామర్శో ఽత్రాస్వాదనమ్। తదేవాచార్యైః ప్రతిషిధ్యతే। తమేవ స్వాభి ప్రాయం ప్రకటయితుం 'నిఃసంగః ప్రజ్ఞయా భవేత్' ఇత్యుక్తమ్। ప్రకృష్టం సవికల్పకం జ్ఞానం ప్రజ్ఞా। తయా సహ సంగం పరిత్యజేత్। యద్వా పూర్వోక్తా ధృతిగృహీతా బుద్ధిః ప్రజ్ఞా। తదాత్మకేన సాధనేన సుఖాస్వాదన తద్వర్ణనాదిరూప మాసక్తిం వర్జయేత్। సమాధౌ బ్రహ్మానందే నిమగ్నం చిత్తం యది కదాచి త్సుఖాస్వాదనాయ వా శీతవాత మశకాద్యుపద్రవేణ వా నిశ్చరేత్ తదా నిశ్చర త్తచ్చిత్తం పునః పునః నిశ్చలం యథా భవతి తథా పరబ్రహ్మణా సహైకీకుర్యాత్। తత్ర చ నిరోధప్రయత్న ఏవ

సాధనమ్। ఏకీభావ ఏవ 'యదా న లీయతే చిత్తమ్?' ఇత్యనేన శ్లోకేన స్పష్టీక్రియతే। 'అనిఙ్గన మనాభాసమ్' ఇత్యాభ్యాం పదాభ్యాం కషాయ సుఖ దుఃఖాస్వాదౌ ద్వౌ చ ప్రతిషిధ్యేతే। లయ విక్షేప కషాయ సుఖాస్వాదేభ్యో వినిర్ముక్తం చిత్త మవిచ్ఛేదేన బ్రహ్మణ్యవస్థితం భవతి।

ఏతదేవాభిప్రేత్య కఠవల్లీషు పఠ్యతే-

శ్లో॥ యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ।
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిమ్॥
తాం యోగమితి మన్యన్తే స్థిరా మిన్ద్రియధారణామ్।
అప్రమత్త స్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ॥
కఠ. ఉ. 2, 3, 10-11 ఇతి।

ఉపేక్షితో యోగ ఇన్ద్రియవృత్తీనాం ప్రభవం కరోతి। అనుష్ఠితస్తు తాసాం లయహేతుః।

భావప్రకాశిక

గౌడపాదకారికలలో **చిత్తవృత్తినిరోధసుఖము** బుద్ధిగ్రాహ్యము కాదని నిషేధింపబడలేదు. మరేమనగా, సమాధికి విరోధిగా నుండు వ్యుత్థానకాలసుఖముయొక్క పరామర్శయే ప్రతిషేధింపబడినది. ఎట్లనగా, గ్రీష్మదినములందు మధ్యాహ్నకాలమున, గంగాప్రవాహమున మునిగినవానిచేత శైత్యసుఖము అనుభవింపబడినను, అప్పుడు చెప్పుటకు శక్యము కాదు. తరువాత గంగాజలమునుండి పైకి లేచినవానిచేత ఆ శైత్యసుఖము చెప్పబడును. అట్లే, సుషుప్తిసమయమున, అతిసూక్ష్మములగు అవిద్యావృత్తులచే స్వరూపసుఖము అనుభవింపబడినను, ఆ సుషుప్తియందు సవికల్పక అంతఃకరణ వృత్తిజ్ఞానముచే ఆ స్వరూపసుఖము గ్రహించుటకు శక్యము కాదు. ప్రబోధకాలము నందైనచో, ఆ సుఖమును స్మరించి విస్పష్టముగా పరామర్శ

చేయబడుచున్నది.('సుఖ మహమస్వాప్సమ్'=నేను హాయిగా నిద్ర పోయితిని). అట్లే, వృత్తిరహితమైన సమాధియందు సంస్కార మాత్రశేషముగా సూక్ష్మమైన చిత్తముచేత సుఖానుభవము శ్రుతి స్మృతులయందు బుద్ధిగ్రాహ్యమని వివక్షితమైనది. నేను గొప్ప సమాధిసుఖమును అనుభవించితిని అనురీతిగా వ్యుత్థానదశయందు సవికల్పక పరామర్శము, దానియొక్క ఆస్వాదము ఆచార్యులచే ప్రతిషేధింపబడినది. ఆ తమ అభిప్రాయమునే ప్రకటించుటకు ఆచార్యులు 'నిస్సంగః ప్రజ్ఞయా భవేత్' బుద్ధిచేత నిస్సంగుడుగా నుండవలెను అని చెప్పిరి. ప్రజ్ఞ అనగా ప్రకృష్టమైన సవికల్పక జ్ఞానము .(ప్రకృష్టం సవికల్పకం జ్ఞానం ప్రజ్ఞా). దానితోగూడ సంగమును పరిత్యజించవలెను. లేదా, వెనుక చెప్పిన ధృతిచే గ్రహింపబడిన బుద్ధి, ప్రజ్ఞ. ఆ ప్రజ్ఞాసాధనముతో సుఖా స్వాదనము, తద్వర్ణనము మొదలగువానియందు ఆసక్తిని విడనాడవలెను. సమాధిదశయందు, బ్రహ్మానందమునందు నిమగ్నమైన చిత్తము ఒకప్పుడు సుఖాస్వాదనము కొరకు గాని, శీతవాత మశకాది ఉపద్రవముచేత గాని, సమాధిని చాలించి, బహిర్ముఖముగా వెలువడినచో, మరల ఆ మనస్సును నిశ్చలము చేసి, పరబ్రహ్మతో ఏకముగుటకు ప్రయత్నించవలెను. అచట, నిరోధప్రయత్నమే సాధనము. ఏకీభావమే 'యదా న లీయతే' చిత్తమ్' అను శ్లోకముచేత స్పష్టము చేయబడినది. 'అనిఙ్గనమ్ అనాభాసమ్' అను పదములచే కషాయ, సుఖాస్వాదములు రెండును నిషేధింపబడినవి. లయ, విక్షేప, కషాయ, సుఖా స్వాదములనుండి విముక్తమైన చిత్తము నిర్విఘ్నముగా బ్రహ్మ యందు నిలుకడ గలది అగును. ఈ అభిప్రాయముతోనే కఠవల్లు లందు ఇట్లు చెప్పబడినది-

"యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ।
బుద్ధిశ్చ న విచేష్టేత తా మాహుః పరమాం గతిమ్॥
తాం యోగమితి మన్యన్తే స్థిరా మిన్ద్రియధారణామ్।
అప్రమత్త స్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ॥

ఎప్పుడు మనస్సుతోగూడ, అయిదు జ్ఞానేంద్రియములు కదలకుండునో, బుద్ధియు, చలించదో ఆ స్థితిని 'పరమగతి' అని చెప్పుచున్నారు. దానినే స్థిరమగు ఇంద్రియధారణము, యోగము అనుచున్నారు. అపుడు అప్రమత్తుడగును.

యోగమనగా ప్రభవ అప్యయములు.

ఉపేక్షింపబడిన యోగము, ఇంద్రియవృత్తులకు కారణమగుచున్నది. అనుష్ఠితమైన యోగము ఆ చిత్తవృత్తులకు లయ హేతువు అగుచున్నది.

జీవన్ముక్తివివేకః

అత ఏవ యోగస్య స్వరూపలక్షణం సూత్రయతి– 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' 1–2 ఇతి। వృత్తీనా మానన్త్యా న్నిరోధోఽశక్య ఇతి శంకాం వారయితు మియత్తాం సూత్రయతి– 'వృత్తయః పంచతయ్యః క్లిష్టా అక్లిష్టాః' 1–5 ఇతి। రాగద్వేషాదిక్లేశ రూపా అసురవృత్తయః క్లిష్టాః। రాగాదిరహితా దైవవృత్తయోఽక్లిష్టాః। యద్యపి పంచస్వేవ క్లిష్టానా మక్లిష్టానాం చాంతర్భావః। తథాఽపి క్లిష్టా ఏవ నిరోద్ధవ్యా ఇతి మందబుద్ధిం వారయితుం తాభిః సహాక్లిష్టా అప్యుదాహృతాః। నామధేయ లక్షణాభ్యాం తా వృత్తీ ర్విశదయితుం సూత్రషట్కమాహ– 'ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః' 1–6 'ప్రత్యక్ష అనుమాన ఆగమాః ప్రమాణాని' 1–7, 'విపర్యయో మిథ్యాజ్ఞాన మతద్రూప ప్రతిష్ఠమ్।' 1–8, 'శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః' 1–9, 'అభావప్రత్యయాలంబనా వృత్తి ర్నిద్రా' 1–10, అనుభూత విషయాసంప్రమోషః స్మృతిః' 1–11 ఇతి।

వస్త్వభావః ప్రతీయతే యస్మిం స్తమస్యావరకే సతితత్తమో౽భావ ప్రత్యయః। తమోగుణం విషయీకుర్వతీ వృత్తిర్ని ద్రేత్యుచ్యతే। అనుభూత విషయస్యాసంప్రమోష స్తదనుభవజన్య మనుసంధానమ్। పంచవిధ వృత్తి నిరోధసాధనంసూత్రయతి-'అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః' 1-12 ఇతి। యథా తీవ్రవేగోపేతం నదీప్రవాహం సేతుబంధనేన నివార్య కుల్యాప్రణయనేన క్షేత్రాభిముఖం తిర్యక్ప్రవాహాన్తర ముత్పాద్యతే, తథా వైరాగ్యేణ చిత్తనద్యా విషయప్రవాహం నివార్య సమాధ్యభ్యాసేన ప్రశాన్తః ప్రవాహః సంపాద్యతే। మంత్రజప దేవతాధ్యానాదీనాం క్రియారూపత్వే నావృత్తిలక్షణో౽భ్యాసః సంభావ్యతే। సర్వవ్యాపారోపరమరూపస్య సమాధేః సాధకః కో నామాభ్యాస ఇతి శంకాం వారయితుం సూత్రయతి- తత్ర స్థితౌ యత్నో౽భ్యాసః' 1-13 ఇతి। స్థితి ర్నైశ్చల్యం నిరోధః। యత్నో మానస ఉత్సాహః। స్వత ఏవ బహిష్ప్రవాహశీలం చిత్తం సర్వథా నిరోధయిష్యా మీత్యేవంవిధ ఉత్సాహ ఆవర్త్యమానో౽భ్యాస ఇత్యుచ్యతే। అయ మభ్యాస ఇదానీం ప్రవృత్తః స్వయ మదృఢః సన్ననాది ప్రవృత్తా వ్యుత్థానవాసనాః కథ మభిభవే దిత్యాశంకా మపవదితుం సూత్రయతి- 'స తు దీర్ఘకాల నైరన్తర్య సత్కారసేవితో దృఢభూమిః' 1-14 ఇతి।

## భావప్రకాశిక

ఈ కారణము వలననే యోగమునకు స్వరూపలక్షణమును సూత్రించుచున్నారు-

"యోగ శ్చిత్తవృత్తినిరోధః।"

చిత్తవృత్తుల యొక్క నిరోధము యోగము అని అర్థము. చిత్తవృత్తులు అనంతములు గనుక, వానియొక్క నిరోధము అశక్యము అను శంకను నివారించుటకు ఆ చిత్తవృత్తులయొక్క పరిమాణమును

(సంఖ్యను) సూత్రించుచున్నారు-

"వృత్తయః పంచతయ్యః క్లిష్టాఽక్లిష్టాః।"

రాగద్వేషాది రూపములగు ఆసుర వృత్తులు, (చిత్త పరిణామములు) క్లిష్టములు. రాగాదిరహితములగు దైవవృత్తులు అక్లిష్టములు. విచారించగా, ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతిరూపములగు అయిదు వృత్తులలోనే ఈ క్లిష్టములు, అక్లిష్టములు అంతర్భవించుచున్నవి. అయినను, క్లిష్టములగు చిత్తవృత్తులే నిరోధింపదగినవి అనెడి మందబుద్ధిని వారించుటకు క్లిష్టవృత్తులతోపాటు, అక్లిష్టవృత్తులు కూడ, ఉదాహరింపబడినవి. నామములతోను, లక్షణములచేతను చిత్తవృత్తులను విశద పరచుటకు ఆరు సూత్రములను రచించిరి-

"ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః।"

"తత్ర ప్రత్యక్ష అనుమాన ఆగమాః ప్రమాణాని।"

వానిలో ప్రత్యక్షము, అనుమానము, ఆగమము ప్రమాణములు. (ప్రమాణాని).

"విపర్యయః మిథ్యాజ్ఞానమ్ అతద్రూప ప్రతిష్ఠమ్।"

"శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః।"

"అభావ ప్రత్యయాలంబనావృత్తిః నిద్రా।"

"అనుభూత విషయాసంప్రమోషః స్మృతిః।"

తమస్సునందు ఏ వస్తువును కనిపించదు. ఆవరకమగు ఆ తమస్సు, అభావప్రత్యయము. తమోగుణమగు ఆ అభావ ప్రత్యయమును విషయముగా చేసికొనిన వృత్తి, నిద్ర అని పిలువబడుచున్నది. అదివరకు మనము అనుభవించిన విషయమును విడిచివేయక, మరల అనుసంధానము చేసికొనుట స్మృతి. అయిదు విధములగు వృత్తులను నిరోధించుటకు సాధనమును సూత్రించుచున్నారు-

"అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః।"

ఎట్లనగా, తీవ్రవేగముతో ప్రవహించు నదీప్రవాహమునకు అడ్డుకట్ట నిర్మించి ప్రవాహగతిని ఆపి కాలవలద్వారా పొలములలోనికి నీరు ప్రసరించుటకు తిర్యక్ప్రవాహము మరియొకటి నిర్మింపబడును, ఏర్పరచబడును. అదేవిధముగా వైరాగ్యముచే చిత్తనదీ విషయప్రవాహమును నివారించి, సమాధి అభ్యాసముచే శాంత ప్రవాహము సంపాదింపబడును. మంత్ర, జప, దేవతాధ్యానాదులు క్రియారూపము లగుటచే ఆవృత్తి చేయుట అభ్యాసము అని భావించవలయును. సర్వవ్యాపారములను ఉపరమింపజేయుట స్వరూపముగా గల సమాధికి సాధకమగు అభ్యాసము ఏమి కలదు? అను శంకను వారించుటకు సూత్రించుచున్నారు-

"తత్ర స్థితౌ యత్నః అభ్యాసః।"

సమాధిస్థితినైశ్చల్యము చిత్తవృత్తినిరోధము అయి ఉన్నది. అచట 'యత్నము' అనగా మానసమగు ఉత్సాహము. చిత్తము బాహ్యముగా ప్రసరించునట్టి స్వభావము కలది. పూర్తిగా ఆ చిత్తమును నిరోధింతును అనునట్టి ఉత్సాహము ఆవృత్తమై 'అభ్యాసము' అని పిలువబడును. ఈ అభ్యాసము ఇపుడు ప్రవృత్తమైనది, స్వయముగా దృఢమైనది కాదు. అనాది ప్రవృత్తములైన వ్యుత్థాన, వాసనలను ఎట్లు ఈ అభ్యాసము అభిభవించగలదు ? అను ఆశంకను తొలగించుటకు సూత్రించు చున్నారు-

"సతత దీర్ఘకాల నైరన్తర్య సత్కార సేవితః దృఢభూమిః।"

జీవన్ముక్తి వివేకః

లోకా హి మూఢస్య వచన ముదాహరన్తి- 'విద్యమానా శ్చత్వార ఏవ వేదాః, తానధ్యేతుం గతస్య మాణవకస్య పంచ దివసా అతీతాః, అద్యాప్యసౌ నాగతః' ఇతి। తాదృశ ఏవాయం

యోగీ తదా స్యాద్ యదా దివసైర్వా మాసైర్వా యోగసిద్ధిం వాంఛేత్। తస్మాత్ సంవత్సరైర్జన్మభిర్వా దీర్ఘకాలం యోగ ఆసేవితవ్యః। తథా చ స్మర్యతే–

శ్లో॥ అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్॥

భ. గీ. 6, 45 ఇతి।

చిర మాసేవ్యమానోఽపి యది విచ్ఛిద్య విచ్ఛిద్య సేవ్యేత తర్హి ఉత్పద్యమానానాం యోగసంస్కారాణాం సమనన్తరభావిభి ర్విచ్ఛేదకారిభి ర్వ్యుత్థానకాలీనైః సంస్కారై రభిభవే సతి ఖన్దన కారోక్త న్యాయ ఆపతేత్– 'అగ్రే ధావ న్పృష్ఠా ల్లుప్యమానో విస్మరణశీలశ్రుతవత్క్రమాలంబేత' ఇతి। తస్మా న్నిరన్తర మాసేవితవ్యః। సత్కార ఆదరః। అనాదరేణ సేవ్యమానే వసిష్ఠోక్త న్యాయ ఆపతేత్–

శ్లో॥ అకర్తృ కుర్వదప్యేత చ్చేత శ్చేత్ క్షీణవాసనమ్।
దూరం గతమనా జన్తుః కథాసంశ్రవణే యథా॥ ఇతి।

అనాదరో లయ విక్షేప కషాయ సుఖాస్వాదనానా మపరిహారః। తస్మాదాదరేణ సేవితవ్యః। దీర్ఘకాలాదిత్రైవిధ్యేన సేవితస్య సమాధేః దృఢభూమిత్వం నామ విషయసుఖవాసనయా దుఃఖవాసనయా వా చాలయితు మశక్యత్వమ్। తచ్చ భగవతా దర్శితమ్–

శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥

భ. గీ. 6, 22 ఇతి।

అపరలాభస్యానాధిక్యం కచవృత్తాన్తేన వసిష్ఠ ఉదాజహార–

శ్లో॥ కచః కదాచిదుత్థాయ సమాధేః ప్రీతమానసః।
ఏకాన్తే సముువాచేద మేవం గద్గదయా గిరా॥

కిం కరోమి క్వ గచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్।
ఆత్మనా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా॥
స బాహ్యాభ్యన్తరే దేహే హ్యధ ఊర్ధ్వం చ దిక్షు చ।
ఇత ఆత్మా తథేహాత్మా నాస్త్యనాత్మమయం క్వచిత్॥
న తదస్తి న యత్రాహం న తదస్తి న యన్మయి।
కిమన్య దభివాంఛామి సర్వం సంవిన్మయం తతమ్॥
ల. వా. 18, 37-40

స్ఫార బ్రహ్మమలాంభోధేః ఫేనాః సర్వే కులాచలాః।
చిదాదిత్యమహాతేజో మృగతృష్ణా జగచ్ఛ్రియః॥
ల. వా. 18, 35 ఇతి।

భావప్రకాశిక

జనులు మూఢుని వచనమును ఇట్లు ఉదహరించుచున్నారు- 'నాలుగు వేదములే కదా ఉన్నవి. వానిని అధ్యయనము చేయుటకు వెళ్ళిన పిల్లవాడు ఇంకను రాలేదు. అయిదు రోజులు గడచినవి. అట్లే, ఈ యోగి కూడ, రోజులలోనో, నెలలలోనో, యోగసిద్ధిని కాంక్షించునట్టివాడు. అట్టివాడు కనుక సంవత్సరముల చేతనో, అనేక జన్మలచేతనో, దీర్ఘకాలము యోగాభ్యాసమును సేవించవలయును. అట్లే భగవద్గీతయందు,

"అనేకజన్మసంసిద్ధః తతో యాతి పరాం గతిమ్।"

అనేక జన్మలకు సంసిద్ధిని పొంది, పరమగతిని పొందుచున్నాడు అని చెప్పబడినది.

చిరకాలము యోగాభ్యాసము చేయువాడు కూడ, మధ్యలో కొన్నాళ్ళు ఆగి, ఆగి ఆ యోగమును సేవించినచో, ఉత్పద్యమానములైన యోగసంస్కారములు మధ్యలో కలుగు వ్యుత్థాన కాలములోని యోగప్రతిబంధక సంస్కారములచే తిరస్కరింపబడుచుండగా, ఖండనకారునిచే చెప్పబడిన న్యాయము సంభవించును.

ముందు పరుగిడువాడు తరువాత, వెనుకబడి తగ్గినవాడు, మరిచిపోవు స్వభావముగలవాని విద్యవలె, దేనిని ఆలంబనము చేసికొనును ? కనుక, ఎడతెగకుండా యోగాభ్యాసమును చేయవలయును. సత్కారః = ఆదరము. అనాదరముగా సేవించినచో, వసిష్ఠోక్త న్యాయము సంభవించును.

వాసనలు క్షీణించిన చిత్తము, క్రియను చేసినను, కర్త కాదు. ఎట్లనగా, పురాణకథా శ్రవణము చేయునపుడు, మనస్సు దూరముగా పోయిన ప్రాణి, వినినను విననట్లే యగును.

యోగమునందు అనాదరము కలిగినచో లయ, విక్షేప, కషాయ, సుఖాస్వాదములు తప్పనిసరి అగును. అందువలన, ఆదరముతో యోగము సేవింపదగియున్నది.

దీర్ఘకాల నైరంతర్య సత్కారములచే సేవించబడిన సమాధి, దృఢభూమి యగును. అనగా, విషయసుఖవాసనలచేత గాని, దుఃఖవాసనలచేతగాని వారించుటకు శక్యము గాకపోవుట అని అర్థము. ఆ విషయము కృష్ణభగవానునిచే ఇట్లు చూపబడినది-

**"యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః।**
**యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే॥"**

ఏ యోగలాభమును పొంది మరియొక లాభమును దాని కంటె అధికమైనదానినిగా తలంచడో, ఏ యోగమునందు పరినిష్ఠితుడై ఎంత కష్టమువచ్చినను చలింపడో, ఆ యోగి సమాధి దృఢభూమి యగును అని భావము.

యోగలాభము కంటె ఇతరలాభము అధికము కాదు అనుటకు కచ వృత్తాంతముచే వసిష్ఠుడు ఉదహరించెను-

కచుడు ఒకానొకప్పుడు సమాధినుండి వ్యుత్థితుడై, శాంత మనస్కుడై ఏకాంతమున, తానొక్కడే ఉండి, గద్గదస్వరముతో ఇట్లు పలికెను-

ఏమి చేయుదును ? ఎక్కడకు వెళ్ళుదును ? దేనిని తీసికొందును? దేనిని విడిచిపెట్టుదును? ప్రళయకాలజలము చేత సమస్తము నింపబడినట్లు, ఆత్మవస్తువుచే సర్వము నింపబడెను. శరీరము లోపల, వెలుపల, క్రింద, పైన, అన్ని దిక్కులందు ఇటు, అటు ఆత్మవస్తువే కానవచ్చుచున్నది. ఆత్మకాని జగత్తు లేనేలేదు. నేను ఎక్కడ లేనో, అట్టిచోటే లేదు. నాయందు లేని వస్తువే లేదు. నాకంటె వేరైనది, లేనిది లేదు గాన, దేనిని కోరుదును? సర్వము, చిదాత్మరూపము. సర్వ కులపర్వతములు విస్తారమైన బ్రహ్మవస్తువనెడి స్వచ్ఛమైన సముద్రముయొక్క నురుగులు. చిత్సూర్యుని మహాతేజస్సుయొక్క ఎండమావులే ఈ జాగతిక శోభలు.

## జీవన్ముక్తివివేకః

గురుణా దుఃఖేనాప్యవిచాల్యత్వం శిఖిధ్వజస్య వత్సర త్రయ సమాధివృత్తాన్తేనోదాజహార–

శ్లో॥ నిర్వికల్పసమాధిస్థం తత్రాపశ్య న్మహీపతిమ్।
రాజానం తావ దేతస్మాద్ బోధయామి పరాత్పదాత్॥

ఇతి సంచిన్త్య చూడాలా సింహనాదం చకార సా।
భూయో భూయః ప్రభో ర గ్రే వనేచరభయప్రదమ్॥

న చచాల తదా రామ యదా నాదేన తేన సః।
భూయో భూయః కృతేనాపి తదా సా తం న్యచాలయత్॥
చాలితః పాతితోఽప్యేష తదా నో బుబుధే బుధః॥

ప్రహ్లాదవృత్తాన్తేనాప్యేతదేవోదాజహార–

శ్లో॥ ఇతి సంచిన్తయన్నేవ ప్రహ్లాదః పరవీరహా।
నిర్వికల్ప పరానన్దసమాధిం సముపాయయౌ॥
నిర్వికల్ప సమాధిస్థ శ్చిత్రార్పిత ఇవాబభౌ।
పంచవర్షసహస్రాణి పీనాంగోఽతిష్ఠ దేకదృక్॥ ల. వా.

మహాత్మన్ సంప్రబుధ్యస్వేత్యేవం విష్ణు రుదాహరత్।
పాంచజన్యం ప్రదధ్మౌ చ ధ్వనయన్ కకుభాం గణమ్॥
ల. వా.

మహతా తేన శబ్దేన వైష్ణవప్రాణజన్మనా।
బభూవ సంప్రబుద్ధాత్మా దానవేశః శనైః శనైః॥
ల. వా. 22, 107 ఇతి।

ఏవం వీతహవ్యాదీనామపి సమాధి రుదాహరణీయః। వైరాగ్యం ద్వివిధం, అపరం పరంచేతి। యతమానవ్యతిరేక ఏకేన్ద్రియవశీకారభేదై రపరం చతుర్విధమ్। తత్రాద్యం త్రయ మర్థాత్సూత్రయన్సాక్షా చ్చతుర్థం సూత్రయతి- 'దృష్టాను శ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్' (1-15) ఇతి। స్రక్చందన వనితా పుత్ర మిత్ర క్షేత్ర ధనాదయో దృష్టాః। వేదోక్తాః స్వర్గాదయ ఆనుశ్రవికాః। తత్రోభయత్ర సత్యామపి తృష్ణాయాం వివేకతారతమ్యేన యతమానాది వైరాగ్యత్రయం భవతి। అస్మిన్ జగతి కిం సారం కిమసారమితి గురుశాస్త్రాభ్యాం జ్ఞాస్యామీత్యుద్యోగో యతమానత్వమ్ (1), స్వచిత్తే పూర్వం విద్యమానానాం దోషాణాం మధ్యేఽభ్యస్యమానేన వివేకేనైతావన్తః పక్వా ఏతావన్తోఽవశిష్టా ఇతి వివేచనం వ్యతిరేకః (2), దృష్టాను శ్రవిక విషయప్రవృత్తే ర్దుఃఖాత్మత్వబోధేన తాం ప్రవృత్తిం పరిత్యజ్య మనసి ఔత్సుక్యమాత్రేణ వితృష్ణావస్థాన మేకేంద్రియ త్వమ్ (3), వితృష్ణత్వం వశీకారః (4), తదిద మపరం వైరాగ్య మష్టాంగయోగప్రవర్తకత్వేన సంప్రజాతస్యాన్త రంగమ్, అసంప్రజ్ఞాతస్య తు బహిరంగమ్। తత్రాంతరంగమ్ పరం వైరాగ్యం సూత్రయతి- 'తత్పరం పురుషఖ్యాతే ర్గుణ వైతృష్ణ్యమ్' (1-16) ఇతి। సంప్రజ్ఞాత సమాధిపాటవేన గుణ త్రయాత్మకాత్ ప్రధానా ద్విరక్తస్య పురుషస్య ఖ్యాతిః

సాక్షాత్కార ఉత్పద్యతే। తస్మాచ్చ సాక్షాత్కారా దశేషగుణత్రయ వ్యవహారే యద్వైతృష్ణ్యం తత్పరం వైరాగ్యమ్।

భావప్రకాశిక

శిఖిధ్వజునకు కలిగిన సంవత్సరత్రయ సమాధివృత్తాంతముచే వసిష్ఠుడు ఎంత కష్టము వచ్చినను చలింపకపోవుటను ఉదహరించెను-

ఆ అరణ్యమున, నిర్వికల్ప సమాధిలోనున్న భర్తయగు శిఖిధ్వజ మహారాజును, భార్యయగు చూడాల చూచి, ఆ పరమపద సమాధినుండి మేల్కొల్పెదను అని తలంచి, సింహగర్జనము చేసెను. వనేచరులకు గూడ, భయము కలిగించు నాదమును ప్రభువు ఎదుట మాటిమాటికి చేసెను. ఓ రామా! ఆ నాదముచేత శిఖిధ్వజుడు చలించలేదు. అపుడు, ఆమె అతనిని కదలించి చూచెను. కదలించినను, పడవేసినను, దొర్లించినను, ఇతడు సమాధినిష్ఠుడుగానే ఉండి మేల్కాంచకపోయెను.

ప్రహ్లాద వృత్తాంతము చేత గూడ, దీనినే ఉదాహరించెను.

ఈవిధముగా ఆలోచించుచునే శత్రువీరులను సంహరించిన ప్రహ్లాదుడు నిర్వికల్ప పరమానంద సమాధిని పొందినవాడాయెను. ఆ నిర్వికల్పసమాధిలో చిత్తరువునందు సమాధిస్థితుని వలె అయిదు వేల సంవత్సరములు బలిష్ఠ భుజములు కల ఆ ప్రహ్లాదుడు, ఏక దృష్టితో నుండెను. విష్ణువు వచ్చి, మహాత్మా! సమాధిని చాలించి, మేల్కొనుము అనెను. పాంచజన్యమును పూరించెను. దిక్కులు పిక్కటిల్లెను. ఆ శంఖమునుండి బయలువెడలిన మహాధ్వని వలన ప్రహ్లాదుడు, మెల్లమెల్లగా మేల్కాంచిన మనస్సు కలవాడు అయెను.

ఇట్లే, వీతహవ్యుడు మొదలగువారియొక్క సమాధి కూడ, ఉదహరింపబడినదై ఉన్నది.

వైరాగ్యము రెండు విధములు– అపర వైరాగ్యము, పర వైరాగ్యము. అపర వైరాగ్యము యతమానము, వ్యతిరేకము, ఏకేంద్రియము, వశీకారము అను భేదములచే నాలుగు విధములు. వానిలో మొదటి మూడు వైరాగ్యములను ఆర్థికముగా (అర్థాత్) సూచించి, సాక్షాత్తు శబ్దముతో నాలుగవ వైరాగ్యమును సూత్రించుచున్నారు–

"దృష్టానుశ్రవిక విషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్।"

స్రక్చందన, వనితా, పుత్ర, విత్త, క్షేత్ర, ధనాదులు దృష్ట విషయములు. వేదోక్తములగు స్వర్గాదులు ఆనుశ్రవికములు (విన్నవి). ఆ రెంటియందు తృష్ణ ఉన్నను,వివేకతారతమ్యముచే యతమానము, వ్యతిరేకము, ఏకేంద్రియము అను మూడు వైరాగ్యములు కలుగుచున్నవి. ఈ జగత్తునందు సారమైనది ఏది? ఏది నిస్సారము? అని గురు, శాస్త్రములచే తెలిసికొందును అను ప్రయత్నము యతమానత్వము. తన చిత్తమునందు పూర్వము ఉన్న దోషములలో తాను, అభ్యసించెడి వివేకముచేత ఈ దోషములు పక్వములైనవి, ఈ దోషములు మిగిలి ఉన్నవి అను వివేచన, వ్యతిరేకము. దృష్ట విషయములందు, ఆనుశ్రవిక విషయములందును ప్రవృత్తి, దుఃఖాత్మకము అనెడి బోధచేత ఆ ప్రవృత్తిని విడనాడి, మనస్సులో ఔత్సుక్యమాత్రముచేత తృష్ణను వీడి ఉండుట ఏకేంద్రియత్వము. పూర్తిగా తృష్ణను వీడుట, వశీకారము. ఆ యీ అపర వైరాగ్యము అష్టాంగ యోగమునందు ప్రవర్తింపజేసి, సంప్రజ్ఞాత సమాధికి అంతరంగము అగును. అసంప్రజ్ఞాత సమాధికైనచో, బహిరంగము. అసంప్రజ్ఞాతసమాధికి అంతరంగమగు పరవైరాగ్యమును సూత్రించుచున్నారు–

"తత్పరం పురుషఖ్యాతేః గుణవైతృష్ణ్యమ్।"

సంప్రజాత సమాధి అభ్యాసపాటవముచేత గుణత్రయాత్మకమగు ప్రధానము (ప్రకృతి) నుండి విరక్తి కలవానికి పురుషఖ్యాతి ఆత్మసాక్షాత్కారము కలుగుచున్నది. ఆ సాక్షాత్కారము వలన, సమస్త గుణత్రయవ్యవహారమునందు తృష్ణ వీడుట జనించును. అది, పరవైరాగ్యము.

జీవన్ముక్తివివేకః

తస్య తారతమ్యేన సమాధేః శీఘ్రత్వ తారతమ్యం సూత్రయతి– 'తీవ్ర సంవేగానా మాసన్నః సమాధిలాభః' 1–20 ఇతి। సంవేగో వైరాగ్యమ్ తద్భేదా ద్యోగిన స్త్రివిధాః– మృదు సంవేగా, మధ్య సంవేగా స్తీవ్రసంవేగాశ్చేతి। ఆసన్నో ఽల్పే నైవ కాలేన సమాధి ర్లభ్యత ఇత్యర్థః। తీవ్రసంవేగేష్వేవ సమాధి తారతమ్యం సూత్రయతి– 'మృదుమధ్యాధిమాత్రత్వా త్తతోఽపి విశేషః' 1–21 ఇతి। మృదుతీవ్రో మధ్యతీవ్రోఽధిమాత్ర తీవ్ర ఇతి। తేష్వప్యుత్తరోత్తరస్య త్వరయా సిద్ధి ర్ద్రష్టవ్యా। ఉత్తమోత్తమా జనక ప్రహ్లాదాదయోఽధిమాత్రతీవ్రాః। ముహూర్త మాత్రవిచారేణ దృఢసమాధిలాభాత్। అధమాధమా ఉద్దాలకాదయో మృదుసంవేగాః, చిర ప్రయాసేన తల్లాభాత్। ఏవ మన్యేఽపి యథాయోగ మున్నేయాః। తదేవ మధిమాత్రతీవ్రస్య దృఢ భూమా వసంప్రజ్ఞాత సమాధౌ లబ్ధే సతి పునర్వ్యుత్థాతు మశక్తం సన్మనో నశ్యతి। మనోనాశేన చ వాసనే క్షయే రక్షితే సతి జీవన్ముక్తిః సుప్రతిష్ఠితా భవతి। న చ మనోనాశేన విదేహముక్తి రేవ న తు జీవన్ముక్తిరితి శంకనీయమ్, ప్రశ్నోత్తరాభ్యాం తన్నిర్ణయాత్।

శ్రీరామః–

శ్లో॥ వివేకాభ్యుదయా చ్చిత్తస్వరూపేఽన్తర్హితే మునేః।
మైత్ర్యాదయో గుణాః కుత్ర జాయన్తే యోగినాం వద॥
ల. వా. 28, 15

వసిష్ఠః -

శ్లో॥ ద్వివిధ శ్చిత్తనాశోఽస్తి సరూపోఽరూప ఏవ చ।
జీవన్ముక్తౌ సరూపః స్యా దరూపోఽదేహముక్తిగః॥
ల. వా. 18, 16

శ్లో॥ ప్రాకృతం గుణసంభారం మమేతి బహు మన్యతే।
సుఖదుఃఖా దవష్టభ్య విద్యమానం మనో విదుః॥
ల. వా.

శ్లో॥ చేతసః కథితా సత్తా మయా రఘుకులోద్వహ।
అస్య నాశ మిదానీం త్వం శృణు ప్రశ్నవిదాం వర॥
ల. వా. 28, 20

శ్లో॥ సుఖదుఃఖదశా ధీరం సామ్యా న్న ప్రోద్ధరన్తి యమ్।
నిఃశ్వాసా ఇవ శైలేంద్రం తస్య చిత్తం మృతం విదుః॥
ఆప త్కార్పణ్య ముత్సాహో మదో మాన్ద్యం మహోత్సవః।
యం నయన్తి న వైరూప్యం తస్య నష్టం మనో విదుః॥
ల. వా. 28, 21-22

చిత్త మాశానిధానం హి యదా నశ్యతి రాఘవ।
మైత్ర్యాదిభి ర్గుణై ర్యుక్తం తదా సత్త్వ ముదేత్యలమ్।
భూయో జన్మవినిర్ముక్తం జీవన్ముక్తస్య తన్మనః॥
ల. వా. 28, 18, 23-24

సరూపోఽసౌ మనోనాశో జీవన్ముక్తస్య విద్యతే।
ల. వా. 28, 25

శ్లో॥ అరూపస్తు మనోనాశో యో మయోక్తో రఘూద్వహ।
విదేహముక్తావేవాసౌ విద్యతే నిష్కలాత్మకః॥
ల. వా. 28, 26

శ్లో॥ సమగ్రాగ్ర్యగుణాధారమపి సత్త్వం ప్రలీయతే।
భా. ప్ర. 43 ]

విదేహముక్తా వమలే పదే పరమపావనే॥ ల. వా. 28, 27

శ్లో॥ సంశాన్త దుఃఖజడాత్మక మేకరూప మానన్దమన్థర
మపేతరజస్తమో యత్।
ఆకాశకోశతనవోఽతనవో మహాన్త స్తస్మిన్ పదే
గలితచిత్తలవా వసన్తి॥ ల. వా. 28, 32 ఇతి।

శ్లో॥ జీవన్ముక్తా న ముహ్యన్తి సుఖదుఃఖరసస్థితౌ।
ప్రాకృతేనార్థకారేణ కించిత్ కుర్వన్తి వా నవా॥
తస్మాత్ సరూపో మనోనాశో జీవన్ముక్తిసాధనమితి స్థితమ్॥

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకే
మనోనాశనిరూపణం నామ తృతీయం ప్రకరణమ్॥

### భావప్రకాశిక

ఆ సమాధియొక్క తారతమ్యముచే శీఘ్రత్వ తారతమ్యమును సూత్రించుచున్నారు–

"తీవ్రవేగానా మాసన్నః సమాధిలాభః।"

సంవేగము అనగా, వైరాగ్యము, తీవ్రవైరాగ్యము గలవారికి సమాదిలాభము శీఘ్రముగా కలుగును. వైరాగ్యభేదముచేతనే యోగులు మూడు విధములుగా ఉందురు. మృదువైరాగ్యము కలవారు, మధ్యవైరాగ్యము కలవారు, తీవ్రవైరాగ్యము కలవారు. ఆసన్నః– అల్పకాలములోనే సమాధి లభించును అని అర్థము. తీవ్రవైరాగ్యము కలవారిలోనే సమాధితారతమ్యమును సూత్రించుచున్నారు–

"మృదు మధ్య అధిమాత్రత్వాత్ తతోఽపి విశేషః।"

మృదుతీవ్రః, మధ్యతీవ్రః, అధిమాత్రతీవ్రః. వారిలోను, ఉత్తరోత్తరయోగికి త్వరగా సిద్ధి లభించును. ఉత్తమోత్తములు జనక, ప్రహ్లాదాదులు అధిమాత్ర తీవ్రయోగులు. ఏలననగా,

ముహూర్తమాత్రవిచారము చేతనే దృఢసమాధిని పొందినవారు. అధమాధములు ఉద్దాలకాదులు. మృదుసంవేగయోగులు చిర కాలము, ప్రయాసచేత సమాధి లభించినవారు. ఈవిధముగా తక్కినవారు కూడ, వారి వారి యోగ్యతనుబట్టి ఊహింపదగినవారు. కనుక, ఈవిధముగా అధిమాత్ర తీవ్రయోగికి దృఢభూమి కల అసంప్రజ్ఞాత సమాధి లబ్ధము కాగా, మరల దేహస్ఫురణ వ్యుత్థానమునకు శక్తి లేనిదై మనస్సు, నశించుచున్నది. మనో నాశముచే వాసనాక్షయము రక్షితము కాగా, జీవన్ముక్తి సుప్రతిష్ఠిత మగును. మనోనాశముచే విదేహముక్తియే కాని, జీవన్ముక్తి యెటుల కలుగును? అని శంకించరాదు. ఏలయనగా మనోనాశమైనను, జీవన్ముక్తి కలదు అని ఈ క్రింది ప్రశ్నోత్తరములచే నిర్ణయము చేయబడెను.

శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు-

ఓ వసిష్ఠ మహామునీ! వివేకముయొక్క అభ్యుదయముచే చిత్తస్వరూపము అదృశ్యము కాగా, యోగులకు మైత్రి మొదలగు గుణములు ఎట్లు కలుగును, చెప్పుడు :

వసిష్ఠుడు ప్రత్యుత్తరమిచ్చెను-

చిత్తనాశము, సరూపము అని అరూపము అని రెండు విధములు. జీవన్ముక్తియందు సరూపచిత్తనాశము ఉండును. విదేహముక్తియందు అరూపచిత్తనాశము ఉండును. ప్రాకృత గుణకార్యములగు విషయాదులతో చేరి, బాగున్నవి అని ఆదరము కలిగినచో, అప్పుడు సుఖదుఃఖాదులను ఆలంబనముగా చేసికొని మనస్సు ఉండును అని తెలిసికొనుచున్నారు.

రఘువంశశ్రేష్ఠా! నాచేత చిత్తము యొక్క సత్త చెప్ప బడినది. ఇపుడు ఆ మనస్సుయొక్క నాశము గురించి చక్కగా

ప్రశ్నించునట్టి రామచంద్రా! వినుము. ఏ ధీరుని సుఖదుఃఖదశలు సమస్థితినుండి పర్వతశ్రేష్ఠమును నిఃశ్వాసములవలె చలింపచేయ నేరవో, వాని చిత్తము నశించినదని తెలిసికొనుచున్నారు.

ఆపద, దీనత్వము, ఉత్సాహము, మదము, మాంద్యము, మహోత్సవము ఎవనిని వికారము పొందింపజేయవో, వాని మనస్సు, నష్టమైనది అని తెలిసికొనుచున్నారు.

ఓ రాఘవా! ఆశలకు నిలయమగు చిత్తము ఎపుడు నశించుచున్నదో, అపుడు మైత్రి, కరుణ మొదలగు గుణములతో కూడుకొని, సత్త్వగుణము యొక్క ఉద్వేలము- అధికమగును. జీవన్ముక్తునకు ఆ మనస్సు తిరిగి జన్మహేతువు కాదు. కనుక, జీవన్ముక్తునకు ఈ సరూపమనోనాశమే ఉన్నది. అరూప మనోనాశమైనచో, విదేహముక్తియందే నిష్కలాత్మునకు ఉండును. విదేహముక్తియందు స్వచ్ఛమైన పరమపావనమైన పదము ప్రాప్తించగా, మైత్రి మొదలగు సమస్త సద్గుణములకు ఆధారమగు ఆ సత్త్వము గూడ, ప్రలీన మగును. దుఃఖము శమించునట్టియు, జడాత్మకముకాని రజ, స్తమోగుణములు లేని ఆనందముతో నిండిన ఏ పరమపదము కలదో, ఆ పదమునందు ఆకాశకోశశరీరులు అనగా, అశరీరులు అగు మహాత్ములు ఆ చిత్త లేశము కూడ, లేనివారై నివసించుచున్నారు.

జీవన్ముక్తులు సుఖదుఃఖ స్థితియందు మోహము చెందరు. ప్రాకృతమగు దేహముతో ఏదైనను కార్యమును (అర్థ ప్రయోజనము గల క్రియను) చేసిన చేయవచ్చును, చేయక పోవచ్చును. కనుక, సరూప మనోనాశము, జీవన్ముక్తిసాధనము అని వసిష్ఠమహర్షి వచించెను.

జీవన్ముక్తిసాధన మనోనాశప్రకరణము సంపూర్ణము.

# 4. స్వరూపసిద్ధిప్రయోజన ప్రకరణమ్

## జీవన్ముక్తివివేకః

కేయం జీవన్ముక్తిః, కింవా తత్ర ప్రమాణమ్, కథం వా తత్సిద్ధిః, ఇత్యేతస్య ప్రశ్నత్రయస్యోత్తరం నిరూపితమ్। సిద్ధ్యా వా కిం ప్రయోజనమిత్యస్య చతుర్థప్రశ్నస్యోత్తర మిదానీ మభిధీయతే– జ్ఞానరక్షా తపోవిసంవాదాభావ దుఃఖనాశ సుఖావిర్భావాః సన్తి పంచ ప్రయోజనాని। నను ప్రమాణోత్పన్నస్య తత్త్వ జ్ఞానస్య కో నామ బాధప్రసంగో యేన రక్షా అపేక్ష్యేత ఇతి చేదుచ్యతే। చిత్తవిశ్రాన్త్యభావే సంశయ విపర్యయౌ ప్రసజ్యేయాతామ్। తథా హి– తత్త్వవిదో రాఘవస్య విశ్రాన్తేః పూర్వం సంశయం విశ్వామిత్ర ఉదాజహార–

శ్లో॥ న రాఘవ తవాస్త్యన్యజ్జ్ఞేయం జ్ఞానవతాం వర।
స్వయైవ సూక్ష్మయా బుద్ధ్యా సర్వం విజ్ఞాతవానసి॥
భగవద్వ్యాసపుత్రస్య శుకస్యేవ మతి స్తవ।
విశ్రాన్తిమాత్ర మేవాత్ర జ్ఞాతజ్ఞేయాఽప్యపేక్షతే॥
ల. వా. 3, 17-18 ఇతి।

శుకస్తు స్వయమేవాదౌ తత్త్వం విదిత్వా తత్ర సంశయానః పితరం పృష్ట్వా పిత్రాఽపి తథైవానుశిష్ట స్తత్రాపి సంశయానో జనక ముపసద్య తేనాపి తథైవానుశిష్ట స్తం ప్రత్యేవ మువాచ–

శ్రీ శుకః–

శ్లో॥ స్వయమేవ మయా పూర్వ మేతజ్జ్ఞాతం వివేకతః।
ఏతదేవ హి పృష్టేన పిత్రా మే సముదాహృతమ్॥
భవతాఽప్యేష ఏవార్థః కథితో వాగ్విదాం వర।
ఏష ఏవ చ వాక్యార్థః శాస్త్రేషు పరిదృశ్యతే॥
యథాఽయం స్వవికల్పోత్థః స్వవికల్పపరిక్షయాత్।
క్షీయతే దగ్ధసంసారో నిఃసార ఇతి నిశ్చయః॥

తత్కిమేతన్మహాబాహో సత్యం బ్రూహి మమాచలమ్।
త్వత్తో విశ్రాన్తి మాప్నోమి చేతసా భ్రామితం జగత్॥
ల. వా. 3, 43-46

జనకః-

శ్లో॥ నాతః పరతరః కశ్చిన్నిశ్చయోఽస్త్యపరో మునే।
స్వయమేవ త్వయా జ్ఞాతం గురుతశ్చ పునః శ్రుతమ్॥
అవ్యచ్ఛిన్న శ్చిదాత్మైకః పుమానస్తీహ నేతరః।
స్వసంకల్పవశాద్బద్ధో నిస్సంకల్పస్తు ముచ్యతే॥
మునే త్వయా స్ఫుటం జ్ఞాతం జ్ఞేయం స్వస్య మహాత్మనః।
భోగేభ్యో విరతి ర్జాతా దృశ్యాద్వా సకలాదిహ॥
ప్రాప్తం ప్రాప్తవ్య మఖిలం భవతా పూర్ణచేతసా।
న దృశ్యే యతసే బ్రహ్మన్ ముక్తస్త్వం భ్రాన్తిముత్సృజ॥
అనుశిష్టః స ఇత్యేవం జనకేన మహాత్మనా।
విశశ్రామ శుకస్తూష్ణీం స్వస్థే పర మవస్తుని॥
వీతశోకభయాయాసో నిరీహ శ్ఛిన్నసంశయః।
జగామ శిఖరం మేరోః సమాధ్యర్థ మనిన్దితమ్॥
తత్ర వర్షసహస్రాణి నిర్వికల్పసమాధినా।
దశ స్థిత్వా శశామాసావాత్మన్యస్నేహదీపవత్॥

# 4. స్వరూపసిద్ధిప్రయోజన ప్రకరణము

## భావప్రకాశిక

ఈ జీవన్ముక్తి యనగా నేమి? ఈ జీవన్ముక్తికి ప్రమాణ మేమి? ఏ సాధనములచే సిద్ధించును? అను స్వరూప, ప్రమాణ, సాధన ప్రశ్నలకు సమాధానము నిరూపింపబడినది. జీవన్ముక్తి సిద్ధించినను, ఏమి ప్రయోజనము? అను నాలుగవ ప్రశ్నకు ప్రత్యుత్తరము ఇప్పుడు చెప్పబడుచున్నది. జ్ఞానరక్ష, తపస్సు,

విసంవాదము (భిన్నాభిప్రాయము) లేకపోవుట, దుఃఖనాశము, సుఖావిర్భావము అనునవి అయిదు, జీవన్ముక్తి ప్రయోజనములు. ఓయీ! ప్రమాణముచేత కలిగిన తత్త్వజ్ఞానమునకు బాధ ప్రసంగము ఏమి కలదు? ఆ తత్త్వజ్ఞానమును రక్షించుకొనుట ఆవశ్యకము, అది ప్రయోజనము అని చెప్పవలసిన అవసర మేమి కలదు? అనినచో సమాధానము చెప్పబడుచున్నది. తత్త్వ జ్ఞానము కలిగినను, చిత్తవిశ్రాంతి లేనప్పుడు సంశయ, విపర్యయ ములు ప్రసక్తములగును. అట్లే గదా! తత్త్వజ్ఞాని అయిన శ్రీరామునకు విశ్రాంతికి పూర్వము కలిగిన సంశయమును విశ్వామిత్రుడు ఇట్లు ఉదాహరించెను–

ఓ రామా! జ్ఞానులలో శ్రేష్ఠుడైనవాడా! నీవు తెలిసికొన వలసినది మరియొకటి లేదు. నీ అంతట నీవే, నీ సూక్ష్మబుద్ధితో సర్వమును తెలిసికొంటివి. భగవానుడైన వ్యాసుని పుత్రుడగు శుకునకు వలె నీ బుద్ధి, విశారదమైనది– తేటయైనది. కాని, జ్ఞేయమును తెలిసికొన్నను, విశ్రాంతిని మాత్రమే, నీ బుద్ధి అపేక్షించుచున్నది.

శుకుడైనచో, స్వయముగానే మొదట, తత్త్వమును తెలిసి కొనెను. సంశయము కలవాడై తండ్రిని ప్రశ్నించెను. తండ్రి కూడ, అట్లే తత్త్వమును బోధించెను. ఆ తండ్రిమాటయందు గూడ, సంశయము కలవాడై జనకుని, సమీపించి (ఉపసదన విధితో) ఆ జనకునిచేత గూడ, అట్లే ఉపదేశింపబడినవాడై జనకునితో ఇట్లనెను–

శ్రీ శుకుడు —

నాచేత వివేకముతో ఈ విషయము స్వయముగానే మొదట తెలిసికొనబడినది. తండ్రి నడుగగా, ఆయనయు ఇట్లే చెప్పెను. వక్తలలో శ్రేష్ఠుడైనవాడా! నీచేత గూడ, ఈ అర్థమే చెప్పబడెను.

శాస్త్రములందు గూడ, ఈ వాక్యార్థమే కన్పడుచున్నది. తన వికల్పములతో పుట్టిన ఈ పాడు సంసారము తన వికల్పములు పూర్తిగా క్షయము చెందుట వలన, క్షీణించుచున్నది. ఈ సంసారము నిస్సారము అని నా నిశ్చయము. ఇంతేకదా, మహాబాహో! నాకు స్థిరమైన సత్యమును చెప్పుము. నీవలన విశ్రాంతిని పొందుదును. చిత్తముచేతనే జగద్భ్రమ కలిగినది.

జనకుడు—

ఓ శుకమునీంద్రా! ఇంతకంటె శ్రేష్ఠమైన మరియొక నిశ్చయము లేదు. నీవు స్వయముగానే తెలిసికొంటివి. తండ్రి వలన అట్లే వింటివి.

"అవ్యుచ్ఛిన్న శ్చిదాత్మైకః పుమానస్తీహ నేతరః।
స్వసంకల్పవశాద్బద్ధో నిఃసంకల్పస్తు ముచ్యతే॥"

నిత్యుడగు చిదాత్మపురుషుడు ఒక్కడే ఉన్నాడు, మరియొకడు లేడు. తన సంకల్పమువలన బద్ధుడగుచున్నాడు. సంకల్పము వీడినవాడు ముక్తుడగుచున్నాడు. ఓ మునీ! మహాత్ముడవగు నీవు తెలిసికొనదగిన విషయమును స్పష్టముగా తెలిసికొంటివి. భోగముల నుండియు, సమస్త దృశ్యప్రపంచమునుండియు, విరక్తి కలిగినది. నీవు, నిండు మనస్సుతో పొందదగినదాని నంతయు, పొందితివి. ఓ బ్రాహ్మణోత్తమా! దృశ్యమునందు నీవు ప్రయత్నించుటలేదు, అపేక్షకలవాడవు కావు. నీవు ముక్తుడవు. భ్రాంతిని విడనాడుము. ఈవిధముగా మహాత్ముడగు జనకునిచే ఉపదేశింపబడినవాడై శుకుడు, స్వరూపస్థితమైన పరమవస్తువు నందు దేహేంద్రియవ్యాపారము లేకుండా విశ్రాంతిని పొందెను. శోక, భయ, ఆయాసములను వీడినవాడై ఏ కోరికలు లేక, సంశయమును తొలగించుకొని, సమాధి కొరకు అనువగు మేరు శిఖరమును చేరెను. అచట, నిర్వికల్పసమాధిలో పదివేల

సంవత్సరములు ఉండి, చమురులేని దీపమువలె ఈ శుకుడు, ఆత్మయందు శమము నొందినవాడాయెను- నిర్వాణము చెందిన వాడాయెను.

**జీవన్ముక్తివివేకః**

తస్మాద్ విదితేఽపి తత్త్వే విశ్రాన్తిరహితస్య శుక రాఘవ యోరివ సంశయ ఉత్పద్యతే। స చాజ్ఞానమివ మోక్షస్య ప్రతిబంధకః। అత ఏవ భగవతోక్తమ్-

శ్లో॥ అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥
భ. గీ. 4, 40 ఇతి।

అశ్రద్ధా విపర్యయః। స చోత్తరత్రోదాహరిష్యతే। అజ్ఞాన విపర్యయౌ మోక్షమాత్రవిరోధినౌ। సంశయస్తు భోగ మోక్షయో రుభయోరపి విరోధీ। తస్య పరస్పర విరుద్ధకోటిద్వయావలంబి త్వాత్। యదా సంసారసుఖాయ ప్రవృత్తిస్తదా సంసారబుద్ధి స్తాం ప్రతిబధ్నాతి। తస్మాత్ సంశయాత్మనో న కించిత్సుఖ మస్తీతి ముముక్షుణా సర్వథా సంశయశ్ఛేత్తవ్యః। అత ఏవ శ్రూయతే- 'ఛిద్యన్తే సర్వసంశయాః' ము. ఉ. 2, 2-8 ఇతి। విపర్యయస్యాపి నిదాఘ ఉదాహరణమ్। ఋభుః పరమకరుణయా నిదాఘస్య గృహమేత్య బహుధా తం బోధయిత్వా నిర్జగామ। బుద్ధేఽపి తదుపదిష్టే వస్తున్యశ్రద్ధధానో నిదాఘః కర్మణ్యేవ పరమపురుషార్థహేతురితి విపర్యయం ప్రాప్య కర్మానుష్ఠానే యథాపూర్వం ప్రవృత్తః। సోఽపి శిష్యస్య పరమపురుషార్థభ్రంశో మా భూదితి కృపయా గురుః పునరాగత్య బోధయామాస। తథాఽపి విపర్యయం న జహౌ। తృతీయేన తు బోధనేన విప ర్యయం పరిత్యజ్య విశ్రాన్తి మలభత। సంశయ విపర్యయాభ్యా

మసంభావనా విపరీతభావనారూపాభ్యాం తత్త్వజ్ఞానస్య ఫలం ప్రతిబధ్యతే। తదుక్తం పరాశరేణ-

శ్లో॥ మణిమన్త్రౌషధై ర్వహ్నిః సుదీప్తోఽపి యథేన్ధనమ్।
ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ ప్రతిబద్ధ స్తథైవ చ॥
జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీప్తః సుదృఢోఽపి చ।
ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ ప్రతిబద్ధస్తు కల్మషమ్॥
భావనా విపరీతాయా యా చాసంభావనా శుక।
కురుతే ప్రతిబంధం సా తత్త్వజ్ఞానస్య నాపరమ్॥

ప. ఉ. అ. 14 ఇతి।

తస్మా దవిశ్రాన్తచిత్తస్య సంశయ విపర్యయప్రసంగేన తత్త్వజ్ఞానస్య ఫల ప్రతిబన్ధలక్షణా ద్బాధా ప్రసక్తాఽపేక్ష్యతే।

భావప్రకాశిక

కనుక, తత్త్వము తెలియబడినను, చిత్తవిశ్రాంతి లేనివానికి శుక, రాఘువులకు వలె సంశయము కలుగుచున్నది. ఈ జ్ఞానము సరియైనదా, కాదా? అను సంశయము కూడ, అజ్ఞానమువలెనే మోక్షమునకు ప్రతిబంధకము. ఇందువలననే, కృష్ణభగవానునిచే ఇట్లు చెప్పబడినది-

అజ్ఞాని, శ్రద్ధలేనివాడు (భ్రాంతి చెందినవాడు), సంశయ స్వభావము కలవాడు నశించుచున్నారు.

సంశయ స్వభావము కలవానికి ఇహలోకము లేదు, పర లోకము లేదు, సుఖము లేదు.

ఇచట అశ్రద్ధ అనగా, విపర్యయజ్ఞానము. అనగా భ్రాంతి. ఇది, రాబోవు గ్రంథమునందు ఉదహరింపబడును. అజ్ఞానము, భ్రాంతిజ్ఞానము మోక్షమునకు మాత్రమే విరోధులు. సంశయ మైనచో భోగ, మోక్షములు రెంటికి గూడ విరోధి. సంశయము పరస్పరవిరుద్ధములు అగు కోటిద్వయమును (రెండు ప్రకారము

లను) **అవలంబించును. ఎప్పుడైతే** సంసారసుఖము కొరకు ప్రవృత్తి కలుగునో, అప్పుడు మోక్షమార్గమునందున్న బుద్ధి, ఆ సంసారసుఖప్రవృత్తిని నిరోధించును. ఎప్పుడైతే మోక్షమార్గము నందు ప్రవృత్తి కలుగునో, సంసారబుద్ధి దానిని ప్రతిబంధించును. కనుక, సంశయస్వభావము కలవానికి ఏమాత్రము సుఖము లేదు. కనుక, ముముక్షువగువాడు పూర్తిగా సంశయమును నివారించుకొన వలెను. కనుకనే 'ఛిద్యన్తే సర్వసంశయాః' బ్రహ్మసాక్షాత్కారము వలన, సర్వసంశయములు తీరుచున్నవి అని శ్రుతియందు చెప్పబడినది. విపర్యయజ్ఞానమునకు నిదాఘుడు ఉదాహరణము. ఋభువు అను ముని, పరమకరుణతో నిదాఘుని గృహమునకు వచ్చి, బహువిధములుగా అతనికి బోధ చేసి వెడలిపోయెను. ఋభువుచే ఉపదేశింపబడిన వస్తుతత్త్వము తెలిసినను, శ్రద్ధ లేనివాడై నిదాఘుడు, కర్మలే పరమ పురుషార్థమునకు సాధనములు అని భ్రాంతిజ్ఞానములోనే ఉండి, వెనుకటివలె కర్మానుష్ఠానమునందు ప్రవృత్తుడాయెను. గురువగు ఋభువు శిష్యుడైన నిదాఘునకు పరమపురుషార్థభ్రంశము కలుగరాదు అను దయతో మరల వచ్చి జ్ఞానోపదేశము చేసెను. అప్పుడును, విపరీత బుద్ధిని విడనాడలేదు. మూడవ పర్యాయము బోధచేత కర్మలు పరమ పురుషార్థసాధనము లనెడి భ్రాంతిని విడనాడి, విశ్రాంతిని పొందెను. సంశయము, అసంభావనా రూపము. విపర్యయము, విపరీతభావనారూపము. ఈ రెంటిచేతను, తత్త్వ జ్ఞానఫలము ప్రతిబంధింపబడును. ఈ విషయమే పరాశరుని చేత చెప్పబడినది–

ఇంధనములచేత సుదీప్తమగు వహ్ని కూడ, మణిమంత్ర ఓషధులచే ప్రతిబంధింపబడినదై దహించుటకు సమర్థము కాదు. అట్లే, జ్ఞానాగ్ని గూడ సుదీప్తము, సుదృఢము అయినను,

ప్రతిబంధింపబడినచో, కల్మషమును దహించుటకు శక్తి కలది కాదు. ఓ శుకా! తత్త్వజ్ఞానమునకు విపరీతభావన, అసంభావన ప్రతిబంధమును కలుగచేయుచున్నవి, మఱియొకటి ప్రతిబంధము కాదు.

కనుక, తత్త్వజ్ఞానము కలిగినను, చిత్తవిశ్రాంతి లేనివానికి సంశయ, విపర్యయములు ప్రసక్తములు కావచ్చును. దానివలన, తత్త్వజ్ఞానమునకు ఫలము ప్రతిబంధింపబడుట అను బాధనుండి జ్ఞానరక్ష అపేక్షితమై యున్నది.

## జీవన్ముక్తివివేకః

విశ్రాన్తచిత్తస్య తు మనోనాశేన యదా జగదేవ ప్రవిలీయతే తదా సంశయ విపర్యయోః కః ప్రసంగః? జగత్ప్రతిభాన రహితస్య బ్రహ్మవిదో దేహవ్యవహారోఽపి వినైవ స్వప్రయత్నం పరమేశ్వరప్రేరితేన ప్రాణవాయునా నిష్పాద్యతే। అత ఏవ ఛన్దోగా ఆమనన్తి– 'నోపజనం స్మరన్నిదం శరీరం స యథా ప్రయోగ్య ఆచరణే యుక్త ఏవమేవాయ మస్మిఞ్ఛరీరే ప్రాణో యుక్తః' ఛా. ఉ. 8, 12, 3 ఇతి। ఉపజనం జనానాం సమీపే వర్తమానమిదం శరీకం న స్మరన్ బ్రహ్మవిద్వర్తతే। పార్శ్వస్థా జనా ఏవ తత్త్వవిదః శరీరం పశ్యన్తి। స్వయం తు నిర్మనస్కత్వా న్మదీయ మిదం శరీరమితి న స్మరతి। ప్రయోగ్యో రథ శకటాదివహనే ప్రయోక్తు మర్హః శిక్షితో అశ్వ బలీవర్దాదిః, స యథా సారథినా మార్గస్యాచరణే ప్రేరితః పునః పునః సారథి ప్రయత్న మనపేక్ష్య స్వయమేవ రథశకటాదికం పురోవర్తి గ్రామం నయతి, ఏవమేవాయం ప్రాణవాయుః పరమేశ్వరేణాస్మిఞ్ఛరీరే నియుక్తః సత్యసతి వా జీవప్రయత్నే వ్యవహారం నిర్వాహయతి। భాగవతేఽపి స్మర్యతే–

శ్లో॥ దేహం వినశ్వర మవస్థిత ముత్థితం వా సిద్ధో న పశ్యతి
యతోఽధ్యగమ త్స్వరూపమ్।
దైవా దుపేత మథ దైవవశా దపేతం వాసో యథా
పరికృతం మదిరామదాన్ధః॥ భాగ. 11, 13, 36 ఇతి।

వసిష్ఠోఽప్యాహ—

శ్లో॥ పార్శ్వస్థబోధితాః సన్తః పూర్వాచారక్రమాగతమ్।
ఆచార మాచర న్త్యేవ సుప్తబుద్ధవదక్షతాః॥
ల. వా. 13, 127 ఇతి।

సిద్ధో న పశ్యత్యాచార మాచరతీత్యుభయోః పరస్పరవిరోధ ఇతి చే న్న। విశ్రాన్తి తారతమ్యేన వ్యవస్థోపపత్తేః। తదేవ తారతమ్య మభిప్రేత్య శ్రూయతే- 'ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః।' ము. ఉ. 3, 1, 4 ఇతి। అత్ర చత్వారః ప్రతీయన్తే బ్రహ్మవిత్ప్రథమః, బ్రహ్మవిద్వరో ద్వితీయః, బ్రహ్మవిద్వరీయాం స్తృతీయో బ్రహ్మవిద్వరిష్ఠః చతుర్థః। స ఏతే సప్తసు యోగభూమిషు చతుర్థీం యోగభూమి మారభ్య క్రమేణ భూమిచతుష్టయం ప్రాప్తా ఇత్యవగంతవ్యమ్।

భావప్రకాశిక

విశ్రాంతచిత్తునకైనచో, మనోనాశముచేత జగత్తే లీన మగును గనుక, సంశయ, విపర్యయములకు ప్రసక్తి లేదు. జగత్ప్రతిభానము లేని బ్రహ్మవేత్తకు దేహవ్యవహారము కూడ, తన ప్రయత్నము లేకయే, పరమేశ్వరునిచే ప్రేరేపింపబడిన ప్రాణవాయువుచేత దేహవ్యవహారము జరుగుచుండును. ఇందువలననే సామవేదశాఖీయులు ఇట్లు పలుకుచున్నారు.

"నోపజనం స్మరన్ ఇదం శరీరం స యథా ప్రయోగ్య ఆచరణే యుక్తః ఏవమేవాయం అస్మిన్ శరీరే ప్రాణో యుక్తః।"

ఉపజ్జనమ్— జనసమీపమున ఉన్న ఈ శరీరమును మనస్సు

లోనికి తీసికొనకుండా (స్మరించకుండా) బ్రహ్మవేత్త ఉండును. ప్రక్కన ఉన్న జనులే తత్త్వవేత్తయొక్క శరీరమును చూచుదురు. బ్రహ్మవేత్త మాత్రము తాను నిర్మనస్కుడు గనుక, 'ఈ శరీరము నాది' అని స్మరించడు. ప్రయోగ్యము అనగా, రథ శకటాదులను లాగికొనిపోవు శిక్షితమైన అశ్వ, వృషభాదులు. ఆ అశ్వవృషభములు సారథిచే మొదట, మార్గమందు నడచుటకు ప్రేరేపింపబడిన తరువాత, మరల మరల సారథిప్రయత్నము లేకయే స్వయముగానే రథశకటాదులను ముందు ఉన్న గ్రామమునకు చేర్చుచున్నవి. ఈవిధముగానే ప్రాణవాయువు, పరమేశ్వరునిచేత ఈ శరీరమునందు నియోగింపబడినదై జీవ ప్రయత్నము ఉన్నను, లేకపోయినను వ్యవహారము నిర్వహించుచున్నది. భాగవతమునందు గూడ, ఇట్లు స్మరింపబడినది-

"దేహం వినశ్వర మవస్థిత ముత్థితం వా సిద్ధో న పశ్యతి యతోఽధ్యగమ త్స్వరూపమ్।"

సిద్ధపురుషుడు, అనగా జ్ఞాని, నశ్వరమగు దేహము ఉన్నదా? లేచి, వ్యవహరించుచున్నదా? అని చూడడు. ఎందువలననగా, జ్ఞాని, బ్రహ్మస్వరూపమును చేరి ఉన్నాడు (దేహాభిమానమును వీడియున్నవాడు). మద్యపానము చేసి బాగుగా మత్తెక్కినవాడు, తాను ధరించిన వస్త్రము ఒంటిమీద ఉన్నదో, లేక దైవవశముచే తొలగిపోయినదో, గ్రహించనివిధముగా జ్ఞాని కూడ, దేహస్థితిని పట్టించుకొనడు.

వసిష్ఠుడు కూడ ఇట్లు చెప్పుచున్నాడు-

జ్ఞానులు, ప్రక్కనఉన్నవారిచే సమాధినుండి మేల్కొల్పబడినవారై సుప్త ప్రబుద్ధులవలె చెక్కుచెదరక పూర్వాచార క్రమముగా వచ్చిన ఆచారమును ఆచరించుచునేయున్నారు అని చెప్పెను.

సిద్ధుడు చూడడు, ఆచారమును ఆచరించుచునే యుండును అను ఈ రెండు వాక్యములకు పరస్పర విరోధము కలదు గదా! అనినచో- అట్లు కాదు, విశ్రాంతితారతమ్యము చేత వ్యవస్థ కుదురుచున్నది. ఆ తారతమ్యమునే,

"ఆత్మక్రీడః ఆత్మరతిః క్రియావానేషః బ్రహ్మవిదాం వరిష్ఠః" అని శ్రుతి పేర్కొనుచున్నది. ఇచట నలుగురు మహాత్ములు తోచుచున్నారు- బ్రహ్మవేత్త మొదటివాడు. బ్రహ్మవిద్వరుడు రెండవవాడు. బ్రహ్మవిద్వరీయుడు మూడవవాడు. బ్రహ్మవిద్వంష్ఠుడు నాలుగవవాడు. వీరు ఏడు యోగభూమికలలో నాలుగవ యోగభూమిక మొదలుకొని, అయిదవ, ఆరవ, ఏడవ భూమికకు చేరినవారు. భూమికాచతుష్టయమును పొందినవారు అని తెలిసికొనవలెను.

## జీవన్ముక్తివివేకః

భూమయశ్చ వసిష్ఠేన దర్శితాః-

శ్లో॥ జ్ఞానభూమిః శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా।
విచారణా ద్వితీయా స్యాత్ తృతీయా తనుమానసా॥
సత్త్వాపత్తి శ్చతుర్థీ స్యాత్ తతోఽసంసక్తినామికా।
పదార్థభావినీ షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా॥
ల. వా. 13, 112-114 ఇతి।

శ్లో॥ స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్షేఽహం శాస్త్రసజ్జనైః।
వైరాగ్యపూర్వ మిచ్ఛేతి శుభేచ్ఛే త్యుచ్యతే జనైః॥
శాస్త్ర సజ్జనసంపర్క వైరాగ్యాభ్యాసపూర్వకమ్।
సద్విచారప్రవృత్తి ర్యా ప్రోచ్యతే సా విచారణా॥
విచారణశుభేచ్ఛాభ్యా మింద్రియార్థేష్వసక్తతా।
యత్ర సా తనుతా మేతి ప్రోచ్యతే తనుమానసా॥
భూమికాత్రితయాభ్యాసా చ్చిత్తేఽర్థవిరతే ర్వశాత్।

సత్త్వాత్మని స్థితః శుద్ధే సత్త్వాపత్తి రుదాహృతా॥
దశాచతుష్టయాభ్యాసా దసంసర్గఫలా తు యా।
రూఢసత్త్వ చమత్కారా ప్రోక్తాఽసంసక్తినామికా॥
భూమికాపంచకాభ్యాసాత్ స్వాత్మారామతయా భృశమ్।
అభ్యన్తరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్॥
పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనమ్।
పదార్థభావినీ నామ షష్ఠీ భవతి భూమికా॥
భూమిషట్కచిరాభ్యాసాత్ భేదస్యానుపలంభనాత్।
యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా స్థితిః॥
ల. వా. 13, 116-123 ఇతి।

అత్ర భూమికాత్రితయం బ్రహ్మవిద్యాయాః సాధనమేవ, న తు విద్యాకోటా వన్తర్భవతి। భూమిత్రమే భేదసత్యత్వబుద్ధేరనివర్తితత్వాత్। అత ఏవైతత్ జాగరణమితి వ్యపదిశ్యతే। తదుక్తమ్-

శ్లో॥ భూమికాత్రతయం త్వేతద్ రామ జాగ్రదితి స్థితమ్।
యథావద్ భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే॥ ఇతి।

తతో వేదాన్తవాక్యాన్నిర్వికల్పకో బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారశ్చతుర్థీ భూమికా ఫలరూపా సత్త్వాపత్తిః। చతుర్థభూమౌ సర్వజగదుపాదానస్య బ్రహ్మణో వాస్తవ మద్వితీయసత్తాస్వభావం నిశ్చిత్య బ్రహ్మణి ఆరోపితయో ర్జగచ్ఛబ్దాభిధేయయో ర్నామరూపయో ర్మిథ్యాత్వ మవగచ్ఛతి। ముముక్షోః పూర్వోక్తం జాగరణ మపేక్ష్య సేయం భూమిఃస్వప్నః। తదాహ-

శ్లో॥ అద్వైతే స్థైర్య మాయాతే ద్వైతే చోపరతిం గతే।
పశ్యన్తి స్వప్నవల్లోకం చతుర్థీం భూమికామితాః॥
చిత్తం తు శరదభ్రాంశవిలయం ప్రవిలీయతే।

సత్తావశేష ఏవాస్తే చతుర్థీం భూమికామితాః॥

ల. వా. 43, 70-71

సోఽయం చతుర్థీభూమికాం ప్రాప్తో యోగీ బ్రహ్మవిది త్యుచ్యతే। పంచమ్యాదయ స్తిస్రో భూమయో జీవన్ముక్తేరవాన్తర భేదాః। తే చ నిర్వికల్ప సమాధ్యభ్యాసకృతేన విశ్రాన్తితార తమ్యేన సంపద్యన్తే। పంచమభూమౌ నిర్వికల్పకాత్ స్వయమేవ వ్యుత్తిష్ఠతే। సోఽయం బ్రహ్మవిద్వరః షష్ఠభూమౌ పార్శ్వస్థై ర్బోధితో వ్యుత్తిష్ఠతే, సోఽయం బ్రహ్మవిద్వరీయాన్। తదేతద్ భూమిద్వయం సుషుప్తి ర్గాఢసుషుప్తిరితి చాభిధీయతే। తదాహ-

శ్లో॥ పంచమీం భూమికామేత్య సుషుప్తిపదనామికామ్।
శాంతాశేషవిశేషాంశ స్తిష్ఠ త్యద్వైతమాత్రకే॥ ల. వా. 43, 73

అంతర్ముఖతయా నిత్యం బహిర్వృత్తిపరోఽపి సన్।
పరిశ్రాన్తతయా నిత్యం నిద్రాలురివ లక్ష్యతే॥
కుర్వన్నభ్యాస మేతస్యాం భూమికాయాం వివాసనః।
షష్ఠీం గాఢ సుషుప్త్యాఖ్యాం క్రమాత్ పతతి భూమికామ్॥
యత్ర నాసన్నసద్రూపో నాహం నాప్యనహంకృతిః।
కేవలం క్షీణమనన ఆస్తే ద్వైతైక్యవర్జితః॥

ల. వా. 43, 75-77

అన్తః శూన్యో బహిః శూన్యః శూన్యః కుంభ ఇవాంబరే।
అన్తఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణః కుంభ ఇవార్ణవే॥

ల. వా. 43, 76

గాఢం నిర్వికల్పకసమాధిం ప్రాప్తస్య సంస్కారమాత్ర శేషస్య చిత్తస్య మనోరాజ్యం కర్తుం బాహ్యపదార్థాన్ గ్రహీతుం వా సామర్థ్యాభావా దాకాశావస్థిత కుంభవ దన్తర్బహిఃశూన్యత్వమ్। స్వయంప్రకాశ సచ్చిదానందైకరసే బ్రహ్మణి నిమగ్నత్వేన

బహిశ్చ సర్వత్ర బ్రహ్మదృష్ట్యా సముద్రమధ్యస్థాపిత జలపూర్ణ కుంభవదన్తర్బహిః పూర్ణత్వమ్। తురీయాభిధాం సప్తమీం భూమిం ప్రాప్తస్య యోగినః స్వతః పరతో వా వ్యుత్థానమేవ నాస్తి। తాదృశమేవోద్దిశ్య 'దేహం వినశ్వర మవస్థిత ముత్థితం వా' ఇత్యాది భాగవతవాక్యం ప్రవృత్తమ్। అసంప్రజ్ఞాత సమాధి ప్రతిపాదకాని యోగశాస్త్రాణ్యత్రైవ పర్యవసితాని। సోఽయ మీదృశో యోగీ పూర్వోదాహృతశ్రుతౌ బ్రహ్మవిద్వరిష్ఠ ఇత్యుచ్యతే। తదేవం పార్శ్వస్థబోధితః సిద్ధో న పశ్యతీతి అనయో ర్భూమిద్వయే వ్యవస్థితత్వా న్న కోఽపి విరోధః। తత్రాయం సంగ్రహః। పంచమ్యాది భూమిత్రయరూపాయాం జీవన్ముక్తౌ సంపాద్యమానాయాం ద్వైతప్రతిభాసాభావేన సంశయ విపర్యయ ప్రసంగాభావా దుత్పన్నం తత్త్వజ్ఞాన మబాధేన రక్షితం భవతి। సేయం జ్ఞానరక్షా జీవన్ముక్తేః ప్రథమం ప్రయోజనమ్।

## భావప్రకాశిక

యోగభూములు వసిష్ఠునిచే చూపబడినవి-

శుభేచ్ఛ అను జ్ఞానభూమి మొదటిది. విచారణ రెండవది. తనుమానస మూడవది. సత్త్వాపత్తి నాలుగవది. అటుపిమ్మట అసంసక్తి అయిదవది. పదార్థ అభావన ఆరవది. తురీయగ ఏడవది.

నేను మూఢుడనుగానే ఉన్నానేమి ? శాస్త్ర సజ్జన సాంగత్యమును చూచుకొందును అను వైరాగ్యశుభముబందు కోరిక, మొదటి భూమిక అని విద్వాంసులచే చెప్పబడినది. శాస్త్ర, సజ్జన సాంగత్య, వైరాగ్య అభ్యాసములతో సద్విచారమునందు ప్రవృత్తి, 'విచారణ' అని చెప్పబడును. ఈ విచారణ, శుభేచ్ఛలతో ఇంద్రియార్థములగు శబ్ద, స్పర్శాది విషయము లందు (జగత్తునందు) ఆసక్తి లేకపోవుట, ఆసంగము

క్రమముగా తరగిపోవుట, కృశించుట, 'తనుమానస' అను మూడవ భూమిక. ఈ మూడు భూమికలందు అభ్యాసము వలన చిత్తము బాహ్యవిషయములందు విరతి నొందుటవలన, శుద్ధమగు సద్రూపాత్మయందు స్థితి 'సత్త్వాపత్తి' అని చెప్పబడినది. ఈ నాలుగు అవస్థలను అభ్యాసము చేయుటవలన, పూర్తిగా అసంగత్వము లభించి, బ్రహ్మాత్మవస్తువునందే రూఢమైన ఆనందమును అనుభవించుట 'అసంసక్తి' అను భూమిక. ఈ అయిదు భూమికలను అభ్యసించుటవలన, స్వాత్మారాముడైన కారణముచేత ఆభ్యంతరములు, బాహ్యములును అగు పదార్థములు భాసింపవు. ఇతరులు చేయు చిరకాలప్రయత్నము వలన వ్యుత్థానము (జాగ్రత) లోనికి వచ్చుట 'పదార్థ అభావిని' అను ఆరవ భూమిక అయి ఉన్నది. భూమికాషట్కమును చిరకాలము అభ్యసించుటవలన, భేదముయొక్క ఉపలబ్ధి (స్ఫురణము) లేకుండా స్వభావమగు ఆత్మస్వరూపమునందే ఎల్లప్పుడు ఉండు 'తురీయుగా' స్థితి ఏడవ భూమిక.

ఇచట, మొదటి భూమికాత్రయము బ్రహ్మవిద్యకు సాధనము మాత్రమే. అవి, విద్యాకోటిలో జేరవు. ఆ మూడు భూమికలందు భేదసత్యత్వబుద్ధి నివర్తించదు. ఇందువలననే ఆ మూడు భూమికలను 'జాగరణము' అందురు.

ఈ విషయమే, 'ఓ రామా! మొదటి భూమికాత్రయము జాగ్రరితము సుమా! ఎప్పటివలెనే ఈ భూమికాత్రయమునందు గూడ జగత్తు, భేదబుద్ధితోనే కనిపించును' అని వసిష్ఠునిచే చెప్పబడినది.

తరువాత, వేదాంతవాక్యములవలన, నిర్వికల్పమగు బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారము అను చతుర్థ భూమిక, ఆ వెనుకటి భూమికలకు ఫలరూపముగ ఉదయించును. ఇదియే 'సత్త్వాపత్తి'.

ఈ చతుర్థ భూమికలో సర్వజగదుపాదానమగు బ్రహ్మకు వాస్తవమైన స్వరూపము అద్వితీయ సత్తాస్వభావము అని నిశ్చయించి, ఆ బ్రహ్మయందు ఆరోపితములగు 'జగత్' అను శబ్దముచే పిలువబడుచున్న నామరూపములకు మిథ్యాత్వమును గ్రహించుచున్నాడు. ముముక్షువగువాడు వెనుక చెప్పిన భూమికాత్రయ జాగరణమును అపేక్షించి, నాలుగవ భూమి 'స్వప్నము' అని వ్యవహరింపబడును. ఆ విషయమునే చెప్పుచున్నారు–

అద్వైతము స్థిరపడగా, ద్వైతభావము శమించగా, చతుర్థ భూమికలోనివారు లోకమును (బాహ్యజగత్తును) స్వప్నముగా చూచుదురు. ఈ నాలుగవ భూమికను పొందినవాడు జగత్తును, ఖండఖండములైన శరత్కాల మేఘములను వలె ప్రవిలాపము (నశించునదిగా) చేయవగినదని ఎంచి, సత్తామాత్రావశేషుడై ఉండును. ఏ బ్రహ్మాత్మ ప్రబోధము వలన, తనను, ఇతరులను గూడ సన్మాత్రులమగా ఎంచి, యోగులు సర్వభూతములందు సద్రూపమునే దర్శించుచుందురు. సద్రూపుడగు ఆ హరిని నమస్కరించుచుందురు. చతుర్థభూమికాస్థితుడు, సత్తామాత్రముగా మిగిలినవాడుగా అయిఉండును. ఈ నాలుగవ భూమికను చేరిన యోగి 'బ్రహ్మవిత్' అని చెప్పబడును.

అయిదు, ఆరు, ఏడు భూమికలు జీవన్ముక్తియొక్క అవాంతర (అవస్థా) భేదములు. అవి, నిర్వికల్పకమైన సమాధ్యభ్యాసము చేత కలుగు విశ్రాంతితారతమ్యముచేత ఏర్పడుచున్నవి. అయిదవ భూమికయందు నిర్వికల్పక స్థితినుండి స్వయముగానే వ్యుత్థానములోనికి వచ్చును. ఈ యోగి, 'బ్రహ్మవిద్వరుడు'. ఆరవ భూమిక యందు ప్రక్కనున్నవారిచే మేల్కొల్పబడి, సమాధినుండి వ్యుత్థానములోనికి వచ్చును. ఇతడు 'బ్రహ్మవిద్వరీయాన్'. ఈ భూమికాద్వయము సుషుప్తి, గాఢ

సుషుప్తి అను రీతిగా వ్యవహరింపబడును. సుషుప్తి యను పేరు గల అయిదవ భూమికను చేరి, విశేషాంశములన్నియు శమింపగా, కేవల అద్వైతమునందే ఉండును. నిత్యము, అంతర్ముఖుడగుటచేత బాహ్యవృత్తిలోనికి వచ్చినను, అలసినవాడు అగుటచే లోకమునకు నిద్రాస్వభావము కలవానివలె కన్పించును. ఈ అయిదవ భూమికలో అభ్యాసము చేసి, విషయవాసనలను అన్నింటిని తొలగించుకొనినవాడై, 'గాఢసుషుప్తి' యను పేరు గల ఆరవ భూమికను చేరుచున్నాడు. ఆ భూమికయందు సద్రూపముగాని, అసద్రూపముగాని భాసించదు. 'నేను' అని అనుకొనడు. అహంకారవృత్తి లేదు, అహంకారము లేదు. మనస్సు పూర్తిగా క్షీణించును. ద్వైతభావమును వదలిపెట్టి ఉండును. ఆకాశమునందున్న శూన్య కుంభము వలె లోపల, ఏమియు లేనివాడై, వెలుపల ఏమియు లేనివాడై ఉండును. సముద్రమునందు జలపూర్ణమైన కుంభమువలె లోపల బ్రహ్మస్వరూపముతో నిండి వెలుపల, బ్రహ్మస్వరూపముతో నిండినవాడు అగును.

గాఢముగా నిర్వికల్ప సమాధిని పొందినవానికి చిత్తము, సంస్కారమాత్రముగా మిగిలి ఉండును. కాని, మనోరాజ్యమును చేయుటకు గాని, బాహ్య పదార్థములను గ్రహించుటకు గాని, సామర్థ్యము కలిగి ఉండదు. కనుక, ఆకాశస్థ కుంభమువలె అంతర్బహిశ్శూన్యత్వము లభించును. స్వయంప్రకాశమగు సచ్చిదానందైకరసబ్రహ్మయందు నిమగ్నుడై ఉన్నందున, వెలుపల గూడ, అంతట బ్రహ్మదృష్టితోనే ఉండుటవలన, సముద్ర మధ్యమునందు స్థాపింపబడిన జలపూర్ణ కుంభమువలె లోపల, వెలుపల, బ్రహ్మస్వరూపముతో నిండి ఉండును. 'తురీయము' అను పేరు గల ఏడవ భూమికను అధిరోహించిన యోగి,

స్వయముగా కాని, ఇతరులవలన కాని, వ్యుత్థానమునకు రాడు. అట్టి యోగిని ఉద్దేశించియే-

'దేహం వినశ్వర మవస్థిత ముత్థితం వా।'

అను భాగవతశ్లోకము ప్రయుక్తమైనది. అసంప్రజ్ఞాత సమాధిని ప్రతిపాదించునట్టి యోగశాస్త్రములు ఈ సప్తమభూమికయందే పర్యవసన్నములగుచున్నవి. ఆ యీ యోగియే, పూర్వము ఉదహరింపబడిన శ్రుతిలో 'బ్రహ్మవిద్వరిష్ఠుడు' అని చెప్పబడుచున్నాడు. కనుక, ఈవిధముగా ప్రక్కవారిచే మేల్కొల్పబడినవాడైన సిద్ధుడు, చూడడు అను ఈ రెండు భూమికలు వ్యవస్థితములు గనుక, విరోధము లేదు (ఆరు, ఏడు భూమికలలో ఉన్నవారు). ఇచట, పైన చెప్పిన విషయము సంగ్రహింపబడుచున్నది. అయిదు, ఆరు, ఏడు భూమికలందు జీవన్ముక్తి సంపాదింపబడగా, ద్వైతప్రతిభానము లేదు గనుక, సంశయ విపర్యయములకు అవకాశము లేదు. కనుక, కలిగిన తత్త్వజ్ఞానము బాధింపబడకపోవుటచే సురక్షిత మగును. ఈ జ్ఞానరక్ష, జీవన్ముక్తికి మొదటి ప్రయోజనము.

## జీవన్ముక్తివివేకః

తపో ద్వితీయం ప్రయోజనమ్। తద్ధేతుత్వం చార్జున భగవతోః శ్రీరామ వసిష్ఠయోశ్చ ప్రశ్నోత్తరాభ్యా మవగమ్యతే।

అర్జున ఉవాచ—

శ్లో॥ అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥
కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి॥
ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హ స్యశేషతః।

త్వదన్యః సంశయస్యాస్య చ్ఛేత్తా న హ్యుపపద్యతే॥
భ. గీ. 6, 37-39

భగవానువాచ—

శ్లో॥ పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
న హి కల్యాణకృత్కశ్చిద్ దుర్గతిం తాత గచ్ఛతి॥
ప్రాప్య పుణ్యకృతాన్లోకాన్ ఉషిత్వా శాశ్వతీః సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥
అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్॥
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన॥
భ. గీ. 6, 40-43 ఇతి।

శ్రీరామ ఉవాచ—

శ్లో॥ ఆద్యామథ ద్వితీయాం వా తృతీయాం భూమికా ముత।
ఆరూఢస్య మృతస్యాథ కీదృశీ భగవన్ గతిః॥

వసిష్ఠ ఉవాచ—

శ్లో॥ యోగభూమికయోత్క్రాన్త జీవితస్య శరీరిణః।
భూమికాంశానుసారేణ క్షీయతే పూర్వదుష్కృతమ్॥
తతః సురవిమానేషు లోకపాలపురేషు చ।
మేరూపవనకుంజేషు రమతే రమణీసఖః॥
తతః సుకృతసంభారే దుష్కృతే చ పురా కృతే।
భోగక్షయపరిక్షీణే జాయన్తే యోగినో భువి॥
శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సతామ్।
తత్ర ప్రాగ్భావనాఽభ్యస్తం యోగభూమిత్రయం బుధః॥
స్పృష్ట్వోపరి పతత్యుచ్చై రుత్తరం భూమికాక్రమమ్॥ ఇతి।

అస్త్వేవం యోగభూమీనాం దేవలోకప్రాప్తి హేతుత్వమ్,

తావతా తపస్త్వం కుత ఇతి చేత్, శ్రుతేరితి బ్రూమః। తథా చ తైత్తిరీయా ఆమనన్తి- 'తపసా దేవా దేవతామగ్ర ఆయన్, తపసర్షయః సువరన్వవిన్దన్' (తై. బ్రా. 3, 12, 3) ఇతి। తత్త్వజ్ఞానాత్ ప్రాచీనస్య భూమికాత్రయస్య తపస్త్వే సతి, తత్త్వజ్ఞానస్య ఉత్తరకాలీనస్య నిర్వికల్పసమాధిరూపస్య పంచమ్యాది భూమికాత్రయస్య తపస్త్వం కైముతిక న్యాయసిద్ధమ్। అత ఏవ స్మర్యతే-

శ్లో॥ మనసశ్చేంద్రియాణాం చ ఐకాగ్ర్యం పరమం తపః।
తజ్జ్యాయః సర్వధర్మేభ్యః స ధర్మః పర ఉచ్యతే॥ ఇతి।

యద్యప్యనేన న్యాయేన తపసా ప్రాప్యం జన్మాన్తరం నాస్తి. తథాఽపి లోకసంగ్రహాయ ఇదం తపో యుజ్యతే।

భావప్రకాశిక

జీవన్ముక్తికి తపస్సు, రెండవ ప్రయోజనము. యోగభూములు దేవత్వ, బ్రహ్మలోకాదిప్రాప్తికి హేతువులగుటచే తపస్సుగా గ్రహించవలయును. ఈ యోగభూములవలన, దేవత్వాదులు ప్రాప్తమగుట కృష్ణార్జునుల యొక్కయు, శ్రీరామ వసిష్ఠులయొక్కయు ప్రశ్నోత్తరములవలన తెలియుచున్నది. అర్జునుడు ఇట్లు ప్రశ్నించెను-

"అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి।"

కృష్ణా! ఇంద్రియసంయమము లేనివాడు, శ్రద్ధగలవాడు యోగమునుంచి చలించిన మనస్సు గలవాడు యోగసిద్ధిని పొందక మరణించినచో, ఏ గతిని పొందును? రెంటికి చెడినవాడై ఆకాశమున, తునిగిపోయిన మేఘమువలె నశించడు గదా! కృష్ణా! నా యీ సంశయము నీవు తీర్చుము. నీకంటె మరి నా సంశయము తీర్చగలవారు ఎవరును లేరు.

కృష్ణభగవానుడు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను-

ఓ అర్జునా! యోగికి ఇహలోకమున గాని, పరలోకమున గాని, వినాశము లేదు. నాయనా! మంచి పని చేయువాడు ఎవడును దుర్గతిని పొందడు. పుణ్యాత్ముల లోకములందు బహు సంవత్సరములు నివసించి, యోగభ్రష్టుడు పరిశుద్ధులు, సంపన్నులైనవారి గృహమునందు పుట్టును. లేదా బుద్ధిశాలురగు యోగుల వంశమునందే జన్మించును. యోగివంశమున, జన్మ కడు దుర్లభమైనది. ఆ జన్మయందు పూర్వజన్మస్మృతి కలవాడై ఆ సంస్కారముతో యోగము యొక్క పై పై భూమికలను సాధించుటకు ప్రయత్నించి సంసిద్ధుడగును.

శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు-

పూజ్యుడవైన ఓ వసిష్ఠమహర్షీ! యోగభూమికలలో మొదటిదానిని గాని, రెండవదానిని గాని, మూడవ భూమికను గాని, ఆరూఢుడై చనిపోయిన సాధకుని గతి యేమి?

వసిష్ఠుడు ప్రత్యుత్తరమిచ్చెను-

యోగభూమికలతో ఉత్క్రమణము చేసిన దేహధారులకు వారి వారి భూమికల ననుసరించి పూర్వపాపము క్షీణించును. పిమ్మట దేవవిమానములలో దిక్పాలుర పురములందును, మేరు పర్వత ఉద్యాన విహారభూములందును, రమణీసహాయుడై విహరించును. పుణ్యపుంజము అనుభవింపబడగా, పాపము క్షీణింపగా, భోగముచే కర్మ క్షీణించుటచేత ఆ యోగులు భూలోకమున జన్మింతురు. పరిశుద్ధులు, శ్రీమంతులు, గుణవంతులు అగు సత్పురుషుల గృహములందు జన్మించి, పూర్వజన్మలో అభ్యసించిన భూమికాత్రయమును స్పృశించి, అభ్యసించి, స్మరించి తరువాత, ఉత్తమ భూమికలను అధిరోహించుదురు.

యోగభూమికలు దేవలోకప్రాప్తిని కలిగించుగాక! అంత మాత్రముచేత ఆ భూమికలు 'తపస్సు' అని ఎట్లు చెప్పనగును? అనినచో, శ్రుతిప్రమాణము వలన, అని సమాధానము చెప్ప బడును. తైత్తిరీయులు ఇట్లు వేదమున– ఆమ్నాయమున పఠించు చున్నారు–

"తపసా దేవా దేవతామగ్ర ఆయన్ తపసా ఋషయః సువ రన్వవిన్దన్।"

తపస్సుచేత ఇంద్రాది దేవతలు దేవతలలో శ్రేష్ఠులైరి. ఋషులు తపస్సుచే స్వర్గము చేరికొనిరి అని శ్రుతితాత్పర్యము.

తత్త్వజ్ఞానమునకు పూర్వమునందున్న భూమికాత్రయము తపస్సు కాగా, తత్త్వజ్ఞానోత్తరకాలమునందు నిర్వికల్పక సమాధి రూపమగు అయిదవ, ఆరవ, ఏడవ భూమికలు తపోరూపములు అనుట కైముతిక న్యాయసిద్ధము. అనగా, యోగభూమికలలో మొదటి మూడు భూమికలే తపస్సు అయినప్పుడు, జ్ఞానా నంతరము మూడు భూమికలు తపస్సు అని, వేరే చెప్పవలసిన పని లేదు. కనుకనే, స్మృతియందు ఇట్లు చెప్పబడినది–

మనస్సుయొక్కయు, ఇంద్రియములయొక్కయు ఏకాగ్రత పరమ తపస్సు. సర్వధర్మములకంటె తపస్సు గొప్పది. అది, పరమ ధర్మము.

విచారించగా, ఈ న్యాయముచేత అయిదవ, ఆరవ, ఏడవ భూమికారూపమగు తపస్సుచేత పొందదగిన జన్మాంతరము లేదు. అయినను, లోకసంగ్రహార్థము దీనిని 'తపస్సు' అనుట యుక్తము అగుచున్నది. ఇందువలననే కృష్ణభగవానుడు చెప్పు చున్నాడు–

జీవన్ముక్తి వివేకః

అత ఏవ భగవానాహ—

శ్లో॥ లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి॥
భ. గీ. 3, 20 ఇతి।

సంగ్రాహ్యశ్చ లోక స్త్రివిధః- శిష్యో భక్త స్తటస్థశ్చేతి। తత్ర శిష్యస్యాన్తర్ముఖే యోగిని గురౌ ప్రామాణికత్వబుద్ధ్యతిశయేన తదుపదిష్టే తత్త్వే పరమం విశ్వాసం ప్రాప్య చిత్తం సహసా విశ్రామ్యతి। అత ఏవ శ్రూయతే-

శ్లో॥ యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః॥
శ్వే. ఉ. 6-23 ఇతి।

స్మర్యతే చ—

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి॥
భ. గీ. 4-39 ఇతి।

అన్నప్రదాన నివాసస్థాన కల్పనాదినా యోగినం సేవమానో భక్త స్తదీయం తపః స్వయమేవాదత్తే। తథా చ శ్రూయతే- 'తస్య పుత్రా దాయ ముపయన్తి సుహృదః సాధుకృత్యాం ద్విషన్తః పాపకృత్యామ్।' ఇతి।

భావప్రకాశిక

ఇందువలననే కృష్ణభగవానుడు చెప్పుచున్నాడు- 'లోకసంగ్రహార్థమై కూడ, నీవు కర్మలను చేయదగియున్నావు' లోకసంగ్రహ మనగా, లోకము యొక్క అపమార్గ ప్రవృత్తిని నివారించుట.

సంగ్రహింపదగిన లోకము మూడు విధములు. శిష్యులు, భక్తులు, తటస్థులు. వారిలో శిష్యునకు అంతర్ముఖుడగు యోగి అయిన గురువునందు ప్రామాణ్యబుద్ధి అధికముగా కలదు గనుక, ఆ గురువుచే ఉపదేశింపబడిన తత్త్వమునందు పరమ విశ్వాస

మును ఉంచి, శీఘ్రముగా చిత్తవిశ్రాంతిని పొందుచున్నాడు. కనుకనే ఇట్లు శ్రుతియందు వినబడుచున్నది-

"యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః॥"

ఎవనికి దేవునియందు పరమ భక్తి కలదో, గురువునందు, దేవుని యందువలె భక్తి కలదో, అట్టి మహాత్మునకు గురువుచే కథితములు, అకథితములు నగు అర్థములు స్ఫురించును అని భావము.

స్మృతియందు గూడ, శ్రద్ధ గలవాడు తత్పరుడై ఇంద్రియ సంయమము కలవాడై జ్ఞానమును పొందుచున్నాడు. జ్ఞానమును పొంది, శీఘ్రముగా అచిరకాలముననే పరమశాంతిని బడయుచున్నాడు అని చెప్పబడినది. స్మృతివచనము గూడ కలదు.

ఇక, భక్తుడు యోగికి అన్నప్రదానముచేతను, నివాస స్థాన కల్పనాదులచేతను యోగిని సేవించువాడై ఆయన తపస్సును స్వయముగానే తీసికొనుచున్నాడు.

"తస్య పుత్రాః దాయ ముపయన్తి, సుహృదః సాధుకృత్యాం, ద్విషన్తః పాపకృత్యామ్।"

అని శ్రుతి కలదు. యోగియొక్క ఆస్తిని పుత్రులు స్వీకరింతురు. మిత్రులు, సుహృద్భావము కలవారు పుణ్యమును స్వీకరింతురు. శత్రువులు (ద్వేషించువారు) పాపమును స్వీకరింతురు అని భావము.

జీవన్ముక్తివివేకః

తటస్థోఽపి ద్వివిధః- ఆస్తికో నాస్తికశ్చేతి। తత్రాస్తికో యోగినః సన్మార్గాచరణం దృష్ట్వా స్వయమపి సన్మార్గే ప్రవర్తతే। తథా చ స్మృతిః-

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।

స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥

భ. గీ. 3-21 ఇతి।

నాస్తి కోఽపి యోగినా దృష్టః పాపాన్ముచ్యతే। తదుక్తమ్-

శ్లో॥ యస్యానుభవపర్యన్తా తత్త్వే బుద్ధిః ప్రవర్తతే।
తద్ దృష్టిగోచరాః సర్వే ముచ్యన్తే సర్వపాతకైః॥

సూ. సం. 2-20-44 ఇతి।

అనేన ప్రకారేణ సర్వప్రాణ్యుపకారిత్వం యోగినో వివక్షిత్వా పఠ్యతే-

శ్లో॥ స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాఽపి దత్తావని
ర్యజ్ఞానాం చ సహస్ర మిష్ట మఖిలా దేవాశ్చ సంపూజితాః।
సంసారాచ్చ సముద్ధృతాః స్వపితర స్త్రైలోక్య
పూజ్యోఽప్యసౌ యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం
మనః ప్రాప్నుయాత్॥

కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన।
అపారసంవిత్సుఖసాగరేఽస్మిన్ లీనం పరే బ్రహ్మణి
యస్య చేతః॥ సూ. సం. 2, 20, 45 ఇతి।

న కేవలం యోగినః శాస్త్రీయ వ్యవహారస్యైవ తపస్త్వమ్, కింతు సర్వస్యైవ లౌకికవ్యవహారస్యాపి। తథా చ తైత్తిరీయాః స్వశాఖాయాం నారాయణస్యాన్తిమేనానువాకేన విదుషోఽపి మహిమాన మామనన్తి। తస్మింశ్చానువాకే పూర్వభాగే యోగినో ఽవయవా యజ్ఞాంగద్రవ్యత్వేనామ్నాతాః- "తస్యైవం విదుషో యజ్ఞస్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ శరీరమిధ్మ మురో వేది ర్లోమాని బర్హిర్వేదః శిఖా హృదయం యూపః కామ ఆజ్యం మన్యుః పశు స్తపోఽగ్ని ర్దమః శమయితా దక్షిణా వాగ్ఘోతా ప్రాణ ఉద్గాతా చక్షురధ్వర్యు ర్మనో బ్రహ్మ శ్రోత్రమగ్నీత్ (నారా. ఉ. 80) ఇతి। అత్ర చ దానం దక్షిణేతి దానపద మధ్యా

హస్తవ్యమ్। 'అథ యత్తపో దాన మార్జవ మహింసా సత్యవచన మితి తా అస్య దక్షిణాః ఇతి ఛన్దోగై రామ్నాతత్వాత్। ఉక్తానువాకే మధ్యమభాగేన యోగివ్యవహారా స్తజ్జీవనకాలశ్చ జ్యోతిష్టోమావయవ క్రియారూపత్వేన, ఉత్తరభాగేన సర్వయజ్ఞావయవ క్రియారూపత్వేన చామ్నాతాః– 'యావద్ ధ్రియతే సా దీక్షా యదశ్నాతి తద్ధవి ర్యత్పిబతి తదస్య సోమపానం యద్రమతే తదుపసదో యత్సంచర త్యుపవిశ త్యుత్తిష్ఠతే చ స ప్రవర్గ్యో యన్ముఖం తదాహవనీయో యా వ్యాహృతి రాహుతి ర్యదస్య విజ్ఞానం తజ్జుహోతి యత్సాయం ప్రాతరత్తి తత్సమిధం యత్ప్రాతర్మధ్యందినం సాయం చ తాని సవనాని యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ యేఽర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని య ఋతవ స్తే పశుబన్ధా యే సంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తేఽహర్గణాః సర్వవేదసం వా ఏతత్సత్రం యన్మరణం తదవభృథః' (నారా. ఉ. 80) ఇతి। సర్వవేదసం సర్వస్వ దక్షిణాకమ్। అత్రై సత్రశబ్దేన ప్రకృతాహోరాత్రాది పరివత్సరాన్తం సర్వకాలసమష్ట్యుపలక్షితం యోగిన ఆయుర్వివక్ష్యతే। యదాయు స్తత్సర్వస్వదక్షిణోపేతం సత్రమిత్యర్థః।

## భావప్రకాశిక

తటస్థుడు కూడ ఆస్తికుడు, నాస్తికుడు అని రెండు విధములు. వారిలో ఆస్తికుడు, యోగియొక్క సన్మార్గాచరణమును చూచి, తాను కూడ, సన్మార్గమునందు ప్రవర్తించును. ఈ విషయమే భగవద్గీతయందు ఇట్లు చెప్పబడినది–

> "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః।
> స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥"

శ్రేష్ఠుడగు వ్యక్తి ఏదేది ఆచరించునో, సాధారణ వ్యక్తి

గూడ, దానిని ఆచరించును. శ్రేష్ఠుడు, దేనిని ప్రమాణముగా గైకొనునో సాధారణజనము కూడ, ఆ ప్రమాణమునే అనుసరించును.

ఇక, నాస్తికుడు గూడ, యోగిచేత చూడబడినవాడై పాపము నుండి ముక్తుడగును. ఆ విషయమే చెప్పబడినది-

ఏ మహానుభావుని బుద్ధి, అనుభవపర్యంతము తత్త్వము నందు ప్రవర్తించునో, ఆ మహాత్ముని దృష్టికి గోచరులగు జనులు, సర్వపాపములనుండి విడివడుదురు.

ఈవిధముగా సర్వప్రాణులకు యోగి, ఉపకరించును అను అభిప్రాయముతో ఇట్లు పఠింపబడుచున్నది-

ఎవని మనస్సు, బ్రహ్మవిచారణయందు క్షణకాలమైనను, స్థిరముగా నుండునో అతడు, సమస్త తీర్థజలములందు స్నానము చేసినవాడు. సమస్త భూమిని దానము చేసినవాడు. వేయి యజ్ఞములు చేసినవాడు. సకల దేవతలను పూజించినవాడు. తన పితృదేవతలు సంసారమునుండి ఉద్ధరింపబడినవాడు. ఇతడు, మూడు లోకములందు పూజింపబడినవాడగును. ఎవని మనస్సు, అపార జ్ఞానానందసాగరమగు పరబ్రహ్మయందు లీనమగునో, అతనిచే వంశము అంతయు పవిత్రము అగును, తల్లి కృతార్థురాలు అగును, భూమి పుణ్యము కలది అగును అని సూతసంహితా వచనములవలన తెలియుచున్నది.

ఇంతవరకు, యోగియొక్క శాస్త్రీయ వ్యవహారము తపస్సుగా చెప్పబడినది. ఇంతియేకాదు, అతని లోకవ్యవహారము కూడ, తపస్సే అగును. తైత్తిరీయులు తమ శాఖయందు నారాయణముయొక్క చివరి అనువాకము చేత జ్ఞానియొక్క మహిమను చెప్పుచున్నారు. ఆ అనువాకమున, పూర్వభాగము నందు యోగి యొక్క అవయవములు యజ్ఞాంగద్రవ్యములుగా

చెప్పబడినవి. ఈ యోగి యొక్క యజ్ఞమునకు ఆత్మ, యజమానుడు. శ్రద్ధ యజమానపత్ని. శరీరము, ఇధ్మము (సమిధలు). వక్షఃస్థలము, వేది. రోమములు, బర్హిస్సులు. శిఖ, వేదము (దర్భముష్టి). హృదయము, యూపము. కామము, ఆజ్యము. క్రోధము, పశువు. తపస్సు, అగ్ని. దమము, శమయిత (పశువును విశసనము చేయువాడు). దానము, దక్షిణ. వాక్కు, హోత. ప్రాణము, ఉద్గాత. చక్షువు, అధ్వర్యుడు. మనస్సు, బ్రహ్మ. శ్రోత్రము, ఆగ్నీధ్రుడు అని చెప్పబడెను.

"తపోదాన మార్జవ మహింసా సత్యవచనమితి తా అస్య దక్షిణాః।" అని సామగులచే చెప్పబడినందువలన, దక్షిణ, దానము అని వివరింపబడినది. వెనుకటి యీ అనువాకమున, మధ్యభాగములో యోగియొక్క వ్యవహారములు, ఆయన జీవనకాలములు జ్యోతిష్టోమావయవ క్రియారూపముగాను, ఉత్తరభాగమునందు సర్వయజ్ఞావయవ క్రియారూపముగాను చెప్పబడినవి. ఎంతవరకు జీవించి ఉండునో, అంతకాలము దీక్ష, ఆత్మయజ్ఞమునకు అతని భోజనమే హవిస్సు. నీరు త్రాగుటయే, సోమపానము. విహరించుట యేది కలదో అది, ఉపసత్తులు. వేదియందు సంచారము, ఉప వేశనము. లేచుట, ప్రవర్గ్యము. ముఖమే, ఆవహనీయము. వ్యాహృతియే, ఆహుతి. విజ్ఞానమే హోమము. సాయం కాలమున, ప్రాతఃకాలమున, ఆహారము ఏది కలదో, అది సమిధలు. ప్రాతర్మధ్యందిన సాయంకాలములు ఏవి కలవో, అవి సవనములు. అహోరాత్రములు ఏవి కలవో, అవి దర్శపూర్ణ మాసములు. అర్ధమాసములు, పక్షములు, మాసములు, చాతు ర్మాస్యములు. ఋతువులు, పశుబంధములు. సంవత్సర, పరివత్సర ములు అహర్గణములు. ఇది, సర్వస్వదక్షిణాకమైన సత్ర యాగము. మరణమే అవబృథము. 'సర్వవేదస' మనగా,

సర్వస్వదక్షిణాకము. ఇచట 'ఏత' చ్ఛబ్దము చేత ప్రకృతములగు అహోరాత్రములు మొదలుకొని పరివత్సరపర్యన్తము సర్వకాల సమష్టితో ఉపలక్షితము అయిన (చూపబడిన) యోగియొక్క అయుఃకాలము వివక్షితము. యోగియొక్క ఆయుఃవు సర్వస్వ దక్షిణాకమైన సత్రయాగము అని అర్థము.

## జీవన్ముక్తి వివేకః

ఉక్తానువాకే చరమభాగేన సర్వయజ్ఞాత్మకం యోగిన ముపాసీనస్య క్రమముక్తిరూపం సూర్యచంద్రమసోః కార్యకారణ బ్రహ్మణోః తాదాత్మ్యలక్షణం ఫల మామ్నాయతే – "ఏతద్వై జరామర్య మగ్నిహోత్రం సత్రం య ఏవం విద్వా నుదగయనే ప్రమీయతే దేవానా మేవ మహిమానం గత్వా ఽఽదిత్యస్య సాయుజ్యం గచ్ఛత్యథ యో దక్షిణే ప్రమీయతే పితౄణా మేవ మహిమానం గత్వా చన్ద్రమసః సాయుజ్యం సలోకతా మాప్నోతి ఇత్యేతౌ వై సూర్యాచంద్రమసో ర్మహిమానౌ బ్రాహ్మణో విద్వా నభిజయతి తస్మాద్ బ్రహ్మణో మహిమాన మాప్నోతి తస్మా ద్బ్రహ్మణో మహిమాన మిత్యుపనిషత్' నారా. ఉ. 80 ఇతి। జరా మరణావధికం యద్యోగిచరిత మస్తి తద్వేదోక్తాగ్నిహోత్రాది సంవత్సర సత్రాన్తకర్మ స్వరూప మిత్యేవ ముపాసీనో భావనాతి శయేన సూర్యాచంద్రమసోః సాయుజ్యం తాదాత్మ్యం ప్రాప్నోతి। భావనామాంద్యేన సమానలోకం ప్రాప్య తస్మింల్లోకే సూర్యా చంద్రమసో ర్విభూతి మనుభూయ తత ఊర్ధ్వం సత్యలోకే చతుర్ముఖస్య బ్రహ్మణో మహిమాన మాప్నోతి। తత్రోత్పన్న తత్త్వజ్ఞాన స్తత ఊర్ధ్వం సత్యజ్ఞానానందరూపస్య పరబ్రహ్మణో మహిమానం కైవల్యం ప్రాప్నోతి ఇత్యుపనిషదిత్యనేన యథోక్త విద్యాయా స్తత్ప్రతిపాదకగ్రన్థస్య చోపసంహారః క్రియతే, తదేవం జీవన్ముక్తే స్తపోరూపం ద్వితీయం ప్రయోజనం సిద్ధమ్।

## భావప్రకాశిక

వెనుకటి అనువాకమున, చివరి భాగమునందు సర్వయజ్ఞ స్వరూపుడగు యోగిని ఉపాసించినవానికి క్రమముక్తి రూపమగు ఫలము, కార్యకారణబ్రహ్మరూపులగు సూర్యచంద్రుల తాదాత్మ్య రూప లక్షణమగు ఫలము చెప్పబడుచున్నది. ఇదియే, జరా మరణపర్యంతమగు అగ్నిహోత్రము, సత్త్రము అయి ఉన్నది. ఏవడు ఈవిధముగా ఉపాసించునో; అతడు, ఉత్తరాయణమున; మరణించినచో దేవతలయొక్క మహిమను పొంది; ఆదిత్యుని సాయుజ్యమును పొందుచున్నాడు. అట్లుగాక; దక్షిణాయనమున, మరణించినచో; పితృదేవతలయొక్క మహిమను పొంది, చంద్రుని సాయుజ్యమును, సాలోక్యమును ఉపాసనాతారతమ్యము చేత పొందుచున్నాడు. ఈ సూర్యచంద్రుల మహిమలను బ్రాహ్మణుడు తెలిసికొని, ఉపాసించినవాడై ఫలమును పొందుచున్నాడు. దాని వలన, హిరణ్యగర్భబ్రహ్మయొక్క మహిమను పొందుచున్నాడు. తరువాత, పరబ్రహ్మమహిమను పొందుచున్నాడు. ఉపనిషత్తు (బ్రహ్మవిద్య) సమాప్తము. జరామరణములు అవధిగా గల యోగి చరితము ఏది కలదో, అది వేదోక్తమగు అగ్నిహోత్ర, కర్మ మొదలుకొని; సంవత్సరసత్త్రాంతమగు కర్మస్వరూపమే అని ఉపాసించినవాడు భావనాతిశయముచే సూర్యచంద్రులయొక్క సాయుజ్యమును, అనగా తాదాత్మ్యమును పొందుచున్నాడు. భావనామాంద్య మున్నచో, సాలోక్యమును పొంది, ఆ లోకమున సూర్యచంద్రుల విభూతిని అనుభవించి, అటుపిమ్మట; సత్యలోకము నందు చతుర్ముఖబ్రహ్మయొక్క మహిమను పొందుచున్నాడు. ఆ సత్యలోకమున, తత్త్వజ్ఞానమును సంపాదించి అటుపిమ్మట; సత్యజ్ఞానానందస్వరూపుడగు పరబ్రహ్మయొక్క మహిమను; అనగా కైవల్యమును పొందుచున్నాడు. ఉపనిషత్తు సమాప్తము. దీనిచేత వెనుక చెప్పిన బ్రహ్మవిద్యకు - దానిని ప్రతిపాదించు

గ్రంథమునకు ఉపసంహారము చేయబడినది. ఈ విధముగా జీవన్ముక్తికి తపోరూపమగు రెండవ ప్రయోజనము సిద్ధించినది.

జీవన్ముక్తివివేకః

విసంవాదాభావ స్తృతీయం ప్రయోజనమ్। న ఖల్వ న్తర్ముఖే బాహ్యవ్యాపార మపశ్యతి యోగీశ్వరే లౌకిక స్తైర్థికో వా కశ్చి ద్విసంవదతే। లౌకిక విసంవాదో ద్వివిధః కలహరూపో నిన్దా-రూపశ్చ। తత్ర క్రోధాదిరహితేన యోగినా సహ కథం నామ లౌకికః కలహాయతే? తద్రాహిత్యం చ స్మర్యతే -

శ్లో॥ క్రుధ్యన్తం న ప్రతిక్రుధ్యే దాకృష్టః కుశలం వదేత్।
అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన ॥ ఇతి।

మను. 6-48,47

నను జీవన్ముక్తేః ప్రాచీనో విద్వత్సంన్యాస స్తతోఽపి ప్రాచీనం తత్త్వజ్ఞానం, తస్మాదపి ప్రాచీనో వివిదిషాసంన్యాసః। తత్రైతే క్రోధాదిరాహిత్యాదయో ధర్మాః కథం స్మృతా ఇతి చేత్-బాఢమ్। అత ఏవ జీవన్ముక్తస్య క్రోధాదయః శంకితుమప్యశక్యాః। అత్యర్వాచీనే పదే వివిదిషాసంన్యాసేఽపి యదా క్రోధాదయో న సన్తి తదోత్తమపదే తత్త్వజ్ఞానే కుత స్తే స్యుః, కుత స్తరాం చ విద్వత్సంన్యాసే, కుత స్తమాం చ జీవన్ముక్తౌ? అతో న యోగినా సహ లౌకికస్య కలహః సంభవతి, నాపి నిందారూపో విసంవాదః శంకనీయః। నిందృత్వస్యానిశ్చితత్వాత్। తథా చ స్మర్యతే -

శ్లో॥ య న్న స న్తం న చాస న్తం నాశ్రుతం బహుశ్రుతమ్।
న సువృత్తం న దుర్వృత్తం వేద కశ్చిత్ స వై యతిః॥ ఇతి।

సదసత్త్వే ఉత్తమాధమజాతీ। తైర్థికోఽపి కిం శాస్త్రప్రమేయే విసంవదతే, కిం వా యోగిచరితే। అద్యే న తావద్యోగీ పరశాస్త్ర ప్రమేయం దూషయతి - 'తమేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో విముంచథ' ము. ఉ. 2,2,5; 'నానుధ్యాయే ద్బహూంశబ్దా న్వాచో విగ్లాపనం హి తత్' బృ.ఉ. 4, 4, 21 ఇత్యాది శ్రుత్యను

రోధాత్। నాపి స్వశాస్త్ర ప్రమేయం ప్రతివాదినోఽగ్రే సమర్థయతే,

శ్లో॥ 'పలాలమివ ధాన్యార్థీ త్యజేద్ గ్రన్థ మశేషతః' ॥

అమృతబిందు ఉ. 18

శ్లో॥ 'పరమం బ్రహ్మ విజ్ఞాయ ఉల్కావత్తాన్యథోత్సృజేత్' ॥

అమృతనాద. ఉ. 1

ఇత్యాది శ్రుత్యర్థపరత్వాత్ । యదా యోగీ ప్రతివాదినమపి స్వాత్మతయా వీక్షతే తదా విజిగీషాయాః కా కథా ? నాపి లోకాయతికవ్యతిరిక్తః సర్వోఽపి తైర్థికో మోక్ష మంగీకుర్వన్ యోగిచరితేఽపి విసంవదితు మర్హతి ।

### భావ ప్రకాశిక

విసంవాదము అనగా, అభిప్రాయభేదము. కలహము, దూషణము లేకపోవుట మూడవ ప్రయోజనము. అంతర్ముఖుడు అయి బాహ్యవ్యాపారమును పట్టించుకొనని యోగీశ్వరుని విషయమున, లోకములోని సాధారణజనము గాని, శాస్త్రజ్ఞుడు గాని, ఎవడును వివాదమును కలిగి ఉండడు. లౌకిక విసంవాదము రెండు విధములు – కలహము, లేదా నింద. వానిలో క్రోధము లేని యోగితో లౌకికుడు ఎట్లు కలహించును? యోగికి క్రోధరాహిత్యము స్మృతియందు చెప్పబడినది. ఎవరైనను, తనను కోపపడినచో, వానిమీద తిరిగి క్రోధమును చెందరాదు. పట్టి లాగినను, 'క్షేమమగు గాక' అనవలెను. దూషణలను ఓర్చుకొనవలయును, ఎవనినైనను అవమానించరాదు.

ఓయీ! జీవన్ముక్తికి పూర్వము విద్వత్సంన్యాసము, అంతకు పూర్వము తత్త్వజ్ఞానము, అంతకంటెగూడ పూర్వము క్రోధాది ధర్మములు ఉండకూడదు అని స్మృతియందు చెప్పబడినది కదా? అనినచో, అవును. కనుకనే జీవన్ముక్తునియందు క్రోధాది దోషములు శంకించనే రాదు. అంతకు ఎంతో పూర్వమున ఉన్న వివిదిషాసంన్యాసకాలముననే క్రోధాదులు లేనప్పుడు, అంతకంటె

ఉత్తమ పదమైన తత్త్వజ్ఞానమునందు అవి ఎట్లుండును? ఇక అటుపిమ్మట, విద్వత్సంన్యాసమునందు గాని, జీవన్ముక్తియందు గాని, ఆ దోషములు ఎటుల వచ్చును? కనుక యోగితో లౌకికునకు కలహము సంభవించనేరదు. అట్లే నిందారూపమగు విసంవాదము కూడ, శంకింప శక్యము కాదు. నిందృుడగుటకు అతడెట్టివాడో, లోకమున, నిశ్చితుడు కాడు. స్మృతియందు ఇట్లు చెప్పబడినది—

ఎవనిని ఉత్తముడని గాని, అధముడని గాని, చదువుకొన్న వాడని గాని, చదువురానివాడని గాని, మంచి వర్తనము కలవాడని గాని, చెడునడత కలవాడని గాని, లోకులు తెలిసికొనలేరో, అతడే యతి. యోగియగు యతి, తానెట్టివాడో, లోకమునకు తెలియ నీయక, సంచరించవలయును అని యతిధర్మము. ఇక, శాస్త్రజ్ఞుడు విసంవాదము కలవాడు కాడు. ఎట్లనగా, అతడు ప్రతిపాదింపబడిన శాస్త్రమందు విసంవాదమును పొందునా? లేక యోగియొక్క నడవడిని గురించి విసంవాదమును పొందునా? యోగి, ఏ శాస్త్ర ప్రమేయమునైనను దూషించడు.

"తమేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో విముంచథ।
నానుధ్యాయేద్ బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్॥"

ఆ పరమాత్మ నొక్కనినే తెలిసికొనును. తక్కిన మాటలను వదలిపెట్టును. ఇతర శబ్దజాలమును పట్టించుకొనుట. వాగ్వ్యయము, కంఠశోష అని శ్రుతి పేర్కొనుచున్నది.

ప్రతివాది ముందు, యోగి, తన శాస్త్రప్రమేయమును సమర్థించుకొనడు. ధాన్యమును కోరినవాడు, తూర్పారబట్టిన పొల్లును వదలివేసినట్లు, పరబ్రహ్మసాక్షాత్కారమును పొంది గ్రంథములన్నింటిని విడిచిపెట్టవలయును. కొరివితో చీకటిలో గమ్యమును చేరినతరువాత, కొరివిని విసర్జించువిధముగా యోగికి బ్రహ్మజ్ఞానానంతరము, శాస్త్రగ్రంథములతో పని లేదు అను శాస్త్రము (శ్రుతి) యొక్క అర్థమును అనుసరించువాడు అగును.

యోగి అయినవాడు ప్రతివాదిని గూడ, తన స్వరూపముగా చూచును గనుక, వాదములో అతనిని జయించవలయును అను ప్రసక్తి ఉండదు. ఒక్క నాస్తికుడు దక్క, శాస్త్రకారులందరును మోక్షమును అంగీకరించుచున్నారు. కావున, యోగియొక్క చరితము విసంవాదమునకు స్థానము కాదు.

**జీవన్ముక్తివివేకః**

ఆర్హత బౌద్ధ వైశేషిక నైయాయిక శైవ వైష్ణవ శాక్త సాంఖ్య యోగాది మోక్షశాస్త్రేషు ప్రతిపాద్యప్రమేయస్యనానావిధత్వే౽పి మోక్షసాధనస్య యమ నియమాద్యష్టాంగ యోగస్యైకవిధత్వాత్ తస్మాదవిసంవాదేన సర్వసంమతో యోగీశ్వరః । ఏతదేవాభిప్రేత్య వసిష్ఠ ఆహ –

శ్లో॥ యస్యేదం జన్మ పాశ్చాత్యం తమాశ్వేవ మహామతే ।
విశన్తి విద్యా విమలా ముక్తా వేణు మివోత్తమమ్ ॥

ఆర్యతా హృద్యతా మైత్రీ సౌమ్యతా ముక్తతా జ్ఞతా ।
సమాశ్రయన్తి తం నిత్య మన్తఃపుర మివాంగనాః ॥

పేశలాచారమధురం సర్వే వాంఛన్తి తం జనాః ।
వేణుం మధుర నిధ్వానం వనే వనమృగా ఇవ ॥

సుషుప్తవత్ప్రశమిత భావవృత్తినాస్థితః
సదా జాగ్రతి యేన చేతసా ।

కాలాన్వితో విధురివ యః సదా బుధైర్నిషేవ్యతే
ముక్త ఇతీహ స స్మృతః॥" ఇతి।

మాతరీవ శమం యాన్తి విషమాణి మృదూని చ ।
విశ్వాస మిహ భూతాని సర్వాణి శమశాలిని ॥

ల. వా. 4, 62

శ్లో॥ తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషు చ ।
బలవత్సు గుణాఢ్యేషు శమవానేవ రాజతే॥ ఇతి। ల.వా 4.66

తదేవ మబాధం జీవన్ముక్తేర్వి సంవాదాభావరూపం తృతీయం ప్రయోజనం సిద్ధమ్।

దుఃఖనాశ సుఖావిర్భావరూపే చతుర్థ పంచమ ప్రయోజనే విద్యానందాత్మకేన బ్రహ్మానందగతేన చతుర్థాధ్యాయేన నిరూపితే। తదుభయ మత్ర సంక్షిప్యోచ్యతే-

శ్లో॥ ఆత్మానం చే ద్విజానీయా దయమస్మీతి పూరుషః।
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మను సంజ్వరేత్॥

బృ. ఉ. 4-4-12

ఇత్యాది శ్రుత్యా దుఃఖస్యైహికస్య వినాశ ఉక్తః। 'ఏతగ్ం హ వావ న తపతి కిమహం సాధు నాకరవం కిమహం పాప మకరవమ్' తై. ఉ. 2, 9 ఇత్యాది శ్రుతయ ఆముష్మికహేతు పుణ్యపాపచిన్తారూపస్య దుఃఖస్య నాశమాహుః। సుఖావిర్భావ స్త్రేధా- సర్వకామావాప్తిః, కృతకృత్యత్వం, ప్రాప్తప్రాప్తవ్యత్వం చేతి। సర్వకామావాప్తి స్త్రేధా- సర్వసాక్షిత్వం, సర్వత్రాకామహతత్వం, సర్వభోక్తృరూపత్వం చేతి। 'హిరణ్యగర్భాది స్థావరాన్తేషు దేహేష్వనుగతం సాక్షిచైతన్యరూపం యద్ బ్రహ్మ తదేవాహమస్మి' ఇతి జానతః స్వదేహ ఇవ పరదేహేష్వపి సర్వకామసాక్షిత్వ మస్తి। తదేతదభిప్రేత్య శ్రూయతే- 'సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా' తై. ఉ. 2-1 ఇతి। లోకే భుక్తేషు భోగేష్వకామహతత్వం యత్తత్కామప్రాప్తిరిత్యుచ్యతే। తథాచ సర్వభోగదోషదర్శిన స్తత్త్వవిదః సర్వత్రాకామహతత్వాదస్తి సర్వకామావాప్తిః। అత ఏవ సార్వభౌమోపక్రమేషు హిరణ్యగర్భపర్యన్తేషూత్తరోత్తర శతగుణేష్వానందేషు 'శ్రోత్రియస్య చాకామహతస్య' ఇతి శ్రుతమ్। సద్రూపేణ చిద్రూపేణానందరూపేణ చ సర్వత్రావస్థితం స్వాత్మాన మనుసందధతః సర్వభోక్తృత్వ మస్తీతి అభిప్రేత్యైవం శ్రూయతే-

'అహమన్న మహమన్న మహమన్నమ్। అహమన్నాదోఽహ మన్నాదోఽహ మన్నాదః' తై. ఉ. ౩, 10 ఇతి। కృతకృత్యత్వం తు స్మర్యతే-

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్॥
యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సన్తుష్టస్య కార్యం న విద్యతే॥
భ. గీ. ౩, 18 ఇతి।

ప్రాప్తప్రాప్తవ్యతాఽపి శ్రూయతే- 'అభయం వై జనక ప్రాప్తోఽసి' బృ. ఉ. 4, 2, 2 ఇతి। 'తస్మా త్తత్సర్వ మభవత్' బృ. ఉ. 1, 4, 10. ఇతి, 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' ము. ఉ. 3, 2, 9. ఇతి చ। నన్వేతౌ ద్వౌ దుఃఖవినాశ సుఖావిర్భావౌ తత్త్వజ్ఞానేనైవ సిద్ధత్వా న్న జీవన్ముక్తిప్రయోజనతా మర్హతః। మైవమ్, సురక్షితయో స్తయోరత్ర వివక్షితత్వాత్। యథా తత్త్వ జ్ఞానం పూర్వమేవోత్పన్నమపి జీవన్ముక్త్యా సురక్షితం భవతి। ఏవ మేతావపి సురక్షితౌ భవతః।

భావప్రకాశిక

ఆర్హత (జైన), బౌద్ధ, వైశేషిక (కాణాద), నైయాయిక (గౌతమ), శైవ, వైష్ణవ, శాక్త, సాంఖ్య, యోగాది మోక్ష శాస్త్రములందు ప్రతిపాద్యమగు విషయము వేరు వేరు అయినను, మోక్షసాధనమగు అష్టాంగయోగము ఏకవిధముగా సమ్మతమైనది. కనుక, యోగీశ్వరుడు ఏ శాస్త్రకారులతోను వివాదము లేక, సర్వ సమ్మతమైనవాడు. ఈ అభిప్రాయముతోనే వసిష్ఠుడు ఇట్లు చెప్పెను-

ఎవనికి సాధనోత్తరమైన ఈ జన్మ కలిగినదో, ఓ మహామతీ! వానిని, ఉత్తమమైన వెదురును ముత్యములు ప్రవేశించునట్లు,

శుద్ధమైన విద్యలు ప్రవేశించును. ఆర్యత (శాంతి, దమము, సత్యము, దయ, నమ్రత, వితరణశీలత), హృద్యత, మైత్రి, సౌమ్యత, ముక్తత, జ్ఞత- ఈ గుణములు అంగనలు అంతః పురమును ఆశ్రయించురీతిగా, ఈ యోగిని ఆశ్రయించుచున్నవి. జనులందరు, అరణ్యమునందు వనమృగములు మధురధ్వని గల వేణువును కోరునట్లు, మృదు మధుర వర్తనము గల యోగిని అభిలషింతురు. నిద్రపోయినవానివలె ప్రశమము పొందిన అంతః కరణవృత్తులు గల ఏ మనస్సుతో జాగ్రదవస్థయందు ఏ యోగి ఉండునో, విజ్ఞులచే ఎవడు, కలాసహితుడైన చంద్రునివలె సేవింప బడుచున్నాడో అతడు, ఈ లోకమున ముక్తుడు. శమగుణాన్వితు డగు యోగియందు ప్రాణులంధరు తల్లియందువలె విశ్వాసమును కలిగియుందురు. సాధుస్వభావము గల, క్రూరస్వభావము గల ప్రాణులు గూడ, తల్లియందు శమమును పొందుచున్నవి.

"తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషు చ।
బలవత్సు గుణాఢ్యేషు శమవానేవ రాజతే॥"

తాపసులలోను, బహుజ్ఞులలోను, యాజకులందు, రాజు లందు, బలవంతులందు, గుణవంతులందు శమము కలవాడే ప్రకాశించును.

ఈవిధముగా జీవన్ముక్తికి మూడవ ప్రయోజనము యొక్క అభిసంవాదము (వివాదము లేకపోవుట) సిద్ధించినది.

ఇక, దుఃఖనాశము, సుఖావిర్భావము అను నాలుగవ, అయిదవ ప్రయోజనములు 'పంచదశి'లో ఆనందపంచకములోని బ్రహ్మానందమునందు విద్యానందముగా చతుర్థాధ్యాయముచేత నిరూపింపబడినవి. ఆ రెండు ప్రయోజనములు, ఇచట సంక్షేప ముగా చెప్పబడుచున్నవి.

"ఆత్మానం చే ద్విజానీయాత్ అయమస్మీతి పూరుషః
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీర మనుసంజ్వరేత్।"

ఆత్మను 'అయమస్మి' అని స్వరూపముతో తెలిసికొనినచో ఏ కోరికలను కోరడు, ఆధ్యాత్మిక తాపము నశించును అను శ్రుతిచే ఇహలోక దుఃఖవినాశము చెప్పబడినది.

"ఏతగ్ంహ వావ న తపతి కిమహం సాధు నాకరవమ్,
కిమహం పాప మకరవమ్।"

నేను పుణ్యము ఎందుకు చేయనైతిని, ఎందుకు పాపమును చేసితిని? అని పరితపించడు అను శ్రుతిచే ఆముష్మిక దుఃఖమునకు హేతువగు పుణ్యపాపముల చింతను, తన్మూలమగు దుఃఖము యొక్క నాశమును చెప్పుచున్నారు-

సర్వకామావాప్తి, కృతకృత్యత్వము, ప్రాప్తప్రాప్తవ్యత్వము అని సుఖావిర్భావము మూడు విధములు. సర్వకామావాప్తి గూడ, మూడు విధములు - సర్వసాక్షిత్వము, సర్వత్ర అకామహతత్వము, సర్వభోక్తృరూపత్వము. హిరణ్యగర్భజీవుడు మొదలుకొని స్థావరపర్యంతము సర్వదేహములందు అనుగతమగు సాక్షిచైతన్యరూపమైన ఏ బ్రహ్మ కలదో, ఆ బ్రహ్మయే నేను అగుచున్నాను అని తెలిసినవానికి తన దేహమునందువలెనే పరదేహమునందు గూడ, సర్వకామసాక్షిత్వము కలదు. ఈ అభిప్రాయముతోనే

"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"

అను శ్రుతి, ప్రవృత్తమైనది. లోకమున, భోగములను అనుభవించినప్పుడు తిరిగి ఆ భోగములందు కోరిక లేకపోవుట అకామహతత్వము. అదియే, 'కామావాప్తి' అని చెప్పబడుచున్నది. అట్లు కాగా, సర్వభోగములయందు దోషమును దర్శించిన తత్త్వజ్ఞానికి ఏ భోగమునందును కోరిక ప్రసరించదు గనుక, సర్వకామావాప్తి

సిద్ధించుచున్నది. కనుకనే, సార్వభౌమానందరూపమగు మనుష్యా నందముతో ప్రారంభించి, హిరణ్యగర్భ పర్యంతము 'ఉత్తరో త్తరము నూరురెట్లు అధికములగు ఆనందములను వర్ణించి, 'శ్రోత్రియస్య చఅకామహతస్య' ఆ భోగములందు కోరిక ప్రస రించని శ్రోత్రియునకు గూడ, ఆ ఆనందములు లభించును అని తైత్తిరీయశ్రుతియందు పేర్కొనబడెను. సద్రూపముతోను, చిద్రూపముతోను, ఆనందరూపముతోను అంతట, తన ఆత్మ ఉన్నది అను అనుసంధానము చేసికొనినవానికి సర్వభోక్తృ త్వము కలదు అను అభిప్రాయముతో

"అహమన్న మహమన్న మహమన్నమ్, అహమన్నాదో ఽహ మన్నాదోఽహమన్నాదః"

అను శ్రుతి, ప్రవృత్తమైనది. కృతకృత్యత్వము భగవద్గీతయందు ఇట్లు చెప్పబడినది-

జ్ఞానామృతముచే తృప్తుడై, కృతార్థుడైన యోగికి కర్తవ్య మేదియు కొంచెము కూడ, మిగిలియుండదు. అట్లుగాక, కర్తవ్య మున్నచో అతడు తత్త్వవేత్త కాడు. ఏ మానవుడు, ఆత్మయందే రతి, తృప్తి, సంతుష్టి కలిగియుండునో, అతనికి కర్తవ్యము లేదు.

ప్రాప్త ప్రాప్తవ్యత్వముగూడ, 'అభయం వై జనక ప్రాప్తోఽసి' ఓ జనకా! సంసారభయరహితమగు బ్రహ్మను పొందితివి, 'తస్మాత్తత్సర్వ మభవత్' అందువలన, అతడు సర్వము తానే ఆయెను. 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' బ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మయే అగుచున్నాడు అని శ్రుతియందు చెప్పబడినది.

ఓయీ! ఈ దుఃఖవినాశ, సుఖావిర్భావములు రెండును తత్త్వజ్ఞానము చేతనే సిద్ధించినవి గనుక, జీవన్ముక్తి ప్రయోజన ములుగా చెప్పుట యుక్తము కాదుకదా! అనినచో, అట్లు కాదు.

సురక్షితములైన దుఃఖవినాశ, సుఖావిర్భావములు జీవన్ముక్తి ప్రయోజనములుగా వివక్షితములు. తత్త్వజ్ఞానము, పూర్వమే ఉత్పన్నమైనను, జీవన్ముక్తియందు ఏ విధముగా సురక్షితమగుచున్నదో ఆ విధముగానే, ఈ దుఃఖవినాశ, సుఖావిర్భావములు కూడ, జీవన్ముక్తియందు సురక్షితములు అగుచున్నవి.

జీవన్ముక్తి వివేకః

నన్వేవం జీవన్ముక్తేః పంచ ప్రయోజనత్వే సతి సమాహితో యోగీశ్వరో లోకవ్యవహారం కుర్వత స్తత్త్వవిదోఽపి శ్రేష్ఠ ఇతి వక్తవ్యమ్। తచ్చ రామ వసిష్ఠయోః (ఉ. వా. 25) ప్రశ్నోత్తరాభ్యాం నిరాకృతమ్।

శ్రీరామః—

శ్లో॥ భగవన్ భూతభవ్యేశ కశ్చి జ్జాతు సమాహితః।
ప్రబుద్ధ ఇవ విశ్రాన్తో వ్యవహారపరోఽపి సన్॥
కశ్చిదేకాన్త మాశ్రిత్య సమాధినియమే స్థితః।
తయోస్తు కతరః శ్రేయానితి మే భగవన్ వద॥

వసిష్ఠః—

శ్లో॥ ఇమం గుణసమాహార మనాత్మత్వేన పశ్యతః।
అన్తఃశీతలతా యా సా సమాధిరితి కథ్యతే॥
దృశ్యైర్న మమ సంబంధ ఇతి నిశ్చిత్య శీతలః।
కశ్చిత్ సంవ్యవహారస్థః కశ్చిత్ ధ్యానపరాయణః॥
ద్వావేతౌ రామ సుసమౌ వన్తశ్చేత్ పరిశీతలౌ।
అంతఃశీతలతా యా స్యాత్ తదనన్త తపఃఫలమ్॥ ఇతి।

నైష దోషః। అత్ర వాసనాక్షయరూప మన్తఃశీతలత్వ మవశ్యం సంపాదనీయ మిత్యేతావదేవ ప్రతిపాద్యతే। న తు తదనన్తరభావినో మనోనాశస్య శ్రేష్ఠత్వం నివార్యతే। శీతలత్వం తృష్ణాయాః ప్రశమన మిత్యేతాదృశీం వివక్షాం స్వయమేవ

స్పష్టీచకార-

శ్లో॥ అన్తఃశీతలతాయాం తు లబ్ధాయాం శీతలం జగత్।

అన్తస్తృష్ణోపతప్తానాం దావదాహమయం జగత్॥ ఇతి।

నను సమాధినిన్దా వ్యవహారప్రశంసా చాత్రోపలభ్యతే -

శ్లో॥ సమాధిస్థానకస్థస్య చేతశ్చేద్ వృత్తిచంచలమ్।

తత్తస్య తు సమాధానం సమ మున్మత్తతాండవైః॥

ఉన్మత్త తాండవస్థస్య చేతశ్చేత్ క్షీణవాసనమ్।

తదన్యోన్మత్తనృత్యం తు సమం బ్రహ్మసమాదినా॥ఇతి।

మైవమ్। అత్ర హి సమాధిప్రాశస్త్య మేవాంగీకృత్య వాసనా నిన్ద్యతే। ఇయమత్ర వచనవ్యక్తిః-యద్యపి వ్యవహారాత్ సమాధిః ప్రశస్తః, తథాఽప్యసౌ సవాసనశ్చేత్ తదా నిర్వాసనా ద్వ్యవహారా దధమ ఏవేతి, స న సమాధిః। యదా సమాహిత వ్యవహర్తారా వుభావప్యతత్త్వజ్ఞౌ సవాసనౌ చ, తదా సమాధే రుత్తమలోకప్రాప్తిహేతు పుణ్యత్వేన ప్రాశ్యస్త్యమ్। యదా తూభౌ జ్ఞాననిష్ఠౌ నిర్వాసనౌ చ, తదాఽపి వాసనాక్షయరూపాం జీవన్ముక్తిం పరిపాలయన్ అయం మనోనాశరూపః సమాధిః ప్రశస్త ఏవ। తస్మాద్ యోగీశ్వరస్య శ్రేష్ఠత్వాత్ పంచప్రయోజ నోపేతాయా జీవన్ముక్తే ర్న కోఽపి విఘ్న ఇతి సిద్ధమ్॥

ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తివివేకే జీవన్ముక్తి స్వరూపసిద్ధి ప్రయోజననిరూపణం నామ చతుర్థం ప్రకరణమ్॥4॥

భావప్రకాశిక

ఓయీ! ఈవిధముగా జీవన్ముక్తికి అయిదు ప్రయోజన ములు కలుగగా సమాధినిష్ఠుడగు యోగీశ్వరుడు లోకవ్యవహారము చేయుచున్న తత్త్వజ్ఞానికంటె గూడ, శ్రేష్ఠుడు అని చెప్పవలసి యుండును. కాని, ఆ శ్రేష్ఠత్వము శ్రీరామ వసిష్ఠుల ప్రశ్నోత్తర ములచే నిరాకరింపబడినది.

శ్రీరాముడు అడుగుచున్నాడు —

పూజ్యుడవైన ఓ వసిష్ఠమహర్షీ! ఒకానొకయోగి, ప్రబుద్ధుని వలె వ్యవహారపరుడై ఉండినను, విశ్రాంతి కలిగి ఉండును. యోగి, ఒకప్పుడు సమాహితుడు అయినవాడు గూడ, తరువాత వ్యవహారపరుడగుచు ప్రబుద్ధునివలె విశ్రాంతి కలవాడగును. ఒకానొక యోగి, ఎల్లప్పుడు ఏకాంతమునందుండి సమాధిలోనే ఉండును. వారిరువురిలో ఎవరు ఉత్కృష్టమైనవారు ?

వసిష్ఠుడు ఇట్లు చెప్పెను —

ప్రకృతిగుణసముదాయరూపమగు ప్రపంచమును, దేహాదులను అనాత్మలుగా చూచుచు, లోపల చల్లగా, హాయిగా ఉండుట, సమాధి అని చెప్పబడును. దృశ్యపదార్థములతో నాకు సంబంధము లేదు అని నిశ్చయించుకొన్నవాడు శీతలుడు. అట్టి సమాధినిష్ఠులలో ఒకడు, వ్యవహారపరుడు కావచ్చును. మరియొకడు ధ్యానపరాయణుడు అగును. రామా ! వీరిరువురును లోపల తాపరహిత శీతల స్వభావము కలవారగుచో ఇద్దరును సములే. అన్తఃశీతలతే ముఖ్యము. అది అనంత తపఃఫలము అని చెప్పెను.

ఇది దోషము కాదు. ఇచట, వాసనాక్షయరూపమగు అన్తఃశీతలత, అవశ్యము సంపాదించవలయునని చెప్పబడుచున్నది. ఆ వాసనాక్షయానంతరము కలుగు మనోనాశముయొక్క శ్రేష్ఠత్వమును నివారించుటలేదు. శీతలత్వమనగా తృష్ణాప్రశమనము అయి ఉన్నది. ఈ విషయము తరువాత స్పష్టము చేయబడినది.

అన్తఃశీతలత లభ్యమైనచో, జగత్తు శీతలముగా ఉండును. లోపల తృష్ణచే తపించువారికి జగత్తు, దావాగ్నిదాహమయముగా ఉండును అని వసిష్ఠుడు చెప్పెను.

ఓయీ ! ముందు చెప్పబోవు ఈ శ్లోకములందు, సమాధినిందయు, వ్యవహారప్రశంసయు కానవచ్చుచున్నదే, ఏమందురు? సమాధిస్థానములో ఉన్నవాని చిత్తము వృత్తులతో చంచలమైనచో, వాని సమాధిస్థితి, ఉన్మత్త తాండవములతో తుల్యము. ఉన్మత్త

తాండవము చేయుచున్నను, చిత్తము వాసనాక్షయము కలది అగుచో, వాని ఉన్మత్త నృత్యము కూడ, బ్రహ్మసమాధితో తుల్యము.

అట్లు కాదు, ఇచట సమాధి ప్రాశస్త్యమును అంగీకరించియే వాసన నిందింపబడుచున్నది. ఆ మాటల తీరు ఇటుల ఉన్నది. విచారించగా వ్యవహారముకంటె సమాధి ప్రశస్తమైనది. నిజమే. అయినను, ఈ సమాధి, వాసనాసహితమైనపుడు, నిర్వాసనయోగి వ్యవహారముకంటె అధమమైనదే. సమాహితుడు, వ్యవహర్త - ఇరువురును తత్త్వజ్ఞానము లేనివారు, వాసనలు కలవారు అగుచో అపుడు సమాధి, ఉత్తమలోకప్రాప్తికి హేతువగు పుణ్యరూప మగుటచే ప్రశస్తమైనది. వారిరువురును, జ్ఞాననిష్ఠులు. వాసనా శూన్యులు అయినచో, వాసనాక్షయరూపమగు జీవన్ముక్తిని పరి పాలించునట్టి ఈ మనోనాశరూపమగు సమాధి, ప్రశస్తమైనదే. కనుక, యోగీశ్వరుడు శ్రేష్ఠుడగుటవలన అయిదు ప్రయోజనములతో కూడిన జీవన్ముక్తికి ఎట్టి విఘ్నము లేదు అని సిద్ధించినది.

ఈవిధముగా శ్రీమద్విద్యారణ్య ప్రణీతమైన
జీవన్ముక్తి వివేకమునందు స్వరూపసిద్ధి ప్రయోజన మను పేరు గల
చతుర్థ ప్రకరణము సమాప్తము.



# 5. పఞ్చమం విద్వత్సంన్యాసప్రకరణమ్

## జీవన్ముక్తి వివేకః

ఏవం స్వరూపప్రమాణసాధనప్రయోజనై ర్జీవన్ముక్తి ర్నిరూపితా। అథ తదుపకారిణం విద్వత్సంన్యాసం నిరూపయామః। విద్వత్సంన్యాసశ్చ పరమహంసోపనిషది ప్రతిపాదితః। తాం చోపనిషద మనూద్య వ్యాఖ్యాస్యామః-

తత్రాదౌ విద్వత్సంన్యాసయోగ్యం ప్రశ్న మవతారయతి-

'అథ యోగినాం పరమహంసానాం కోఽయం మార్గ స్తేషాం కా స్థితిరితి నారదో భగవన్త ముపగత్యోవాచ' ఇతి।

యద్యప్యథశబ్దాపేక్షిత అనన్తర్యప్రతియోగీ న కోఽప్యత్ర ప్రతిభాతి, తథాఽపి ప్రష్టవ్యార్థోఽత్ర విద్వత్సంన్యాసః। తస్మింశ్చ విదిత తత్త్వే లోకవ్యవహారై ర్విక్షిప్యమాణో మనోవిశ్రాన్తిం కామయమానోఽధికారీ। తత స్తాదృగధికారసంపత్త్యాఽఽనన్తర్య మథశబ్దార్థః। కేవల యోగినం కేవల పరమహంసం చ వారయితుం పదద్వయ ముక్తమ్। కేవల యోగీ తత్త్వజ్ఞానాభావేన త్రికాల జ్ఞాన ఆకాశగమనాదిషు యోగైశ్వర్య చమత్కార వ్యవహారే ష్వాసక్తః సంయమవిశేషై స్తత్ర తత్రోపయుంక్తే। తతః పరమ పురుషార్థాద్ భ్రష్టో భవతి। అస్మిన్నర్థే సూత్రం పూర్వ మేవో దాహృతమ్- 'తే సమాధా వుపసర్గా వ్యుత్థానే సిద్ధయః' 3.38 ఇతి, కేవల పరమహంసస్తు తత్త్వవివేకేనైశ్వర్యేష్వసారతాం బుద్ధ్వా విరజ్యతి। ల.వా. 27 తదప్యుదాహృతమ్ -

శ్లో॥ చిదాత్మన ఇమా ఇత్థం ప్రస్ఫురన్తీహ శక్తయః।
ఇత్యస్యాశ్చర్యజాలేషు నాభ్యుదేతి కుతూహలమ్॥ ఇతి।

విరక్తోఽప్యసౌ బ్రహ్మవిద్యాభరేణ విధినిషేధా వుల్లంఘ యతి। తదుక్తమ్ - 'నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః' ఇతి। తథా చ శ్రద్ధాలవః శిష్టా స్తమేవం నిన్దన్తి -

శ్లో॥ సర్వే బ్రహ్మ వదిష్యన్తి సంప్రాప్తే తు కలౌ యుగే।
నానుతిష్ఠన్తి మైత్రేయ శిశ్నోదరపరాయణాః॥ వి. పు. ఇతి।
యోగిని తు పరమహంసే యథోక్తం దోషద్వయం నాస్తి।

# 5. విద్వత్సంన్యాస ప్రకరణము

## భావప్రకాశిక

ఈవిధముగా స్వరూప, ప్రమాణ, సాధన, ప్రయోజనములతో జీవన్ముక్తి నిరూపింపబడినది. తరువాత, తదుపకారి యగు విద్వత్సంన్యాసము నిరూపించుచున్నాము. విద్వత్సంన్యాసము అయినచో, పరమహంసోపనిషత్తునందు ప్రతిపాదింపబడినది. ఆ ఉపనిషత్తునే అనువదించి వ్యాఖ్యానింతుము.

ఆ ఉపనిషత్తునందు మొదట, విద్వత్సంన్యాసయోగ్యమగు ప్రశ్నను అవతరింపజేయుచున్నారు—

"అథ యోగినాం పరమహంసానాం కోఽయం మార్గ స్తేషాం
కా స్థితిరితి నారదో భగవన్త ముపగత్యోవాచ।"

ప్రారంభమున, యోగులగు పరమహంసలకు మార్గము ఏమై యున్నది? వారియొక్క స్థితి ఏమి ? అని నారదుడు పూజ్యుడగు భగవానుని సమీపించి ఇట్లు పలికెను—

విచారించగా, ఇచట 'అథ' శబ్దముచేత బోధింపబడు ఆనంతర్యమునకు ప్రతియోగి (సంబంధి) యగు అర్థము కనిపించుటలేదు. అయినను, ఇచట ప్రశ్నించిన అర్థము విద్వత్సంన్యాసము కనుక, దానికి అనువుగా తత్త్వము తెలిసినవాడు, లోకవ్యవహారమునందు విక్షిప్తచిత్తుడై మనోవిశ్రాంతిని కోరువాడు అధికారి. కావున, అట్టి అధికారసంపత్తి యొక్క అనంతరము అని 'అథ' శబ్దమునకు అర్థము. ఇచట, కేవల యోగిని, కేవల పరమ

హంసను వారించుటకొరకు 'తత్త్వము తెలిసినవాడు' అను విశేషణము, 'లోకవ్యవహార విక్షేపము కలవాడు' అను విశేషణము చెప్పబడినవి. కేవల యోగికి తత్త్వజ్ఞానము లేకపోవుటవలన త్రికాలజ్ఞానమునందును, ఆకాశగమనాదులందును యోగైశ్వర్య చమత్కారము గల వ్యవహారములందును, ఆసక్తి గలవాడై వానికి సాధనములగు ఆ యా సంయమములందు ఉద్యుక్తుడగును. కనుక, తత్త్వజ్ఞానము లేనందున, పరమ పురుషార్థము నుండి క్రిందికి జారినవాడు అగుచున్నాడు. ఆ విషయమునందే

"తే సమాధౌ ఉపసర్గాః ఉత్థానే సిద్ధయః।"

అవి, సమాధికి విఘ్నకరములు, లోకవ్యవహారమున సిద్ధులు అని ఉదహరింపబడినవి. కేవల పరమహంస అయినచో తత్త్వవివేకము చేత యోగైశ్వర్య మహిమలందు నిస్సారత్వమును గ్రహించి విరమించుచున్నాడు. ఆ విషయము కూడ, చెప్పబడినది.

ఈ యోగమహిమలు, శక్తులు చిదాత్మయొక్క ప్రస్ఫురణములు అని గ్రహించి, ఈ అద్భుత జాలములందు కుతూహలము కలవాడు కాడు. ఈ కేవల పరమహంస, (తాత్కాలిక) వైరాగ్యము కలవాడైనను, బ్రహ్మవిద్య కలదుగదా అను బలముతో విధినిషేధములను ఉల్లంఘించును. ఆ విషయమే,

"నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః।"

త్రిగుణాతీతమగు బ్రహ్మజ్ఞానమార్గమున, సంచరించువారికి విధి నిషేధము లేవి కలవు? అని చెప్పబడినది. కనుకనే, శ్రద్ధాతిశయము గల శిష్టులు, ఆ పరమహంసను ఇట్లు నిందించుచున్నారు–

కలియుగము రాగా, అందరు బ్రహ్మను గురించి మాట్లాడుదురు. ఓ మైత్రేయా! సదాచార కర్మానుష్ఠానములను చేయరు. ఉదరపోషణ, భోగాసక్తి కలవారు అగుదురు. యోగి అగు పరమహంసయందు ఈ రెండు దోషములు లేవు.

జీవన్ముక్తివివేకః

అన్యోఽప్యస్యాతిశయః ప్రశ్నోత్తరాభ్యాం (ల. వా. 42) దర్శితః–

శ్రీరామః—

శ్లో॥ ఏవం స్థితేఽపి భగవన్ జీవన్ముక్తస్య సన్మతేః।
అపూర్వో ఽతిశయః కోఽసౌ భవత్యాత్మవిదాం వర॥

వసిష్ఠః—

శ్లో॥ జ్ఞస్య కస్మింశ్చిదప్యేషా భవత్యతిశయేన ధీః।
నిత్యతృప్తః ప్రశాన్తాత్మా స ఆత్మన్యేవ తిష్ఠతి॥
మంత్రసిద్ధై స్తపఃసిద్ధైర్యోగసిద్ధైశ్చ భూరిశః।
కృత మాకాశయానాది తత్ర కా స్యా దపూర్వతా॥
ఏక ఏవ విశేషోఽస్య న సమో మూఢబుద్ధిభిః।
సర్వత్రాస్థాపరిత్యాగా న్నీరాగ మమలం మనః॥
ఏతావదేవ ఖలు లిఙ్గ మలిఙ్గమూర్తేః సంశాన్త
సంసృతిచిరభ్రమనిర్వృతస్య।
తజ్జ్ఞస్య యన్మదనకోప విషాద మోహ లోభాపదా
మనుదినం నిపుణం తనుత్వమ్॥ ఇతి।

ఏతేనాతిశయేనోపేతానాం దోషద్వయరహితానాం మార్గస్థితీ పృచ్ఛ్యేతే। వేషభాషాదిరూపో హి వ్యవహారో మార్గః। చిత్తోపరమరూప ఆన్తరో ధర్మః స్థితిః। భగవాంశ్చతుర్ముఖో బ్రహ్మ యథోక్తం ప్రశ్నోత్తర మవతారయతి– 'తం భగవానాహ' ఇతి।

వక్ష్యమాణమార్గే శ్రద్ధాతిశయ ముత్పాదయితుం తం మార్గం ప్రశంసతి।

'సోఽయం పరమహంసానాం మార్గో లోకే దుర్లభతరో న తు బాహుల్యః' (పరమ. ఉ. 1) ఇతి।

యః పృష్టః సోఽయమితి యోజనా। అయ మిత్యుత్తర

గ్రన్థే వక్ష్యమాణ ఆచ్ఛాదనాదిః స్వశరీరోపభోగేన లోకోపకారేణ చ నిరపేక్షో ముఖ్యో మార్గః పరామృశ్యతే। తాదృశస్య పరమకాష్ఠాం ప్రాప్తస్య వైరాగ్యస్యాదృష్టచరత్వాత్ తస్య మార్గస్య దుర్లభతరత్వమ్। న చైతావతాఽత్యన్తాభావః శంకనీయ ఇత్యభిప్రేత్య బాహుల్యమేవ ప్రతిషేధతి- న త్వితి బాహుల్యమితి వక్తవ్యే లిఙ్గవ్యత్యయశ్ఛాన్దసః।

## భావప్రకాశిక

మరియొక విశేషముగూడ, ప్రశ్నోత్తరములచేత చూపబడినది-

శ్రీరాముడు —

ఆత్మవేత్తలలో శ్రేష్ఠుడవైన ఓ వసిష్ఠమహర్షీ! సద్బుద్ధియగు జీవన్ముక్తునకు ఈ విశేషమున్నను, ఇంకను అపూర్వమగు అతిశయము మరొకటి కలదా?

వసిష్ఠుడు —

జ్ఞానికి ఏ అతిశయమునందును బుద్ధి ప్రసరించదు. నిత్యతృప్తుడు, ప్రశాంతస్వభావము కలవాడు. అతడు ఆత్మయందే స్థితి కలవాడగును. మంత్రసిద్ధి, తపస్సిద్ధి, యోగసిద్ధి, ఆకాశగమనము- వీనియందు ఏమి విశేషమున్నది? అతనియందు ఒకే విశేషము కలదు. మూఢబుద్ధులతో పోల్చదగినవాడు కాడు. అన్నిటియందును ఆదరమును విడనాడును. మనస్సు, రాగరహితమై నిర్మలముగా నుండును. సంసారభ్రమ, శాంతించుటచే పరమానందమును అనుభవించు లింగశరీరచిహ్నములు లేని జ్ఞానికి ఇది ఒకటియే చిహ్నము. ఏధనగా కామము, క్రోధము, విషాదము, మోహము, లోభము అను ఆపదలు రోజురోజుకు నిపుణముగా తరిగి కృశించిపోవును.

దీనిచేత ఇట్టి విశేషము గల యోగసిద్ధులందు ఆసక్తి, విధినిషేధముల అతిక్రమణము అను రెండు దోషములు లేని యోగి,

పరమహంసయొక్క మార్గము, స్థితి ప్రశ్నింపబడుచున్నవి. మార్గ మనగా, వేషభాషాదిరూపమగు వ్యవహారము. స్థితి యనగా, చిత్తో పరమలక్షణమగు అంతర ధర్మము. ఇచట, భగవాన్ చతుర్ముఖ బ్రహ్మ, ఆ ప్రశ్నలకు ఉత్తరమును 'తం భగవానాహ' అని అవతరింపజేయుచున్నాడు. చెప్పబోవునట్టి మార్గమునందు శ్రద్ధాతి శయమును కలిగించుటకు ఆ మార్గమును ప్రశంసించుచున్నాడు: ఈ యీ పరమహంసమార్గము లోకమున, కడు దుర్లభము. బాహుల్యముగా కనబడదు. ఉత్తర గ్రంథమునందు చెప్పబోవు ఆచ్ఛాదనాదులు తన శరీరోపభోగముచేతను, లోకోపకారముచేతను నిరపేక్షమైన ముఖ్యమార్గముగా 'అయమ్' అను శబ్దముచే పరామర్శింపబడుచున్నది. అట్టి వైరాగ్యపరాకాష్ఠను పొందిన వారు ఇదివరకు మనచే చూడబడకపోవుటవలన, ఆ మార్గము దుర్లభతరము అని చెప్పబడినది. ఇంతమాత్రముచేత అట్టి వైరాగ్యము కలవారు బొత్తుగా ఎవరును లేరు అని తలంచరాదు. అందుకొరకే 'న తు బాహుల్యః' అని చెప్పబడినది. ఎక్కువమంది లేరు అని మాత్రమే దాని అర్థము. 'బాహుల్యమ్' అని నపుంసక లింగము ఉండవలసి ఉండగా 'బాహుల్యః' అని పుంలింగ ప్రయో గము ఛాందసము. వేదములో 'వ్యత్యయో బహులమ్' అను సూత్రముచే ఒక లింగమునకు మారుగా మరియొక లింగము ఉండవచ్చును.

జీవన్ముక్తివివేకః

నన్వయం మార్గో దుర్లభతరశ్చేత్తర్హి తదర్థం ప్రయాసో న కర్తవ్యః, తేన ప్రయోజనాభావా దిత్యాశంక్యాహ–

'యద్యేకోఽపి భవతి స ఏవ నిత్యపూతస్థః స ఏవ వేద పురుష ఇతి విదుషో మన్యన్తే' ఇతి।

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।

యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

భ. గీ. 7, 3

ఇతి న్యాయేన యత్ర క్వాపి యదా కదాచిద్ యోగిపరమహంసో యది కశ్చిల్లభ్యతే, తర్హి స ఏవ నిత్యపూతస్థో భవతి। నిత్యపూతః పరమాత్మా, 'య ఆత్మాఽపహతపాప్మా' ఛాం. ఉ. 8 ఇతి శ్రుతేః। ఏవకారేణ కేవల యోగీ కేవల పరమహంసశ్చ వ్యావర్త్యేతే। కేవల యోగీ నిత్యపూతం న జానాతి। కేవల పరమహంసో జానన్నపి చిత్తవిశ్రాన్త్యభావాద్ బహిర్ముఖో బ్రహ్మణి న తిష్ఠతి। వేదప్రతిపాద్యః పురుషో వేదపురుషః। విదుషో విద్వాంసో బ్రహ్మానుభవ చిత్తవిశ్రాన్తి ప్రతిపాదక శాస్త్రపారంగతా యోగినః। పరమహంసస్య బ్రహ్మనిష్ఠత్వం సర్వే జనా మన్యన్తే। యథోక్తా విద్వాంసస్తు తదప్యసహమానా బ్రహ్మత్వమేవ మన్యన్తే। తథా చ స్మర్యతే–

శ్లో॥ దర్శనాదర్శనే హిత్వా స్వయం కేవల రూపతః।
యస్తిష్ఠతి స తు బ్రహ్మన్ బ్రహ్మ న బ్రహ్మవిత్ స్వయమ్॥ ఇతి।

అతో న ప్రయోజనాభావః శఙ్కితుమపి శక్యతే।

నిత్యపూతస్థత్వం వేదపురుషత్వం చ ముఖతో విశదయన్ అర్థాత్ 'కా స్థితిః?' ఇతి ప్రశ్నోత్తరం సూత్రయతి–

"మహాపురుషో యచ్చిత్తం తత్సర్వదా మయ్యేవావస్థాపయతి, తస్మాదహం చ తస్మిన్నేవావస్థితః" ఇతి।

భావప్రకాశిక

ఓయీ! ఈ యోగి పరమహంసమార్గము కడు దుర్లభము అయినచో, దానికొరకు ప్రయాసపడనక్కరలేదు. అందువలన, ప్రయోజనము లేదుగనుక అని ఆశంకించుకొని సమాధానము చెప్పుచున్నాడు.

అట్టివాడు ఒక్కడైనను, అతడే నిత్యపూతస్థుడు (పరమాత్మ నిష్ఠుడు). అతడే, వేదపురుషుడు (వేదమునందు ప్రతిపాదింప బడిన పురుషుడు) అయి ఉన్నాడు అని విద్వాంసులు తలంచు చున్నారు.

వేలకొలది మనుష్యులలో ఒకానొకడు మాత్రమే, సిద్ధి కొరకు యత్నించును. ఆ యత్నము చేయు సిద్ధులలో గూడ, ఒకానొకడు మాత్రమే, నన్ను యదార్థ స్వరూపముతో తెలిసికొనును అను న్యాయముచే ఎచ్చటనైనను, ఎప్పుడైనను, యోగియగు పరమ హంస ఒకడు లభ్యమైనచో (చాలును) అతడే, నిత్యప్రూతస్థుడు. నిత్యపూతుడు అనగా పరమాత్మ. 'య ఆత్మా ఒపహత పాప్మా' పరమాత్మ, పాపము లేనివాడు, పరిశుద్ధుడు అను శ్రుతివలన విదితమగుచున్నది. 'ఏవ'కారముచేత కేవల యోగి కాని, కేవల పరమహంస గాని, వ్యావర్తింపచేయబడుచున్నారు (వారిని గ్రహించరాదు). కేవల యోగి, నిత్యపూతుడగు పరమాత్మను ఎరుగడు. కేవల పరమహంస పరమాత్మజ్ఞానము కలవాడైనను, చిత్తమునందు విశ్రాంతి లేదు గనుక, బహిర్ముఖుడై బ్రహ్మ యందు నిలుకడగల స్థితి కలవాడు కాడు. వేదపురుషుడు అనగా, వేదప్రతిపాద్యుడగు పురుషుడు. విదుషః=విద్వాంసులు బ్రహ్మాను భవ చిత్తవిశ్రాంతి ప్రతిపాదక శాస్త్రములందు నిష్ణాతులగు యోగులు. పరమహంస, బ్రహ్మనిష్ఠుడని జనులందరు తలంతురు. కాని, వెనుక చెప్పిన విద్వాంసులు దానిని గూడ, సహించక, బ్రహ్మయే అని అందురు- తలంతురు. స్మృతియందు ఇట్లు చెప్పబడినది-

జ్ఞానాజ్ఞానములను వదలిపెట్టి తాను కేవలరూపుడుగా ఎవడు ఉండునో, అతడు బ్రహ్మయే కాని, బ్రహ్మవిదుడు అని అనరాదు.

కనుక, ప్రయోజనము లేకపోవుట లేదు.

నిత్యపూతస్థత్వమును, వేదపురుషత్వమును స్పష్టముగా శబ్దముతో విశదపరచి, అర్థాత్ బ్రహ్మవేత్తకు 'కా స్థితిః' అను ప్రశ్నకు సమాధానమును సూత్రించుచున్నారు.

"మహాపురుషో యచ్చిత్తం తత్సర్వదా మయ్యేవావతిష్ఠతే।
తస్మాదహం చ తస్మిన్నేవావస్థితః॥"

'మహాపురుషుని చిత్తము ఎల్లప్పుడు నాయందే ఉండును, కనుక, నేను గూడ, ఆ మహాపురుషునియందే ఉందును' అని అర్థము.

జీవన్ముక్తివివేకః

వైదిక జ్ఞాన కర్మాదికారిషు పురుషేషు మధ్యే యోగినః పరమహంసస్యాస్య అత్యన్త ముత్తమత్వా న్మహాపురుషత్వమ్। స చ మహాపురుషో యచ్చిత్తం స్వకీయం తత్సర్వదా మయ్యేవావస్థాపయతి। సంసారగోచరాణాం తదీయ చిత్తవృత్తీనా మభ్యాసవైరాగ్యాభ్యాం నిరుద్ధత్వాత్। అత ఏవ భగవాన్ ప్రజాపతిః శాస్త్రసిద్ధం పరమాత్మానం స్వానుభవేన పరామృశ న్మయీతి వ్యపదిశతి। యస్మాద్ యోగీ మయ్యేవ చిత్తం స్థాపయతి, తస్మాద్ధహమపి పరమాత్మస్వరూపత్వేన తస్మిన్నేవ యోగిన్యావిర్భూతో ఽవస్థితోఽస్మి; నేతరే ష్వజ్ఞానిషు, తేషా మవిద్యావృతత్వాత్। తత్త్వవిత్స్వప్యయోగిషు బాహ్యచిత్తవృత్తిభిరావృతత్వాన్నాస్తి ఆవిర్భావః।

ఇదానీం కోఽయం మార్గ ఇతి పృష్టం మార్గ ముపదిశతి—

'అసౌ స్వపుత్ర మిత్ర కలత్ర బన్ధ్వాదీన్ శిఖాయజ్ఞోపవీతే స్వాధ్యాయం చ సర్వకర్మాణి సంన్యస్యాయం బ్రహ్మాండం చ హిత్వా కౌపీనం దండ మాచ్ఛాదనం చ స్వశరీరోపభోగార్థాయ లోకస్య ఉపకారార్థాయ చ పరిగ్రహేత్।' పరమ ఉ. 1 ఇతి॥

యో గృహస్థః పూర్వజన్మసంచిత పుణ్యపుంజే పరిపక్వే

సతి మాతృపిత్రాజ్ఞాదినా నిమిత్తేన వివిదిషాసంన్యాసరూపం పరమహంసాశ్రమ మస్వీకృత్యైవ శ్రవణాది సాధనా న్యనుష్ఠాయ తత్త్వం సమ్యగవగచ్ఛతి, తతో గృహస్థస్య ప్రాప్తై ర్లౌకిక వైదిక వ్యవహారసహస్రై శ్చిత్తే విక్షిప్తే సతి విశ్రాన్తిసిద్ధయే విద్వత్సంన్యాసం చికీర్షతి, తం ప్రతి స్వ పుత్ర మిత్రేత్యా ద్యుపదేశః, పూర్వ మేవ వివిదిషాసంన్యాసం కృత్వా తత్త్వం విదితవతో విద్వత్సంన్యాసం చికీర్షోః పుత్ర కలత్రాది ప్రసంగా భావాత్। నన్వయం విద్వత్సంన్యాసః కిమితర సంన్యాస వత్ప్రైషోచ్చారణాది విధ్యుక్త ప్రకారేణ సంపాదనీయః? కిం వా జీర్ణవస్త్ర సోపద్రవగ్రామాది త్యాగవల్లౌకిక త్యాగమాత్రరూపః? నాద్యః, తత్త్వవిదః కర్తృత్వరాహిత్యేన విధినిషేధానధికారాత్। అత ఏవ స్మర్యతే-

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నైవాస్తి కించిత్ కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్॥ ఇతి।

న ద్వితీయః। కౌపీన దండాద్యాశ్రమలిఙ్గవిధానశ్రవణాత్। నైష దోషః। ప్రతిపత్తికర్మవ దుభయరూపత్వోపపత్తేః। తథా హి జ్యోతిష్టోమే దీక్షితస్య దీక్షాంగ నియమానుష్ఠానకాలే కండూయితుం హస్తం ప్రతిషిధ్య కృష్ణవిషాణా విహితా 'యద్ధస్తేన కండూయేత పామనంభావుకాః ప్రజాః స్యు ర్యత్స్మయేత నగ్నంభావుకాః' ఇతి, 'కృష్ణవిషాణయా కండూయతే' ఇతి చ। తస్యాశ్చ కృష్ణ విషాణాయాః సమాప్తే నియమే ప్రయోజనాభావాద్ వోఢు మశక్యత్వాచ్చ త్యాగః స్వత ఏవ ప్రాప్తః। తం చ త్యాగం సప్రకారం వేదో విదధాతి- 'నీతాసు దక్షిణాసు చాత్వాలే కృష్ణ విషాణాం ప్రాస్యతి' ఇతి। తదిదం ప్రతిపత్తికర్మ లౌకికం వైదికం చేతి ఉభయరూపమ్। ఏవం విద్వత్సంన్యాసోఽప్యుభయరూపః।

న చ తత్త్వవిది కర్తృత్వస్యాత్యన్తాభావః శంకనీయః, చిదాత్మని ఆరోపితస్య కర్తృత్వస్య విద్యయాఽపోహితత్వేఽపి చిచ్ఛాయోపేతేఽన్తఃకరణోపాధౌ విక్రియాసహప్రయుక్తే స్వతఃసిద్ధస్య కర్తృత్వస్య యావద్ద్రవ్యభావితయాఽనపోహితత్వాత్। న చ 'జ్ఞానామృతేన' ఇత్యాది స్మృతివిరోధః; సత్యపి జ్ఞానే విశ్రాన్తిరహితస్య తృప్త్యభావేన విశ్రాన్తిసంపాదనలక్షణకర్తవ్యశేషసద్భావేన కృతకృత్యత్వాభావాత్।

## భావప్రకాశిక

వైదిక జ్ఞాన కర్మలందు అధికారము (అర్హత) గల పురుషులలో యోగియగు పరమహంస, మిక్కిలి ఉత్తముడు గనుక, ఆయన మహాపురుషుడు. ఆ మహాపురుషుడు, తన చిత్తమును ఎల్లప్పుడు నాయందే (పరమాత్మయందే) ఉంచును. ఏలననగా, సంసారవిషయములగు చిత్తవృత్తులను అభ్యాస, వైరాగ్యములచే నిరోధించి ఉన్నాడు. ఇచట, పూజ్యుడగు ప్రజాపతి (బ్రహ్మ) శాస్త్రసిద్ధమగు పరమాత్మను స్వానుభవముచే పరామర్శించుచు, 'మయి' (నాయందు) అని పేర్కొనినారు. కనుక, యోగి, చిత్తమును పరమాత్మయందే ఉంచుచున్నాడు. కావున, నేను గూడ పరమాత్మ స్వరూపుడను గాన, ఆ యోగియందే ఆవిర్భవించి ఉందును. ఇతరులు, అజ్ఞానులు, అవిద్యావరణము కలవారు గనుక, వారియందు అభివ్యక్తుడను కాను. తత్త్వవేత్తలైనను, యోగులు కాకపోయినచో, బాహ్యచిత్తవృత్తులచే ఆవరింపబడుదురు గనుక, నాయొక్క ఆవిర్భావము ఉండదు.

ఇప్పుడు 'కోఽయం మార్గః' అని ప్రశ్నింపబడిన మార్గమును ఉపదేశించుచున్నారు. ఇతడు తన పుత్రులను, మిత్రులను, భార్యను, బంధువులు మొదలైనవారిని, శిఖా యజ్ఞోపవీతములను;

స్వాధ్యాయమును, సర్వకర్మలను సంన్యసించి, బ్రహ్మాండమును గూడ వదలిపెట్టి, కౌపీనమును, దండమును, ఆచ్ఛాదనమును తన శరీరోపభోగార్థము, లోకోపకారము కొరకును పరిగ్రహించవలయును అని ఆ మార్గము ఉపదేశింపబడినది.

ఏ గృహస్థు, పూర్వజన్మయందు సంపాదించిన పుణ్యపుంజ పరిపాకముచేత మాతాపితరుల ఆజ్ఞను తీసికొని, వివిదిషాసంన్యాస రూపమగు పరమహంసాశ్రమమును స్వీకరింపకయే శ్రవణాది సాధనములను అనుష్ఠించి, తత్త్వమును చక్కగా తెలిసికొను చున్నాడో, తరువాత, గృహస్థునకు ప్రాప్తములగు లౌకిక, వైదిక వ్యవహారములు అనేకములు చిత్తవిక్షేపము కలిగించగా, విశ్రాంతి సిద్ధికొరకు విద్వత్సంన్యాసమును చేయదలంచుచున్నాడో, వానిని గురించి 'స్వపుత్ర మిత్రాది' అను ఈ ఉపదేశము అయి ఉన్నది. ఇదివరకే, వివిదిషాసంన్యాసమును స్వీకరించి, శ్రవణాదులచే తత్త్వజ్ఞానము కలవానికి విద్వత్సంన్యాసము చేయదలచినప్పుడు పుత్ర, మిత్ర, కళత్రాది ప్రసంగము లేదు.

ఓయీ! ఈ విద్వత్సంన్యాసము ఇతర సంన్యాసములవలె ప్రేషోచ్చారణాదులతో విధ్యుక్త ప్రకారముగా ఆచరించ వలయునా? లేక, జీర్ణవస్త్ర ఉపద్రవములతో గూడిన గ్రామాది త్యాగము వలె లౌకిక త్యాగమాత్రమేనా? మొదటి పక్షము కాదు. తత్త్వజ్ఞాని, కర్తృత్వము లేనివాడు గనుక, విధినిషేధాధికారము లేదు కదా! ఇందువలననే స్మృతియందు—

"జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నైవాస్తి కించిత్కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్॥"

'జ్ఞానామృతముతో తృప్తి చెందిన, కృతార్థుడైన యోగికి కర్తవ్యము కొంచెము కూడ లేదు. ఒకవేళ కర్తవ్యము ఉన్న దనినచో, అతడు తత్త్వవేత్త కాడు' అని చెప్పబడినది.

రెండవ పక్షము సరి కాదు. కౌపీనము, దండము మొదలగు ఆశ్రమలింగములను (చిహ్నములను) విధించుట శ్రూయమాణ మగుచున్నది కదా? ఇది, దోషము కాదు. ప్రతిపత్తికర్మవలె, రెండు రూపములు సంభవించును. జ్యోతిష్టోమయాగమున, దీక్షితుడు దీక్షానియమానుష్ఠానకాలమున, గోకికొనుటకు హస్తమును నిషేధించి, 'కృష్ణవిషాణము' విధింపబడినది. 'చేతితో గోకికొనినచో, ప్రజలు దురద కలవారు అగుదురు. నవ్వినచో, నగ్నులగుదురు' అను శ్రుతిచే 'కృష్ణవిషాణయా కండూయతే' అని చెప్పబడినది. దీక్షావిసర్జనానంతరము ఆ కృష్ణవిషాణమునకు పనిలేదు గనుక, ఎప్పుడును ధరించుట శక్యము కాదుగనుకను, ఆ కృష్ణవిషాణము నకు త్యాగము స్వయముగానే ప్రాప్తించుచున్నది. ఆ త్యాగ ప్రకారమును వేదము విధించుచున్నది.

"నీతాసు దక్షిణాసు చాత్వాలే కృష్ణవిషాణం ప్రాశ్యతి।"

ఋత్విక్కులకు దక్షిణాదానము అయిన తరువాత, కృష్ణవిషాణ మును గంజిగుంటయందు విసర్జించవలెను. ఈ కృష్ణవిషాణ త్యాగము ప్రతిపత్తికర్మ— లౌకికము, వైదికము ఉభయరూపము అయి ఉన్నది. ఇదేవిధముగా విద్వత్సంన్యాసము లౌకిక, వైదిక ఉభయరూపము. తత్త్వవేత్తయందు కర్తృత్వము అసలే లేదు కదా అని శంకించరాదు. చిదాత్మయందు ఆరోపితమైన కర్తృ త్వము విద్యచేత నివృత్తమైనను (వదలిపెట్టబడినను) చిచ్ఛాయా సహితమైన అంతఃకరణోపాధియందు అనేక చిత్తవికారముల వలెనే స్వతస్సిద్ధమగు కర్తృత్వము ఆ అంతఃకరణము ఉన్నంతవరకు ఉండును. కనుక, అంతఃకరణ కర్తృత్వము సంన్యాసవిధిని పాటించుటకు ఉపయోగించును. అయితే 'జ్ఞానామృతేన తృప్తస్య' అను స్మృతితో విరోధము రాదా? అని శంకించరాదు. జ్ఞానము కలిగినను, విశ్రాంతి లేనివానికి తృప్తి లేదు గనుక, విశ్రాంతి

సంపాదన మనెడి కర్తవ్యశేషము ఉండుటచే కృతకృత్యత్వము అతనికి లేదు.

### జీవన్ముక్తివివేకః

నను తత్త్వవిదోఽపి విధ్యంగీకారే సతి తేనాపూర్వేణ దేహాన్తర మారభ్యేత। మైవమ్, తస్యాపూర్వస్య చిత్తవిశ్రాన్తి ప్రతిబన్ధనివారలక్షణస్య దృష్టఫలస్య సంభవే సత్యదృష్టఫల కల్పనాయా అన్యాయ్యత్వాత్। అన్యథా శ్రవణాదివిధిష్వపి బ్రహ్మజ్ఞానోత్పత్తి ప్రతిబన్ధనివారణరూపం దృష్టఫల ముపేక్ష్య జన్మాన్తరహేతుత్వం కల్ప్యేత। తస్మాద్విధ్యంగీకారే దోషాభావా ద్వివిదిషురివ విద్వానపి గృహస్థో నాందీముఖశ్రాద్ధోపవాస జాగరణాది విధి మనుసృత్యైవ సంన్యసేత్। యద్యప్యత్ర శ్రాద్ధాదికం నోపదిష్టం తథాఽప్యస్య విద్వత్సంన్యాసస్య వివిదిషా సంన్యాస వికృతత్వాత్ 'ప్రకృతివద్వికృతిః కర్తవ్యా' ఇతి న్యాయేన తదీయా ధర్మాః సర్వేఽప్యత్ర ప్రాప్నువన్తి, యథా ఽగ్నిష్టోమస్య వికృతిష్వతిరాత్రాదిషు తదీయ ధర్మప్రాప్తి స్తద్వత్। తస్మాదితర సంన్యాసవదత్రాపి ప్రైషమంత్రేణ పుత్ర మిత్రాదిత్యాగం సంకల్పయేత్। బంధ్వాదీనిత్యాదిశబ్దేన భృత్య పశు గృహ క్షేత్రాది లౌకిక పరిగ్రహాదివిశేషాః సంగృహ్యన్తే। స్వాధ్యాయంచేతి చకారేణ తదర్థనిర్ణయోపయుక్తాని పదవాక్య ప్రమాణశాస్త్రాణి వేదోపబృంహకాణి ఇతిహాసపురాణాదీని చ సముచ్చినోతి। ఔత్సుక్యనివృత్తిమాత్ర ప్రయోజనానాం కావ్య నాటకాదీనాం త్యాగః కైముతిక న్యాయసిద్ధః। సర్వకర్మాణీతి సర్వశబ్దేన లౌకిక వైదిక నిత్య నైమిత్తిక నిషిద్ధ కామ్యాని సంగృహ్యన్తే। పుత్రాది త్యాగే నైహికభోగః పరిహృతః। సర్వ కర్మత్యాగేన చాముష్మిక భోగాశా చిత్త విక్షేపకారిణీ పరిహృతా। అయమితి ఛాందస విభక్తి లిఙ్గవ్యత్యయేనేదం బ్రహ్మాండమితి

యోజనీయమ్। బ్రహ్మాండత్యాగో నామ తత్ప్రాప్తిహేతో ర్విరాడుపాసనస్య త్యాగః। బ్రహ్మాండంచేతి చకారేణ సూత్రాత్మ ప్రాప్తిహేతో ర్హిరణ్యగర్భోపాసనస్య తత్త్వజ్ఞానహేతూనాం శ్రవణాదీనాం చ సముచ్చయః। స్వపుత్రాదిహిరణ్యగర్భోపాస నాన్త మైహికమాముష్మికం చ సుఖసాధనం సర్వం ప్రైషమంత్రో చ్చారణేన పరిత్యజ్య కౌపీనాదికం పరిగృహ్ణీయాత్। ఆచ్ఛాదనం చేతి చకారేణ పాదుకాదిని సముచ్చినోతి। తథా చ స్మృతిః-

శ్లో॥ కౌపీనయుగలం వాసః కన్థాం శీతనివారిణీమ్।
పాదుకే చాపి గృహ్ణీయాత్ కుర్యా న్నాన్యస్య సంగ్రహమ్॥
ఇతి॥

స్వశరీరోపభోగో నామ కౌపీనేన లజ్జావ్యావృత్తిః। దండేన గో సర్పాద్యుపద్రవ పరిహారః। ఆచ్ఛాదనేన శీతాది పరిహారః। చకారాత్ పాదుకాభ్యా ముచ్ఛిష్టదేశ స్పర్శాది పరిహారం సముచ్చినోతి।

## భావప్రకాశిక

ఓయీ! తత్త్వజ్ఞానికి గూడ, విధిని అంగీకరించినచో, ఆ విధివలన కలిగిన అపూర్వముతో, మరియొక దేహము రావలసి యుండును కదా! అట్లు కాదు. ఆ అపూర్వము చిత్తవిశ్రాంతి ప్రతిబంధమును నివారించుట అను దృష్టఫలము కలిగినందున, అదృష్టఫలకల్పనకు అవకాశము లేదు. అట్లు కానిచో, శ్రవణాది విధులందు గూడ, బ్రహ్మజ్ఞానోత్పత్తి ప్రతిబంధమును నివారించు నట్టి దృష్టఫలమును ఉపేక్ష చేసి, జన్మాంతరహేతుత్వమును కల్పించవలసివచ్చును. కనుక, విధిని అంగీకరించినను, దోషము లేదు. కావున, వివిదిషువు అగు గృహస్థువలెనే విద్వాంసుడగు గృహస్థు కూడ, నాందీముఖశ్రార్ధ, ఉపవాస, జాగరణాది విధులను అనుసరించియే సంన్యసించవలయును. విచారించగా, ఇచట

శ్రాద్ధాదికము ఉపదేశింపబడలేదు. అయినను, ఈ విద్వత్సం న్యాసము వివిదిషాసంన్యాసమునకు వికృతి గాన, 'ప్రకృతివత్ వికృతిః కర్తవ్యా' ప్రకృతియాగము వలెనే, వికృతియాగమును చేయవలెను అను న్యాయముచే ప్రకృతియాగములోని అంగములు వికృతియాగమునకు వచ్చినట్లుగా వివిదిషాసంన్యాసి ధర్మములు గూడ, విద్వత్సంన్యాసమునందు అన్నియు ప్రాప్త మగుచున్నవి. అగ్నిష్టోమము ప్రకృతియాగము. వికృతియాగము లగు అతిరాత్రాదులందు ప్రకృతియగు అగ్నిష్టోమము యొక్క అంగములు ప్రాప్తములై అనుష్ఠింపబడుచున్నవి. అదేవిధముగా ఇతర సంన్యాసమునందు వలెనే విద్వత్సంన్యాసమునందు గూడ, ప్రేమమాత్రముతో పుత్ర, మిత్రాది త్యాగమును సంకల్పించ వలయును. బంధువులు మొదలైనవారు 'బంధ్వాది' అనుచోట, 'ఆది' శబ్దముచేత భృత్య, పశు, గృహ, క్షేత్రాది లౌకిక పరిగ్రహములను గూడ, సంగ్రహింపబడును. 'స్వాధ్యాయం చ' అనుచోట, 'చ'కారముచేత వేదార్థ నిర్ణయమునకు ఉపయోగించు వ్యాకరణ, మీమాంసా, న్యాయశాస్త్రములను, వేదార్థ విశదీకరణము కొరకు ఏర్పడిన ఇతిహాస పురాణములను సముచ్చయము చేసి విడనాడవలయును. ఔత్సుక్యనివృత్తిమాత్రమే ప్రయోజనముగా గల కావ్య నాటకాదులను త్యజించుట కైముతికన్యాయసిద్ధము. 'సర్వకర్మాణి' అనుచోట, 'సర్వ' శబ్దముచే లౌకిక, వైదిక నిత్య నైమిత్తిక, కామ్య, నిషిద్ధ కర్మలు సంగ్రహింపబడుచున్నవి. పుత్రాది త్యాగముచేత ఐహిక భోగము పరిహరింపబడినది. సర్వ కర్మత్యాగముచే చిత్తవిక్షేపకారిణి యగు ఆముష్మిక భోగాశ పరిహరింపబడినది. 'అయం బ్రహ్మాణ్డమ్' అనుచోట, 'ఇదమ్' శబ్దముయొక్క స్థానమున 'అయమ్' శబ్దము ప్రయోగింపబడినది. ఇది, ఛాందసము. బ్రహ్మాండత్యాగ మనగా, బ్రహ్మాండశరీరుడగు

విరాట్పురుషప్రాప్తికి హేతువగు విరాడుపాసనను త్యజించుట సూచితము. 'చ'కారము చేత సూత్రాత్మప్రాప్తికి హేతువగు హిరణ్యగర్భోపాసనను, తత్త్వజ్ఞానహేతువులగు శ్రవణాదులను గ్రహించవలయును.

తన పుత్రుని మొదలుకొని హిరణ్యగర్భోపాసన వరకు ఐహికాముష్మిక సాధనమగు సర్వమును ప్రేషమంత్రోచ్చారణచే పరిత్యజించి, కౌపీనాదికమును పరిగ్రహించవలెను. 'ఆచ్ఛాదనం చ' అనుచోట, 'చ'కారముచేత పాదుకలను సముచ్చయము చేయుచున్నారు. అట్లే, స్మృతి కలదు-

రెండు కౌపీనములు, శీతనివారణార్థము బొంత, పాదుకలు, గ్రహించవలయును. ఇతరములను సంగ్రహించరాదు.

స్వశరీరభోగ మనగా, కౌపీనముచేత లజ్జావ్యావృత్తి. దండముచే గోసర్పాది ఉపద్రవ పరిహారము. 'చ'కారము వలన, పాదుకలచే ఉచ్ఛిష్టదేశ స్పర్శపరిహారము సముచ్చయము చేయబడినది.

జీవన్ముక్తివివేకః

లోకస్యోపకారో నామ దండాదిలిఙ్గైస్తదీయ ముత్తమా శ్రమం పరిజ్ఞాయ తదుచితాభివన్దన భిక్షాప్రదానాది ప్రవృత్త్యా తత్ సుకృత సిద్ధిః। చకారేణ శ్రమ మర్యాదాయాః శిష్టాచార ప్రాప్తాయాః పాలనం సముచ్చినోతి।

కౌపీనాది పరిగ్రహ స్యానుకూలత్వ మభిప్రేత్య ముఖ్యత్వం ప్రతిషేధతి- 'తచ్చ న ముఖ్యోఽస్తి' ఇతి పరమ ఉ 1. ॥

యత్కౌపీనాది పరిగ్రహణమస్తి తదప్యస్య యోగినః పరమహంసస్య ముఖ్యః కల్పో న భవతి, కిన్త్వనుకల్ప ఏవ। వివిదిషాసంన్యాసినస్తు దండగ్రహణం ముఖ్యమితి కృత్వా దండ వియోగస్య నిషేధః స్మర్యతే-

శ్లో॥ దణ్డాత్మనోస్తు సంయోగః సర్వదైవ విధీయతే।
న దణ్డేన వినా గచ్ఛే దిషుక్షేపత్రయం బుధః॥ ఇతి।

ప్రాయశ్చిత్తమపి దణ్డనాశే ప్రాణాయామశతం స్మర్యతే- 'దణ్డత్యాగే శతం చరేత్' ఇతి।

యోగినః పరమహంసస్య ముఖ్యం కల్పం ప్రశ్నోత్తరాభ్యాం దర్శయతి- 'కోఽయం ముఖ్య' ఇతి చేదయం ముఖ్యః, 'న దణ్డం, న శిఖం న యజ్ఞోపవీతం నాచ్ఛాదనం చరతి పరమహంసః' పరమ. ఉ. 1-2 ఇతి।

న శిఖమితి ఛాందసో లిఙ్గవ్యత్యయోఽనుసంధేయః। వివిదిషుః పరమహంసః శిఖా యజ్ఞోపవీతాభ్యాం రహితో ముఖ్యస్తథా యోగీ దణ్డాచ్ఛాదనాభ్యాం రహితఃసన్ముఖ్యో భవతి। దణ్డస్య వైణవత్వాదిలక్షణ మాచ్ఛాదనస్య కన్థాత్వాది లక్షణం చ పరీక్షితుం దణ్డాదికం సంపాదయితుం రక్షితుం చ చిత్తే వ్యాపృతే సతి చిత్తవృత్తినిరోధలక్షణో యోగో న సిద్ధ్యేదితి। తచ్చ న యుక్తమ్, 'న హి వరవిఘాతాయ కన్యోద్వాహః' ఇతి న్యాయాత్।

ఆచ్ఛాదనాద్యభావే శీతాది బాధాయాః కః ప్రతీకార ఇత్యాశంక్యాహ-

శ్లో॥ న శీతం న చోష్ణం న సుఖం న దుఃఖమ్।
న మానావమానౌ చ షడూర్మివర్జమ్॥ ఇతి। పరమ. ఉ. 2।

నిరుద్ధశేష చిత్తవృత్తి ర్యోగినః శీతం నాస్తి, తత్ప్రతీత్యభావాత్। యథా లీలాయా మాసక్తస్య బాలస్య ఆచ్ఛాదనాది రహితస్యాపి హేమన్త శిశిరయోః ప్రాతఃకాలేఽపి శీతం నాస్తి, తథా పరమాత్మన్యాసక్తస్య యోగినః శీతాభావః। ఘర్మకాల ఉష్ణాభావశ్చ తథైవావగన్తవ్యః। వర్షాసు తదభావ సముచ్చయార్థ

శ్చకారః। శీతోష్ణయో రప్రతీతౌ తజ్జన్యయోః సుఖదుఃఖయో రభావ ఉపపన్నః। నిదాఘే శీతం సుఖజనకం హేమన్తే దుఃఖ జనకమ్। ఉక్త విపర్యయ ఉష్ణే ద్రష్టవ్యః। మానః పురుషాన్తరేణ సంపాదితః సత్కారః। అవమాన స్తిరస్కారః। యదా యోగినః స్వాత్మవ్యతిరిక్తం పురుషాన్తరమేవ న ప్రతీయతే తదా మానావ మానౌ దూరాపేతౌ। చకారః శత్రుమిత్ర రాగద్వేషాది ద్వన్ద్వా భావం సముచ్చినోతి। షడూర్మయః- క్షుత్పిపాసే శోకమోహౌ జరామరణే చ। తేషాం త్రయాణాం ద్వంద్వానాం క్రమేణ ప్రాణ మనో దేహధర్మత్వా దాత్మతత్త్వాభిముఖస్య యోగిన స్తద్వర్జనం యుజ్యతే।

## భావప్రకాశిక

లోకమునకు ఉపకార మనగా, దండము మొదలైన చిహ్న ములచేత 'వీరు ఉత్తమ ఆశ్రమములోనివారు' అని తెలిసికొని, ఉచితమగు అభివందన, భిక్షాప్రదానాదులు చేయుటచే పుణ్యము సిద్ధించుట. 'చ'కారము చేత శిష్టాచారముచే ప్రాప్తమగు ఆశ్రమ మర్యాదను పాలించుట అదనముగా గ్రహింపనగును. కౌపీనాదు లను పరిగ్రహించుట అనుకూలముగా నుండునను అభి ప్రాయముతో ముఖ్యత్వము లేదు. 'తచ్చ న ముఖ్యోఽస్తి' అది ముఖ్యము కాదని నిషేధింపబడినది. యోగి యగు పరమ హంసకు కౌపీనాది పరిగ్రహణము ముఖ్యపక్షము కాదు. గౌణపక్షము అయి ఉన్నది. వివిదిషాసంన్యాసికైనచో, దండ పరిగ్రహము ముఖ్యముగా చేసి, దండవియోగము స్మృతియందు నిషేధింప బడినది. వివిదిషాసంన్యాసికి దండ, శరీర సంయోగము ఎల్లప్పుడు ఉండవలయును. దండము లేకుండా కొలది దూరము గూడ, (బాణమును దూరముగా విడచునంత దూరము)కూడ, వెళ్ళరాదు. దండనాశమందు, ప్రాయశ్చిత్తముగా నూరు ప్రాణాయామము

లను చేయవలయునని 'దండత్యాగే శతం చరేత్' అని స్మృతి కలదు. యోగి అయిన పరమహంసకు ముఖ్యపక్షమును ప్రశ్నోత్తరములచే చూపుచున్నారు-

ముఖ్యమైనది ఏది? అనినచో, దండము కాదు, శిఖ కాదు, యజ్ఞోపవీతము కాదు, ఆచ్ఛాదనము కాదు. వీనిని వీడియే, పరమహంస సంచరించును. ఇదియే ముఖ్యము.

'న శిఖమ్' అని ఛాందసప్రయోగము. 'శిఖామ్' అని స్త్రీలింగమునకు మారుగా నపుంసకలింగ ప్రయోగము ఛాందసము. వివిదుషువు అగు సంన్యాసికి శిఖా యజ్ఞోపవీతములు లేకుండుట ఎంత ముఖ్యమో, యోగికి దండాచ్ఛాదనములు లేకుండుట అంత ముఖ్యమై యున్నది. దండము, వెదురుకు చెందినదై, కణుపులు కలది మొదలైన దండలక్షణములు కలది ఉండవలయును. ఆచ్ఛాదనమునకు, కంథకు (బొంతకు) చెప్పిన లక్షణములను పరీక్షించి అట్టి దండాదులను సంపాదించుకొనుటకు, రక్షించుకొనుటకు చిత్తము వ్యాపారము కలది కాగా, చిత్తవృత్తినిరోధలక్షణమైన యోగము సిద్ధించదు గనుక, అది యుక్తము కాదు.

"న హి వరవిఘాతాయ కన్యోద్వాహః"

'వరుని వధించుటకు పిల్లనిచ్చి పెండ్లి చేయరు' అను న్యాయము వలన, చిత్తవ్యాపారాదులకు హేతువులగు దండాదులను వదలివేయవలయును.

ఆచ్ఛాదనము లేనిచో, శీతాదిబాధకు ప్రతిక్రియ ఎట్లు? అని ఆశంకించుకొని, చెప్పుచున్నారు-

యోగికి శీతము ఉండదు, ఉష్ణము ఉండదు, దుఃఖము లేదు, సుఖము లేదు. మానావమానములు లేవు. ద్వంద్వబాధలు ఉండవు. షడూర్ములు, అనగా క్షుత్పిపాసలు, శోకమోహములు, జరామరణములు ఉండవు. చిత్తవృత్తుల నన్నింటిని నిరోధించిన

యోగికి చలిబాధ ఉండదు. ఆటలతో నిమగ్నమైన చిత్తము గల బాలకునకు ఒంటిమీద వస్త్రము లేకపోయినను, హేమంత, శిశిర ఋతువులందు ప్రాతఃకాలమున గూడ, శీతబాధ ఉండదు. అట్లే, పరమాత్మయందు లగ్నమైన చిత్తము గల యోగికి శీతము ఉండదు. అట్లే, గ్రీష్మకాలమున వేడి లేకపోవుటను గూడ, గ్రహించవలయును. 'చ'కారముచే వర్షబాధ గూడ, లేదు అని సముచ్చయము. శీతోష్ణముల స్ఫురణము లేనపుడు, వానివలన కలుగు సుఖదుఃఖములు లేకపోవుట యుక్తమే. గ్రీష్మమున, శీతము సుఖమును కలిగించును, హేమంతమున దుఃఖము కలిగించును. ఉష్ణము నిదాఘమున దుఃఖజనకము, హేమంతమున సుఖజనకము. మానము అనగా, ఇతరులచే చేయబడిన సత్కారము. అవమాన మనగా, తిరస్కారము. యోగి, సమాధి యందు తన ఆత్మను దక్క, మరియొక పురుషుని చూడడు గనుక; మానావమానముల ప్రసక్తి లేదు. 'చ'కారము శత్రు, మిత్ర, రాగ, ద్వేషాది ద్వంద్వములు లేకపోవుటను సముచ్చయము చేయుచున్నది. షడూర్ములు- వానిలో క్షుత్పిపాసలు ప్రాణధర్మములు, శోక, మోహములు, మనోధర్మములు, జరా మరణములు స్థూల శరీరధర్మములు. ఆత్మతత్త్వమునకు అర్హుడైన యోగికి ఈ షడూర్మివర్జనము యుక్త మగుచున్నది.

జీవన్ముక్తివివేకః

నన్వస్త్వేవం సమాధిదశాయాం శీతాద్యభావః, వ్యుత్థాన దశాయాం తు నిద్రాది క్లేశః సంసారిణమివైనం బాధేతైవేత్యా శంక్య ఆహ-

'నిందా గర్వ మత్సర దంభ దర్పేచ్ఛా ద్వేష సుఖ దుఃఖ కామ క్రోధ లోభ మోహ హర్షాసూయాహంకారాదీంశ్చ హిత్వా' పరమ ఉ. 2 ఇతి।

వివిధైః పురుషైః స్వస్మిన్నాపాదితా దోషోక్తిర్నిందా। అన్యేభ్యోఽధికోఽహమితి చిత్తవృత్తిర్గర్వః। విద్యాధనాదిభి రనన్య సదృశో భవామీతి బుద్ధి ర్మత్సరః। పరేషా మగ్రే జప ధ్యానాది ప్రకటనం దంభః। భర్త్సనాదిషు దృఢబుద్ధి ర్దర్పః। ధనాద్యభి లాష ఇచ్ఛా। శత్రువధాదిషు బుద్ధి ర్ద్వేషః। అనుకూల ద్రవ్యాది లాభేన బుద్ధిస్వాస్థ్యం సుఖమ్। తద్విపర్యయో దుఃఖమ్।యోషిదా ద్యభిలాషః కామః। కామితార్థవిఘాతజన్యో బుద్ధిక్షోభః క్రోధః। లబ్ధస్య ధనస్య త్యాగాసహిష్ణుత్వం లోభః। హితేష్వహితబుద్ధిః అహితేషు చ హితబుద్ధి ర్మోహః। చిత్తగత సుఖాభివ్యంజికా ముఖ వికాసాది హేతు ర్వృత్తి ర్హర్షః। పరకీయ గుణేషు దోషత్వారోపణ మసూయా। దేహేంద్రియాది సంఘాతేష్వాత్మభ్రమోఽహంకారః। ఆది శబ్దేన భోగ్యవస్తుషు మమకార సమీచీనత్వాది బుద్ధయో గృహ్యన్తే। చకారో యథోక్త నిన్దాదివిపరీతం స్తుత్యాదికం సముచ్చినోతి। ఏతాన్ సర్వాన్ నిందాదీన్ హిత్వా పూర్వోక్త వాసనాక్షయాభ్యాసేన పరిత్యజ్యావతిష్ఠేతేతి శేషః।

నను విద్యమానే స్వదేహే తత్పరిత్యాగో న సంభవః ఇత్యా శంక్య ఆహ-

'స్వవపుః కుణపమివ దృశ్యతే యత స్తద్వపు రపధ్వస్తమ్।'

పరమ. ఉ. 2 ఇతి।

పూర్వం యత్స్వకీయం వపు స్తదిదానీం యోగినా స్వాత్మచైతన్యాత్ పృథగ్భూతత్వేన కుణపమివావలోక్యతే యథా శ్రద్ధాలుః స్పర్శనభీత్యా స్వదేహం దూరే స్థితోఽవలోకయతి, తథాఽయం యోగీ తాదాత్మ్యభ్రాన్త్యుదయభీత్యా సావధానో దేహం చిదాత్మనః సకాశా న్నిరన్తరం వివినక్తి। యతః కారణాత్ తద్వపు రాచార్యోపదేశాగమానుభవై రపధ్వస్తం చిదాత్మనః సకాశా న్నిరాకృతమ్। తత శ్చైతన్యవియుక్తస్య దేహస్య

శవతుల్యతయా దృశ్యమానత్వాత్ సత్యపి దేహే నిందాదిత్యాగో ఘటత ఇత్యభిప్రాయః।

ననూత్పన్నో దిగ్భ్రమః సూర్యోదయదర్శనేన వినష్టోఽపి యథా కదాచి దనువర్తతే, తథా కదాచిదాత్మని దేహాత్మసంశయా ద్యనువృత్తౌ నిందాదిక్లేశః పునః పునః ప్రసజ్యేతేత్యాశంక్య ఆహ—

'సంశయ విపరీత మిథ్యాజ్ఞానానాం యో హేతు స్తేన నిత్య నివృత్తిః' ఇతి।

ఆత్మా కర్తృత్వాది ధర్మోపేత స్తద్రహితో వేత్యాదికం సంశయజ్ఞానమ్। దేహాదిరూప ఏవాత్మేతి విపరీతజ్ఞానమ్। ఏత దుభయం భోక్తృవిషయమ్। మిథ్యాజ్ఞానం తు భోగ్యవిషయ మత్ర వివక్షితమ్। తచ్చానేకవిధమ్ 'సంకల్పప్రభవాన్కామాన్' భ. గీ. 6, 24 ఇత్యత్ర స్పష్టీకృతమ్।

భావప్రకాశిక

ఓయీ! సమాధిదశయందు ఈవిధముగా శీతాదులు లేకపోవచ్చును, వ్యుత్థానదశయందైనచో, నిందాదిక్లేశము సంసారినివలె ఈయోగిని గూడ, బాధించితీరును అని ఆశంక చేసినచో, చెప్పుచున్నారు—

'నిందా, గర్వ, మత్సర, దంభ, దర్ప, ఇచ్ఛా, ద్వేష, సుఖ, దుఃఖ, కామ, క్రోధ, లోభ, మోహ, హర్ష, అసూయా హంకారాదులను వదలిపెట్టి' అని చెప్పిరి.

పలురకములుగల పురుషులచే తనయందు ఆపాదింపబడిన దోషవచనము నింద. నేను ఇతరులకంటె అధికుడను అను చిత్త వృత్తి గర్వము. విద్యాధనాదులచే ఇతరులంతవాడను అగుదును అనెడు బుద్ధి, మత్సరము. ఇతరుల ముందు జప, ధ్యానాది ప్రకటనము దంభము. బెదరించుట మొదలగువానియందు దృఢ బుద్ధి, దర్పము. ధనాదులందు అభిలాష, ఇచ్ఛ. శత్రువధాదు

లందు బుద్ధి, ద్వేషము. అనుకూలములగు ద్రవ్యాదులు లభించుటచే బుద్ధి స్తిమితము (స్వాస్థ్యము), సుఖము. ప్రతికూల ద్రవ్యాదులవలన బుద్ధి, స్తిమితము తప్పుట దుఃఖము. స్త్రీజనాద్యభిలాష కామము. కోరిన వస్తువునకు విఘాతము కలుగుటవలన, జనించు బుద్ధిక్షోభము, క్రోధము. లభించిన ధనమును విడిచి పెట్టుటను, లేదా దానము చేయుటను సహింపలేకపోవుట, లోభము. హితమును అహితముగాను, అహితమును హితముగాను తలంచుట మోహము. మనస్సులోని సుఖమునకు అభివ్యంజకము లగు ముఖవికాసాదులకు కారణమైన బుద్ధివృత్తి, హర్షము. ఇతరుల గుణములందు దోషత్వమును ఆరోపించుట, అసూయ.

"దేహేన్ద్రియాది సంఘాతేషు ఆత్మభ్రమోఽహఙ్కారః।"

దేహేంద్రియ సంఘాతమునందు ఆత్మ అనెడి భ్రమ, అహంకారము. 'ఆది' శబ్దముచే భోగ్యవస్తువులందు మమకారము, 'బాగున్నది' అని అనుకొనుట మొదలగు బుద్ధులు గ్రహింపబడు చున్నవి. 'చ'కారము, వెనుక చెప్పిన నిందాదులకు విపరీతమగు స్తుత్యాదికముయొక్క సముచ్చయము చేయును. ఈ నిందాదు లను అన్నింటిని విడిచిపెట్టి, వెనుక చెప్పిన వాసనాక్షయా భ్యాసముచే పరిత్యజించి ఉంటున్నాడు- అని అధ్యాహారము.

ఓయీ! తన దేహము ఉండగా, దానిని పరిత్యజించుట సంభవము కాదు అని ఆశంకించుకొని, చెప్పుచున్నారు-

"స్వవపుః కుణపమివ దృశ్యతే యత స్తద్వపు రపధ్వస్తమ్।"

'తన శరీరము శవము వలె చూడబడును' ఎందువలననగా, ఆ శరీరము ధ్వస్తమైనది.

పూర్వము తనది అని అనుకొనిన ఏ శరీరము కలదో, ఆ శరీరము ఇప్పుడు యోగి స్వాత్మచైతన్యముతో విడివడినందున

శవమువలె చూడబడుచున్నది. ఎట్లు శ్రద్ధాళువు (ఆస్తిక్యబుద్ధి కలవాడు) భీతిచే శవదేహమును దూరమునుండియే చూచు చున్నాడో, అదేవిధముగా యోగి, తాదాత్మ్యభ్రాంతి మరల కలుగునేమో అను భయముతో సావధానుడై దేహమును చిదాత్మ నుండి ఎల్లపుడు వివేచనచేయును (వేరుగా చూచును). ఎందు వలననగా, ఆ శరీరము ఆచార్య,ఉపదేశ, ఆగమ, అనుభవములచే అపధ్వస్తము. అనగా, చిదాత్మనుండి నిరాకృతము. కనుక, చైతన్యము లేని దేహము శవమువలె కనిపించుచుండును గనుక, దేహమున్నను, నిందాదిత్యాగము ఘటిల్లుచున్నది అని అభిప్రాయము.

ఓయీ! అదివరకు కలిగిన దిగ్భ్రమ, సూర్యోదయదర్శనముచే వినాశము చెందినను, మరల ఎప్పుడైనను అనువర్తించును. అట్లే, ఒకానొకప్పుడు ఆత్మయందు, దేహము ఆత్మ అగునా, కాదా? అను సంశయాదులు అనువృత్తమైనచో, నిందాదిక్లేశములు మరల ప్రసక్తములగును గదా! అనినచో, చెప్పుచున్నారు–

"సంశయ విపరీత మిథ్యాజ్ఞానానాం యో హేతు స్తేన
నిత్యనివృత్తః।"

'సంశయము, విపరీతజ్ఞానము, మిథ్యాజ్ఞానము వీనికి కారణము ఏది కలదో, అది (అజ్ఞానము) ఎన్నటికి మరల రాకుండునట్లుగా నివృత్తమైనవాడు. కనుక, నిందాదిక్లేశములు ప్రసక్తములు కావు.

సంశయజ్ఞాన మనగా, ఆత్మ, కర్తృత్వాది ధర్మములు కలవాడా? అవి లేనివాడా? అనునట్టి ఆకారము గల జ్ఞానము. విపరీతజ్ఞాన మనగా, దేహమే ఆత్మ, దేహేంద్రియ సంఘాతమే ఆత్మ అను జ్ఞానము. ఈ సంశయ, విపరీతజ్ఞానములు కర్తృత్వ భోక్తృత్వ విషయములు. మిథ్యాజ్ఞానము అనగా, భ్రాంతి.

జ్ఞానము కూడ విపరీతజ్ఞానమే అయినను, భోగ్యవిషయజ్ఞానముగా ఇచట వివక్షితము. అది, అనేకవిధములు. 'సంకల్ప ప్రభవాన్ కామాన్' అనుచోట, స్పష్టీకృతము.

జీవన్ముక్తివివేకః

తద్ధేతుశ్చతుర్విధః, 'అనిత్యాశుచి దుఃఖానాత్మసు నిత్య శుచి-సుఖాత్మఖ్యాతి రవిద్యా' 2-5 ఇతి సూత్రణాత్। అనిత్యే గిరి నదీ సముద్రాదౌ నిత్యత్వ భ్రాన్తి రేకా। అశుచౌ పుత్ర భార్యాది శరీరే శుచిత్వ భ్రాంతి ర్ద్వితీయా। దుఃఖే కృషి వాణిజ్యాదౌ సుఖత్వ భ్రాన్తి స్తృతీయా। గౌణ మిథ్యాత్మని పుత్రభార్యాదా వన్నమయాదికే చానాత్మని ముఖ్యాత్మత్వ భ్రాన్తి శ్చతుర్థీ। ఏతేషాం సంశయాదీనాం హేతు రద్వితీయబ్రహ్మాత్మతత్త్వావరక మజ్ఞానం తద్వాసనా చ। తచ్చాజ్ఞానం యోగినః పరమహంసస్య మహావాక్యార్థబోధేన నివృత్తమ్। వాసనా తు యోగాభ్యాసేన నివృత్తా। ఉదాహృతాయాం దిగ్భ్రాన్తావజ్ఞానే నివృత్తేఽపి వాసనాయాః సద్భావా ద్యథాపూర్వం భ్రాన్తివ్యవహారః। యోగినస్తు భ్రాన్తిహేతుద్వయరాహిత్యాత్ కుతః సంశయాదీ న్యనువర్తేరన్? తమేన మనువృత్త్యభావ మభిప్రేత్య హేతుద్వయేన నిత్యనివృత్త ఇత్యుక్తమ్। సత్యామప్యజ్ఞాన తద్వాసనానివృత్తౌ తస్యా నివృత్తే ర్వినాశాభావా న్నిత్యత్వం ద్రష్టవ్యమ్-

తన్నిత్యత్వే హేతుమాహ- 'తన్నిత్యబోధః'

పరమ ఉ. 2 ఇతి।

సర్వనామత్వాత్ ప్రసిద్ధార్థవాచీ తచ్ఛబ్దోఽత్ర సర్వవేదాన్త ప్రసిద్ధం పరమాత్మాన మాచష్టే। తస్మిన్పరమాత్మని నిత్యో బోధో యస్య యోగినః సోఽయం నిత్యబోధః। యోగీ హి 'తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః' బృ. ఉ. 4-4-21 ఇతి శ్రుతి

భా. ప్ర. 52 ]

మనుసృత్య చిత్తవిక్షేపాన్ యోగేన పరిహృత్య నైరన్తర్యేణ పరమాత్మవిషయామేవ ప్రజ్ఞాం కరోతి। అతో బోధస్య నిత్యత్వాద్ బోధవినాశయో రజ్ఞాన తద్వాసనయో ర్నివృత్తి ర్నిత్యేత్యర్థః।

బుద్ధ్యమానస్య పరమాత్మన స్తార్కికేశ్వరవత్ తటస్థశఙ్కాం వారయతి–

'తత్స్వయమేవావస్థితిః' పరమ. ఉ. 2 ఇతి।

యద్వేదాన్తవేద్యం పరంబ్రహ్మాస్తి తత్స్వయమేవ న తు స్వస్మా దన్యదిత్యేవం నిశ్చిత్య యోగినోఽవస్థితి ర్భవతి।

తస్య యోగినో బ్రహ్మానుభవప్రకారం దర్శయతి–

'తం శాన్త మచల మద్వయానన్ద విజ్ఞానఘన మేవాస్మి తదేవ మమ పరమం ధామ' పరమ. ఉ. 2. ఇతి।

తమిత్యాది పదత్రయే ద్వితీయా ప్రథమార్థే ద్రష్టవ్యా। యః పరమాత్మా శాన్తః క్రోధాదివిక్షేపరహితః అచలో గమనాది క్రియారహితః, స్వగత సజాతీయ విజాతీయభేదశూన్యః సచ్చిదానన్దైకరపోఽస్తి స ఏవాహమస్మి। తదేవ బ్రహ్మతత్త్వం మమ యోగినః పరమం ధామ వాస్తవం స్వరూపమ్, న త్వేతత్కర్తృత్వ భోక్తృత్వాదియుక్తమ్, ఏతస్య మాయాకల్పితత్వాత్। నన్వాత్మనః పరబ్రహ్మత్వ ఆనన్దావాప్తి రిదానీం కుతో నేత్యత్రానన్దావాప్తిః సదృష్టాన్త ముక్తాఽభియుక్తైః।

శ్లో॥ గవాం సర్పిః శరీరస్థం న కరోత్యంగపోషణమ్।
తదేవ కర్మరచితం పున స్తస్యైవ భేషజమ్॥
ఏవం సర్వశరీరస్థః సర్పివత్పరమేశ్వరః।
వినా చోపాసనం దేవో న కరోతి హితం నృషు॥ ఇతి।

యది యోగినః పూర్వాశ్రమ ప్రసిద్ధా ఆచార్య పితృభ్రాత్రాదయః కర్మిణః శ్రద్ధాజడాః శిఖాయజ్ఞోపవీత సంధ్యావన్దనాదిరాహిత్యేన పాషండిత్వ మారోప్య వ్యామోహయేయు

స్తదా వ్యామోహానుత్పత్తయే యోగినో వర్తమానం నిశ్చయం దర్శయతి-

'తదేవ చ శిఖా తదేవోపవీతం చ పరమాత్మ ప్రత్యగాత్మనో రేకత్వజ్ఞానేన తయోర్భేద ఏవ విభగ్నః సా సంధ్యా' పరమ. ఉ. 2 ఇతి।

### భావప్రకాశిక

ఆ సంశయ, విపరీత, మిథ్యాజ్ఞానములకు కారణము నాలుగు విధములు-

"అనిత్య అశుచి దుఃఖ అనాత్మసు నిత్య శుచి సుఖ ఆత్మఖ్యాతిః" అని సూత్రించుటవలన, అనిత్యములగు గిరి, నదీ, సముద్రాదులందు నిత్యత్వభ్రాంతి ఒక అవిద్య. అశుచియగు పుత్ర, భార్యాది శరీరములందు శుచిత్వభ్రాంతి రెండవ అవిద్య. దుఃఖము లగు కృషి, వాణిజ్యాదులందు సుఖత్వ భ్రాంతి, మూడవ అవిద్య. గౌణ మిథ్యాత్మలగు పుత్ర, భార్యాదులందును, అన్నమయాది కోశములందును ఆత్మకానివానియందు ముఖ్యమగు ఆత్మ అనెడి భ్రాంతి నాలుగవ అవిద్య. ఈ సంశయాదులకు హేతువు అద్వితీయ బ్రహ్మతత్త్వావరకమగు అజ్ఞానము, ఆ అజ్ఞానవాసనయు అయి ఉన్నవి. ఆ అజ్ఞానము యోగి యగు పరమహంసకు మహావాక్యార్థజ్ఞానముచేత నివృత్తమైనది. వాసన అయితే యోగాభ్యాసముచేత నివృత్తమైనది. పూర్వము ఉదహరించిన దిగ్భ్రాంతిలో అజ్ఞానము నివృత్తమైనను, వాసన మిగిలి ఉండుటవలన, యథాపూర్వము (మరల) భ్రాంతి వ్యవహారము ప్రసక్తమగుచున్నది. యోగికి భ్రాంతికారణములగు అజ్ఞాన, తద్వాసనలు రెండును, లేకపోయినపుడు సంశయాదులు ఎట్లు వర్తించును? ఈ సంశయాదులు అనువర్తించవు అను అభిప్రాయముతోనే యోగి, 'నిత్యనివృత్తుడు' అని చెప్పబడెను. అజ్ఞాన, తద్వాసనలు నివృత్తములు కాగా, ఆ నివృత్తికి

నాశము లేదుగనుక, నిత్యనివృత్తిత్వము గ్రహించవలయును. ఆ నిత్యత్వమునకు కారణమును చెప్పుచున్నాడు. 'తన్నిత్యబోధ' ఇతి. 'తత్' అను సర్వనామశబ్దము ప్రసిద్ధార్థకము. సర్వవేదాన్త ప్రసిద్ధమగు పరమాత్మను ఆ 'తత్' శబ్దము చెప్పును. ఆ పరమాత్మయందు నిత్యబోధ; యే యోగికి కలదో, ఆ యోగి, నిత్యబోధుడు. యోగి అయినచో,

'తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః।'

అను శ్రుతి ననుసరించి, చిత్తవిక్షేపములను యోగముచేత పరిహరించి, నిరంతరము పరమాత్మవిషయకమగు ప్రజ్ఞనే చేయుచున్నాడు. ఇందువలన, బోధ, నిత్యము గనుక, బోధచే నశించునట్టి అజ్ఞాన, తద్వాసనల నివృత్తి, నిత్యమైనది అని అర్థము. తెలిసికొనబడు పరమాత్మకు తార్కికుల ఈశ్వరునకువలె తటస్థత్వము కలదను శంకను వారించుచున్నారు- 'తత్స్వయమేవ అవస్థితిః' వేదాంతవేద్యమగు పరబ్రహ్మ ఏది కలదో అది, ఆత్మస్వరూపము, తనకంటె వేరైనది కాదు అని నిశ్చయించి, యోగి యొక్క అవస్థితి (ఉనికి) యుండును. ఆ యోగికి బ్రహ్మానుభవ ప్రకారమును చూపుచున్నాడు- 'తం శాంతం అచలం అద్వయానంద విజ్ఞానఘన ఏవాస్మి, తదేవ మమ పరమం ధామ' అని తం శాన్తం అచలం' అను మూడుపదములందున్న ద్వితీయావిభక్తికి ప్రథమా విభక్త్యర్థమును గ్రహించవలెను. ఏ పరమాత్మ, శాంతుడో,అనగా క్రోధాది విక్షేపము లేనివాడో,అచలః- అచలుడో అనగా, గమనాది క్రియలు లేనివాడో, సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేనివాడో, సచ్చిదానంద ఏకరస స్వరూపుడో, ఆ పరమాత్మయే నేను అయి ఉన్నాను. ఆ బ్రహ్మ తత్త్వమే యోగిని అయిన నాకు 'పరమం ధామ' వాస్తవ స్వరూపము. కర్తృత్వ, భోక్తృత్వాదులు నాయందు లేవు. అవి

మాయాకల్పితములు.

ఓయీ! ఆత్మయే పరబ్రహ్మ అయినచో, ఆనందానుభూతి ఇప్పుడు (సంసారదశయందు) ఏల కలుగుటలేదు ? అను విషయములో ప్రామాణికులచే దృష్టాంతపూర్వకముగా ఆనందావాప్తి చెప్పబడినది. గోవుల శరీరమునందున్న ఘృతము గోవుల యొక్క శరీరపోషణ చేయలేదు. ఆ ఘృతమే ఔషధములతో భైషజ్యకర్మచేత సేవితమై,వానికే ఔషధము అగును. ఈవిధముగా సర్వశరీరములందు ఉన్న పరమేశ్వరుడు ఆ ఘృతమువలె ఉపాసన లేకుండా మానవులకు హితమును ఆచరించడు.

యోగికి పూర్వాశ్రమమున, పరిచితులగు ఆచార్య, పితృ, భ్రాత్రాదులు కర్మనిష్ఠులు, శ్రద్ధాజడులు, శిఖాయజ్ఞోపవీత సంధ్యావందనాదులు లేకపోవుటచే ఈ యోగులందు పాషండత్వము (వేదవిరుద్ధ మతావలంబిత్వమును) ఆరోపించి వ్యామోహ పెట్టుదురేమో! అట్టి వ్యామోహము లేకుండా చేయుటకు యోగి యొక్క వర్తమాన నిశ్చయమును చూపుచున్నారు.

"తదేవ చ శిఖా తదేవోపవీతం చ పరమాత్మప్రత్యగాత్మనో
రేకత్వజ్ఞానేన తయో ర్భేద ఏవ విభగ్నః సా సన్ధ్యా।"

పరమాత్మ ప్రత్యగాత్మలకు ఏకత్వజ్ఞానమే శిఖ, అదియే, యజ్ఞోపవీతము. ఆ ఆత్మపరమాత్మలకు భేదము విభగ్నమైనది. అదియే, సంధ్య.

జీవన్ముక్తి వివేకః

యద్వేదాన్త వేద్యస్య పరబ్రహ్మణో జ్ఞానం తదేవ కర్మాంగ భూత బాహ్యశిఖా యజ్ఞోపవీతస్థానీయమ్। అన్యే చ మన్త్ర ద్రవ్య లక్షణే కర్మాంగభూతే చకారాభ్యాం సముచ్చీయేతే। శిఖాద్యంగ సాధ్యైః కర్మభి రుత్పన్నం యత్స్వర్గాదిసుఖం తత్సర్వం బ్రహ్మజ్ఞానేనైవ లభ్యతే, విషయానన్దస్య సర్వస్య బ్రహ్మానన్ద

లేశత్వాత్। 'ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రా ముప జీవన్తి' బృ. హ. ఉ. 4-3-32 ఇతి శ్రుతిః।
ఏతదేవాభిప్రేత్య బ్రహ్మోపనిషద్యామనన్తి-

శ్లో॥ సశిఖం వపనం కృత్వా బహిఃసూత్రం త్యజేద్ బుధః।
యదక్షరం పరం బ్రహ్మ తత్ సూత్రమితి ధారయేత్॥
సూచనాత్ సూత్రమిత్యాహుః సూత్రం నామ పరంపదమ్।
తత్సూత్రం విదితం యేన స విప్రో వేదపారగః॥
యేన సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ।
తత్సూత్రం ధారయేద్ యోగీ యోగవిత్తత్త్వదర్శివాన్॥
బహిఃసూత్రం త్యజేద్ విద్వాన్ యోగముత్తమ మాస్థితః।
బ్రహ్మభావమిదం సూత్రం ధారయేద్యః స చేతనః॥
ధారణాత్ తస్య సూత్రస్య నోచ్ఛిష్టో నాశుచిర్భవేత్॥
సూత్రమన్తర్గతం యేషాం జ్ఞానయజ్ఞోపవీతినామ్।
తే వై సూత్రవిదో లోకే తే చ యజ్ఞోపవీతినః॥
జ్ఞానశిఖా జ్ఞాననిష్ఠా జ్ఞానయజ్ఞోపవీతినః।
జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞాన ముచ్యతే॥
అగ్నేరివ శిఖా నాన్యా యస్య జ్ఞానమయీ శిఖా।
స శిఖీ త్యుచ్యతే విద్వాన్ నేతరే కేశధారిణః॥
కర్మణ్యధికృతా యే తు వైదికే బ్రాహ్మణాదయః।
తైర్వై ధార్య మిదం సూత్రం కర్మాఙ్గం తద్ధి వై స్మృతమ్॥
శిఖా జ్ఞానమయీ యస్యోపవీతం చాపి తన్మయమ్।
బ్రాహ్మణ్యం సకలం తస్య ఇతి బ్రహ్మవిదో విదుః॥
ఇదం యజ్ఞోపవీతం చ పరమం యత్పరాయణమ్।
విద్వాన్ యజ్ఞోపవీతీ స్యాత్ తజ్జ్ఞాస్తం యజ్వినం విదుః॥
బ్ర. ఉ. 6-15 ఇతి।

తస్మాద్యోగినః శిఖాయజ్ఞోపవీతే యథా విద్యేతే తథైవ సన్ధ్యాఽపి విద్యతే। యః శాస్త్రగమ్యః పరమాత్మా యశ్చాహం ప్రత్యయగమ్యో జీవాత్మా, తయోరేకత్వజ్ఞానేన మహావాక్యజన్యేన భ్రాన్తిప్రతీతో భేదో విశేషేణ భగ్న ఏవ। పునః భ్రాన్త్యనుదయో భంగస్య విశేషః। యేయమేకత్వ బుద్ధిః సేయ ముభయోరాత్మనోః సంధౌ జాయమానత్వాత్ సంధ్యేత్యుచ్యతే। అహోరాత్రయోః సంధా వనుష్ఠేయా క్రియా యథా సంధ్యా తద్వత్। ఏవం చ సతి యోగీ శ్రద్ధాజడైర్న వ్యామోహయితుం శక్యః।

'కోఽయం మార్గః?' ఇతి ప్రశ్నస్య 'అసౌ స్వపుత్ర' ఇత్యాదినోత్తర ముక్తమ్। 'కా స్థితిః?' ఇత్యేతస్య 'మహాపురుషః' ఇత్యాదినా సంక్షిప్తోత్తర ముక్త్వా 'సంశయ విపరీత' ఇత్యాదినా తదేవ ప్రపంచ్య ఇదానీ ముపసంహరతి-

'సర్వాన్ కామాన్ పరిత్యజ్య అద్వైతే పరమా స్థితిః।'

పరమ. ఉ. 3 ఇతి।

క్రోధలోభాదీనాం కామపూర్వకత్వాత్ కామపరిత్యాగేన చిత్త దోషాః సర్వేఽపి పరిత్యజ్యన్తే। ఏతదేవాభిప్రేత్య వాజసనేయిభి రామ్నాతమ్- 'అథో ఖల్వాహుః కామమయ ఏవాయం పురుషః' బృహ. ఉ. 4-4-5 ఇతి। అతో నిష్కామస్య యోగిచిత్తస్యాద్వైతే నిర్విఘ్నా స్థితి రుపపద్యతే।

### భావప్రకాశిక

ఉపనిషత్తులచే ప్రతిపాద్యమగు పరబ్రహ్మయొక్క జ్ఞానము ఏది కలదో, అదియే వైదిక కర్మాంగభూతమగు బాహ్య శిఖా, యజ్ఞోపవీతముల స్థానములయందు గ్రహింపదగినది. కర్మాంగ భూతములు మంత్ర, ద్రవ్యరూపములు నగు మరికొన్ని, 'చ' కారములచేత సముచ్చయము చేయబడుచున్నవి. శిఖ మొదలగు అంగములచే సాధింపబడునట్టి, అనుష్ఠింపదగు వైదిక కర్మలచే

ఉత్పన్నమగు స్వర్గాదిసుఖము ఏది కలదో, అది అంతయు బ్రహ్మజ్ఞానముచేతనే లభ్యమగుచున్నది.

"ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి।"
విషయానందమంతయు, బ్రహ్మానందముయొక్క లేశమే అయి ఉన్నది. బ్రహ్మవేత్తకాని ఇతర ప్రాణులు 'ఈ బ్రహ్మానందము యొక్క లేశమునే విషయసుఖరూపముగా అనుభవించుచున్నారు' అను శ్రుతివలన తెలియుచున్నది. ఈ అభిప్రాయముతోనే అథర్వ శాఖీయులు బ్రహ్మవిద్యోపనిషత్తునందు ఇట్లు చెప్పుచున్నారు–

వివేకవంతుడు శిఖాసహితముగా వపనమును (శిరోముండనమును) చేయించుకొని, బాహ్య యజ్ఞోపవీతమును త్యజించవలెను. అక్షర పరబ్రహ్మ ఏది కలదో, అదియే సూత్రమని ధరించవలెను.

"సూచనా త్సూత్రమిత్యాహుః సూత్రం నామ పరం పదమ్।"
సూచించునది గనుక, సూత్రము అని చెప్పుదురు. సూత్రము అనగా, పరమపదము. ఆ సూత్రము ఎవనిచే తెలియబడెనో, అతడే వేదపారంగతుడగు విప్రుడు. దారమునందు మణిగణముల వలె ఎవనిచేత ఈ ప్రపంచము కూర్చబడినదో, ఆ సూత్రమును తత్త్వదర్శి, యోగజ్ఞుడు అగు యోగి, ధరించవలయును. ఉత్తమ యోగమును అవలంబించినవాడు బహిఃసూత్రమును త్యజించవలెను. బ్రహ్మభావరూపమగు ఈ సూత్రమును ధరించవలయును. అతడే, చేతనుడు. ఈ బ్రహ్మసూత్రధారణము వలన, మైల పడడు, అశుచిగాడు. జ్ఞానయజ్ఞోపవీతము గల ఎవరికి సూత్రము అంతర్గతమో, వారే లోకమున సూత్రమును తెలిసినవారు. బాహ్య యజ్ఞోపవీతధారణమాత్రమున, సూత్రవిదులు కారు. జ్ఞానయజ్ఞోపవీతులు, జ్ఞానశిఖులు, జ్ఞాననిష్ఠులు. వారికి జ్ఞానమే సర్వోత్కృష్టమైనది. జ్ఞానము పవిత్రమైనది అని చెప్పబడును. జ్ఞానశిఖ కలవానికి, అగ్నికివలె వేరే శిఖ ఉండదు. బ్రహ్మజ్ఞానియే; జ్ఞాన

శిఖచేత 'శిఖి' యని చెప్పబడును. శిఖా, కేశధారణముచేత నిజముగా శిఖులు కారు. వైదిక కర్మయందు అధికారము కల బ్రాహ్మణాదులు వైదిక కర్మాంగముగా బాహ్య సూత్రమును ధరించవలయును. ఎవనికి జ్ఞానమయమగు శిఖయు, జ్ఞానమయమగు ఉపవీతము కలవో, వానికే సమగ్రమగు బ్రాహ్మణధర్మము కలదు అని బ్రహ్మవేత్తలు తెలిసికొనుచున్నారు. ఈ యజ్ఞోపవీతమే ఉత్కృష్టము, పరాయణము. జ్ఞాని, ఈ జ్ఞానము చేతనే 'యజ్ఞోపవీతి' యగును. అతడే, 'యజ్వ' అని బ్రహ్మజ్ఞులు చెప్పుచున్నారు.

కావున, యోగికి ఏవిధముగా శిఖాయజ్ఞోపవీతములు కలవో, అదేవిధముగా సంధ్య కూడ కలదు. వేదాంతశాస్త్రగమ్యుడయిన ఏ పరమాత్మ కలడో, 'అహమ్' అను స్ఫురణలో గోచరించునట్టి ఏ జీవాత్మ కలడో, ఆ జీవాత్మ- పరమాత్మలకు మహావాక్యము వలన కలిగిన ఏకత్వజ్ఞానముచే భ్రాంతివలన గోచరించిన భేదము విశేషముగా భగ్నమయియే యున్నది. మరల భ్రాంతి కలుగక పోవుట, ఆ భేదభంగమునందు విశేషము. ఆ యీ ఏకత్వబుద్ధి జీవాత్మ, పరమాత్మలయొక్క సంధియందు కలుగుటవలన, 'సంధ్య' అని చెప్పబడును. అహోరాత్రసంధ్యలందు అనుష్ఠింపదగు సంధ్యాక్రియవలెనే ఈ జీవాత్మ- పరమాత్మల యొక్క ఏకత్వబుద్ధి గూడ, సంధ్యయే అయి ఉన్నది. ఇట్లు కాగా, యోగి కర్మశ్రద్ధాజడులచే వ్యామోహపరచుటకు శక్యమైనవాడు కాడు. ఈ మార్గమేది? అను ప్రశ్నకు తన పుత్ర, మిత్రాదులను వదలిపెట్టి అను రీతిగా ఉత్తరము చెప్పబడినది. ఈ మహాపురుషుడు, ఎట్టి స్థితి కలవాడు అగును? అను మొదలగు వాక్యముతో సమాధానములు చెప్పి, సంశయ, విపరీతాది వాక్యములచే దానినే

విస్తారముగా తెలిపి, ఇపుడు సమస్తమైన కోరికలను పూర్తిగా విడనాడి అద్వైతబ్రహ్మయందు ఉత్కృష్టమైన స్థితి అని ఉపసంహరించుచున్నారు. క్రోధ, లోభాదులు, కామమునకు పూర్వమునందు కలిగినవి గనుక (కామమును సఫలము చేయునదిగనుక) చిత్తదోషములన్నియు విడచిపెట్టినట్లయినది. ఈ అభిప్రాయముతోనే శుక్లయజుశ్శాఖీయులచే ఇట్లు చెప్పబడినది–

'ఈ పురుషుడు కామమయుడే అయి ఉన్నాడు.' ఇందువలన కామము లేని యోగి చిత్తమునకు అద్వైతమునందు విఘ్నము లేకుండా స్థితి ఉపపన్నమగుచున్నది.

## జీవన్ముక్తివివేకః

నను దణ్డగ్రహణవిధివాసనయోపేతా వివిదిషా సంన్యాసినో యోగినం దణ్డరహితం పరమహంసం నాభ్యుపగచ్ఛన్తీత్యాశంక్య ఆహ–

శ్లో॥ జ్ఞానదండో ధృతో యేన ఏకదండీ స ఉచ్యతే।
కాష్ఠదండో ధృతో యేన సర్వాశీ జ్ఞానవర్జితః॥
స యాతి నరకాన్ ఘోరాన్ మహారౌరవసంజ్ఞకాన్॥
తితిక్షా జ్ఞాన వైరాగ్య శమాది గుణవర్జితః।
భిక్షామాత్రేణ యో జీవేత్ స పాపీ యతివృత్తిహా।
ఇదమన్తరం జ్ఞాత్వా స పరమహంసః॥'

పరమ. ఉ. 3–3 ఇతి।

పరమహంసస్య యోఽయమేకదణ్డః స ద్వివిధః– జ్ఞానదణ్డః, కాష్ఠదణ్డశ్చేతి। యథా త్రిదణ్డినో వాగ్దండో మనోదణ్డః కర్మదణ్డశ్చేతి త్రైవిధ్యం తద్వత్। వాగ్దండాదయో మనునా స్మర్యతే–

శ్లో॥ వాగ్దండోఽథ మనోదణ్డః కర్మదణ్డస్తథైవ చ।
యస్యైతే నియతా బుద్ధౌ స త్రిదణ్డీతి చోచ్యతే॥
త్రిదణ్డమేతన్నిక్షిప్య సర్వభూతేషు మానవః।

కామక్రోధౌ తు సంయమ్య తతః సిద్ధిం నిగచ్ఛతి॥
మను. 12-10-11 ఇతి।

తేషాం స్వరూపం దక్షః స్మరతి-

శ్లో॥ వాగ్దణ్డోఽథ మనోదణ్డః కర్మదణ్డ స్తథైవ చ।
యస్యైతే నియతా దణ్డా స్త్రిదణ్డీతి స ఉచ్యతే॥
వాగ్దండే మౌన మాతిష్ఠేత్ కర్మదణ్డే త్వనీహతామ్।
మానసస్య తు దణ్డస్య ప్రాణాయామో విధీయతే॥ ఇతి।
'కర్మదణ్డోఽల్పభోజనమ్' ఇతి స్మృత్యన్తరపాఠః।
ఈదృశం త్రిదణ్డిత్వం పరమహంసస్యాప్యస్తి। తదేతదభిప్రేత్య పితామహః స్మరతి-

శ్లో॥ యతిః పరమహంసస్తు తుర్యాఖ్యః శ్రుతిచోదితః।
యమైశ్చ నియమై ర్యుక్తో విష్ణురూపీ త్రిదణ్డభృత్॥ ఇతి।

ఏవం సతి మౌనాదీనాం వాగాది మనోహేతుత్వా ద్యథా దణ్డత్వం తథైవాజ్ఞాన తత్కార్య దమనహేతో ర్జ్ఞానస్య దణ్డత్వమ్। అయం జ్ఞానదండో యేన పరమహంసేన ధృతః స ఏవ ముఖ్య ఏకదండీత్యుచ్యతే। మానసస్య జ్ఞానదండస్య కదాచి చ్చిత్తవిక్షేపేణ విస్మృతిః ప్రసజ్యేతేతి తన్నివారణార్థం స్మారకః కాష్ఠదండో ధ్రియతే। తదేత చ్ఛాస్త్రార్థరహస్య మబుద్ధ్వా వేష మాత్రేణ పురుషార్థసిద్ధి మభిప్రేత్య కాష్ఠదండో యేన పరమ హంసేన ధృతః స పురుషో బహువిధ యాతనోపేతత్వాద్ ఘోరా న్మహారౌరవసంజ్ఞకా న్నరకానాప్నోతి। తత్ర హేతు రుచ్యతే- పరమ హంసవేషం దృష్ట్వా జ్ఞానిత్వభ్రాంత్యా సర్వే జనాః స్వ స్వగృహే తం భోజయన్తి। అయం చ జిహ్వాలంపటో వర్జ్యావర్జ్య వివేక మకృత్వా సర్వ మన్న మశ్నాతి। తేన ప్రత్యవాయం ప్రాప్నోతి। యాని తు 'నాన్నదోషేణ మస్కరీ', 'చాతుర్వర్ణ్యం చరేద్ భైక్షమ్' ఇత్యాది స్మృతివచనాని తాని జ్ఞానివిషయాణి।

అయం చ జ్ఞానవర్జిత ఇతి యుక్తోఽస్య నరకః। అత ఏవ జ్ఞానహీనస్య యతే ర్భిక్షానియమ మాహ మనుః-

శ్లో॥ నచోత్పాతనిమిత్తాభ్యాం న నక్షత్రాంగవిద్యయా।
నానుశాసనవాదాభ్యాం భిక్షాం లిప్సేత కర్హిచిత్॥
ఏకకాలం చరేద్ భైక్ష్యం న ప్రసజ్యేత విస్తరే।
భైక్షే ప్రసక్తో హి యతి ర్విషయేష్వపి సజ్జతి॥
మను. 6, 50-55 ఇతి।

జ్ఞానాభ్యాసినం ప్రతి త్వేవం స్మర్యతే-

శ్లో॥ ఏకవారం ద్వివారం వా భుంజీత పరమహంసకః।
యేనకేన ప్రకారేణ జ్ఞానాభ్యాసీ భవేత్ సదా॥ ఇతి।

ఏవం చ సతి జ్ఞానదండ కాష్ఠదండయో ర్యదన్తరముత్తమత్వాధమత్వరూపం తదిద మవగత్యోత్తమం జ్ఞానదండం యో ధారయతి స ఏవ ముఖ్యః పరమహంస ఇత్యభ్యుపగన్తవ్యమ్।

నన్వస్త్వభిజ్ఞస్య పరమహంసస్య జ్ఞానదండో మాభూత్ కాష్ఠదండః। ఇతరా తు చర్యా సర్వా కీదృశీ త్యాశంక్య ఆహ-

'ఆశాంబరో నిర్నమస్కారో న స్వధాకారో న నిందా న స్తుతి ర్యాదృచ్ఛికో భవేద్, భిక్షు ర్నావాహనం, న విసర్జనం, న మంత్రం, న ధ్యానం, చోఽపాసనం న లక్ష్యం, నాలక్ష్యం, న పృథఙ్ నాపృథఙ్, న చాహం న త్వమ్, న చ సర్వమ్, న చానికేతస్థితిరేవ స భిక్షుః సౌవర్ణాదీ న్నైవపరిగ్రహే న్న లోకం నావలోకం చ।' పరమహంస. ఉ, 4 ఇతి।

## భావప్రకాశిక

ఓయీ! దండగ్రహణవిధిచే వివిదిషాసంన్యాసులు, దండము లేని పరమహంస యగు యోగిని సమీపించరు అని ఆశంకించుకొని చెప్పుచున్నారు-

ఎవనిచే జ్ఞానదండము ధరింపబడినదో, అతడు ఏకదండి

అని చెప్పబడుచున్నాడు. జ్ఞానము లేకుండా సర్వభక్షుడగు ఎవనిచే కాష్ఠదండము ధరింపబడినదో, అతడు ఘోరములగు మహా రౌరవాది నరకములను పొందును. ఓర్మి, జ్ఞానము, వైరాగ్యము, శమము మొదలగు గుణములు లేకుండా భిక్షామాత్రముచే జీవించునట్టి అతడు పాపి, యతిధర్మమును వదలిపెట్టినవాడు. ఈ భేదమును తెలిసికొని, అతడు పరమహంస యగును. పరమహంసకు ఏ ఏకదండము కలదో, అది– జ్ఞానదండము,కాష్ఠదండము అని రెండు విధములు. త్రిదండములు వాగ్దండము,మనోదండము, కాయదండము అని మూడు విధములుగా ఉన్నట్లుగానే ఏకదండము రెండు విధములు. ఈ వాగ్దండాదులు మనువుచే స్మరింపబడినవి–

వాగ్దండము, మనోదండము, కర్మదండము ఎవనికి బుద్ధియందు నియతముగా కలవో, అతడు త్రిదండి అని చెప్పబడుచున్నాడు. ఈవిధముగా మానవుడు, సర్వప్రాణులయందు త్రిదండములను ఉంచి కామ, క్రోధములను నియమించి సిద్ధిని పొందుచున్నాడు.

వాని స్వరూపమును దక్షుడు తన స్మృతిలో–

ఎవనికి మనోవాక్కాయదండములు నియతములో, అతడు త్రిదండి. వాగ్దండమునందు మౌనమును వహించవలెను. కర్మదండమునందు పరిగ్రహము పనికిరాదు. మనోదండమునకు ప్రాణాయామము విధింపబడుచున్నది అని చెప్పుచున్నాడు.

కర్మదండ మనగా, అల్పభోజనమని మరియొక స్మృతియందు కలదు. ఈ త్రిదండి ధర్మములు పరమహంసకు గూడ, కలవు. ఈ అభిప్రాయముతోనే బ్రహ్మ ఇట్లు స్మరించుచున్నాడు–

పరమహంస యతి, శ్రుతిచోదితమగు తురీయాశ్రమి.అతడు యమ, నియమములతో కూడుకొని త్రిదండములు కలవాడై విష్ణు

స్వరూపుడగుచున్నాడు.

ఇట్లు కాగా, మౌనము మొదలైనవి వాక్కు మొదలైనవానిని అదుపులో నుంచుటకు ఎట్లు కారణమగుచున్నవో, అట్లే అజ్ఞాన, తత్కార్యములను మర్దించునట్టి జ్ఞానము కూడ, దండమే అయి ఉన్నది. ఈ జ్ఞానదండము ఏ పరమహంసచే ధరింపబడినదో, అతడే ముఖ్యమైన 'ఏకదండి' అగుచున్నాడు. మానసమైన జ్ఞాన దండము చిత్తవిక్షేపముచేత ఒకప్పుడు విస్మృతికి రావచ్చును అని తలచి, తన్నివారణముకొరకై గుర్తుచేయుటకు కాష్ఠదండము ధరింపబడుచున్నది. ఈ శాస్త్రార్థరహస్యమును తెలిసికొనక, వెదురుకర్రను (వేణుదండమును) చేతితో పట్టుకొన్నంతమాత్రము చేత పురుషార్థసిద్ధి అను అభిప్రాయముతో ఏ పరమహంసచే కాష్ఠ దండము ధరింపబడునో, ఆ పురుషుడు బహువిధములగు యాతనలతో కూడుకొనిన ఘోరములగు మహారౌరవనరకములను పొందును. దానికి కారణము చెప్పబడుచున్నది-

పరమహంస వేషమును చూచి, జ్ఞాని అను భ్రాంతిచే సర్వ జనులు తమ తమ గృహములందు భుజింపజేయుదురు. ఇతడు, జిహ్వాలంపటుడై ఏది వర్జ్యము, ఏది స్వీకరింపదగినది? అను వివేకము లేకుండ, సర్వమును భక్షించును. అందుచే ప్రత్యవాయ మును పొందును.

"నాన్నదోషేణ మస్కరీ చాతుర్వర్ణ్యం చరేద్ భైక్షమ్।"

'మస్కరికి అన్నదోషము లేదు' 'చాతుర్వర్ణ్యమునందు భిక్ష చేయ వచ్చును' మొదలగు విషయములు జ్ఞాని విషయములు. వివిదిషా సంన్యాసి విషయములు కావు. ఇతడు జ్ఞానవర్జితుడు గనుక, అట్లు చేసినచో, నరకము యుక్తమే. కనుకనే, జ్ఞానము పొందని యతికి భిక్షానియమమును మనువు చెప్పుచున్నాడు-

సంన్యాసి ఉత్పాత నిమిత్తములచేతను, భిక్ష చేయరాదు.

జ్యోతిషవిద్యచేత భిక్ష చేయరాదు. ఉపదేశాదులచేతను, పండిత వాదములచేతను భిక్షను కోరరాదు. రోజుకు ఒకమారే భిక్ష చేయవలెను. ఎక్కువ భిక్షను సంపాదించరాదు. భైక్షమునందు ప్రసక్తి గల యతి విషయసంగము కలవాడగును.

జ్ఞానాభ్యాసిని గూర్చి ఇట్లు స్మరింపబడుచున్నది-

పరమహంస ఒకమారుగాని, రెండు పర్యాయములు గాని, భుజించవచ్చును. ఏవిధముగానైనను, ఎల్లప్పుడు జ్ఞానాభ్యాసము చేయవలయును. ఇట్లు కాగా జ్ఞానదండ, కాష్ఠదండములలో తారతమ్యమును, ఉత్తమాధమ భావమును తెలిసికొని ఉత్తమమగు జ్ఞానదండమును ఎవడు ధరించుచున్నాడో, అతడే, ముఖ్య పరమహంస అని తెలియవలయును.

ఓయీ! ఈ పరమహంసకు జ్ఞానదండమే ఉండుగాక! కాష్ఠదండ నిర్బంధము లేకుండుగాక! తక్కిన చర్య ఇతనికి ఎట్లు ఉండును? అని ఆశంకించుకొని చెప్పుచున్నాడు-

దిగంబరుడు, నమస్కారము లేనివాడు, స్వధాకారము లేనివాడు, యాదృచ్ఛికుడు కావలెను. ఆవాహనము, విసర్జనము ఉండరాదు. మంత్రము లేదు, ధ్యానము లేదు, ఉపాసన లేదు. లక్ష్యము లేదు, అలక్ష్యము లేదు. భేదము లేదు, అభేదము లేదు. నేను లేదు, నీవు లేదు. ఏమియును లేదు. స్థిరనివాసము లేనివాడు ఆ భిక్షువు, బంగారము మొదలైనవానిని పరిగ్రహించరాదు. పై లోకము లేదు, క్రింది లోకము లేదు.

జీవన్ముక్తివివేకః

ఆశా దిశః తా ఏవాంబరం వస్త్ర మాచ్ఛాదనం యస్యాసా వాశాంబరః। యత్తు స్మృతి వచనమ్-

శ్లో॥ జాన్వోరూర్ధ్వ మధో నాభేః పరిధాయైక మంబరమ్।
ద్వితీయ ముత్తరం వాసః పరిధాయ గృహానటేత్॥ ఇతి।

తదిద మయోగివిషయమ్। అత ఏవ పూర్వం 'తచ్చ న ముఖ్యోఽస్తి' ఇత్యుక్తమ్। యద్యపి స్మృత్యన్తరమ్–

శ్లో॥ యో భవేత్ పూర్వసంన్యాసీ తుల్యో వై ధర్మతో యది।
తస్మై ప్రణామః కర్తవ్యో నేతరాయ కదాచన॥ ఇతి।

తథాఽపి తస్యాయోగివిషయత్వా న్నాస్య నమస్కారః కర్తవ్యోఽస్తి। అత ఏవ బ్రాహ్మణలక్షణే 'నిర్నమస్కార మస్తుతిమ్' పృ. 29 ఇత్యుదాహృతమ్। గయా ప్రయాగాది తీర్థేషు శ్రద్ధాజాడ్యప్రాప్తః స్వధాకారో నిషిధ్యతే। పూర్వత్ర 'నిన్దా గర్వ' ఇత్యాదివాక్యేన పరకృతయా స్వనిందయా క్లేశో నివారితః అత్ర తు సర్వకర్తృకే అన్యవిషయే నిందాస్తుతీ నిషిధ్యేతే। యాదృచ్ఛికత్వం నిర్బంధరాహిత్యమ్। న క్వచిదపి వ్యవహారే నిర్బంధం కుర్యాత్। యస్తు దేవపూజాయాం నిర్బంధః స్మర్యతే–

శ్లో॥ భిక్షాటనం జపః శౌచం స్నానం ధ్యానం సురార్చనమ్।
కర్తవ్యా నిషడేతాని సర్వథా నృపదండవత్॥ ఇతి।

తస్యాపి అయోగివిషయత్వ మభిప్రేత్య నావాహన మిత్యా ద్యామ్నాతమ్। సకృత్స్మరణం ధ్యానమ్, నైరన్తర్యేణానుస్మరణ ముపాసనమితి తయోర్భేదః। యథా యోగినః స్తుతినిందాది లౌకికవ్యవహారాభావః, యథా వా దేవపూజాది ధర్మశాస్త్రవ్యవహారా భావః, తథా లక్ష్యత్వాలక్ష్యత్వాది జ్ఞానశాస్త్రవ్యవహారోఽపి నాస్తి। 'యత్సాక్షిచైతన్యమస్తి తదిదమ్– 'తత్త్వమసి' ఇతి వాక్యే 'త్వం' పదేన లక్ష్యమ్। దేహాదివిశిష్టం చైతన్యం లక్ష్యం న భవతి కిన్తు, వాచ్యమ్। తచ్చ వాచ్యం తత్పదార్థాత్ పృథక్, లక్ష్యం త్వపృథక్, స్వదేహనిష్ఠో వాచ్యోఽర్థోఽహమితి వ్యవహారార్హః। పరదేహనిష్ఠ స్త్వమితి వ్యవహారార్హః। లక్ష్యం వాచ్య మిత్యుభయు విధం చైతన్యోపేతమ్, అన్య జ్జడం జగ త్సర్వమితి

వ్యవహారార్థమ్' ఇత్యేతాదృశో వికల్పో న కోఽపి యోగినోఽస్తి, తదీయ చిత్తస్య బ్రహ్మణి విశ్రాన్తత్వాత్। అత ఏవ స భిక్షు రనికేతస్థితిరేవ। యది నియత నివాసార్థం కంచిన్మఠం సంపాదయేత్, తదానీం తస్మిన్ మమత్వే సతి తదీయ హానివృద్ధ్యోశ్చిత్తం విక్షిప్యేత। ఏతత్సర్వ మభిప్రేత్య గౌడపాదాచార్యా ఆహుః—

శ్లో॥ నిఃస్తుతి ర్నిర్నమస్కారో నిఃస్వధాకార ఏవ చ।
చలాచల నికేతశ్చ యతి ర్యాదృచ్ఛికో భవేత్॥ 2-38 ఇతి।

యథా మఠో న పరిగ్రహీతవ్య స్తథా సౌవర్ణ రాజతాదీనాం భిక్షాచమనాది పాత్రాణా మేకమపి న గృహ్ణీయాత్। తదాహ యమః—

శ్లో॥ హిరణ్మయాని పాత్రాణి కార్ష్ణాయసమయాని చ।
యతీనాం తాన్యపాత్రాణి వర్జయేత్ తాన్ భిక్షుకః॥ ఇతి।

మనురపి—

శ్లో॥ అతైజసాని పాత్రాణి తస్య స్యు ర్నిర్వ్రణాని చ।
తేషాం మృద్భిః స్మృతం శౌచం చమసానా మివాధ్వరే॥
అలాబు దారుపాత్రం వా మృణ్మయం వైణవం తథా।
ఏతాని యతిపాత్రాణి మనుః స్వాయంభువోఽబ్రవీత్॥
6, 53, 54 ఇతి।

బోధాయనోఽపి—

శ్లో॥ స్వయ మాహృత పర్ణేషు స్వయం శీర్ణేషు వా పునః।
భుంజీత న వటాశ్వత్థ కరంజానాం చ పర్ణకే॥
ఆపద్యపి న కాంస్యేషు మలాశీ కాంస్యభోజనః।
సౌవర్ణే రాజతే తామ్రే మృన్మయే త్రపు సీసయోః॥ఇతి।

తథా లోకం జనం శిష్యవర్గం న గృహ్ణీయాత్। తదాహ మనుః—

శ్లో॥ ఏక ఏవ చరే న్నిత్యం సిద్ధ్యర్థ మసహాయకః।
సిద్ధి మేకస్య పశ్యన్ హి తజ్జహాతి న హీయతే॥ 6-42 ఇతి।

భావప్రకాశిక

ఆశలు అనగా దిక్కులు. అవి అచ్ఛాదనముగా గలవాడు ఆశాంబరుడు. మోకాళ్ళకు పైన, నాభికి క్రింద ఒక వస్త్రమును ధరించి, పైన ఉత్తరీయము వేసికొని భిక్ష కొరకు గృహములకు వెళ్ళవలెను అను స్మృతివచనము యోగికాని భిక్షుకుని గురించి అయి ఉన్నది. కనుకనే, పూర్వము 'అది, అంత ముఖ్యము కాదు' అని చెప్పబడినది. మరియొక స్మృతియందు తనకంటె ముందు సంన్యాసము తీసికొనిన సమానధర్మము కలవానికి ప్రణామము చేయవలెను. ఎన్నడును, ఇతరులకు నమస్కరించరాదు అని చెప్పబడినది. ఈ స్మృతి కూడ, యోగి కానివాని విషయమే గనుక, యోగియగు సంన్యాసికి నమస్కారము కర్తవ్యము కాదు. కనుకనే, బ్రాహ్మణలక్షణములలో 'నిర్నమస్కార మస్తుతిమ్' నమస్కారము లేదు, స్తుతిలేదు అని వచింపబడినది.

గయా ప్రయాగాది తీర్థములందు శ్రద్ధాజడులకు ప్రాప్తమైన స్వధాకారము, పితృతర్పణాదులు నిషేధింపబడినవి. పూర్వము నిందాగర్వాది వాక్యమునందు పరులచే చేయబడు నిందచే క్లేశము నివారింపబడినది. ఇచట, తాను ఇతరులను నిందించుటగాని, స్తుతించుట గాని, చేయరాదని నిషేధింపబడినది. యాదృచ్ఛికత్వ మనగా, నిర్బంధము లేకపోవుట. ఏ వ్యవహారమునందైనను ఇట్లే చేయవలయును అను నిర్బంధము పనికిరాదు. ఏదైతే దేవపూజయందు నిర్బంధము స్మృతియందు చెప్పబడినదో, భిక్షాటనము, జపము, శౌచము, స్నానము, ధ్యానము, సురార్చనము (దేవపూజ) ఈ ఆరు రాజదండనము

వతె పూర్తిగా ఆచరింపవలయును అను వచనము కూడ, యోగి కాని సంన్యాసివిషయము అను అభిప్రాయముతో ఆవాహనము మొదలైనవి లేవు అని చెప్పబడినది. ఒకమారు స్మరించుట ధ్యానము. నిరంతరము అనుస్మరణము, ఉపాసనము అని ఆ రెంటికి భేదము. యోగికి ఏ విధముగా స్తుతి నిందాది లౌకిక వ్యవహారము లేదో, దేవపూజాది ధర్మశాస్త్రవ్యవహారము లేదో, అట్లే లక్ష్యత్వ, అలక్ష్యత్వాది జ్ఞానశాస్త్ర వ్యవహారము గూడ లేదు. సాక్షిచైతన్యమేది కలదో, అదే 'తత్త్వమసి' అను వాక్యము నందు 'త్వం' పద లక్ష్యార్థము. దేహాదివిశిష్ట చైతన్యము 'త్వం' పద లక్ష్యార్థము కాదు. మరేమనగా, 'త్వం' పదార్థవాచ్యార్థము. అచట, వాచ్యార్థము 'తత్' పదార్థము కంటె వేరైనది. లక్ష్యార్థము వేరు కానిది (అభిన్నమైనది).తన దేహమునందున్న వాచ్యార్థము (దేహాది విశిష్ట చైతన్యము) 'అహమ్' అను వ్యవహారమునకు యోగ్యము. పరదేహమునందున్న దేహాదివిశిష్ట చైతన్యము 'త్వం' అను వ్యవహారమునకు యోగ్యము. లక్ష్యము, వాచ్యము- రెండు విధములు- చేతన గలవి. తక్కిన జడ ప్రపంచము సర్వము, అను వ్యవహారమునకు అర్హము.ఇటువంటి వికల్పములు ఏవియు, యోగికి లేవు. అతని చిత్తము బ్రహ్మయందు విశ్రాంతి నొందినది. కనుకనే, ఆ భిక్షువు 'అనికేతస్థితిః' ఎచ్చటను నిలుకడ గల నివాసము కలవాడు కాడు. నియత నివాసము కొరకు మఠమును సంపాదించినచో, అప్పుడు దానియందు మమకారము కలుగగా, ఆ మఠముయొక్క హాని, వృద్ధులందు చిత్తము విక్షేపము నొందును. ఇదంతయు మనసులో నుంచుకొనియే గౌడపాదాచార్యులు

"నిః స్తుతిః నిర్నమస్కారః నిఃస్వధాకార ఏవ చ।
చలాచల నికేతశ్చ యతిః యాదృచ్ఛికో భవేత్॥"

అని నుడివిరి.

ఏవిధముగా మఠపరిగ్రహము పనికిరాదో, అదేవిధముగా సువర్ణ రజతాదులచే నిర్మింపబడిన భిక్షాచమన పాత్రాదికమును ఒక్కదానినైనను గ్రహించరాదు.

అట్లే, యముడు యతికి బంగారుపాత్రలు, వెండిపాత్రలు, లోహపాత్రలు, అపాత్రములు. భిక్షుకుడు ఆ పాత్రలను వర్జించవలెను అని చెప్పుచున్నాడు.

ఇక, మనువు అయినచో, సంన్యాసికి తైజసములు కాని పాత్రలు, కణుపులు లేని పాత్రలు, వానికి (ఆ పాత్రలకు) అధ్వరమునందు చమసపాత్రలకు వలె జలముచేత శుద్ధి అని స్మరింపబడినది.

సొరకాయతోను, కొయ్యతోను చేసిన పాత్ర గాని, మృణ్మయ పాత్ర గాని, వెదురుపాత్ర గాని, యతికి శ్రేష్ఠములని స్వాయంభువ మనువు చెప్పెను.

బోధాయనుడు గూడ, స్వయముగా తెచ్చుకొనిన ఆకులందుగాని, స్వయముగా రాలిన పర్ణములందు గాని భుజింపవలయును. మర్రి, రావి, కరంజ వృక్ష పర్ణములందు భుజించరాదు. కంచములో భోజనము పనికిరాదు. ఆపదయందు గూడ బంగారు, వెండి, రాగి, మట్టి, సత్తు, సీసము పాత్రలందు భుజించరాదు అని నిషేధించెను. అట్లే లోకమును, అనగా శిష్యజనమును చేరదీయరాదు.

మనువు ఇట్లు చెప్పుచున్నాడు-

యతి, సిద్ధికొరకు రెండవవాని సహాయము లేకనే తానొక్కడే సంచరించవలయును. ఒక్కడుగా ఉన్నవానికి సిద్ధిని చూచుచు చరించవలయును. అట్లు చేయుటచే తాను దేనిని పోగొట్టుకొనడు. దేనికంటెను, హీనుడు కాడు అని యతిధర్మమును విహితము చేసెను.

మేధాతిథిరపి—

శ్లో॥ ఆసనం పాత్రలోపశ్చ సంచయః శిష్యసంగ్రహః।
దివాస్వాపో వృథాలాపో యతే ర్బన్ధకరాణి షట్॥
ఏకాహాత్ పరతో గ్రామే పంచాహాత్ పరతః పురే।
వర్షాభ్యోఽన్యత్ర యత్స్వాధన మాసనం తదుదాహృతమ్॥
ఉక్తాలాబ్వాదిపాత్రాణా మేకస్యాపి న సంగ్రహః।
భిక్షో ర్భైక్షభుజశ్చాపి పాత్రలోపః స ఉచ్యతే॥
గృహీతస్య తు దండాదే ర్ద్వితీయస్య పరిగ్రహః।
కాలాన్తరోపభోగార్థం సంచయః పరికీర్తితః॥
శుశ్రూషాలాభపూజార్థం యశోఽర్థం వా పరిగ్రహః।
శిష్యాణాం న తు కారుణ్యాత్ స జ్ఞేయః శిష్యసంగ్రహః॥
విద్యా దినం ప్రకాశత్వా దవిద్యా రాత్రి రుచ్యతే।
విద్యాభ్యాసే ప్రమాదో యః స దివాస్వాప ఉచ్యతే॥
ఆధ్యాత్మికీం కథాం ముక్త్వా భైక్షచర్యాం సురస్తుతిమ్।
అనుగ్రహః పరిప్రశ్నౌ వృథాలాపః స ఉచ్యతే॥ ఇతి।

లోకం శిష్యజనరూపం న గృహ్ణీయాదిత్యేతావదేవ న భవతి, కిన్తు తస్య లోకస్యావలోకం దర్శనమపి న కుర్యాత్, తస్య బన్ధహేతుత్వాత్। న చేత్యనేనాన్యదపి స్మృతినిషిద్ధం న కుర్యాదిత్యభిప్రేతమ్। తచ్చ నిషిద్ధం మేధాతిథి ర్దర్శయతి-

శ్లో॥ స్థావరం జంగమం బీజం తైజసం విష మాయుధమ్।
షడేతాని న గృహ్ణీయాద్ యతి ర్మూత్రపురీషవత్॥
రసాయనం క్రియావాదం జ్యోతిషం క్రయవిక్రయమ్।
వివిధాని చ శిల్పాని వర్జయేత్ పరదారవత్॥ ఇతి।

యోగినో లౌకిక వైదిక వ్యవహారగతాని యాని బాధకాని సన్తి తేషాం వర్జన మభిహితమ్। అథ ప్రశ్నోత్తరాభ్యా మత్యన్త

బాధకం ప్రదర్శ్య తద్వర్జనమాహ-

'అబాధకః క ఇతి చే దాబాధకోఽస్త్యేవ। యస్మాద్ భిక్షుః హిరణ్యం రసేన దృష్టం చేత్ స బ్రహ్మహా భవేత్। యస్మాద్ భిక్షు హిరణ్యం రసేన స్పృష్టం చేత్ స పౌల్కసో భవేత్। యస్మాద్ భిక్షుఃహిరణ్యం రసేన గ్రాహ్యం చేత్ స ఆత్మహా భవేత్। తస్మాద్ భిక్షుహిరణ్యం రసేన న దృష్టం చ న స్పృష్టం చ న గ్రాహ్యం చ'
పరమ. ఉ. 4 ఇతి।

ఆకారోఽభివ్యాప్త్యర్థకః। 'ఆఙ్ ఈషదర్థేఽభివ్యాప్తౌ' ఇత్యభిహితత్వాత్। అభివ్యాప్తో బాధకోఽత్యన్తబాధక స్తస్య సద్భావం ప్రతిజ్ఞాయ హిరణ్యస్య తథావిధ బాధకత్వ ముచ్యతే। రసేనాభిలాషయుక్తేనాదరేణ హిరణ్యం యది దృష్టం స్యా త్తదానీం స ద్రష్టా భిక్షు ర్బ్రహ్మహా భవేత్। హిరణ్యాసక్త్యా తత్సంపాదన రక్షయోః సర్వదా ప్రయతమాన స్తద్వైయర్థ్యపరిహారాయ ప్రపంచమిథ్యాత్వ ప్రతిపాదకాన్ వేదాన్తాన్ దూషయిత్వా తత్సత్యత్వ మవలంబతే। తతః శాస్త్రసిద్ధం అద్వితీయం బ్రహ్మ తేనభిక్షుణా హతమేవ భవతి। తస్మాదసౌ బ్రహ్మహా భవేత్। తథా చ స్మర్యతే-

శ్లో॥ బ్రహ్మ నాస్తీతి యో బ్రూయాద్ ద్వేష్టి బ్రహ్మవిదం చ యః।
అభూత బ్రహ్మవాదీ చ త్రయ స్తే బ్రహ్మఘాతకాః॥ ఇతి।

'బ్రహ్మహా తు స విజ్ఞేయః సర్వధర్మబహిష్కృతః।' ఇతి చ।

అభిలాషపూర్వకం హిరణ్యం స్పృష్టం చేత్ తదా తత్స్ప్రష్టా భిక్షుః పతితత్వాత్ పౌల్కసో మ్లేచ్ఛసదృశో భవేత్। పాతిత్యం చ స్మర్యతే-

శ్లో॥ పతత్యసౌ ధ్రువం భిక్షు ర్యస్య భిక్షోర్ద్వయం భవేత్।
ధీపూర్వం రేత ఉత్సర్గో ద్రవ్యసంగ్రహ ఏవ చ॥ ఇతి।

అభిలాషపురస్సరం హిరణ్యం న గ్రాహ్యమ్। గృహీతం చేత్ తదా స భిక్షు ర్దేహేన్ద్రియాదిసాక్షిణ మసఙ్గం చిదాత్మానం హతవాన్ భవేత్। అసంగత్వ మపోహ్య స్వాత్మనో హిరణ్యాది ద్రవ్యం ప్రతి భోక్తృత్వేన ప్రతిపన్నత్వాత్। తస్యాశ్చాన్యథా ప్రతిపత్తేః సర్వ పాపరూపత్వం స్మర్యతే–

శ్లో॥ యోఽన్యథా సన్త మాత్మాన మన్యథా ప్రతిపద్యతే।
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణాః॥

మ. భా. ఆది. 98–7 ఇతి।

### భావప్రకాశిక

మేధాతిథి కూడా ఇట్లు చెప్పెను–

ఆసనము, పాత్రలోపము, సంచయము, శిష్యసంగ్రహము, దివాస్వాపము, వృథాలాపము– ఈ ఆరును యతికి బంధకరములు.

గ్రామమున, ఒకరోజు పైన ఉండుట బంధకరము. పురమున, అయిదు దినముల తరువాత, చాతుర్మాస్యములలో దక్క, అధిక కాలము ఉనికి 'ఆసనము' అని చెప్పబడును. యతికి నిర్దేశింప బడిన సొరకాయ మొదలగు పాత్రలలో ఒకదానిని గూడ సంగ్ర హించకపోవుట, భిక్షువునకు- భైక్షము తినువానికి పాత్రలోపము అని చెప్పబడును. కాలాంతరమున, ఉపభోగము కొరకై రెండవ దండమును ఉంచుకొనుట (పరిగ్రహించుకొనుట) సంచయము. కారుణ్యముతో తప్ప, శుశ్రూషాలాభపూజలకై, యశస్సు కొరకు శిష్యపరిగ్రహము పనికిరాదు, విద్యయే దినము, ప్రకాశ రూపము గనుక, అవిద్యయే రాత్రి. విద్యాభ్యాసమున, ఏమరుపాటు దివాస్వాపము అనబడును. ఆధ్యాత్మికప్రసంగమును వదలిపెట్టి భిక్షాప్రస్తావము, సురస్తుతి వదలిపెట్టి మంత్రోపదేశాను గ్రహము, మార్గప్రశ్నే వృథాలాపము అనబడును. 'లోకం న

గృహ్ణీయాత్' అనగా శిష్యజనమును స్వీకరించరాదు అని మాత్రమే అర్థము కాదు, బంధహేతువగుటవలన లోకమును గూడ చూడరాదు. 'న చ' అనుటచే స్మృతినిషిద్ధములగు ఇతరములను గూడ చేయరాదు. ఆ నిషిద్ధములను మేధాతిథి చూపుచున్నాడు-

యతి, స్థావరమును (రత్నాదులను), జంగమును (గవాదులను), బీజములను (తులసీ విత్తనములను), తైజసమును, విషమును, ఆయుధమును- ఈ ఆరింటిని మూత్రపురీషములవలె గ్రహించరాదు. రసాయనమును, లోకవ్యవహారమును (క్రియాకలాపమును), జ్యోతిషమును, క్రయవిక్రయములను, వివిధ శిల్పములను పరదారనువలె వర్జించవలెను.

యోగికి లౌకిక, వైదిక వ్యవహార బాధకములను వర్జించుట చెప్పబడినది. తరువాత, ప్రశ్నోత్తరములతో అత్యంతబాధకమును ప్రదర్శించి, దానిని వర్జించుటను చెప్పుచున్నారు-

ఆ బాధకము ఏమి? అనినచో, ఆ బాధకము కలదు. దీని వలన సంన్యాసి బంగారమును ప్రీతితో చూచినచో, అతడు బ్రహ్మహత్యాదోషము కలవాడగును. భిక్షువు బంగారమును ప్రీతితో స్పృశించినచో, పౌల్కసుడు అగును. భిక్షువు హిరణ్యమును ప్రీతితో గ్రహించినచో, ఆత్మహత్యాదోషము కలవాడు అగును. కనుక, భిక్షువు హిరణ్యమును ప్రీతితో చూడరాదు, స్పృశించరాదు, గ్రహించరాదు అని బాధకత్యాగము చెప్పబడెను.

'ఆ' అనెడి వర్ణమునకు 'అభివ్యాప్తి' అని అర్థము కలదు. 'ఆఙ్ ఈషదర్థే అభివ్యాప్తౌ' 'ఆ'కారము కొంచెము, అత్యంతము అను రెండు అర్థములు కలది. అభివ్యాప్తియందు బాధకము అనగా అత్యంత బాధకము. అది ఉన్నది అని ప్రతిజ్ఞ చేసి హిరణ్యము అట్టిది అని చెప్పబడినది. సాభిలాషముగా ఆదరముతో హిరణ్యమును చూచినచో, ద్రష్టయగు ఆ భిక్షువు బ్రహ్మహత్య

చేసినవాడు అగును. బంగారమునందు ప్రీతిచే దానిని సంపాదించుటయందును, రక్షణయందును ఎల్లప్పుడు ప్రయత్నించుచు, ఆ బంగారముయొక్క సాఫల్యము (వైయర్థ్య పరిహారము)కొరకు ప్రపంచమిథ్యాత్వమును ప్రతిపాదించునట్టి వేదాంతములను దూషించి, జగత్సత్యత్వమును అవలంబించును. కనుక, శాస్త్రసిద్ధమగు అద్వితీయ బ్రహ్మ, ఆ భిక్షువుచే హతమైనదివలె అగును. కనుక, ఇతడు 'బ్రహ్మహా' యగును. స్మృతియందు ఇట్లు చెప్పబడినది-

ఎవడు బ్రహ్మ లేదు అని పలుకునో, బ్రహ్మవేత్తను ద్వేషించునో, బ్రహ్మ, పరమార్థము కాదని వాదించునో, ఈ మువ్వురును బ్రహ్మఘాతకులు. ఇట్టివాడు సర్వ వైదిక ధర్మ బహిష్కృతుడు.

సాభిలాషముగా హిరణ్యమును స్పృశించిన భిక్షువు, పతితుడు గనుక, మ్లేచ్ఛునివంటివాడు అగును. పాతిత్యము స్మృతియందు ఇట్లు చెప్పబడినది-

బుద్ధిపూర్వకముగా రేతస్సుయొక్క ఉత్సర్గము, ద్రవ్య సంగ్రహము- ఈ రెంటిని భిక్షువు విడనాడవలెను. ఆ రెంటివలన, భిక్షువు, తప్పక పతితుడగును.

అభిలాషపూర్వకముగా హిరణ్యమును భిక్షువు గ్రహించినచో, దేహేంద్రియాది సాక్షియు, అసంగము నగు చిదాత్మను హత మొందించినవాడు అగును. అసంగత్వమును విడనాడి, తనను హిరణ్యాది ద్రవ్యమునకు భోక్తగా గ్రహించి ఉన్నందువలన, అభోక్తయగు ఈ ఆత్మకు భోక్తృరూపముగా భ్రమించుట సర్వ పాపరూపము అని స్మృతియందు చెప్పబడినది.

"యోఽన్యథా సన్త మాత్మాన మన్యథా ప్రతిపద్యతే।
కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా॥"

ఎవడు అసంగముగాను, అకర్తగాను, అభోక్తగాను, ఉన్న ఆత్మను సక్తుడై కర్తగాను, భోక్తగాను తలంచునో, ఆత్మను అపహరించిన ఆ చోరునిచే ఏ పాపము చేయబడలేదు అని భావము.

జీవన్ముక్తివివేకః

కించాత్మఘాతినః సుఖలేశేనాపి రహితా బహువిధ దుఃఖే నావృతా లోకాః శ్రూయన్తే-

శ్లో॥ అసుర్యా నామ తే లోకా అంధేన తమసాఽఽవృతాః।
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః॥
ఈశా. ఉ. 3 ఇతి।

దృష్టం చేత్యనేన చకారేణ శ్రుతం చ సముచ్చీయతే। స్పృష్టం చేత్యనేన కథితస్య సముచ్చయః। గ్రాహ్యం చేత్యనేన వ్యవహృతం చేతి సముచ్చీయతే। దర్శన స్పర్శన గ్రహణవత్ అభిలాషపూర్వకాః హిరణ్యవృత్తాన్త శ్రవణ తద్గుణకథన తదీయ క్రయాదివ్యవహారా అపి ప్రత్యవాయహేతవ ఇత్యర్థః। యస్మాత్ సాభిలాష హిరణ్యదర్శనాదయో దోషకారిణ స్తస్మాద్ భిక్షుణా హిరణ్యదర్శనాదయో వర్జనీయా ఇత్యర్థః।

హిరణ్యవర్జనస్య ఫలమాహ—

'సర్వే కామా మనోగతా వ్యావర్తన్తే దుఃఖే నోద్విగ్నః సుఖే నిఃస్పృహ స్త్యాగో రాగో సర్వత్ర శుభాశుభయో రనభి స్నేహో న ద్వేష్టి న మోదతే చ సర్వేషా మింద్రియాణాం గతి రుపరమతి య ఆత్మన్యేవావతిష్ఠతే।' పరమ. ఉ. 4॥ ఇతి।

పుత్ర భార్యా గృహ క్షేత్రాది కామానాం సర్వేషాం హిరణ్య

మూలత్వా ద్ధిరణ్యే పరిత్యక్తే సతి తే కామా మనోగతాః మనస్యేవ స్థానా ద్వ్యావర్తన్తే వ్యావృత్తా భవన్తి। కామనివృత్తౌ సత్యాం కర్మప్రాప్తయో ర్దుఃఖసుఖయో రుద్వేగస్పృహే న భవతః। ఏతచ్చ స్థితప్రజ్ఞప్రస్తావే ప్రపంచితమ్। ఐహికయోః సుఖదుఃఖయో ర్విక్షేపకత్వేనాముష్మిక విషయరాగేఽపి త్యాగో భవతి। ఐహిక స్పృహాయుక్తో హి తద్దృష్టాన్తేనానుమిత ఆముష్మికే సుఖే రాగవాన్ భవతి। తస్మా దైహికే నిఃస్పృహస్యాముష్మికే రాగాభావో యుజ్యతే। ఏవం సతి సర్వత్ర లోకద్వయేఽపి యౌ శుభాశుభా వనుకూలప్రతికూలవిషయౌ తయో రనభిస్నేహః। ఏతచ్చ ద్వేషరాహిత్యస్యాప్యుపలక్షణమ్। తాదృశో విద్వా నశుభకారిణం కంచిదపి పురుషం న ద్వేష్టి। శుభకారిణం దృష్ట్వా న చ మోదం ప్రాప్నోతి। ద్వేష మోదరహితో యః పుమా నాత్మన్యేవ సర్వదాఽవతిష్ఠతే। తస్య సర్వేషా మింద్రియాణాం గతిః ప్రవృత్తి రుపరమతి। ఇన్ద్రియోపరతౌ న కదాచిదపి నిర్వికల్పక సమాధే ర్విఘ్నో భవతి। 'తేషాం కా స్థితిః?' ఇతి ప్రశ్నస్య సంక్షేపవిస్తరాభ్యాం ఉత్తరం పూర్వ ముక్తమ్। తదేవాత్ర పునరపి హిరణ్యనిషేధప్రసంగేన స్పష్టీకృతమ్।

అథ విద్వత్సంన్యాస ముపసంహరతి-

'యత్పూర్ణానందైకబోధ స్తద్, బ్రహ్మాహమస్మీతి కృతకృత్యో భవతి కృతకృత్యో భవతి॥' పరమ. ఉ. 4॥ ఇతి।

యద్ బ్రహ్మ వేదాన్తేషు పూర్ణానందైకబోధః పరమాత్మేతి నిరూపితం తద్బ్రహ్మాహమస్మీత్యేవం సర్వదా అనుభవన్నయం పరమహంసః కృతకృత్యో భవతీతి। యథా చ స్మర్యతే-

శ్లో॥ జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నైవాస్తి కించిత్ కర్తవ్య మస్తి చే న్న స తత్త్వవిత్॥ ఇతి।

శ్లో॥ జీవన్ముక్తివివేకేన తమో హార్దం నివారయన్।
పుమర్థ మఖిలం దేయాద్ విద్యాతీర్థమహేశ్వరః॥
భేదాభేదౌ సపది గలితౌ పుణ్యపాపే విశీర్ణే మాయామోహౌ
క్షయ మధిగతౌ నష్టసందేహవృత్తిః।
శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్య తత్త్వావబోధం
నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః?॥
తీర్థాని తోయపూర్ణాని దేవాన్ పాషాణ మృణ్మయాన్।
యోగినో న ప్రపద్యన్తే ఆత్మజ్ఞాన పరాయణాః॥
అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతమ్।
ప్రతిమాస్వల్పబుద్ధీనాం సర్వత్ర విదితాత్మనామ్॥
సర్వత్రావస్థితం శాన్తం న ప్రపద్యే జనార్దనమ్।
జ్ఞానచక్షుర్విహీనత్వా దన్ధః సూర్యమివోదితమ్॥
ఇతి శ్రీమద్విద్యారణ్యప్రణీతే జీవన్ముక్తవివేకే
విద్వత్సంన్యాసనిరూపణం నామ పంచమం ప్రకరణమ్॥
సంపూర్ణోఽయం శ్రీమద్విద్యారణ్యప్రణీతో
జీవన్ముక్తివివేకః॥

భావప్రకాశిక

మరియు, ఆత్మఘాతకునకు సుఖలేశము కూడ లేనట్టి బహు విధములగు దుఃఖములతో నిండిన లోకములు వినబడుచున్నవి.

"అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసాఽఽవృతాః।
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కేచాత్మహనో జనాః॥

ఆత్మఘాతకులగు జనులు సూర్యుడు లేనట్టియు, కటిక చీకటితో నిండిన లోకములను మరణానంతరము వెళ్ళుచున్నారు అని ఉక్తశ్రుతి తాత్పర్యము.

'దృష్టం చ' అను 'చ'కారముచేత 'శ్రుతం చ' అని చేర్చుకొనవలెను. చూచినదియే కాక, విన్నది కూడ, అని అర్థము.

'స్పృష్టం చ' అను 'చ'కారముచేత కథితము సముచ్చయము చేయబడుచున్నది. 'గ్రాహ్యం చ' అనుచోట, 'వ్యవహృతం చ' అని సముచ్చయము. అనగా, హిరణ్య దర్శన, గ్రహణముల వలెనే సాభిలాషముగా హిరణ్యవృత్తాంత శ్రవణము, తద్గుణ కథనము, ఆ హిరణ్యముతోటి వ్యవహారము యతికి ప్రత్యవాయ మును కలిగించును. కనుక భిక్షువు, హిరణ్యదర్శనాదులను వర్జించ వలయును. హిరణ్యవర్జనమునకు ఫలమును చెప్పుచున్నారు–

మనోగతములగు కోరికలు అన్నియు, వ్యావర్తించును– తొలగిపోవును. దుఃఖమునందు కలత నొందడు. సుఖమునందు అభిలాష కలవాడు కాడు. రాగమును త్యజించును. అంతట, శుభాశుభములందు ప్రీతి, ద్వేషము కలవాడు కాడు. సర్వేంద్రియ వ్యాపారము ఆగిపోవును. ఆ యతి, ఆత్మస్వరూపమునందే స్థితి కలవాడు అగును అని హిరణ్యదర్శనాది త్యాగఫలము చెప్పబడినది.

కోరబడునట్టి భార్యా, పుత్ర, గృహ, క్షేత్రాదులు అన్నియు, హిరణ్యమూలకములు. హిరణ్యపరిత్యాగము చేయగా, మనోగతము లగు ఇతర కామములు గూడ, నివర్తించును. కామము నివృత్తము కాగా, కర్మప్రాప్తములగు సుఖ, దుఃఖములందు స్పృహ, ఉద్వేగము ఉండవు. ఇది, స్థితప్రజ్ఞప్రకరణమున విస్తరింప బడినది. ఐహిక సుఖదుఃఖములు విక్షేపకరములు గనుక, ఆముష్మిక విషయములందు గూడ, రాగమును త్యజించుట సంభవించును. ఐహిక సుఖమునందు స్పృహ కలవాడు ఆ దృష్టాంతముతో అనుమితమగు ఆముష్మిక సుఖమునందును, రాగము కలవాడు అగును. కనుక, ఐహిక సుఖమునందు నిఃస్పృహ గలవానికి ఆముష్మిక సుఖమునందు గూడ, రాగము లేకపోవుట యుక్తమగుచున్నది. ఇట్లు కాగా, లోకద్వయము

నందు, శుభాశుభ, అనుకూల, ప్రతికూల విషయములందు రాగాతి శయము ఉండదు. ఇది, ద్వేషరాహిత్యమునకు గూడ, ఉప లక్షణము. అట్టి విద్వాంసుడు, అశుభకారియగు పురుషుని, ద్వేషించడు. శుభకారిని చూచి, హర్షమును పొందడు. ద్వేష, మోదములు లేనివాడై ఆత్మయందే ఎల్లప్పుడు స్థితి గలవాడు అగును. అతనికి సర్వేంద్రియప్రవృత్తి విరత మగును. ఇంద్రియములు నిర్వ్యాపారములు కాగా, ఇక ఎన్నడును, నిర్వికల్పక సమాధికి విఘ్నము కలుగదు. 'తేషాం కా స్థితిః?' అను ప్రశ్నకు సంక్షేప, విస్తరములతో ఉత్తరము పూర్వము చెప్ప బడినది. అదియే, మరల హిరణ్యనిషేధ ప్రసంగముతో స్పష్టము చేయబడినది.

ఇక, విద్వత్సంన్యాసమును ఉపసంహరించుచున్నారు. 'పూర్ణానందైక బోధస్వరూపమగు బ్రహ్మ నేను అగుచున్నాను' అని కృతార్థుడగుచున్నాడు.

వేదాంతములందు ఏ బ్రహ్మ, పూర్ణానందైకబోధ స్వరూప ముగా నిరూపింపబడినదో, ఆ బ్రహ్మ నేను అయిఉన్నాను' అని ఎల్లప్పుడు, బ్రహ్మస్వరూపమును అనుభవించునట్టి ఈ పరమ హంస, యోగి కృతార్థుడు అగుచున్నాడు. స్మృతి (భగవద్గీత) యందు–

"జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః।
నైవాస్తి కించిత్ కర్తవ్య మస్తి చేన్న స తత్త్వవిత్॥

జ్ఞానామృతముచే తృప్తుడై కృతకృత్యుడైన యోగికి కర్తవ్యము ఏమియు లేదు. కర్తవ్యము మిగిలి ఉన్నచో అతడు, తత్త్వజ్ఞాని కాడు అని చెప్పబడినది.

* * * * *

విద్యాతీర్థ మహేశ్వరుడు జీవన్ముక్తి వివేకముచే హృదయము నందలి అజ్ఞానమనెడి తమస్సును నివారించుచు, నిఖిల పురుషార్థములను, పరమ పురుషార్థమును ఒసంగుగాక!

భేదాభేదములు తక్షణమే జారిపోయినవి (నివృత్తము లైనవి). పుణ్యపాపములు ధ్వస్తమైనవి. మాయామోహములు క్షయము నొందినవి. సంశయములు తీరిపోయినవి, శబ్దములచే వర్ణింపనలవికాని త్రిగుణరహితమైన తత్త్వావబోధ (తత్త్వసాక్షాత్కారము) ప్రాప్తమైనది. త్రిగుణాతీతమగు మార్గమున, విహరించువారలకు విధి యేమి? నిషేధ మేమి? ఆత్మజ్ఞాన పరాయణులగు యోగులు జలపూర్ణములగు తీర్థములు గాని, పాషాణ, మృణ్మయములగు దేవతామూర్తులను గాని సేవించరు. బ్రాహ్మణులకు అగ్ని దేవుడు, మునులకు హృదయమునందు దైవతము. స్వల్పబుద్ధులకు ప్రతిమలందు దైవతము. ఆత్మజ్ఞానులకు అంతట దేవస్వరూపము. అంధుడు ఉదయించిన సూర్యుని చూడనటుల, జ్ఞానచక్షువు లేకపోవుటచే అంతట నిండి ఉన్న శాంతస్వరూపుడగు జనార్దనుని, పరమాత్మను దర్శించలేక ఉన్నాను.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమద్భారతీతీర్థ
భగవచ్ఛిష్య శ్రీమద్విద్యారణ్యగురువర విరచితమగు
జీవన్ముక్తి వివేకము సంపూర్ణము.

ఇతి శమ్

ఓం తత్సత్